# బ్రహ్మమీమాంసా దర్శనము

## వ్యాస మహర్షి

Andhra Pradesh-Hyderabad.



1075
RGP




చర్ల గణపతిశాస్త్రి

# బ్రహ్మమీమాంసా దర్శనము

## వ్యాస మహర్షి



చర్ల గణపతిశాస్త్రి

సర్వస్వామ్య సంకలితము
మొదటి ముద్రణము
1000 ప్రతులు

లలితా ప్రెస్
ఖైరతాబాదు,
హైద్రాబాదు-500004.

181.42
GAN

వెల: 10-00

చర్ల గణపతిశాస్త్రి
ఆర్షవిజ్ఞాన పరిషత్తు
ఖైరతాబాదు,
హైద్రాబాదు-500004.

197
వైశాఖ పూర్ణిమ

# జ్ఞాన దీపిక

ప్రతిజీవి ఏదో ప్రయోజనమును లక్ష్యమును ఆశించియే పని చేయును. కాని ఆ సరియైన లక్ష్యమేదో దానికె సరిగాఁ దెలియదు. అది తెలిసినప్పుడు దానికోసమై సర్వవిధముల ప్రయత్నము చేయుటయు దానిని చేరుటయు జరగును. ఆ లక్ష్యమును చేరుటకు ముందుగా తానెవరో తానెక్కడి నుండి వచ్చెనో ఎక్కడికిఁ బోవలయునో తెలిసికొనవలయును గదా. తన సంగతి తన లక్ష్యము తెలిసికొనకుండ చేయు ప్రయత్నము వ్యర్థమగుటయెగాక అది లక్ష్యమునుఁ జేర్చక విరుద్ధముగాఁ దీసికొనిపోవును. అందుచేతనే తాననేకకష్టనష్టములకు అధీనము కావలసి వచ్చుచున్నది. ఆ లక్ష్యములనే మన పూర్వులు పురుషార్థము లనిరి. అవి ధర్మార్థకామమోక్షములని నాలుగు. అందులోఁ గూడ ధర్మమును, ధర్మముతోఁ గూడిన యర్థకామములను తెలిసికొని మోక్షమును పొందవలె గాని సత్యమైన యానందము లక్ష్యమును జేరుటకు వీలుపడదు. అందుచే వానిని సరిగాఁ దెలిసికొనవలయును. అట్లు తెలిసికొనక ప్రాణి అర్థకామములనె పురుషార్థములుగాఁ దలఁచి తాను అనంతమగు కష్టనష్టములను జరావ్యాధి సహిత జన్మమరణములను పొందుచున్నది, కాన వానిని సరిగాఁ దెలుపుచు తన నిజస్వరూపమేదో సరియైన లక్ష్యమేదో తెలిసికొని కష్టములు లేని నిత్యానందమును దానికి ముఖ్యసాధనమైన జ్ఞానమునుపొందు మార్గములను దెలిసికొనవలయును.

అట్టి మార్గములు మూఁడు. వానినే ప్రస్థానత్రయము అందురు. ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు అను నీ మూడు ప్రస్థానత్రయ మనఁబడును. ఆ యుపనిషత్తులు నూటయెనిమిది. వానిలో ముఖ్యములగు ఈశ, కేన, కఠ ప్రశ్న ముండక మాండూక్య తైత్తిరీయ ఐతరేయ ఛాందోగ్య బృహదారణ్యక నరసింహ పూర్వతాపినులకు. భగవద్గీతకు బ్రహ్మసూత్రములకు శంకరాదులు భాష్యములు వ్రాసిరి. ఇందు ఉపనిషత్తులు వేదముల శిరస్సులు. వేదములు భగవంతుని నిశ్వాసముల వంటివి గాన అపౌరుషేయము లనఁబడును. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు అర్జునికి ఉపదేశించినది వ్యాసమహర్షి రచించఁగాఁ

ప్రసిద్ధమైనది భగవద్గీత, ఈ రెంటిలోని విషయములను విమర్శనాదృష్టితోఁ జర్చించి, అందు విరుద్ధములుగాఁ బైకిఁ దోఁచిన విషయములను సమన్వయపఱచి, లోపభూయిష్ఠములగు నితర మతములను దర్శనములను ఖండించి తత్త్వమును నిర్ణయించినవి బ్రహ్మసూత్రములు. వీనికిఁ గర్త వ్యాసభగవానుఁడు. ఇది సర్వోత్తమమైన గ్రంథము. ఇది యుపనిషత్తులను ప్రమాణముగా గ్రహించి చెప్పఁబడినది.

## మనమెవరము

మనస్సున్న ప్రాణి ఆలోచించుట మొదలుపెట్టెను. తానెవరు? తానెక్కడ నుండి వచ్చెనని. ఆలోచింపఁగా ఆలోచింపఁగా భావనకుఁ దోఁచినది. తాను పరమాత్మనని. ఆ పరమాత్మ నుండి విడివడిన తాను జీవాత్మనని. జలకణములకు మూలస్థానమేది. సముద్రమని వేఱుగఁ జెప్పవలసిన పనిలేదుగదా. నిప్పు-నెరసులకు మూలస్థానమేది. అగ్నిగోళమని చెప్పకయే తెలియుచున్నదే. "తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః" ఇదంతయు సత్యము. బాగుగా మండిన యగ్ని నుండి వేలకొలఁది సమానరూపములు గల నెఱసులు ప్రభవించునట్లు" అని ముండకోపనిషత్తు చెప్ప వలసిన పనిలేదు. జీవాత్మయగు తనకు మూలమేది? పరమాత్మ యని స్పష్ట పడుచున్నదే. దీనికింత ఆలోచన విమర్శన భావన అక్కఱలేదే. కాని తన మనస్సుతో ఆలోచించకపోతే ఏమియు తెలియదు. ఆలోచింపవలెను. "తథాక్షరాద్వివిధాః సోమ్య భావాః ప్రజాయంతే తత్ర చైవాపియంతి". అట్లే ఓ సౌమ్యుఁడా! అక్షర పరమాత్మ నుండి వివిధములైన జీవులు బయలుదేఱుచున్నవి, అందే లయమైపోవుచున్నవి. అని ముండకోపనిషత్తు చెప్పవలసిన పనేమున్నది. కాని చెప్పవలసి వచ్చినది ఎందుకు? ఎవరికి? మన మాలోచింపకపోవుటవలన, ఆలోచన చేయక సోమరిగా ఇంద్రియముల మత్తులోపడిన వారికి?

## ఆ యక్షర పరమాత్మ ఎటువంటిది?

"దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యంతరో హ్యజః అప్రాణోహ్యమనాః శుభ్రః" ఆ యక్షర పరమాత్మ దివ్యమైనది. శరీరము లేనిది. శరీరమను పుర మందున్నది. అది పైని లోపల నున్నది. పుట్టుక లేనిది ప్రాణము లేనిది మనస్సులేనిది స్వచ్ఛమైనది. అసలు ఆ పరమాత్మకు శరీరము ప్రాణము

మనస్సు లేదు. స్వచ్ఛమైనది, యజమానుఁడు సేవకుఁడు గాఁడు. కాని తన పనులు చేయించుకొనుటకు సేవకులను నియోగించుకొన్నాఁడు. అలాగే ఆ యాత్మ తన పనులను చేయించుకొనుటకు ఇంద్రియము లనెడి సేవకులను పెట్టుకొన్నది. కన్నులు పెట్టుకొని చెవులను దిద్దుకొని చూచెను వినెను ఇలాగే అన్ని పనులు చేయుటకు అన్ని యింద్రియాలను పెట్టుకొన్నది. అసలు ఆ యాత్మకు చూచుటకు వినుటకు కన్నులు చెవులు మొదలైన వన్నియు అక్కఱలేదు. తనకు ఏ యింద్రియము లున్నవని కలలో చూచును వినును సంచరించును సకలకార్యములు దేశకాలముల నిర్బంధము లేకుండ విహరించును. అది స్వతంత్రమైనది శుద్ధమైనది. అది లోకాలలో విహరించవలెననుకొన్నది భూలోకములో విహరించవలెననుకొని ఆ భూలోకములోని వానిని జూచుటకై తగిన వాహనములను ఆ వాహనములను లాగుటకు గుఱ్ఱములను ఇంద్రియాలను ధరించినది. మఱి సేవకుల మాట విని యజమాని చెడినట్లు ఇంద్రియాల మాట విని జీవాత్మ చెడును. అందుకనియే ఇంద్రియాలను వశములో నుంచుకొని తిన్నగా పోవలసిన జీవాత్మ తన యింద్రియాలకు వశమై మంచిచెడ్డ పనులను జేయుచు, స్వర్గనరకములను, స్థావర కీట పశుపక్ష్యాది మూఢజన్మలను పొందుచున్నది. ఈ విషయములన్నిటిని శాస్త్రములలో శాస్త్రకర్తలు నిరూపించి యున్నారు ఉపనిషత్తులు భగవద్గీత నిర్ణయించి చెప్పినవి. అందులోని విషయములలో అనుమానముగా విరుద్ధముగాఁ దోఁచిన విషయములను చర్చించి విమర్శించి సరియైన సమన్వయమును బ్రహ్మమీమాంసా దర్శనము చేసి జీవాత్మ పరమాత్మల విషయములోఁ దెలిసికొనవలసిన విషయములను సిద్ధాంతీకరించి చెప్పినది

మనుష్యులు దూరదృష్టి లేక తమకు ప్రత్యక్షముగాఁ గనిపించినవే తమ యనుభవములోని విషయములనే సత్యమనుకొని యట్టి ప్రవర్తనం కిష్టానిష్టములకు గురియై స్వర్గ నరకలోకములను అజ్ఞాన జన్మలను పొందుచున్నారు. ఈ సత్యవిషయములను తెలిసికొనుటకు మన పూర్వులు ప్రత్యక్షము అనుమానము ఉపమానము శాబ్దము అను ప్రమాణములు చెప్పియున్నారు. లోకములోని పదార్థములను ధర్మాధర్మములను జీవాత్మ పరమాత్మను కొలిచి గ్రహించునవి గాన ప్రమాణములనఁబడెను. ఏదైనను ఒక వస్తువున్నదా లేదా యను సందేహము గలిగినపుడు ప్రమాణము నిశ్చయించి ఉన్నదో లేదో చెప్పును. శబ్దమును

చర్మముగాని కన్నుగాని నాలుకగాని ముక్కుగాని తెలిసికొనలేవు. చెవి మాత్రమె తెలిసికొనును. ఇట్లే స్పర్శమును ఒక చర్మమెగాని యితరేంద్రియములు తెలిసికొనలేవు. ఇట్లే కన్ను ముక్కు నాలుకలు తమ విషయములను మాత్రమె గ్రహించును. ఇట్లు వీనిని తెలిసికొనుటను ప్రత్యక్ష ప్రమాణమందురు. ఈ సకలప్రపంచ వస్తువులు పంచేంద్రియములకు గోచరించును. కాన ఇవి ప్రత్యక్షములనఁబడును. కొన్ని ప్రత్యక్షప్రమాణముచేఁ దెలిసికొనఁబడవు గాన అవి యున్నవా లేవా ? అని సందేహము కలుగును. దూరముగా బర్వతమున నిప్పు ఉన్నదో లేదో సందేహము కలుగును. పొగ మాత్రము కనిపించును. అప్పుడు మనకుఁ బ్రత్యక్షప్రమాణముచేఁ దెలిసిన పొగచే నిప్పును ఊహించి నిప్పు ఉన్నదని నిశ్చయింతుము. ఈ నిశ్చయమును గలిగించు ప్రమాణమును అనుమాన ప్రమాణమందుము, కారణములచే ఊహించి తెలిసికొనవలసినవి కొన్ని. అవి ధర్మాధర్మములు పుణ్యాపాపములు ఆత్మ పునర్జన్మ ఈశ్వరుఁడు మొదలైనవి. వీనిని గన్నులు చెవులు మొదలైన వానిచేఁ దెలిసికొనలేము. జీవి సుఖముగా మంచి పుట్టుకలో ఉన్నచో ధర్మము పుణ్యము చేసెనని, కష్టములో చెడ్డ పుట్టుకలో ఉన్నచో అధర్మము పాపము చేసెనని కారణములనుబట్టి కార్యములను ఊహింపవలసి యున్నది. దీనిని అనుమాన ప్రమాణమందురు. ఇట్లు సరిగా ఊహించుకొనలేక అజ్ఞులు ధర్మాధర్మములను పుణ్యాపాపములను భగవంతుని నమ్మక నమ్మినను బలహీనతచే చేయక స్వర్గ నరకాదులను నీచోత్తమ జన్మలను పొందుదురు, ఇట్టివారె నాస్తికాదులు. ఇంక పిల్లినిబట్టి పెద్దపులిని తెలిసికొను పోలికజ్ఞానము ఉపమానము. దూరమందు గ్రామ దేశ లోకాంతరములందలి విషయములను దెలిసిన యాప్తుల వాక్యమునుబట్టి తెలిసికొను జ్ఞానము ఆప్త వాక్యము శబ్దప్రమాణము. పరలోకము జన్మాంతరము ఈశ్వరాస్తిత్వము మున్నగు జ్ఞానములను ఈ శబ్దప్రమాణము తెలుపును. దీనిని తెలుపునవి వేదములు శాస్త్రములు ఉపనిషత్తులు స్మృతులు మున్నగునవి. సర్వవ్యాపి అగు పరమేశ్వరుడును ఆత్మయును పరమాత్మయును ప్రత్యక్షములు గావు. అవి ప్రత్యక్షమైన పక్షములో అవి సంకుచితములై యుండవలసివచ్చును. నాస్తికులైన చార్వాకాదులు పత్యక్షము నొక్కదానినే ప్రమాణముగాఁ గైకొని ఈశ్వరాస్తిత్వమును నిరాకరించిరి.

1. చార్వాకమతస్థులు లోకాయతికులు ప్రత్యక్ష ప్రమాణమును మాత్రమె అంగీకరింతురు. ఈశ్వరుఁడు లేఁడందురు.

2. బౌద్ధులు జైనులు ప్రత్యక్షానుమానములను ప్రమాణముగా నంగీకరించిరి. సర్వజ్ఞ మునియే ఈశ్వరుఁడని బౌద్ధులు. తీర్థంకరులు పూజ్యులని జైనులు.

3. కొందఱు నైయాయికులు ప్రత్యక్షానుమానోపమానములను మూఁటిని అంగీకరించిరి.

4. మఱికొందఱు నైయాయికులు వేదాంతులు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దములు ప్రమాణమనిరి. వీరు కర్మనుబట్టి ఫలము నీశ్వరు డిచ్చునని యందురు.

5. ఈ పైనాలుగే గాక అర్థాపత్తి అనునది గూడఁ బ్రమాణమని ప్రాభాకరులు. దేవదత్తుఁడు బలిసియున్నాఁడు పగలు భుజింపఁడు అనుచోట పగలు భుజించుటలేదను నర్థమునుబట్టి రాత్రి భుజించుచున్నాఁడను నర్థము ఆపన్నమైనది గాన అర్థాపత్తి.

6. అనుపలబ్ధి గూడఁ బ్రమాణమె అని భాట్టవేదాంతులు.

7. సంభవము ఐతిహ్యము గూడఁ గలవని పౌరాణికులు.

8. చైష్టికము (చేష్టాజన్యము) గూడఁ గలదని తాంత్రికులు.

ఈ విధముగా అనేకులు అనేక విధములుగాఁ జెప్పియున్నారు. ఈ దర్శనములో పై మతములన్నియు సహేతుకముగను ఉపనిషత్తుల ప్రమాణములతోను ఖండింపఁబడినవి.

అసలు ఈ యాత్మ పరిశుద్ధమైనదే గదా ఎందుకిట్లు అనేక విధములుగఁ గనిపించుచున్నది. అంటే శరీరసంబంధమువలన జీవాత్మయొక్క జ్ఞానైశ్వర్యములు పోవుచున్నవి అని ఈ దర్శనము నిరూపించుచున్నది. (చూ. 162 పుట 3 వ అధ్యాయము 3 వ పాదము 6 వ సూత్రము) శరీర ప్రకృతిచే అది బలహీనము బలయుతము గూడనయి నీచకర్మలు పుణ్యకర్మలు చేయుచున్నది. జ్ఞానమును పోగొట్టుకొని అజ్ఞాని యగుచున్నది. శరీరమునకు వశమైనను అగ్నివలె మఱికిని పాపమును దగులపెట్టుచు ఆ తగులపెట్టునపుడు ఆ వస్తువుల దుర్గంధ సుగంధములవంటి పాపపుణ్యములను పొందుచు చివరకుఁ బ్రకృతిని జయించి శుద్ధము బుద్ధము నిత్యము ఆనందము నగుచున్నది. ఎప్పుడైతే నీచ కర్మలు చేయునో అపుడది వాని ఫలితములను పొందుచున్నది. కాన క్రింది

విధముగా నీచాది కర్మలకు వశముగాకుండునట్లు ప్రాణి తన నిజస్వరూపమగు నిత్యశుద్ధ బుద్ధ స్వరూపమును పొందుటకుఁ బ్రయత్నింపవలసి యున్నది.

1. శరీరబంధముచే ధనపుత్రాది వ్యామోహముగల వారు యమలోకమునో కీట పశుపక్ష్యాది జన్మలనో పొందుదురు.

2. ఇష్టా (యాగాదులు) పూర్త (వాపీకూప తటాకాదులు) దానధర్మాదులు చేసిన వారు ధూమయానము (పితృయాణము) ద్వారా చంద్రలోక స్వర్గాదులను పొంది ఆ పుణ్యములు అయిపోయిన తరువాత తిరిగి జరామరణసహిత మానవ జన్మలను పొందుదురు.

3. ఆత్మజ్ఞానము గలవారు జీవన్ముక్తులై దేహము వీడిన పిదప అర్చిరాది యానము (దేవయానము) ద్వారా పోవుచు ఒక అమానవ పురుషునిచే బ్రహ్మలోకమునకుఁ దీసికొనిపోఁబడి జన్మలు లేకయుందురు.

4. జీవన్ముక్తులైన వసిష్ఠ సూర్యాదులు లోకానుగ్రహము కొఱకు జన్మలు పొందినను ఆ లోకానుగ్రహ కార్యము ముగిసిన పిదప ముక్తి పొందుదురు.

ఇందులో ఆత్మ జరామరణ రహితమైనది శాశ్వతము. జీవాత్మ పరమాత్మ లొక్కటే. ప్రపంచము జీవుఁడు అనాదులు అను విషయములు ఉపనిషదాదుల ప్రామాణ్యముతో నిరూపింపఁబడినవి.

గింజ ముందా చెట్టు ముందా అనునదివలె జీవుఁడు ముందా వాఁడు చేసిన కర్మలు ముందా అనునదియు అనాదియే. ఆత్మ మొదట శుద్ధమైనచో పుణ్యపాప కర్మలు దానికెట్లు అంటుకొనును. అందుకనియె పెద్దలు "జీవఈశశ్చశుద్ధాచిత్, తథా జీవేశ్వరయోర్భిదా అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాక మనాదయః" 1. జీవుఁడు 2. ఈశ్వరుఁడు 3. విశుద్ధమైన చైతన్యము 4. జీవేశ్వరుల భేదము 5. అవిద్య(మాయ) 6. మాయాచైతన్యములకుఁగల సంబంధము ఈ యాఱును అనాదులు అన్నారు. జీవాదులు ఒక వర్తులాకారములో తిరుగుచుందురు. గుండ్రని వలయమునకు ఎక్కడికక్కడ మొదలు అగును కాని మొదలని యేదియు నుండదు. ముందు దానికి వెనుకటిది కారణమగును. కాన ఈ వలయాకారములకు మొదలు చివరలు లేవు. అందుచే జీవులు అనాదిగా వారు చేసిన కర్మలనుబట్టి ఫలము లనుభవించుచుందురు. అందుచేత జీవి మంచిపని చేసిన

మంచి ఫలితమును చెడ్డపని చేసిన చెడ్డఫలితమును పొందుచుండును. గింజను కాల్చివేసినచో అది యింక మొలవనట్లు ఈ జీవి జ్ఞానాగ్నిచేత తన పుణ్యపాప కర్మలను కాల్చివేసినచో అపుడు అది ముక్తి పొందును నిత్యానందము పొందును. ఇంకెన్నటికి దుఃఖమిశ్రిత సుఖములను జన్మజరామరణాదులను పొందదు.

జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున (గీత) సంచితములయిన అనఁగా ఇదివరలో చేసి ప్రోగు పెట్టిన కర్మలను, ప్రారబ్ధములు అనఁగా ఇదివరకటి కర్మలవల్ల ప్రారంభింపఁబడిన పుణ్యపాపములను, మూలములగు సంచితములు ప్రారబ్ధములు పోయెను గాన ఇంక ఆగామి అనఁగా ముందు జరుగఁబోవు కర్మలను అన్నిటిని జ్ఞానాగ్ని భస్మము చేసినైచును. ఇంక జన్మించుటకు బీజము లేదు గాన అది జన్మజరావ్యాధి మరణామలను బొందక నిత్యమై శుద్ధమై ముక్తమై నిత్యానందమై యుండి బ్రహ్మైక్యమును పొందును. ఇట్టి స్థితియే యుత్తమస్థితి. ఇదే లక్ష్యము. దీనిని అనుభవించినఁ గాని దానిలోని సంపూర్ణా నందము నిత్యానందము మనకు అర్థము కాదు.

ఇట్టి లక్ష్యస్థితిని తెలిసి ఆచరించి లక్ష్యము పొందువఱకు పరమాత్మ నుండి విడిన జీవాత్మజగత్తంతయు వివిధ పరిణామములను పొందునని వివిధ శాస్త్రకారులు నాలుగు వాదములను చెప్పిరి. 1. ఆరంభము 2. సంఘాతము 3. పరిణామము 4. వివర్తము.

> ఆరంభ పక్షః కణభక్ష పక్షః సంఘాతపక్షస్తు భదంత పక్షః
> సాంఖ్యాదిపక్షః పరిణామపక్షో వేదాంతపక్షస్తు వివర్తపక్షః

అందు ఆరంభపక్షము వైశేషికులది. సంఘాతపక్షము బౌద్ధులది. పరిణామ పక్షము సాంఖ్యులది. వివర్తపక్షము వేదాంతులది. మధుసూదన సరస్వతిసంఘాత వాదమును గాక మిగిలిన మూఁడు పక్షములను తన ప్రస్థానభేదమున నిరూపించి యుండెను. పంచభూతములు పరమాణువు మొదలు బ్రహ్మాండమువఱకు కారకవ్యాపారముచే జగత్తును ఆరంభింపఁ జేయునన్నది ఆరంభపక్షము. ఇది వైశేషికాదితార్కికులది. సర్వము క్షణికము అయినను బాహ్యవస్తువుల సంఘాతము ప్రపంచమును గలుగఁ జేయుచున్నదన్నది సంఘాతవాదము ఇది బౌద్ధ జైనాదులది సున్నముతములపాకులు కలిసినచో ఎఱుపురంగు వచ్చినట్లు పరస్పర విశేషశక్తిగల వస్తువుల కలయికవల్ల విచిత్ర వస్తుజగత్తు పుట్టునని శాస్త్రకారులు.

సత్త్వ రజస్తమో గుణాత్మక ప్రకృతి మహదహంకార క్రమముగా జగద్రూపముగా మారుచున్నదని సూక్ష్మముగా నున్న కార్యమె కారణవ్యాపారముచే అభివ్యక్తమగుచున్నదనునది పరిణామవాదము. ఇది సాంఖ్యయోగ పాతంజల పాశుపతులది. స్వప్రకాశమై యద్వితీయమై పరమానంద రూపమై యుండు బ్రహ్మమె స్వమాయవల్ల బ్రతిబింబించి మిథ్యయగు జగద్రూపముగ కల్పింపఁబడుచున్నది అన్నది వివర్తవాదము. సర్వప్రస్థానకర్తలు చివరకు ఈ వివర్తవాదమునందె పర్యవసింతురు. వారు సర్వజ్ఞులైనను నాస్తికత్వమును వారించుటకై అనేక విధమార్గములను వివరించిరి. వారి మూలాశయములు తెలియక వేద విరుద్ధమైన విషయమందు వారికి తాత్పర్యము గలదని యూహించి జనులు ఋజు కుటిలమార్గముల వెంబడి పడిపోవుచున్నారు. అందుచే వారు ఋజుమార్గము తెలియక నానా కష్టముల పాలగుచున్నారు. అంతఃకరణము శుద్ధమైన పిదప వారు ఋజుమార్గమునే పట్టుకొనినచో నిత్య బుద్ధపరమానందమున నైక్యము పొందుదురని మనమాశింపవచ్చును. కనుక జీవులు ఇటువంటి సర్వోత్తమ దర్శనమును సరిగా అర్థము చేసికొని ఆచరించి జీవన్ముక్తులై సర్వకష్టములనుండి బంధములనుండి విడివడి ఆనంద సముద్రమున ఓలలాడుదురుగాక.

## బ్రహ్మసూత్రముల శైలి

ఈ బ్రహ్మసూత్రములు ధారణకు అనుకూలమైన సూత్రశైలిలో నుండుటచే ప్రసంగములనుబట్టి యా యా యర్థములను గ్రహించుకొనవలసి యుండును. వీనికి టీక వ్రాయుటలో ఆ సూత్రముల కెంతవఱకు అర్థమో అంతమాత్రమె వ్రాయఁబడినది. దాని కనువాదమగు తెనుఁగు సూత్రములలో వాని పూర్వాపరసందర్భములనుబట్టి ఆయా శ్రుతి స్మృతివాక్యములను గలిపి వానికి పూర్తి యర్థము శంకర భాష్యానుసారముగ వివరింపఁబడినది. వానిని చదువరులు గ్రహింతురుగాక.

*1976*

ఆర్షవిజ్ఞాన పరిషత్తు

ఇట్లు
బుధ విధేయుడు
చర్ల గణపతిశాస్త్రి

# లోకములకు జీవుల రాకపోకలు



## జీవుల ప్రయాణములు

- పితృయాణము
- దేవయానము
- నరకము
  - స్థావరాది నీచ జన్మలు

## జీవుల వివిధగతులు

**దేవయానము అర్చిరాదిమార్గము**

తపస్సు శ్రద్ధగలవారు
→ అర్చిస్సు
→ దినాదికాలక్రమమున
→ ఆదిత్యుడు
→ చంద్రుడు
→ విద్యుత్తు
→ విద్యుత్తునుపొందిన వారిని ఒక అమానవ పురుషుడు

బ్రహ్మలోకమును

పొందించును.

**పితృయాణము ధూమాది మార్గము**

యజ్ఞములు వాపీకూప తటాకాదులు దానధర్మాదులు చేసినవారు
→ ధూమము
→ రాత్ర్యాదిక్రమమున
→ పితృలోకము
→ ఆకాశము
→ చంద్రుడు
→ ఈ లోకములో పుణ్యమనుభవింతురు

**స్వర్గములో పుణ్యమను భవించి జన్మించు వారు**

→ ఆకాశము
→ వాయువు
→ పొగ
→ మబ్బు
→ వర్షము
→ ధాన్యాదులు
→ అన్నము
→ ఈ అన్నము తిన్న జీవులనుండి
→ ప్రాణులు
→ జరామరణాదులు పొందును.

# విషయానుక్రమణిక


| | | పుట |
|---|---|---|
| | 1 వ అధ్యాయము 1 వ పాదము. | |
| 1. | సాంఖ్యోక్తము ప్రధానము బ్రహ్మముగాదు | 3 |
| 2. | బ్రహ్మము జగత్తునకుఁగారణము | 5 |
| 3. | జీవుఁడు ఆనందమయుఁడు కాఁడు | 7 |
| 4. | సూర్యమండల మధ్యవర్తి పురుషుఁడు పరమాత్మయె | 9 |
| 5. | ఆకాశప్రాణజ్యోతిస్సు లన బ్రహ్మమె | 11 |
| 6. | ప్రాణ గాయత్రీపదములు బ్రహ్మపరములు | 13 |
| 7 | ప్రాణ మన బ్రహ్మమె | 15 |
| | 1 వ అధ్యాయము 2 వ పాదము. | 17 |
| 8. | బ్రహ్మమె ఉపాసింపఁదగినది | 19 |
| 9. | భక్షకుఁడన బ్రహ్మమె | 21 |
| 10. | కన్నులలోని వాఁడు పరమాత్మయె | 23 |
| 11. | అంతర్యామి బ్రహ్మమె | 25 |
| 12. | భూతయోని బ్రహ్మమె | 27 |
| 13. | వైశ్వానరుఁడన పరమాత్మయె జఠరాగ్ని కాదు | 29 |
| 14. | పరమాత్మ వివరణము | 31 |
| | 1 వ అధ్యాయము 3 వ పాదము | 33 |
| 15 | భూమతత్త్వము బ్రహ్మమె | 35 |
| 16. | ఉపాస్యుఁడు పరమాత్మయె | 37 |
| 17. | దహరము పరమాత్మయె | 39 |
| 18. | హృదయమునుబట్టి పరమాత్మ అంగుష్ఠమాత్రుఁడు | 43 |
| 19. | వేదములు నిత్యములు | 45 |
| 20. | సూర్యాదులు అధిదేవతలు గోళములు గావు. | 47 |
| 21. | సత్యమును చెప్పువాఁడు బ్రాహ్మణుఁడు | 49 |
| 22. | ఆకాశపదము బ్రహ్మపరము | 51 |
| | 1 వ అధ్యాయము 4 వ పాదము | 53 |
| 23. | అజా అనఁగా పుట్టుకలేనిది అనియెగాని ప్రధానము అర్థము గాదు | 55 |
| 24. | అజ అనఁగా ప్రకృతి | 57 |
| 25. | అసత్తు అనఁగా బ్రహ్మమె | 59 |
| 26. | ఆత్మ యనఁగా పరమాత్మయె | 61 |
| 27. | జీవాత్మ పరమాత్మలు అభిన్నము | 63 |
| 28. | బ్రహ్మమె జగత్తునకుఁ గారణము | 65 |

2 వ అధ్యాయము 1 వ పాదము 67

29. బ్రహ్మమే జగత్తునకుఁ గారణము 69

30. పరమాత్మ ముక్తుఁడె 73

31. బ్రహ్మముకంటె ప్రపంచము వేఱు కాదు. 75

32. జీవాత్మ పరమాత్మ లొకటె 77

33. బ్రహ్మము విచిత్ర సృష్టులు చేయఁ గలదు 79

34. పరమాత్మ విషమచిత్తుఁడు గాని నిర్దయుఁడు గాని కాఁడు 81

35. ప్రపంచము అనాది 83

2 వ అధ్యాయము 2 వ పాదము 84

36. ప్రధానము జగములకు కారణము కాదు 85

37. సాంఖ్యదర్శనము అసమంజసము 87

38. పరమాణువులు జగత్కారణములు గావు 89

39. పూర్ణవైనాశిక మత ఖండనము 91

40. సృష్టిసంఘాతము జగత్కారణము గాదు 93

41. వైనాశిక మతఖండనము 95

42. జైనమత ఖండనము 101

43. తార్కికుల యీశ్వర మతకల్పన సంగతము కాదు 103

44. పాంచరాత్రాగమ ఖండనము 105

2 వ అధ్యాయము 3 వ పాదము 107

45. శ్రుతులకు పరస్పర విరోధము లేదు 109

46. బ్రహ్మమునకు జన్మము లేదు 111

47. ఆ బ్రహ్మమె సృష్టికర్త 113

48. జీవాత్మకు జన్మమరణములు లేవు 115

49. జీవాత్మ అణుపరిమాణము గలది గాదు 117

50. బాహ్యేంద్రియములకంటె మనసు వేఱుగ నున్నది 121

51. జీవుఁడు కర్త 125

52. ఈశ్వరుఁడు సుఖాదులు పొందఁడు 129

53. జీవుఁడు ఈశ్వరుని ప్రతిబింబము 131

2 వ అధ్యాయము 4 వ పాదము 133

54. ప్రాణములు బ్రహ్మమునుండి పుట్టెను అవి ఏడే 135

55. ప్రాణములు అణుపరిణామము గలవి 137

56. ఇంద్రియములు భోగసాధనములు - జీవుఁడు భోక్త 139

57. ప్రాణము ఇంద్రియము గాదు 141

58. సముద్రాదుల నామరూపములను ఈశ్వరుఁడే చేసెను 143

3 వ అధ్యాయము 1 వ పాదము 144

59. జీవు తోఁగూడ సూక్ష్మభూతములు పోవును 145

60. శ్రద్ధ అనఁగా జలములు అర్థము 147

61 పశువువలె జీవులు దేవతల కుపకరణము 149

62. పాపము చేసినచో యమలోకము పొందును 151

63. నీచకర్మలు చేయువారు ఈ లోకమునె పొందుదురు 153

64. జన్మలెత్తువారు ఆకాశాదులతో సమానరూపము పొందుదురు 155

65 చంద్రలోకము నుండి దిగువారు స్థావరభావము పొందరు 157

66. పుణ్యపాపములచే బంధింపఁబడరాదు 159

3 వ అధ్యాయము 2 వ పాదము 160

67. దేహాదిసంబంధముచే జీవునికి జ్ఞానైశ్వర్యశక్తి కలుగుటలేదు 161

68. నిద్రలో జీవుఁడు బ్రహ్మమున ఏకీభవించును 163

69 బ్రహ్మము నిర్గుణము 165

70. రూపాదులున్నట్లు చెప్పు శ్రుతులు ఉపాసనాపరములు 167

71. బ్రహ్మము సత్యము దానికంటె వేఱైనదేదియు లేదు 1 0

72. జీవబ్రహ్మలు అభిన్నులు 173

73. సర్వ కర్మఫలదాత ఈశ్వరుడె 177

3 వ అధ్యాయము 3 వ పాదము 179

74. విద్యలకు భేదము లేదు 181

75 ఉద్గీథోపాసనలు భిన్నములె 183

76. బ్రహ్మమున కానందాదులు గలవు 185

77. ఇంద్రియాదిక్రమము మోక్షదాతయగు పురుషుని జూపుటకే 187

78 స్వర్గాది సృష్టికర్త పరమాత్మయె 180

79. ఉపాస్యుఁ డొకఁడే ఉపాసనలు భిన్నములు 199

80. దేవయాన మార్గము 199

81. సగుణోపాసకులు దేవయానము పొందుదురు 201

82. జీవన్ముక్తులును లోకములు నిలుపుటకు పుట్టుచుందురు 203

83. జీవాత్మ పరమాత్మలకు విశేషణ విశేష్యభావము ఉపాసనకె 205

84. ఉపాసనల ఫలము వేఱుగా నుండును 209

85. ప్రకరణముకంటె సూచనయె బలీయము 211

86. మనశ్చయనాదులకు మానస కర్మలకు సామ్యము లేదు 219

87. ఉపాసనల ఫలము వేఱుగా నుండును 2 ?

| | | |
|---|---|---|
| | 3వ అధ్యాయము 4వ పాదము | 223 |
| 88. | కేవలాత్మజ్ఞానమె మోక్షమునకు సాధనము | 225 |
| 89. | ఉద్గీథాద్యుపాసనలు ఉపాసనా విధులు | 233 |
| 90. | వైవస్వత యముఁడు గలఁడిత్యాదులు ఉపాసనాపరములు | 235 |
| 91. | భక్ష్యాభక్ష్యవిధులు వ్యర్థము కావు | 237 |
| 92. | యాగాది కర్మలు మోక్షసాధనములు | 239 |
| 93. | ఊర్ధ్వస్థితిని పొందినవారు క్రిందికి జారరు | 241 |
| 94. | వ్రతభ్రష్టులు బహిష్కరింపఁదగిన వారె | 243 |
| 95. | మౌనము సహకారి | 245 |
| 96. | బ్రహ్మవేత్త అజ్ఞాతుఁడై చరింపవలెను | 247 |
| 97. | సగుణోపాసనలలోనేగాని నిర్గుణోపాసనలలో భేదము లేదు | 249 |
| | 4వ అధ్యాయము 1వ పాదము | 250 |
| 98. | సగుణోపాసనలలో అభేదము లేదు | 251 |
| 99. | ఉపాసకుఁడు కూర్చుండియె ధ్యానము చేయవలెను | 253 |
| 100. | బ్రహ్మజ్ఞాని కడవఱకటి పాపములన్నియు పోవును | 255 |
| 101. | కర్మలున్నంతవఱకు శరీరమె పనిచేయును | 257 |
| 102. | జ్ఞానరహిత కర్మలును మోక్షమునకు సహకారులె | 259 |
| | 4వ అధ్యాయము 2వ పాదము | 261 |
| 103. | మనోవ్యాపారము ప్రాణమందు లయించును | 263 |
| 104. | విద్వాంసుడు బ్రహ్మలోకమును పొందును | 265 |
| 105. | బ్రహ్మవేత్త ప్రాణము అతనియందె లయించును | 267 |
| 106. | అజ్ఞానులు సర్వకర్మల ద్వారా ఆయా లోకములు పొందుదురు | 269 |
| 107. | విద్యాసామర్థ్యముచే ఉత్తమగతిని పొందును | 271 |
| | 4వ అధ్యాయము 3వ పాదము | 274 |
| 108. | అర్చిరాది మార్గము | 275 |
| 109 | అమానవ పురుషుఁడు బ్రహ్మమును పొందించును | 277 |
| 110. | సగుణోపాసకులు క్రమముగ బ్రహ్మమును పొందుదురు | 279 |
| | 4వ అధ్యాయము 4వ పాదము | 285 |
| 111. | జీవుడు ఆత్మరూపముతోనే బ్రహ్మమును పొందును | 287 |
| 112. | ముక్తునికి వేఱుగా శరీరేంద్రియములుండవని బాదరి | 289 |
| 113. | ముక్తుడు సంకల్పమాత్రముచే సర్వకామములను పొందును | 291 |
| 114. | ముక్తునికి జగద్వ్యాపారము తక్క మిగిలిన సిద్ధులు గలుగును | 293 |
| 115. | పరమేశ్వరునికి నిర్గుణరూపమును గలదు | 294 |
| 116. | బ్రహ్మలోకము పొందినవారు తిరిగిరారు | 295 |


*

# బ్రహ్మ మీమాంసా దర్శనము

మొదటి యధ్యాయములో మొదటి పాదము

స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయము

## ౧ జిజ్ఞాసాధికరణము

ప్రతి అధికరణములోను, దెలుపఁదగిన యంశము ౧, సంశయము ౨, పూర్వపక్షము ౩, సిద్ధాంతము ౪, సమన్వయము ౫ అనునవియుండును.

ఏదైనను తెలుపునపుడు దానిలో తెలిసికొనవలసిన భాగము ఉండును. దానిలో సందేహము కలుగును. దానిలోనే తప్పుగా నిర్ధారణచేయు నితరమత ములవారి పూర్వపక్షమును దానిని ఖండించి చేయు సిద్ధాంతమును దానిని చెప్పు వాక్యముల సమన్వయమును ఉండును. దానినే అధికరణము అందురు. ఆ అధికర ణములో ఇవన్నియు నుండునని భావము.

ఇవి యాయా సూత్రములలోఁ దెలిసికొనునది.

1. సూ. ౧. అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా.

అథ=మఱి. అతః=బ్రహ్మవిజ్ఞానమువలనఁ బరమపురుషార్థము సిద్ధించును గనుక. బ్రహ్మ జిజ్ఞాసా=బ్రహ్మమును దెలిసికొను కోరిక చేయవలెను.

సూ. మఱి యందువలన బ్రహ్మమును దెలిసికొనఁ గోరవలసి యున్నది. సాధన చతుష్టయమును సంపాదించిన పిదప బ్రహ్మమును దెలిసికొనఁగోరవలయు నని "మఱి" అను పదము సూచించుచున్నది.

౧ నిత్యానిత్య వస్తువివేకము =ఏవి నిత్యవస్తువులో ఏవి యనిత్య వస్తువులో తెలిసికొనుట ౨ ఇహాఽముత్రఫలభోగ విరాగము =ధనకనక కాంతా భూవస్తువాహనాదులైన ఇహలోకభోగములందును స్వర్గలోక భోగము లందును వైరాగ్యము. ౩ శమాదిషట్క సంపద. 1 శమము=అంతరింద్రియ నిగ్రహము, 2 దమము బహిరింద్రియ నిగ్రహము 3 ఉపరతి =శాస్త్రవిహిత కర్మల సంన్యసించుట. 4 తితిక్ష=శీతోష్ణ సుఖదుఃఖాదులను సహించుట.

౫ సమాధానము =విషయవాంఛల నుండి మనస్సును మరల్చుట, ౬ శ్రద్ధ =గురు వేదాది వాక్యములందు విశ్వాసము ౪ మోక్షేచ్ఛ యను నివి నాలుగు సాధన చతుష్టయ మనఁబడును. ఇవి యన్నియుఁగలిగిన పిదప బ్రహ్మజిజ్ఞాస చేయవలెనని భావము. ఇవి కలుగకముందు మనస్సు విషయ భోగాదులందు లగ్నమైయుండును. కాన అట్టి మనసు నిర్గుణబ్రహ్మను సరిగాఁ దెలిసికొనలేదని గ్రహింపవలెను.

## ౨ జన్మాద్యధికరణము

2. మూ. జన్మా ద్యస్య యతః

జన్మాది=జన్మాదులు, అస్య=ఈజగత్తునకు, యతః=ఎవనివల్లనో.

సూ. జన్మస్థితిలయములకుఁ గారణమైనది బ్రహ్మము,

"యతోవా ఇమాని భూతాని జాయంతే, యేనజాతాని జీవంతి, యత్ ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" (తైత్తి. ౩ ౧) "దేనివల్ల ఈ ప్రాణులు పుట్టుచున్నవో, దేనిచేఁ బుట్టి ప్రాణులు జీవించుచున్నవో దేనిని జేరి లయించుచున్నవో దానిని దెలిసికొనఁ గోరుము అది బ్రహ్మము" అని శ్రుతిప్రమాణము.

## ౩ శాస్త్రయోనిత్వాధికరణము

3. మూ. శాస్త్రయోనిత్వాత్=శాస్త్రములు ప్రమాణముగా నుండుటవలన.

సూ. జన్మాదులకు బ్రహ్మమె కారణమని శాస్త్రప్రామాణ్యము వలనఁ దెలియుచున్నది.

"యతో వా ఇమాని భూతాని జాయంతే" (ఎందువల్ల ఈ ప్రాణులు పుట్టుచున్నవో) (తై. ౩. ౧.) ఇత్యాది శ్రుతిశాస్త్రములు ప్రమాణములు.

## ౪ సమన్వయాధికరణము

4. మూ. తత్తు సమన్వయాత్.

తత్ తు=ఆ శాస్త్రప్రమాణత్వమైతే, సమన్వయాత్=సమన్వయించుటవల్ల.

సూ. వేదాంత శాస్త్ర వాక్యములు బ్రహ్మమందె సమన్వయించుటవలన అవి బ్రహ్మమును ప్రకాశింపఁజేయునవి అని సిద్ధించుచున్నది.

సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఓ సౌమ్యుఁడా మొదట ఇది యొక్కటె ఉండెను. ఆత్మానా ఇదమేవ అగ్రఆసీత్ ఆత్మయే ఇది మొదట ఒక్కటే ఉండెను "బ్రహ్మైద మమృతం పురస్తాత్" అమృతమైన యీ బ్రహ్మమె మొదట ఉండెను మొదలగునవి.

## ౨ ఈక్షత్యధికరణము

5. సూ. ఈక్షతేర్నాఽశబ్దం.

ఈక్షతేః = చూచుటవలన, అశబ్దం = వేదమందుఁ జెప్పఁబడక సాంఖ్య శాస్త్రమందుఁ జెప్పఁబడిన ప్రధానము, న=జన్మాదులకుఁగారణముగాదు.

సూ. శ్రుతిలో 'చూచెను' అని చెప్పఁబడుటవలన వేదమందుఁ జెప్పఁబడని జడమైన ప్రధానము చూడదుగాన అది జన్మాదులకుఁ గారణముగాదు.

"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" ఓ సోమ్యుఁడా ! ఈ సత్పదార్థమె మొదట ఉండెను. ఎక్కువగా ప్రజలను సృజింతును అని యీ సత్పదార్థము చూచెను." అని

సత్త్వరజస్తమో గుణసముదాయ రూపమును జడము నగునది ప్రధానము. అది జగత్తులకుఁగారణమని సాంఖ్యమతము. జడపదార్థమునకుఁ జూచుట సంభవింపదు గాన శ్రుతిలోని "చూచెను" అను దానికిఁ గర్తగాఁ బ్రధానమును జెప్పరాదని ఖండింపఁబడుచున్నది.

6. సూ. గౌణశ్చేన్నాఽఽత్మశబ్దాత్.

గౌణః చేత్=చూచుట గౌణమన్నచో, ఆత్మశబ్దాత్=ఆత్మశబ్దము ప్రయోగించుటవలన, న=అట్లనరాదు.

సూ. శ్రుతులలో జగత్కారణ బోధకముగ ఆత్మశబ్దమును ప్రయోగించుటవలనఁ "జూచెను" అనుదానికి గౌణార్థము చెప్పరాదు.

"తత్తేజ ఐక్షత తాఆపఐక్షంత" (ఛాం. ఉ. ౬ ౩. ౩.) ఆ తేజస్సు చూచెను ఆ నీరు చూచెను" అనుచోటవలె నిటఁగూడ చూచెను అనుదానికి ఔపచారికార్థము చెప్పవచ్చు నన్నచో "ఐతదాత్మ్యమిదంసర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసిశ్వేతకేతో" (ఛాందో. ఉ. ౧౪. ౩.) ఇదియంతయు ఈయాత్మ వలనఁగలిగినదే అది సత్యస్వరూపమైనది. అది యాత్మ. ఓ శ్వేతకేతూ ! నీవు

ఆ యాత్మయై యున్నావు." అనుచోట జగత్కారణముగా ఆత్మను జెప్పుట వలన "చూచెను" అనుదానికి కర్తగా గౌణార్థముగ జడమగు ప్రధానమును జెప్పరాదు. కాన జగత్కారణము అచేతనమగు ప్రధానము గాదు. 'ఆ సత్పదార్థము చూచెను' అనుచోట ఆ సత్పదార్థము అనఁగా చేతనమైన యాత్మయే కాని ప్రధానముకాదని భావము. అర్థము సరిపోవనపుడు దాని గుణములతొ సంబంధించిన వేఱొక యర్థమును జెప్పుదురు. దానిని గౌణము లక్ష్యార్థము ఔపచారికార్థము అని యందురు. దీని వివరము (చూ. నా సాహిత్య సౌందర్య దర్శనము 44 పుట)

7. మూ. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్.

తన్నిష్ఠస్య = ఆత్మయందు నిష్ఠగలవానికి మోక్షోపదేశాత్ = మోక్షము ఉపదేశించుటవలన.

సూ. జడమగు ప్రధానము యొక్క ధ్యానముచేత మోక్షము లభింపదు గాన ఆత్మ పదమునకుఁ జేతనమయిన యాత్మయె యర్థము గాని జడమగు ప్రధానముగాదు.

"స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" (ఛాందో. ౬. ౧౪. ౩.) అది యాత్మ. శ్వేతకేతూ! నీవు ఆ యాత్మవై యున్నావు" అని మోక్షము పొందఁదగిన చేతనుఁడైన శ్వేతకేతువునకు ధ్యాననిష్ఠను ఉపదేశించి "ఆచార్యవాన్ పురుషో వేద తస్యతావదేవ, చిరంయావన్న విమోక్ష్యే(=విమోక్ష్యతే) అథసంపత్స్యే (=సంపత్స్యతే)" (ఛాందో. ౬. ౧౪. ౨.) గురూపదేశము పొందిన పురుషుఁడు బ్రహ్మమును దెలిసికొనును. వాఁడు దేహమున్నంతవఱకు మోక్షము పొందఁడు. పిదప సత్తుతో నైక్యముపొందును." అని మోక్షము ఉపదేశింపఁబడినది. ఆ యుపదేశము జడమగు ప్రధానము యొక్క విషయమున సంభవింపదని భావము.

8. మూ. హేయత్వా ఽవచనాచ్చ.

హేయత్వాఽవచనాత్ చ=ఆత్మపరమైన యర్థము హేయమని చెప్పక పోవుటవలనను.

సూ. సత్పదార్థమునకుఁ బ్రధానమే యర్థమైనచో ఆత్మపరమైన యర్థము హేయమని చెప్పియుండును. అట్లు చెప్పకపోవుటవలనను సత్పదమునకుఁ బ్రధానము అర్థముగాదు.

అరుంధతిని జూపఁదలఁచి మొదట సప్తర్షులను పిదప అరుంధతి దగ్గర

నున్న పెద్దనక్షత్రమును జూపి తరువాత అది అరుంధతి గాదు ఆ పెద్దనక్షత్రము దగ్గరనున్న చిన్న నక్షత్రము అరుంధతి అని స్థూలారుంధతి న్యాయము ననుసరించి చెప్పునట్లు స్థూలముగా ఆ సత్పదార్థమనఁగా ఆత్మ యని చెప్పినను పిదప సత్పదార్థ మనఁగా ఆత్మగాదు ప్రధానము అని యాత్మపరమైన యర్థమును నిషేధించి ప్రధానపరముగ అర్థము చెప్పకపోవుట వలన ఆ సత్పదార్థమునకుఁ బ్రధానము అర్థము అని చెప్పరాదని భావము.

౯. మూ. స్వాప్యయాత్.

స్వాప్యయాత్=ఆత్మయందు నిద్రలో లయ మొందుటవలన.

సూ. నిద్రావస్థయందు అంతఃకరణముతోఁగూడిన ప్రాణులు తమ కాధారమైన యాత్మస్వరూపమైన తనయందు లయమొందుట సంభవింపదు గాన సత్పదార్థము చేతనమైన యాత్మయె కాని ప్రధానముగాదు.

“యత్రైతత్పురుషః స్వపితినామ సతా సోమ్య తదా సంపన్నోభవతి” (ఛాందో. ౬. ౮. ౧) “పురుషుఁడు నిద్రించు సమయమున ఓ సౌమ్యుఁడా! సత్పదార్థముతో నైక్యమొందుచున్నాఁడు.” అని శ్రుతి.

10. మూ. గతిసామాన్యాత్.

గతిసామాన్యాత్=అవగతి (జ్ఞానము) సమానముగ నుండుటవలన.

సూ. శ్రుతులన్నింటియందును జగత్తులకుఁ జేతనమె కారణమను నవగతి (జ్ఞానము) సమానముగ నుండుటవలన బ్రహ్మమె జగత్తునకుఁగారణము.

“యథాగ్నేర్జ్వలతః సర్వాదిశోవిస్ఫులింగా విప్రతిష్ఠేరన్ ఏవమేవైతస్మాదాత్మనః సర్వేప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యోదేవా, దేవేభ్యో లోకా (కౌషీ. ౩ ౩.)మండుచున్న యగ్నినుండి యన్ని దిక్కులను నెరసులు ప్రవేశించుచున్నట్లు ఈ యాత్మనుండి సర్వప్రాణములు తమతమ స్థానములను బొందుచున్నవి. ఈ ప్రాణములనుండి సూర్యాదిదేవతలు ఆ దేవతలనుండి లోకములు వెడలుచున్నవి, “తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః (తైత్తి. ౨.౧) ఆయా యాత్మనుండియె యాకాశము పుట్టినది. “ఆత్మన ఏ వేదం సర్వం (ఛాం. ౭. ౨౬. ౧.) ఇది యంతయు ఆత్మనుండియె వెడలుచున్నది.” మొదలైన శ్రుతులన్నియు జగత్తులకు ఆత్మనే కారణముగఁ దెలుపుచున్నవని భావము.

11. మూ. శ్రుతత్వాచ్చ.

శ్రుతత్వాత్ చ=శ్రుతులలో వినఁబడుట వలనను.

సూ. సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడు జగత్తులకుఁ గారణమని శ్రుతులలో వినఁబడుటవలనను సర్వమును దెలిసిన బ్రహ్మమె జగత్తులకుఁ గారణము.

"స కారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా న చాధిపః" (శ్వేతా. ౬. ౯.) సర్వేంద్రియములకు రాజాధిరాజైన యా సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడు జగత్తులకుఁ గారణము. ఇతనిఁబుట్టించినవాఁడుగాని యితనికిఁ బ్రభువుగాని లేఁడు." అని శ్రుతియందు బ్రహ్మమె జగత్తులకుఁ గారణముగ వినఁబడుట వలన బ్రహ్మమె కారణమని భావము.

## ౬. ఆనందమయాధికరణము

12. మూ. ఆనందమయోఽభ్యాసాత్.

అభ్యాసాత్ = మాటిమాటికిఁ బ్రయోగింపఁబడుటవలన, ఆనందమయః = ఆనందమయుఁడు.

సూ. శ్రుతులందు ఆనంద శబ్దము బ్రహ్మమందె చాలసార్లు ప్రయోగింపఁబడుటవలన యానందమయుఁడనఁ బరమాత్మయె కాని జీవుఁడుగాఁడు.

"ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి" (తై. ౨. ౮.) "విద్వాంసుఁడు ఈ యానందమయుఁడయిన పరమాత్మను బొందుచున్నాఁడు." "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" (తై. ౨. ౯) "బ్రహ్మానందమును దెలిసినవాఁడు దేనినుండియు భయపడఁడు." "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" (తై. ౩. ౬.) భృగువు ఆనందమును బ్రహ్మముగాఁ దెలిసికొనెను." "విజ్ఞాన మానందం బ్రహ్మ" (బృ. ౩. ౯. ౨౮.) "విజ్ఞానరూపమును ఆనందరూపమునైనది బ్రహ్మము" ఇత్యాదులందు ఆనందశబ్దము బ్రహ్మమందె ప్రయోగింపఁబడినదని భావము.

13. మూ. వికారశబ్దా న్నేతి చే న్న ప్రాచుర్యాత్.

వికారశబ్దాత్ = వికారార్థమగు మయట్(ట్) ప్రత్యయమువల్ల, ఇతి చేత్ = అని యన్నచో. న=అట్లనరాదు. ప్రాచుర్యాత్ = మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థక మగుటవలన.

సూ. ఆనందమయపదములోని "మయ" ప్రత్యయమునకుఁ బ్రాచుర్యమే యర్థముగాని వికారము అర్థముగాదు కాన ఆనందమయుఁడన పరమాత్మయే యర్థముగాని జీవుఁడుగాదు.

14. మూ. తద్ధేతువ్యపదేశాచ్చ.

తద్ధేతువ్యపదేశాత్ చ=దానికి,ఆనందమునకు హేతువుగాఁ జెప్పుట వలనను.

సూ. ఆనందమునకు హేతువు బ్రహ్మమని వ్యపదేశించుట వలనను ఆనందమయపదములోని 'మయ' ప్రత్యయమునకుఁ బ్రాచుర్యార్థమె చెప్ప వలయును.

"ఏష హ్యేవానందయాతి" (తై. ౭. ౨.) "ఇతఁడె యానంద పెట్టును" అను శ్రుతిలో బ్రహ్మమె యానందకారణముగఁ జెప్పఁబడెనని భావము.

15. మూ. మాంత్ర వర్ణికమేవ చ గీయతే.

మాంత్రవర్ణికం ఏవ చ = మంత్రవర్ణములందుఁ జెప్పఁబడిన బ్రహ్మమే గీయతే=చెప్పఁబడుచున్నది.

సూ. శ్రుతి మంత్రములందు వర్ణింపఁబడిన బ్రహ్మమె యిట ఆనందమయ శబ్దముచేఁ జెప్పఁబడినది.

"సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" (తై. ౨. ౧.) "సత్యస్వరూపము జ్ఞాన స్వరూపము అనంతమునగునది బ్రహ్మము" అను మంత్రముచేఁ జెప్పఁబడిన బ్రహ్మమె "అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః (తై. ౨. ౫) "ఆనంద మయుఁడు విజ్ఞానమయకోశముకంటె నితరమైన లోపలియాత్మ" అని చెప్పఁ బడినదని భావము.

16. మూ. నేతరోఽనుపపత్తేః.

ఇతరః=ఇతరమైనజీవుఁడు. అనుపపత్తేః=ఉపపన్నము కాకపోవుటవలన =ఆనందమయుఁడు కాఁడు.

సూ. సృష్టి మొదలగు క్రియలు జీవునియందు ఉపపన్నములు గాక పోవుటవలన ఆనందమయుఁ డన జీవుఁడు గాఁడు.

"సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ ఇతి, స తపోఽతప్యత స తప స్తప్త్వా ఇదంసర్వమసృజత యదిదం కించ" (తై. ౨. ౬.) "నేను అనేకముగ అగుదును అనేకముగఁ బుట్టుదును అని యా బ్రహ్మము సంకల్పించెను." ఇట్లు సంకల్పించిన యా యీశ్వరుఁడె తపస్సుచేసి యాలోచించెను. అట్లు ఆలోచించి కనిపించు నీ ప్రపంచమును సృజించెను." ఇత్యాది సృష్టికార్యములు జీవుని యందు సంభవింపవని భావము.

17. మూ. భేదవ్యపదేశాచ్చ.

భేదవ్యపదేశాత్ చ = జీవుని వేఱుగఁజెప్పుటవల్లను ఆనందమయుఁ డన జీవుఁడు గాఁడు.

"రసంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి. (తైత్తి, ౨. ౭) ఈ జీవుఁడు రసస్వరూపుఁడగు బ్రహ్మమును పొంది యానందముగలవాఁడగును" అని జీవుని ఆనందమయునికంటె వేఱుగ శ్రుతి చెప్పుచున్నదని భావము.

18. మూ. కామాచ్చ నాఽనుమానాపేక్షా.

కామాత్ చ=కోరికవలనను అనుమానాపేక్షా=అనుమానాఽపేక్ష న=లేదు

సూ. "సోఽకామయత" అతఁడు కోరెను, అను శ్రుతిలో ఆనందమయునికిఁ గోరికయున్నట్లు వినఁబడుటవలన జడమగు ప్రధానమునకుఁ గోరిక సంభవింపదు గాన అనుమాన ప్రమాణమును అపేక్షించి ప్రధానము జగములకుఁ గారణమని గాని అది ఆనందమయమగునని గాని చెప్పరాదు.

19. మూ. అస్మిన్నస్యచ తద్యోగం శాస్తి.

అస్మిన్=ఈ యానందమయునియందు, అస్య=ఈ జీవునికి తద్యోగం= ఆత్మతో నైక్యమును మోక్షమును శాస్తి=శ్రుతి శాసించుచున్నది.

సూ. ఈ యానందమయమందు జీవునికి ఆత్మతో నైక్యమును శ్రుతి శాసించుచున్నది గాన ఆనందమయుఁడన పరమాత్మయె కాని జీవుఁడును ప్రధానమును గాదు.

"యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాంవిందతే, అథసోఽభయం గతోభవతి యదాహ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే అథతస్య భయంభవతి" (తై. ౨. ౭.) "చూడరానివాఁడును

లింగశరీరములేనిదియు ఇట్టిదని చెప్పరానిదియు మాయాశూన్యమునగు బ్రహ్మమందు ఎవఁడు భయములేనిస్థితిని పొందునో యావిద్వాంసుఁడు జరామరణములులేని బ్రహ్మమును పొందును. ఈ బ్రహ్మమందు అల్పమైన భేదమును పొందువానికి జరామరణ భయమగును" అని శ్రుతి.

## ౭. అంతరధికరణము

20. మూ. అంతస్తద్ధర్మోపదేశాత్.

అంతః=సూర్యునిలోపల, తద్ధర్మోపదేశాత్=బ్రహ్మముయొక్క ధర్మములు ఉపదేశించుటవలన.

సూ. బ్రహ్మముయొక్క యపహతపాప్మత్వాది(పాపరహితాది)ధర్మములు సూర్యమండలాంతర్వర్తియగు పురుషునియందు ఉపదేశించుటవలన సూర్యమండలగతపురుషుఁడు పరమాత్మయె.

"అథ య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవసువర్ణః (ఛాందో. ౧ ౬. ౬) ఈ సూర్యునందున్న పురుషుఁడు బంగారపు బొమ్మవంటివాఁడుగను బంగారపు గడ్డము మీసములుగలవాఁడుగను బంగారపు వెంట్రుకలు గలవాఁడుగను కాలిగోరువఱకు బంగారపు సర్వదేహముగలవాఁడుగను గనిపించుచున్నాఁడు. "తస్యయథా కప్యాసం పుండరీకమేవమక్షిణి తస్యోదితి నామ స ఏషసర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతిహ వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవంవేద" (ఛాందో. ౧. ౬. ౭. ౮.) ఆ పురుషుని కన్నులు కోఁతి పృష్ఠమువలెను ఎఱ్ఱతామరవలెను ఉన్నవి. అతఁడు పాపముల నన్నింటినుండి దాటినవాఁడు. అతనికి ఉదితియనిపేరు. (ఉదిత=దాటినవాఁడు) ఆ పురుషుని ఇట్లు తెలిసినవాఁడు సర్వపాపములనుండి దాఁటుచున్నాఁడు. అని శ్రుతిలో ఆ పురుషునికి అపహతపాప్మత్వాదిధర్మములు చెప్పఁబడినవి.

21. మూ. భేదవ్యపదేశాచ్చాన్యః.

భేదవ్యపదేశాత్ చ=భేదముగ వ్యవహరించుట వలనను, అన్యః=ఈశ్వరుఁడు వేఱు.

సూ. నియమింపఁబడు సూర్యశరీరాభిమాని జీవులకంటె నియామకుఁ

డయిన యీశ్వరుని వేఱుగ వ్యపదేశించుటవలన ఆ జీవులకంటె ఈశ్వరుఁడు భిన్నుఁడు.

"య ఆదిత్యేతిష్ఠన్నాదిత్యాదంతరో యమాదిత్యోనవేద, యస్యాఽఽదిత్యః శరీరం, య ఆదిత్యమంతరో యమయత్యేష తఆత్మా అంతర్యామ్యమృతః (బ్రహ. ౩. ౭. ౯.) "సూర్యునియందుండి సూర్యుని కంటె వేఱుగా సూర్యుని లోపలనున్నవాఁడు. ఈయంతర్యామియగు నీశ్వరుని సూర్యుఁడు తెలిసికొనలేఁడు. ఆ యీశ్వరునికి సూర్యుఁడు శరీరము. ఆ యీశ్వరుఁడు లోపలఉండి సూర్యుని నియమించును. ఇతఁడె యీ యంతర్యామియైన యాత్మ ఇదె యమృతమైనది." అను శ్రుతినిబట్టి యీశ్వరుఁడు నియమించువాఁడుగను సూర్యుఁడు నియమింపబడువాఁడుగను వేఱుగఁ జెప్పఁబడినది గాన ఈశ్వరుఁడు సూర్యాభిమాన జీవుని కంటె భిన్నుఁడని భావము.

## ౮. ఆకాశాధికరణము

22. సూ. ఆకాశస్తల్లింగాత్.

తల్లింగాత్=బ్రహ్మలింగములుండుటవలన, ఆకాశః=ఆకాశపదము బ్రహ్మ పరమైనది.

సూ. బ్రహ్మముయొక్క ధర్మములుండుటవలన శ్రుతిలోని యాకాశ పదము బ్రహ్మపరమైనది.

"అస్యలోకస్య కాగతి రిత్యాకాశ ఇతిహోవాచ సర్వాణిహవా ఇమాని భూతాన్యాకాశా దేవ సముత్పద్యంత ఆకాశం ప్రత్యస్తం యంత్యాకాశో హ్యే వైభ్యోజ్యాయానాకాశః పరాయణం" (ఛాందోః ౨. ౯. ౧)" ఈ లోకమునకు ఆశ్రయమేది యని శాలావత్యుఁడు జైవలి నడిగెను. ఆకాశమెయని జైవలి చెప్పెను. ఈ చరాచరములన్నియు ఆకాశమునుండియె పుట్టుచున్నవి. ఆకాశమందె యస్తమించుచున్నవి. ఎందువలన ననఁగా ఈ భూతము లన్నిటికంటె ఆకాశమె గొప్పది. ఆకాశమె యాశ్రయము."అని శ్రుతియందు ఆకాశమునుండియె చరాచరములన్నియుఁ బుట్టుచున్నవని యందె యస్తమించుచున్నవని అది యన్నిటికంటె గొప్పది యదె యాశ్రయము అని చెప్పుటవలన ఆ యాకాశ పదము బ్రహ్మపరమైనదె గాని పంచభూతములలో నొకటైన యాకాశముగాదని భావము.

## ౯. ప్రాణాధికరణము

23. సూ. అతఏవ ప్రాణః

అతః ఏవ=ఆకారణము వలననే, ప్రాణః=ప్రాణమనఁగా బ్రహ్మము.

సూ. బ్రహ్మముయొక్క ధర్మములుండుటవలననె ప్రాణశబ్దమును బ్రహ్మపరమైనది.

"కతమాసాదేవతా, ప్రాణఇతిహోవాచ, సర్వాణిహ వాఇమాని భూతాని ప్రాణమే వాభిసంవిశంతి, ప్రాణమభ్యుజ్జిహతే సైషాదేవతా ప్రస్తావ మన్వాయత్తా" (ఛాందో. ౧ ౧౧. ౪. ౫) ప్రస్తోత యుషస్తి నిట్లు అడిగెను. "ఆ దేవత యెవరు? ప్రాణము. ఈ సర్వభూతములు ప్రాణమునే ప్రవేశించుచున్నవి. ప్రాణము నుండియె పుట్టుచున్నవి ఈ ప్రాణదేవతయె యుపాసింపఁదగినది." అని యుషస్తి చెప్పెను." పైని జెప్పిన దర్మములు బ్రహ్మముయొక్క ధర్మములేగాని ప్రాణవాయువుయొక్క ధర్మములుగావు. కాన ప్రాణపదము బ్రహ్మపరమైనది యని భావము.

## ౧౦. జ్యోతిశ్చరణాధికరణము

24. సూ. జ్యోతిశ్చరణాభిధానాత్

చరణాభిధానాత్=చరణములు చెప్పుటవలన. జ్యోతిః=జ్యోతిస్సు అనఁగా బ్రహ్మము.

సూ. ఈ జ్యోతిస్సునకు సర్వభూతములు చరణములు అని చెప్పఁబడుటచే తేజోవాచియగు జ్యోతిస్సునకు చరణములుండుట సంభవింపదు గాన శ్రుతిలోని జ్యోతిశ్శబ్దము బ్రహ్మపరమైనది.

"అథ యదతః పరోదివోజ్యోతిర్దీప్యతే. విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషూత్తమేషులోకేష్విదం వావతద్యదిద మస్మిన్నంతః పురుషే జ్యోతిః" (ఛాందో. ౩. ౧౩ ౭.) మఱి యీద్యులోకముకంటెను సమస్తప్రాణులకంటెను, భూరాదిలోకములకంటెను దీనికంటె నుత్తమములేని యుత్తమలోకములకంటెను పైనున్న యా జ్యోతి యీ పురుషుని గర్భముననున్న జఠరాగ్నిరూపజ్యోతిగాఁ బ్రకాశించుచున్నది" అను శ్రుతిలోని జ్యోతిః పదమునకు బ్రహ్మమె యర్థముగాని సూర్యాదిజ్యోతిగాదు. "పాదోఽస్య విశ్వాభూతాని" (ఛాందో. ౩. ౧౨. ౬)

"ఇతని పాదము సమస్తభూతములు" అని పూర్వము బ్రహ్మమునకు మూఁడు పాదములు చెప్పి యా బ్రహ్మమునె ద్యులోకసంబంధముగా జ్యోతిర్వాక్యమందు గుర్తుగాఁ జెప్పుటవలన ఈ జ్యోతిఃపదము మొదటఁ జెప్పిన బ్రహ్మమెగాని సూర్యాదిజ్యోతి గాదని భావము.

25. మూ. ఛందోఽభిధానాన్నేతి చేన్న తథా, చేతోఽర్పణనిగదాత్ తథాహి దర్శనం.

ఛందోఽభిధానాత్=గాయత్రీ ఛందస్సును జెప్పుటవలన, ఇతిచేత్= గాయత్రియే యన్నచో చేతోఽర్పణనిగదాత్=మనస్సుంచుటను జెప్పుటవలన తథా=అట్లు,న=చెప్పరాదు. తథాహి=అట్లే, దర్శనం=బ్రహ్మదర్శన మగుచున్నది.

సూ. "గాయత్రీ వాఇదం సర్వం యదిదంకించ" (ఛాందో. ౩ ౧౨. ౧) "ఈసర్వభూతములు గాయత్రియే" అని గాయత్రిని ఉపక్రమించి చెప్పుట వలన పాదములు గాయత్రీఛందస్సునకే యుండుట సంభవించును గాన గాయత్రికే పాదములు చెప్పఁబడినవి బ్రహ్మమునకుఁగాదు" అని యన్నచో అక్కడ గాయత్రీఛందస్సుద్వారా గాయత్రి యందున్న బ్రహ్మమందె మనస్సు ఉంచుట చెప్పఁబడుటవలనఁ బాదములు బ్రహ్మమునకెగాని గాయత్రికిఁగాదు. సూర్యమండలాది శుద్ధస్థలములందుఁ బరమాత్మ ప్రకటమగుట కనిపించునట్లు గాయత్రియందును బ్రహ్మదర్శనమగుచున్నది.

26. మూ. భూతాది పాదవ్యపదేశోపపత్తేశ్చైవం.

భూతాది పాదవ్యపదేశోపపత్తేః చ=భూతాదులను పాదములుగఁ జెప్పుట యుపపన్న మగుటవలనను, ఏవం=ఇట్లు.

సూ. భూతాదులను పాదములుగఁ జెప్పుట బ్రహ్మమందె యుపపన్న మగునుగాని గాయత్రీ ఛందస్సునందు ఉపపన్నముగాదు గాన నిట గాయత్రీ పదముచే గాయత్రియందున్న బ్రహ్మమె చెప్పఁబడుచున్నది.

గాయత్రీవా ఇదం సర్వం" (ఛాందో. ౩. ౧౨. ౧) "ఈ ప్రపంచ మంతయు గాయత్రియె" అను శ్రుతిలోని గాయత్రీ పదమునకు పంచ మహా భూతాది సకల ప్రపంచాత్మక బ్రహ్మత్వమె చెప్పఁబడినది. అది గాయత్రి యందున్న బ్రహ్మమునకెగాని గాయత్రీ ఛందస్సునకు సందర్భింపదని భావము.

27. మూ. ఉపదేశ భేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్.

ఉపదేశభేదాత్=ఉపదేశములో ఒకచో దివి అని సప్తమిగనుదివః అని యొకచో పంచముగ విభక్తిభేదము ఉండుటవలన న=బ్రహ్మకు ప్రత్యభిజ్ఞానము లేదు, ఇతిచేత్=అని అన్నచో న=అట్లనరాదు, ఉభయస్మిన్ అపి=సప్తమీ పంచమీ విభక్తులు రెండిటియందుఁగూడ, అవిరోధాత్=విరోధము లేకపోవుటవలన.

సూ. "ఈ బ్రహ్మముయొక్క యమృతరూపమైన మూఁడవపాదము ద్యులోకమందున్నది" అనుచో ద్యులోకమందు అని సప్తమిగను "మఱి యీ జ్యోతి యీద్యులోకముకంటెఁ బైని బ్రకాశించుచున్నది" అనుచో ద్యులోకము కంటె అని పంచమిగను విభక్తిభేదముగ నుపదేశించుటవల్ల ఇట బ్రహ్మము యొక్క ప్రత్యభిజ్ఞానము లేదన్నచో ఉపదేశములో భేదమున్నను పరస్పరము అర్థవైరుధ్యము లేకపోవుటవలన బ్రహ్మముయొక్క ప్రత్యభిజ్ఞానము గాయత్రి యందుఁ జెప్పవచ్చును.

"త్రిపాదస్యామృతం దివి" (ఛాందో. ౩. ౧౨. ౬.) అనుచోట దివి అని సప్తమిగను "అథయదతః పరోదివో జ్యోతిర్దీప్యతే" అనుచో దివః అని పంచమిగను ఉపదేశింపఁబడెను. డేగచెట్టునందున్నది చెట్టుపైనున్నది అను లోకవ్యవహారములోవలె ఇటను విరోధములేదని భావము లేక దివి అను సప్తమికి పంచమ్యర్థమైనను జెప్పుకొనవచ్చునని భావము.

### ౧౧. ఇంద్రప్రాణాధికరణము

28. మూ. ప్రాణస్తథానుగమాత్.

అనుగమాత్=పూర్వాపరశ్రుత్యనుగతినిబట్టి తదా=అట్లే, ప్రాణః=ప్రాణ మనఁగా బ్రహ్మము.

సూ. ముందు వెనుకల శ్రుతివాక్యములను బర్యాలోచింపఁగా సమన్వయ ముండుటవలనఁ బ్రాణపదము బ్రహ్మపరమైనది.

దివోదాసుని కుమారుఁడగు ప్రతర్దనుఁడనురాజు యుద్ధముచేతను పౌరుషముచేతను ఇంద్రునికిఁ బ్రియవాసమైన స్వర్గమునకుఁబోఁగా నింద్రుఁడు సంతసించి నీకు వరమిచ్చెదఁ గోరుమనియె. అప్పుడు ప్రతర్దనుఁడు 'మనుష్యులకు మేలుగూర్చు దానిని నీవే యాలోచించియిమ్ము' అనెను. అపుడింద్రుఁడు "సహో

వాచ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తంమామాయురమృతముపాసస్వ" (కౌషీ. ౩. ౧.) నేను ప్రాణమను చేతనుఁడను అట్టి నన్ను ఆయువునకుఁ గారణముగను అమృత స్వరూపముగను ఉపాసింపుము అని యింద్రుఁడనియె." అను శ్రుతిలో ప్రాణ పదము బ్రహ్మపరమైనది. "సఏషప్రాణఏవ ప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతం" (కౌషీ. ౩. ౮) ఆ ప్రాణమె చేతనస్వరూపమైనది. ఆనందమైనది చావుఁ బుట్టుకలు లేనిది. మోక్షరూపమైనది" అను శ్రుతితోఁ బై శ్రుతిని బర్యాలోచన చేసి చూడఁగా ప్రాణపదమునకు బ్రహ్మమనునర్థము సమన్వయించుచున్నది. ప్రాణపదము బ్రహ్మపరమైనది. కానఁ బ్రాణపదమునకిటఁ బ్రాణవాయువనిగాని, జీవుఁడనిగాని ప్రాణదేవతయనిగాని అర్థము చెప్పరాదని భావము.

౨౯. మూ. నవక్తురాత్మోపదేశాదితి చేదధ్యాత్మ సంబంధ భూమాహ్యస్మిన్.

వక్తుః=వక్తకు, ఆత్మోపదేశాత్ ఇతిచేత్=తన్నుఁగూర్చి యుపదేశించుట వల్ల అన్నచో, న=అట్లుగాదు, అస్మిన్=ఈ ప్రతర్దనాధ్యాయమందు, అధ్యాత్మ భూమాహి=అధ్యాత్మ విషయాధిక్యముగలదుగదా.

సూ. ఇంద్రపతర్దనుల గుఱించిన విషయముగల యీ యధ్యాయమందు ఆనందామృతత్వాదికమైన యధ్యాత్మతత్త్వమునకు సంబంధించిన విషయ మధికముగ నుండుటవల్ల ఇట 'ఇంద్రుఁడు తన్నుఁగూర్చి మాత్రము చెప్పెనేగాని బ్రహ్మమునుగూర్చి చెప్పలేదు' అనరాదు.

"సఏష ప్రాణఏవ ప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతం" (కౌషీ. ౩. ౮) ఆ యీ ప్రాణమె చేతనము ఆనందము చావులేనిది. మోక్షరూపమైనది, "సమ ఆత్మేతి విద్యాత్" ఆనందాది ధర్మములుగల యీ ప్రాణమె నా యాత్మయని తెలిసికొనవలెను." "అయమాత్మాబ్రహ్మ సర్వానుభూః" ఈ ప్రత్యగాత్మయె సర్వమును అనుభవించు బ్రహ్మము. "మొదలైన యానందామృతత్వాదికాధ్యాత్మ తత్త్వమునకు సంబంధించిన విషయబాహుళ్యమునుబట్టి ప్రాణపదము బ్రహ్మ పరమనిభావము.

౩౦. మూ. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్.

వామదేవవత్=వామదేవునివలె, శాస్త్రదృష్ట్యాతు = శాస్త్రదృష్టి చేతనై తే, ఉపదేశః=ఉపదేశముచేయఁబడినది.

సూ. పూర్వజన్మజ్ఞానముచే బ్రహ్మస్వరూపుఁడై "నేను మనువునైతిని, సూర్యుఁడనైతిని" అని తెలిసికొన్న వామదేవునివలె "నేనే పరబ్రహ్మమును, అనుశాస్త్రదృష్టిచే "నాలోని బ్రహ్మమును దెలిసికొనుము" అను భావముతో "నన్నే తెలిసికొనుము" అని యుపదేశించెను గాని వృత్రాసురుని జంపుట మొదలైన పనులు చేసిన నా భౌతికశరీరమును దెలిసికొనమని యుపదేశింపలేదు.

"అహంమనురభవం సూర్యశ్చ" అని వామదేవుఁడనుకొనెను. ఇట్లే "అహమేవ పరంబ్రహ్మ" అను శాస్త్రదృష్టిచే "మామేవజానీహి" అని యింద్రుఁడు చెప్పెనని భావము.

31. మూ. జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేన్న ఉపాసాత్రైవిధ్యా దాశ్రితత్వాదిహ తద్యోగాత్.

జీవముఖ్యప్రాణలింగాత్=జీవునికిముఖ్యమైన ప్రాణలింగమువలన, న=బ్రహ్మమని చెప్పరాదు, ఇతిచేత్=అని యన్నచో న=అట్లనరాదు, ఉపాసాత్రైవిధ్యాత్=మూఁడు విధములైన యుపాసన లుండుట వలన ఇహ=ఇందు ఆశ్రితత్వాత్=ఆయుపాసనలు ఆశ్రయింపఁబడుటవలన, తద్యోగాత్=అవి యిట సంబంధించియుండుటవలన.

సూ. జీవునియొక్కయుఁ బ్రధానమైన ప్రాణముయొక్కయు ధర్మములు గనిపించుటవలన నిట బ్రహ్మము అర్థము గాదన్నచో అందు జీవోపాసన, ప్రధాన ప్రాణోపాసన బ్రహ్మోపాసన యని యుపాసన మూఁడు విధములుగా నుండుట వలన ఆ మూఁడు విధములైన యుపాసనలు ఇట నంగీకరింపఁబడుటచే నిందు ఆ మూఁడు విధములైన యుపాసనలు స్థూలారుంధతీ న్యాయముగ నిర్గుణ బ్రహ్మజ్ఞానసాధనముగ సంబంధించియున్నవి గాన ఇందు బ్రహ్మమును గుఱించియె చెప్పఁబడినది.

"న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" వాక్కును దెలిసికొనఁగోరకుము వక్తను దెలిసికొనుము. "అథ ఖలు ప్రాణఏవ ప్రజ్ఞాత్మా ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" (కౌషీ. ౩. ౩) చేతనమైన యీ ప్రాణమె యీ శరీరమును అవలంబించి లేవఁదీయుచున్నది." ఇత్యాది శ్రుతులు వక్తయగు జీవుని ప్రధాన ప్రాణమును; "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఆనందోఽజరోఽమృతం" ఆ యీ

ప్రాణమె చేతనము ఆనందము చావులేనిది మోక్షరూపమైనది" ఇత్యాది శ్రుతులు బ్రహ్మమును జెప్పుటచే మూఁడు విధములైన యుపాసనలు ఇట సమ్మతము. ఈ యుపాసనలద్వారా నిర్గుణ బ్రహ్మోపాసనము సుకరమగునని భావము.

ఇది
శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందు మొదటి యధ్యాయమున
స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయమను
మొదటి పాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

మొదటి యధ్యాయమున రెండవపాదము.

బ్రహ్మబోధ కాస్పష్టశ్రుతి వాక్యసమన్వయము.

## ౧. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము

1. మూ. సర్వత్రప్రసిద్ధోపదేశాత్.

సర్వత్ర=అన్ని శ్రుతులందు, ప్రసిద్ధోపదేశాత్=ప్రసిద్ధమైన బ్రహ్మమును ఉపదేశించుట వలన.

సూ. శ్రుతులందన్నిచోట్ల జగత్కారణముగఁ బ్రసిద్ధమైన బ్రహ్మమె యుపదేశింపఁబడుట వలన బ్రహ్మమె యుపాసింపఁదగినది.

"సర్వంఖల్విదంబ్రహ్మ "తజ్జలాన్" ఇతిశాంత ఉపాసీత. అథఖలు క్రతుమయః పురుషోయథాక్రతు రస్మిన్‌లోకే పురుషోభవతి. తథేతః ప్రేత్య భవతి సక్రతుం కుర్వీత "మనోమయః ప్రాణశరీరోభారూప స్సత్యకామ స్సత్య సంకల్పః" (ఛాందో. ౩. ౧౪. ౧. ౨.) ఇదియంతయు బ్రహ్మము. ఈ ప్రపంచము తజ్జ=ఆ బ్రహ్మమందె పుట్టినదై ల=అందెలయమై అన్=చేష్టగల్గదై యున్నది, అని యుపాసింపవలయు. సంకల్పరూపుఁడైన పురుషుఁడు ఈ లోక మందెట్టి సంకల్పము గలవాఁడగునో యట్టి సంకల్పము గలవాఁడుగనే పరలోకము పొందియున్నాఁడు. అతనిని ధ్యాసింపవలయును, అతఁడు మనోమయుఁడు ప్రాణశరీరుఁడు తేజోరూపుఁడు సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు" అను శ్రుతిలో మనోమయత్వాది గుణములు గలిగి యుపాసింపఁదగినవాఁడై యుండువాఁడు బ్రహ్మముగాని జీవుఁడుగాదని భావము. "సర్వకర్మా సర్వకామః" సర్వకర్మలు గలవాఁడు సర్వకామములు గలవాఁడు. "ఏష మ ఆత్మా అంతర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా యవాద్వా" నా హృదయ మధ్యమందున్న యాత్మ వడ్లగింజకంటెను యవగింజకంటెను మిగులఁ జిన్నది". అను శ్రుతివాక్యములలో జీవుఁడే బోధింపఁ బడుటవలన ఇట "మనోమయః ప్రాణశరీరః" మనోమయుఁడు, ప్రాణశరీరుఁడు

అనెడి గుణములు గూడ జీవునికి వర్తించునేమో యను సందేహము గలుగు చున్నది దానిని వారించుటకై యిట్లు చెప్పఁబడినది.

2. మూ. వివక్షిత గుణోపపత్తేశ్చ.

వివక్షిత గుణ=చెప్పఁదలఁచిన గుణములు, ఉపపత్తేశ్చ=బ్రహ్మమందు ఉపపన్నములగుట వలనను.

సూ. ఉపాసనయందు స్వీకరింపఁదగినవిగ నుద్దేశింపఁబడిన సత్య సంకల్పాది గుణములు బ్రహ్మమందె యుపపన్నములగును గావునను ఇట ఉపాస్యము బ్రహ్మమె.

"సత్యకామ స్సత్యసంకల్పః" ఆ బ్రహ్మము సత్యమైన కామము గలది సత్యమైన సంకల్పము గలది. "య ఆత్మా అపహతపాప్మా" (ఛాందో. ౮. ౭. ౧) "ఆ యాత్మ పాపములేనిది" "అప్రాణో హ్యమనా శ్శుభ్రః" ఆ బ్రహ్మము ప్రాణములేనిది, మనస్సులేనిది, శుద్ధమైనది, ఇత్యాది శ్రుత్యుక్త గుణములు బ్రహ్మమందెగాని జీవునియందు ఉపపన్నములుగావని భావము.

3. మూ. అనుపపత్తేస్తు న శారీరః.

అనుపపత్తేః తు=ఉపపన్నములు గాకపోవుటవల్లనైతే, శారీరః=శరీరగత జీవుఁడు, న=ఉపాసింపఁదగినవాఁడుకాఁడు.

సూ. సత్యసంకల్పాది గుణములు జీవునియందు ఉపపన్నములుగావు గాన శరీర నిష్ఠుఁడగు జీవుఁడు ఉపాసింపఁదగినవాఁడు గాఁడు.

"సత్యసంకల్పః, ఆకాశాత్మా" సత్యసంకల్పుఁడు ఆకాశ స్వరూపుఁడు. "అవాకీ అనాదరః" వాగాదీంద్రియ శూన్యుఁడు కోరికలు లేనివాఁడు. "జ్యాయాన్ పృథివ్యా జ్యాయా నంతరిక్షాత్" భూమికంటె గొప్పవాఁడు ఆకాశము కంటె గొప్పవాఁడు. "ఆకాశవత్సర్వ గతశ్చ నిత్యః" ఆకాశమువలె సర్వ గతుఁడు నిత్యుఁడు. ఇత్యాది గుణములు శరీరమందు బద్ధుఁడయిన జీవునికి సరిపడవని భావము.

4. మూ. కర్మకర్తృ వ్యపదేశాచ్చ.

కర్మకర్తృ=బ్రహ్మమును కర్మగను జీవుని కర్తగను వ్యపదేశాచ్చ= వ్యవహరించుట వలనను.

సూ. ఉపాసింపఁదగిన బ్రహ్మమును కర్మగను ఉపాసించు జీవుని కర్త గను వ్యవహరించుటవల్లఁ గూడ ఇట ఉపాసింపఁదగినది బ్రహ్మమె.

"ఏత మితః ప్రేత్యాభిసంభవి తాస్మి" (ఛాందో. ౩. ౧౪. ౪.) మనోమయత్వాది గుణములు గల యీ యాత్మను ఈ శరీరమునుండి పొందెదను". అను శ్రుతిలో కర్తయగు జీవుఁడు కర్మమయిన యాత్మను పొందునని చెప్పఁబడినది గాన ఇట ఉపాసింపఁదగినది బ్రహ్మమె యని భావము.

5. మూ. శబ్ద విశేషాత్.

శబ్దవిశేషాత్=పురుషుఁడను శబ్దవిశేషమును ఉపదేశించుట వలన.

సూ. 'వరిగింజవలెఁగాని యవగింజవలెఁగాని చామగింజవలెఁగాని చామబియ్యపు గింజవలెఁగాని సూక్ష్మమైన హిరణ్మయమైన పురుషుఁడు అంతరాత్మయందుఁ గలఁడు' అను శ్రుతిలో అంతరాత్మకంటె వేఱుగఁ బురుషశబ్దమును ఉపయోగించుట వలన శరీరమునందలి జీవునికంటె మనోమయత్వాది గుణములు గల పరమాత్మ భిన్నుఁడు అతఁడే యుపాసింపఁదగినవాఁడు.

"యథా వ్రీహిర్వాయవోవా శ్యామాకోవా శ్యామాకతండులోవా ఏవమయ మంతరాత్మన్ పురుషో హిరణ్మయః" (శతపథ. ౧౦. ౬. ౩. ౨.) అను శ్రుతిలో అంతరాత్మన్ అను లుప్తసప్తమ్యంతార్థక పదముకంటె వేఱుగ "పురుషః". అని ప్రథమాంతపదముచేఁ జెప్పఁబడు జీవుఁడును పరమాత్మయును భిన్నులని భావము.

6. మూ స్మృతేశ్చ.

స్మృతేశ్చ=స్మృతినిబట్టియును.

సూ. "అర్జునా! ఈశ్వరుఁడెల్ల ప్రాణుల హృదయదేశ మందున్నాఁడు" అను స్మృతినిబట్టియు జీవునికంటె భిన్నుఁడైన యీశ్వరుడె యుపాసింపఁదగినవాఁడు.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి" (గీత. ౧౮. ౬౧) ఇత్యాది గీతావాక్యములు స్మృతులు. పై సూత్రమందును ఈ సూత్రమందును శరీరస్థజీవుని పరమాత్మను వేఱుగఁ జెప్పుట ఘటాకాశము అనంతాకాశముల భేదమువలె అజ్ఞానులచే గ్రహింపఁబడు వ్యావహారిక దృష్టిచేతనేగాని వాస్తవిక దృష్టిచే మాత్రము గాదని తెలియునది.

7. మూ. అర్భకౌకస్త్వా త్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ.

అర్భకౌకస్త్వాత్=స్వల్పనివాసముగలవాఁడగుటవలన, తద్వ్యపదేశాచ్చ= అట్లువ్యవహరించుటవలనను. న=బ్రహ్మము అర్థముగాదు, ఇతిచేత్=అన్నచో, న= అట్లనరాదు, నిచాయ్యత్వాత్=సూక్ష్మహృదయమునఁ జూడఁదగినవాఁడగుటవలన, ఏవం=ఇట్లు, వ్యోమవచ్చ=ఘటాద్యాకాశమువలె.

సూ. 'ఈ యాత్మ నా హృదయములోపలనున్నది' ఇత్యాది శ్రుతులలో స్వల్పమైన నివాసముగలవాఁడుగను "వరిగింజకంటెఁగాని యవగింజకంటెఁగాని మిక్కిలి యణువైనవాఁడు" ఇత్యాతి శ్రుతులలో అణువుగను వ్యపదేశింపఁబడుట వలనను జీవుఁడేగాని పరమాత్మ యిటఁ జెప్పఁబడలేదనరాదు. అణీయస్త్వాది గుణగణములతో నిండిన యీశ్వరుఁడు సూక్ష్మమగు హృదయపద్మమునఁ జూడఁ బడినవాఁడగుటవలన అనంతాకాశము ఘటాద్యాకాశముగను సకల వసుధాధిపతి యయోధ్యాదిపతిగను వ్యవహరింపఁబడినట్లు ఇట ఈశ్వరుఁడే వ్యవహరింపఁబడెను గాని జీవుఁడు వ్యవహరింపఁబడలేదు.

"ఏష మ ఆత్మా అంతర్హృదయే" ఇత్యాదులలో స్వల్పస్థానము గలుగు నట్లు "అణీయాన్ వ్రీహేర్వాయవాద్వా" ఇత్యాదులలో అణీయస్త్వము గలుగు నట్లుగఁ గనిపించుటచే జీవుఁడే చెప్పఁబడుచున్నాఁడని సందేహము గలుగఁగా నిది చెప్పఁబడెను.

8. మూ. సంభోగప్రాప్తిరితిచేన్న వైశేష్యాత్.

వైశేష్యాత్ = బ్రహ్మమందు గుణవిశేషములుండుటవలన, సంభోగ ప్రాప్తిః = ఫలభోక్తృత్వాదులు ప్రాప్తించును, ఇతిచేత్ = అని అన్నచో, న=అట్లనరాదు.

సూ. ఆకాశమువలె సర్వగతుఁడగు బ్రహ్మమునకు సర్వప్రాణి హృదయ ములతో సంబంధముండుటవలన అతనికి ఫలభోక్తృత్వాదులు సంభవించునన రాదు. మిథ్యాజ్ఞానముగల జీవునికంటె సమ్యగ్జ్ఞానముగల పరమాత్మకు గుణవిశేష ముండుట వలన ఫలభోక్తృత్వాదు లతనికి సంభవింపవు.

## ౨. అత్త్రధికరణము

9. మూ. అత్తా చరాచరగ్రహణాత్.

చరాచరగ్రహణాత్ = చరాచరములను భక్షించువాఁడుగా గ్రహింపఁబడుట వలన, అత్తా=భక్షకుఁడు బ్రహ్మమె.

సూ. చరాచరములను భక్షించువాఁడుగ గ్రహింపఁబడుట వలన అత్త (=భక్షకుఁడు) అనఁగాఁ బరమేశ్వరుఁడె.

"యస్య బ్రహ్మ చ క్షత్రంచ ఉభే భవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థావేద యత్రసః" (కఠ. ౧. ౨. ౨౪.) అతనికి బ్రహ్మక్షత్రియులు రెండు అన్నము. మృత్యువు ఊరఁగాయ. అతఁడెచ్చటనుండునో యెవ్వఁడెఱుఁగును. అనుశ్రుతిలో ఆ యన్నమును భక్షించువాఁడు అగ్నియా? జీవుఁడా? పరమాత్మయా? అని సందేహము గలుగఁగా మృత్యువు ఊరఁగాయగా అనఁగా చరాచరములను భక్షించువాఁడుగాఁగూడ గ్రహింపఁబడుటవలన అతఁడు పరమేశ్వరుఁడే, కాన బ్రహ్మక్షత్రియులను భక్షించువాఁడు అగ్నిగాని జీవుఁడుగాని కాఁడని తెలుపుట కిది చెప్పఁబడెనని భావము.

10. మూ. ప్రకరణాచ్చ.

ప్రకరణాచ్చ=ప్రకరణమునుబట్టియును.

సూ. "పుట్టఁడు చనిపోఁడు జ్ఞానముగలవాఁడు" మొదలగు శ్రుతుల ప్రకరణమునుబట్టియు ఇట భక్షకుఁడనఁగాఁ బరమేశ్వరుఁడె.

"నజాయతే మ్రియతే వా విపశ్చిత్" (కఠ. ౧. ౨ ౧౮) ఇత్యాది బ్రహ్మబోధక శ్రుతుల ప్రకరణమునుబట్టి పరమేశ్వరుఁడనియె గ్రహింపవలయునని భావము.

## ३. గుహాప్రవిష్టాధికరణము

11. మూ. గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి తద్దర్శనాత్.

తద్దర్శనాత్=శ్రుతిలో అట్లుగనిపించుటవలన, ఆత్మానౌ = జీవాత్మ పరమాత్మలు, గుహాం=హృదయగుహను ప్రవిష్టౌ=ప్రవేశించినవారు.

సూ. "సుకృతజన్యమగు శరీరమునఁ గర్మఫలమును అనుభవించుచు గొప్పదైన హృదయగుహను బ్రవేశించినారు. ఇత్యాదిశ్రుతులలో గుహను బ్రవేశించినట్లు చెప్పఁబడినవారు జీవుఁడును బరమాత్మయునుగాని బుద్ధిజీవులు

మాత్రము గారు. శ్రుతులలో జీవునికిని పరమాత్మకును హృదయ గుహాప్రవేశము గనిపించుచున్నది

"ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే" అను శ్రుతిలో సందేహవారణకై యిట్లు చెప్పఁబడినది. "ఆత్మాన మన్విచ్ఛ గుహాం ప్రవిష్టం" "హృదయ గుహను బ్రవేశించిన యాత్మను అన్వేషింపుము" ఇత్యాదిశ్రుతులలో జీవునికిఁ బరమాత్మకు గుహాప్రవేశమున్నట్లు కనిపించు చున్నది గాన ఇట బుద్ధి జీవులను జెప్పరాదనిభావము.

12. మూ. విశేషణాచ్చ.

విశేషణాచ్చ=విశేషించి చెప్పుట వలనను.

సూ. శ్రుతులలో జీవునిని బ్రహ్మము పొందు వానినిగాను, బ్రహ్మమును జీవునిచేఁ బొందఁదగినవానినిగను విశేషించి చెప్పుట వలనను హృదయ గుహను బ్రవేశించినవారు జీవాత్మ పరమాత్మలే గాని బుద్ధి జీవులు గారు.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు (కఠ. ౧. ౩. ౩.) ఆత్మను రథికునిగను శరీరమును రథముగను దెలిసికొనుము" అనుచోట రథికునిగ నిరూపింపఁబడిన జీవాత్మను సంసార మోక్షములను బొందు వానినిగఁ జెప్పఁబడెను. "సో౽ధ్వనః పారమాప్నోతి, తద్విష్ణోః పరమంపదం (కఠ. ౧. ౩. ౯.) "ఆ జీవుఁడు సంసారసాగరమున కావలియొడ్డైన యుత్కృష్టమగు విష్ణుపదమును బొందుచున్నాఁడు" అను శ్రుతిలోఁ బరమాత్మ పొందఁదగినవాఁడుగఁ దెలుపఁ బడెను. "అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" అధ్యాత్మయోగమును దెలిసికొనుటచేత ఈశ్వరుని దలఁచి ధీరుఁడు హర్షశోక ములను విడచుచున్నాడు" అను శ్రుతిలో జీవునిని దలఁచువానినిగను ఈశ్వరుని దలఁపఁదగినవానినిగను దెలుపఁబడెను. వీనినిబట్టి హృదయగుహను బ్రవేశించు వారు జీవాత్మ పరమాత్మలని భావము.

## ४. అంతరాధికరణము

13. మూ. అంతర ఉపపత్తేః.

ఉపపత్తేః = శ్రుతిధర్మములు ఉపపన్నములగుటవలన, అంతరః = కను లందలి పురుషుఁడు బ్రహ్మమె.

సూ. "కనులందుఁ గనిపించుచున్న యీపురుషుఁడె యాత్మ, అమృత రూపుఁడు అభయుఁడు బ్రహ్మము అని చెప్పెను" ఇత్యాది శ్రుతులలోఁ జెప్పఁ బడిన కనులలోని పురుషుఁడు పరమాత్మ అని చెప్పినప్పుడే శ్రుత్యుక్త ధర్మములు ఉపపన్నములగును గాన ఆ కనులలోని పురుషుఁడు పరమాత్మయెగాని ప్రతి బింబముగాని జీవుఁడుగాని యింద్రియాధిదేవతగాని కారు."

"య ఏషోఽక్షిణి పురుషోదృశ్యతే ఏష ఆత్మేతిహోవాచ ఏతదమృతమే తదభయ మేత ద్బ్రహ్మేతి" (ఛాంధో. ౮. ౪. ౧౫. ౧.) ఇత్యాదులందుఁ జెప్పఁబడినవాడు పరమాత్మయె. అమృత్వాభయత్వాదులు బ్రహ్మముయొక్క ధర్మములుగాని జీవాదుల ధర్మములుగావని తెలియునది.

14. మూ. స్థానాది వ్యపదేశాచ్చ.

స్థానాదివ్యపదేశాత్ చ=పరమాత్మకు స్థానాదులను జెప్పుటవలనను.

సూ. పరమాత్మకు స్థాననామ రూపములను జెప్పుటవలనను గన్నులలోని వాఁడు పరమాత్మయెగాని ప్రతిబింబాదులుగావు.

పరమాత్మకు ఆదిత్యమండలభాగము, హృదయ పద్మము, కన్నులలోని దేశము స్థానములుగను "అస్యోదితినామ" (ఛాందో. ౧. ౬. ౭.) అని ఉదితి ప్రణవము మొదలగునవి నామములుగను, య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆ ప్రాణఖాత్సర్వ ఏవసువర్ణః (ఛాందో. ౧. ౬. ౬.) ఆదిత్యునందు హిరణ్మయుఁడై కనిపించు పురుషుఁడు హిరణ్మయశ్మశ్రువులు గలవాడు హిరణ్మయకేశుఁడు, ప్రాణము మొదలు నఖముల వఱకు సువర్ణమయుఁడు" అని హిరణ్యశ్మశ్రువు మొదలగు రూపములును నిర్గుణ బ్రహ్మకు ఉపాసనకై చెప్పఁబడెనని తెలియునది.

15. మూ. సుఖవిశిష్టాభిధానా దేవచ.

సుఖవిశిష్ట=సుఖముతోఁగూడిన బ్రహ్మమును, అభిధానాదేవచ=చెప్పుట వలననే గూడ.

సూ. ప్రాణము బ్రహ్మము, ఆనందము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము" అని మొదటి శ్రుతిలో ఆనంద విశిష్టుఁడగు బ్రహ్మమును జెప్పుట వలననే గూడ తరువాతి "కనులదుఁ గనిపించుచున్న యీ పురుషుఁడే యాత్మ" అను శ్రుతిలోఁ జెప్పఁబడిన కనులలోని పురుషుఁడు బ్రహ్మమెగాని ప్రతిబింబాదులుగాఁడు

"ప్రాణో బ్రహ్మ, కం బ్రహ్మ, ఖం బ్రహ్మ" (ఛాందో. ४. ౧४. ౧.) అను శ్రుతి మొదటిది. తరువాతిదైన "సఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" అను శ్రుతిలోఁ జెప్పఁబడిన పురుషుఁడు బ్రహ్మమే. కం అనఁగా సుఖము, ఖం అనఁగా ఆకాశము. ఇట సుఖమనఁగా భౌతికసుఖము గాదు. బ్రహ్మానందము. సుఖ విశేషణమునుబట్టి యాకాశమనఁగా ఆకాశభూతము గాదు. బ్రహ్మమే. ఆకాశమునుబట్టి సుఖమనఁగా బ్రహ్మము. ఈ శ్రుతినిబట్టియుఁ బూర్వశ్రుతిలోని పురుషుఁడు బ్రహ్మమని తెలియవలెను.

16. సూ. శ్రుతోపనిషత్క గత్యభిధానాచ్చ.

శ్రుతోపనిషత్క=ఉపనిషద్రహస్యమును పొందువానికి, గతి=ఉత్తమగతి, అభిధానాత్ చ=చెప్పుటవలనను.

సూ. ఉపనిషత్తుల రహస్యమును గ్రహించినవానికిఁ గలిగెడి యుత్తమ గతి, కంటిలోని పురుషునుపాసించువానికిని గలుగునని చెప్పుటవలనను ఆ కంటియందున్న పురుషుఁడు బ్రహ్మమె.

"అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా ఆత్మాన మన్విష్య ఆదిత్య మభిజయంతే ఏతద్వై ప్రాణానా మాయతనమ్ తదమృత మభయ మేత త్పరాయణ మేతస్మా న్న పునరావర్తంతే" (ప్రశ్న. ౧. ౧౦) "మఱియు తపస్సుచేతను బ్రహ్మచర్యముచేతను శ్రద్ధచేతను విద్యచేతను ఆత్మను అన్వేషించి యుత్తరాయణముద్వారా సూర్యుని జయించుచున్నారు. ఈ హిరణ్య గర్భలోకమే ప్రాణముల కాధారము, ఇదే జరామరణములులేనిది, భయములేనిది. ఇదే యుత్తమగతి. దీని నుండి తిరిగి జన్మమరణములను బొందరు." అను శ్రుతిలోని యుత్తమ గతియే "అథ యదు చైవాస్మిన్ శవ్యం కుర్వంతి యదిచన, అర్చిష మేవ అభిసంభవంతి... ఆదిత్యాచ్చంద్ర మసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మగమయతి ఏష దేవపథో బ్రహ్మపథః, ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే నావర్తంతే. (ఛాందో. ४. ౧౫ ౫.) కంటియందున్న పురుషు నుపాసించినవారు శరీరమును విడిచిన పిదప వాని పుత్రాదులు వానికి శవసంస్కారము చేసినను చేయకున్నను అర్చిరాదిలోకములు పొంది సూర్యుని బొందుదురు... సూర్యుని నుండి చంద్రుని, చంద్రుని నుండి విద్యుల్లోకమును పొందుదురు. అక్కడ నుండి యొక దివ్యుఁడగు పురుషుఁడు వీరిని బ్రహ్మమును పొందించును. ఇదియె దేవమార్గము.

ఇదె బ్రహ్మమార్గము, ఈ మార్గమున బ్రహ్మమును పొందినవారు జన్మమరణములు గల కల్పమును ఈ మనుష్య శరీరమును పొందరు పొందరు." అను శ్రుతిలోఁ గంటి యందున్న పురుషునుపాసించిన వారికిఁ జెప్పఁబడుట వలన ఈ కంటియందున్న పురుషుడు బ్రహ్మమె యని భావము.

17. మూ. అనవస్థితే రసంభవాచ్చ నేతరః.

అనవస్థితేః=ఉండకపోవుటవలన, అసంభవాచ్చ=అసంభవమగుటవలనను న ఇతరః=ఇతరుఁడుగాఁడు.

సూ. ప్రతిబింబము కంటి యెదుట ఎల్లప్పుడు నుండకపోవుట వలనను అమృతత్వాదిధర్మములు ప్రతిబింబమునందు అసంభవమగుటవలనను కంటిలోని పురుషుఁడు బ్రహ్మమెగాని ప్రతిబింబముగాదు.

## ౫. అంతర్యామ్యధికరణము

18 మూ. అంతర్యామ్యధి దైవాదిషు తద్ధర్మ వ్యపదేశాత్.

అధిదైవాదిషు=అధిదేవతలందు, తద్ధర్మవ్యపదేశాత్=బ్రహ్మధర్మములను వ్యపదేశించుట వలన, అంతర్యామి=అంతర్యామి బ్రహ్మమె.

సూ భూమి మొదలైన యధిదేవతలందు బ్రహ్మధర్మములు వ్యపదేశించుట వలన ఆయధిదేవతలలో నుండి వానిని నియమించువాఁడు బ్రహ్మమె.

"యః పృథివ్యాంతిష్ఠన్, పృథివ్యా అంతరో యం పృథివీ నవేద, యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయతి ఏషత ఆత్మా అంతర్యామి అమృతః (బృహదా. ౩. ౭. ౧ ౨.) "ఎవఁడు భూమియందున్నవాఁడై భూమి లోపల నుండెనో, భూమి ఎవనిని ఎఱుఁగదో, ఎవనికి భూమికి శరీరమో, ఎవఁడు భూమిలో నుండి నియమించుచుండెనో, ఇతఁడే నీకు ఆత్మ అమృతుఁడు అంతర్యామియును" ఇత్యాది శ్రుతులలో అమృతత్వాది బ్రహ్మధర్మములు చెప్పఁబడుటచే వానికి సంబంధించిన పూర్వవాక్యములలోని యంతర్యామి పరమాత్ముఁడె.

19. మూ. నచస్మార్త మతద్ధర్మాభిలాపాత్.

అతద్ధర్మాభిలాపాత్ = ప్రధానమందులేని ధర్మములను జెప్పుట వలన, స్మార్తం=కపిలస్మృతియందుఁ జెప్పఁబడిన ప్రధానము, న చ=అంతర్యామియుఁగాదు.

సూ. ప్రధానమందులేని ద్రష్టృత్వాది ధర్మములు ఇటఁ జెప్పఁబడుట వలనఁ గపిలస్మృతి యందుఁ జెప్పఁబడిన ప్రధానము అంతర్యామిగాదు. పర మాత్మయె అంతర్యామి.

"అదృష్టో ద్రష్టా, అశ్రుతః శ్రోతా, అమతో మంతా, అవిజ్ఞాతో జ్ఞాతా" (బృహ. ౩ ౭. ౨౩) ఆ బ్రహ్మము చూడఁబడనివాఁడైనను చూచువాఁడు, వినఁబడనివాఁడైనను వినువాఁడు తలంపఁబడనివాఁడైనను తలఁచువాడు, తెలియఁ బడనివాఁడైనను దెలియువాఁడు. ఇత్యాది శ్రుతులందుఁ జెప్పఁబడిన ద్రష్టృత్వ శ్రోతృత్వాదులు జడమైన ప్రధానమందు సంభవింపవని భావము.

20. మూ. శారీరశ్చోభయేఽపి భేదేనైన మధీయతే.

ఉభయేఽపి=కౌణ్వ, మధ్యందినశాఖీయులగు వారిద్దఱును, భేదేన=భేద ముగా, ఏనం=ఈ జీవుని అధీయతే=చదువుచున్నారు. కాన శారీరశ్చ=శరీస్థజీవుఁ డును బ్రహ్మమె.

సూ. కణ్వశాఖీయులును మధ్యందిన శాఖీయులును ఈ జీవుని బర మాత్మకంటె వేఱుగాఁ జదువుచున్నారు. కాన ఆయధిదేవతలలో నుండి నియ మించువాఁడు పరమాత్మయె గాని శరీరస్థజీవుఁడు గాఁడు

"యో విజ్ఞానేతిష్ఠన్" (బృహ. ౩. ౭. ౨౨.) ఎఁడు విజ్ఞానాత్మయగు జీవుని యందుండెనో, అని కణ్వశాఖీయులును, "య ఆత్మనితిష్ఠన్" ఎవఁడు ఆత్మ యందు ఉండెనో అని మధ్యందిన శాఖీయులును జీవునికంటె బ్రహ్మమును వేఱుగఁ జెప్పుటచే అంతర్యామి పరమాత్మయె యని భావము. అంతర్యామి జీవుఁడన్నచో "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇతనికంటె మఱియొక ద్రష్టలేఁడు" ఇత్యాదిశ్రుతులు విరోధించునని భావము.

## ౬. అదృశ్యత్వాధికరణము

21. మూ. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః

ధర్మోక్తేః=సర్వజ్ఞత్వాదిధర్మములు చెప్పఁబడుటవలన, అదృశ్యత్వాది గుణకః=అదృశ్యాదిగుణములు గలవాఁడు బ్రహ్మమె.

సూ. సర్వజ్ఞత్వాది ధర్మములు చెప్పఁబడుటవలన అదృశ్యత్వాది గుణ ములతోఁగూడిన భూతయోని పరమాత్మయెగాని ప్రధానముగాదు.

"అథ పరా యయా తదక్షర మధిగమ్యతే, యత్తదద్రేశ్య, మగ్రాహ్యమ గోత్ర. మవర్ణ. మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం, నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" (ముండక. ౧. ౧. ౫. ౬.) "దేనివలన ఆయక్షర స్వరూపము తెలియఁబడుచున్నదో ఆ విద్య పరవిద్య యనఁబడును. ఆయక్షరము అదృశ్యము గ్రహింపరానిది గోత్రము లేనిది, రంగులేనిది, కనులు చెవులు లేనిది, చేతులు కాళ్లు లేనిది, నిత్యము వ్యాపించినది, అంతటనున్నది, మిగుల సూక్ష్మమైనది, మార్పు లేనిది దీనినే ధీరులు భూతములకుఁ గారణముగాఁ జూచుచున్నారు. "అక్షరాత్సంభవతీహ విశ్వం" (ముండక. ౧. ౧. ౭.) అక్షరస్వరూపమునుండి యీ విశ్వము గలుగుచున్నది. "ఇక్కడ అదృశ్యత్వాది గుణములు గల యక్షరము అనఁగాఁ బ్రధానమనునది యగునేమోయను సందేహము గలుగఁగా "య స్సర్వజ్ఞః సర్వవిత్" "అతఁడె సర్వమును దెలిసినవాఁడు సర్వవేత్త" అని పైవాక్యములకుఁ జిపర జగత్కర్తయయిన యక్షరము సర్వజ్ఞుఁడు సర్వవేత్తయని చెప్పుటచే నిట జ్ఞానములేని జడమగు ప్రధానము ఆ యక్షరమునకు అర్థముగాదని నిశ్చయింపఁబడుచున్నదని భావము.

2. సూ. విశేషణభేదవ్యపదేశాభ్యాంచ నేతరౌ.

విశేషణ భేదవ్యపదేశాభ్యాం=విశేషణములతోను భేదముగాను వ్యపదేశించుటవలన, ఇతరౌ=ప్రధానమును జీవుఁడును, న=కారు.

సూ. "పురుషుఁడు మూర్తిలేనివాఁడు దివ్యుఁడుగదా లోపల వెలుపల నున్నవాఁడు పుట్టుకలేనివాఁడు ప్రాణమనస్సులు లేనివాఁడు. శుభ్రమైనవాఁడు" అనుశ్రుతిలో మూర్తిలేనివాఁడు మొదలగు విశేషణములను బట్టియు," ఉత్కృష్టమైన యక్షరముకంటె నా పురుషుఁడు పరుఁడు" అని యక్షరమగు ప్రధానముకంటె వేఱుగఁజెప్పుటను బట్టియు అదృశ్యాదిగుణములుగల భూతయోని పరమాత్మయె గాని ప్రధానమును జీవుఁడును గాని గారు.

"దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాంభ్యంతరోహ్యజః అప్రాణోహ్యమనాః శుభ్రః" (ముండక. ౨. ౧ ౨.) అనుశ్రుతిలోని విశేషణములనుబట్టియు, "అక్షరాత్పరతః పరః" అనుశ్రుతిలో భేదముగాఁ జెప్పుటను బట్టియు అదృశ్యాది గుణయుక్తుఁడు పరమాత్మయని భావము.

23. మూ. రూపోపన్యాసాచ్చ.

రూపోపన్యాసాచ్చ=రూపమును ఉపన్యసించుట వలనను.

సూ. ఈ భూతయోనికి "తల యగ్ని కన్నులు సూర్య చంద్రులు, చెవులు దిక్కులు, వాక్కులు వేదములు. ప్రాణము వాయువు హృదయము విశ్వము, ఇతని పాదములనుండి భూమి పుట్టెను, ఇతఁడు సర్వప్రాణులకు అంతరాత్మ" అని శ్రుతిలో రూపము ఉపన్యసించుట వలనను ఆ భూతయోని పరమాత్మయె.

"అగ్నిర్మూర్ధా, చక్షుషీ చంద్రసూర్యౌ, దిశః శ్రోత్రే, వాగ్వివృతాశ్చ వేదాః, వాయుః ప్రాణో, హృదయం విశ్వ మస్య పద్భ్యాంపృథివీ, హ్యేష సర్వ భూతాంతరాత్మా" (ముండక. ౨ ౧. ౪.) అను శ్రుతిలో ఆభూతయోనికిఁ జేయఁబడిన రూపోపన్యాసమునుబట్టియు ఆ భూతయోని పరమాత్మయె యని భావము.

## ౩. వైశ్వానరాధికరణము

24. మూ. వైశ్వానరః సాధారణ శబ్దవిశేషాత్.

సాధారణ శబ్ద విశేషాత్=సాధారణ వాచక శబ్దమునకు విశేషము చెప్పుట వలన, వైశ్వానరః=వైశ్వానరుఁడు బ్రహ్మమె.

సూ. జఠరాగ్ని, అగ్ని, అగ్నిదేవతయను నర్థములందు వైశ్వానరశబ్దము సామాన్యమైనను ఇందు ద్యుమూర్ధత్వాది విశేషములు చెప్పఁబడుట వలన వైశ్వానరుఁడనఁగా బ్రహ్మమె.

"తస్యహవా ఏతస్యాత్మనో వైశ్వానరస్యమూర్ధైవ, సుతేజాశ్చక్షు ర్విశ్వ రూపో, వాయుః ప్రాణః, పృథగ్వర్త్మా, సందేహోబహులో. వస్తిరేవ రయిః, పృథివ్యేవ పాదా, వురఏవవేది. ర్లోమానిబర్హి, ర్హృదయంగార్హ పత్యో, మనో అన్వాహార్యపచన, ఆస్యమాహవనీయః" (ఛాందో. ౫ ౧౮. ౨.) "ఆత్మ రూపుఁడైన యీ వైశ్వారునకు తలద్యులోకము, కన్నులు సూర్యుఁడు, ప్రాణము వేఱుమార్గములు గలగాలి, అంతరాళము ఆకాశము, మూత్రకోశము ధనము గూర్చు జలము, కాళ్లు భూమి, వక్షస్థ్సలమువేది, రోమములు బర్హిస్సు, హృద యము గార్హపత్యాగ్ని, మనస్సు దక్షిణాగ్ని, ముఖము అహవనీయాగ్ని" అని శ్రుతిలోఁ, జెప్పఁబడిన "ద్యులోకము తల" మొదలగు విషయములు జఠరాగ్నికిఁ

గాని అగ్నిదేవతకుఁగాని, సంభవింపవు గాన నిట వైశ్వానరుఁడనఁగాఁ బర మాత్మయె యని యర్థము చెప్పవలయునని భావము.

25. మూ. స్మర్యమాణ మనుమానంస్యాదితి.

స్మర్యమాణం=స్మృతిలోఁ జెప్పఁబడినది, అనుమానంస్యాత్ ఇతి= సూచనగాఁగూడ నుండునని.

సూ. "ఎవనికి అగ్నిముఖమో ద్యులోకము తలయో" అని స్మృతిలోఁ జెప్పఁబడిన విషయముగూడ వైశ్వానర శబ్దమునకుఁ బరమాత్మపరమైన యర్థ మునె చెప్పవలయునని సూచించుచున్నది.

"యస్యాగ్ని రాస్యం, ద్యౌర్మూర్ధా, ఖంనాభి, శ్చరణౌక్షితిః, సూర్య శ్చక్షు, ర్దిశః శ్రోత్రం అస్మైలోకాత్మనే నమః" ఎవనికి అగ్ని ముఖమో ద్యులోకము తలయో ఆకాశము నాభియో క్షితిపాదములో, సూర్యుఁడు కన్నో, దిక్కులు చెవులో, అట్టి లోకస్వరూపుఁడైన వానికి నమస్కారము." ఇత్యాది స్మృతులు ఈ విషయమునే తెలుపుచున్నవని భావము.

26. మూ. శబ్దాదిభ్యోఽతః ప్రతిష్ఠానా న్నేతిచేన్న తథా దృష్ట్యుప దేశాదసంభవాత్ పురుషమపిచైన మధీయతే.

శబ్దాదిభ్యః=వైశ్వానరశబ్దము మొదలగువానివల్లను, అంతఃప్రతిష్ఠానాత్= హృదయములోనున్నట్లు చెప్పుటవలనను, న=పరమాత్మకాఁడు. ఇతిచేత్= అన్నచో, తథా=అట్లు, న=కాదు, దృష్ట్యుపదేశాత్=పరమాత్మదృష్టిని ఉప దేశించుటవలనను. అసంభవాత్=అసంభవమగుటవలనను, ఏనం=వీనిని, పురుషం అపి=పురుషునిగాఁగూడ అధీయతే చ=చెప్పుచున్నారుగూడ.

సూ. వైశ్వానరశబ్దము అగ్నిపరముగఁ బ్రయుక్తమగుట వలనను వైశ్వానరునికి త్రేతాగ్నులను అవయవములుగఁ జెప్పుటవలనను వైశ్వానరుఁడు హృదయములోనున్న వాఁడుగ శ్రుతిలోఁ జెప్పఁబడుట వలనను ఇట వైశ్వాన రుఁడనఁగా జఠరాగ్నియని చెప్పవలయునేగాని పరమాత్మ యని చెప్పరాదు. అన్నచో అట్లనరాదు. జఠరాగ్నియందుఁ బరమాత్మ దృష్టిచే నుపాసన చెప్పఁ బడుటవలనను ద్యులోకముతల మొదలగు విషయములు జఠరాగ్నియందు సంభవింపకపోవుటవలనను వాజసనేయులు ఈ వైశ్వానరుని బరమపురుషునిగఁ బఠించుటవలనను వైశ్వానరుఁడనఁగాఁ బరమాత్మయె యగుఁగాని జఠరాగ్నికాదు.

"సఏషోఽగ్నిర్వైశ్వానరః" ఆ యీ యగ్ని వైశ్వానరుఁడు. "హృదయంగార్హపత్యః" ఇతనికి హృదయముగార్హపత్యాగ్ని "పురుషేఽతః ప్రతిష్ఠితంవేద" "వైశ్వానరుని పురుషునిలోపలనున్నవానినిగఁ దెలిసికొనుము" (ఛాందో. ౫ ౧౮. ౨) ఇత్యాదులు వైశ్వానరపదమునకు జఠరాగ్నియను నర్థమును జెప్పవలయునని బోధించుచున్నవి గాన వైశ్వానరుఁడనఁగా జఠరాగ్నియని పూర్వపక్షము. "సఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషః సయో హైతమేవమగ్నిం వైశ్వానరం పురుషం పురుషేఽతః ప్రతిష్ఠితంవేద" ఆ యితఁడు జఠరాగ్ని యుపాధిగఁగల వైశ్వానరుఁడు. ఈ వైశ్వానరుని బూర్ణునిగాను మూర్ధచిబుకములకు మధ్యనున్న వానినిగను దెలిసికొనువాఁడు అంతట భోగ్యమును భుజించును" (శతపథ. ౧౦. ౬. ౧. ౧౧.) ఈ వాజసనేయుల శ్రుతి సిద్ధాంతము అని తెలియునది.

27. సూ. అతఏవ న దేవతా భూతంచ.

అతఏవ=కనుకనే, దేవతా=అగ్న్యభిమాన దేవతయును భూతంచ=అగ్నిభూతమును, న=కాదు.

సూ. ద్యుమూర్ధత్వాది ధర్మ విశేషములు సంభవింపక పోవుచున్నవి గనుకనే వైశ్వానరుఁడనఁగా అగ్న్యభిమానదేవతగాని పంచభూతములలోని అగ్ని గాని కాదు. పరమాత్మయె.

28. సూ. సాక్షాదప్యవిరోధం జైమినిః

సాక్షాత్‌అపి=సాక్షాత్తుగాఁగూడ, అవిరోధం=విరోధములేదని, జైమినిః=జైమిని.

సూ. వైశ్వానరపదమునకు జఠరాగ్నిరూపమైన పరమాత్మయనిగాని జఠరాగ్నియందలి పరమాత్మయనిగాని చెప్పి యా వైశ్వానరుని ఉపాసింపవలయునని చెప్పఁబడెను గాని అట్లు చెప్పక వైశ్వానరపదమునకు విశ్వరూపుఁడైన నరుఁడని ప్రత్యక్షముగా యౌగికార్థము చెప్పి పరమాత్మ యర్థము చెప్పినను విరోధము లేదని జైమిని యనియె.

విశ్వరూపుఁడైన నరుఁడు అని వైశ్వానరపదమునకు "అగ్రం నయతి" ముందుకుఁ దీసికొనిపోవును అని యగ్ని పదమునకు వ్యుత్పత్తి చెప్పినను విరోధము లేదని జైమిని తలఁచెనని భావము.

29. సూ. అభివ్యక్తే రిత్యాశ్మరథ్యః

అభివ్యక్తేః = అభివ్యక్తమగుట వలన, ఇతి=అని, ఆశ్మరథ్యః=ఆశ్మరథ్యుఁడనియె.

సూ. ఉపాసకుల ననుగ్రహించుటకై పరమాత్మ హృదయాదులందు లొడితెఁడు మాత్రమె పరిమాణము గలవాఁడుగ నభివ్యక్తమగుట వలన లొడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడుగఁ జెప్పఁబడిన వైశ్వానరుఁడు పరమాత్మయె యగునని యాశ్మరథ్యుఁడనెను.

"ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానరముపాస్తే" లొడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడును ఇంతవాఁడని పరిమాణములేనివాఁడును నైన పరమాత్మస్వరూపుఁడైన వైశ్వానరుని ఉపాసించుచున్నాఁడు. (ఛాందో. ౫. ఖ. ౧) అను శ్రుతిలోఁ జెప్పఁబడిన పరిమాణము ఉపాసకులకై చెప్పఁబడెనని భావము.

30 సూ. అనుస్మృతేర్బాదరిః

అనుస్మృతేః=స్మరణ ననుసరించి అని బాదరిః=బాదరియనియె.

సూ. లొడితెఁడు మాత్రమె పరిమాణముగల హృదయమందలి మనస్సుచే స్మరింపఁబడినవాఁడగుటవల్ల ఆస్మరణనుబట్టి పరమాత్మ లొడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడుగఁ జెప్పఁబడుచున్నాఁడని బాదరి యనెను.

31. సూ. సంపత్తేరితి జైమిని స్తథాహి దర్శయతి.

సంపత్తేః=అవయవాది సంపత్తివలన, ఇతి=అని, జైమినిః=జైమిని యనెను. తథాహి=అట్లే, దర్శయతి=బ్రాహ్మణము చూపుచున్నది.

సూ. తల మొదలుకొని గడ్డము వఱకుఁగల యవయవముల సంపత్తి గలవాఁడగుట వలనఁ బరమాత్మ లొడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడని చెప్పఁబడినది యని జైమిని యనెను. అట్లె వాజసనేయ బ్రాహ్మణమును జూపుచున్నది.

"ప్రాదేశమాత్ర మివహవైదేవాః సువిదితా అభిసంపన్నా స్తథా తు వ ఏతాన్ వక్ష్యామి. యథా ప్రదేశ మాత్రమేవాభి సంపాదయిష్యామీతి." దేవతలు లొడితెఁడు పరిమాణము గలవానివలె నున్న యీశ్వరుని దెలిసికొని

"సఏషోఽగ్నిర్వైశ్వానరః" ఆ యీ యగ్ని వైశ్వానరుఁడు. "హృదయంగార్హపత్యః" ఇతనికి హృదయముగార్హపత్యాగ్ని "పురుషేఽతః ప్రతిష్ఠితంవేద" "వైశ్వానరుని పురుషునిలోపలనున్నవానినిగఁ దెలిసికొనుము" (ఛాందో. ౫ ౧౮. ౨) ఇత్యాదులు వైశ్వానరపదమునకు జఠరాగ్నియను నర్థమును జెప్పవలయునని బోధించుచున్నవి గాన వైశ్వానరుఁడనఁగా జఠరాగ్ని యని పూర్వపక్షము. "సఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషః సయో హైతమేవ మగ్నిం వైశ్వానరం పురుషం పురుషేఽతః ప్రతిష్ఠితంవేద" ఆ యితఁడు జఠరాగ్ని యుపాధిగఁగల వైశ్వానరుఁడు. ఈ వైశ్వానరుని బూర్ణునిగాను మూర్ధ చిబుకములకు మధ్యనున్న వానినిగను దెలిసికొనువాఁడు అంతట భోగ్యములను భుజించును" (శతపథ. ౧౦. ౬. ౧. ౧౧.) ఈ వాజసనేయుల శ్రుతి సిద్ధాంతము అని దెలియునది.

27. సూ. అతఏవ న దేవతా భూతంచ.

అతఏవ=కనుకనే, దేవతా=అగ్న్యభిమాన దేవతయును భూతంచ= అగ్నిభూతమును, న=కాదు.

సూ. ద్యుమూర్ధత్వాది ధర్మ విశేషములు సంభవింపక పోవుచున్నవి గనుకనే వైశ్వానరుఁడనఁగా అగ్న్యభిమానదేవతగాని పంచభూతములలోని అగ్నిగాని కాదు. పరమాత్మయె.

28. సూ. సాక్షాదప్యవిరోధం జైమినిః

సాక్షాత్‌అపి=సాక్షాత్తుగాఁగూడ, అవిరోధం=విరోధములేదని, జైమినిః= జైమిని.

సూ. వైశ్వానరపదమునకు జఠరాగ్నిరూపమైన పరమాత్మయనిగాని జఠరాగ్నియందలి పరమాత్మయనిగాని చెప్పి యా వైశ్వానరుని ఉపాసింప వలయునని చెప్పఁబడెను గాని అట్లు చెప్పక వైశ్వానరపదమునకు విశ్వరూపుఁడైన నరుఁడని ప్రత్యక్షముగా యౌగికార్థము చెప్పి పరమాత్మ యర్థము చెప్పినను విరోధము లేదని జైమిని యనియె.

విశ్వరూపుఁడైన నరుఁడు అని వైశ్వానరపదమునకు "అగ్రం నయతి" ముందుకుఁ దీసికొనిపోవును అని యగ్ని పదమునకు వ్యుత్పత్తి చెప్పినను విరోధము లేదని జైమిని తలఁచెనని భావము.

29. మూ. అభివ్యక్తే రిత్యాశ్మరథ్యః

అభివ్యక్తేః = అభివ్యక్తమగుట వలన, ఇతి=అని, ఆశ్మరథ్యః=ఆశ్మరథ్యుఁడనియె.

సూ. ఉపాసకుల ననుగ్రహించుటకై పరమాత్మ హృదయాదులందు లొటిడితెఁడు మాత్రమె పరిమాణము గలవాఁడుగ నభివ్యక్తమగుట వలన లొటిడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడుగఁ జెప్పఁబడిన వైశ్వానరుఁడు పరమాత్మయె యగునని యాశ్మరథ్యుఁడనెను.

"ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానరముపాస్తే" లొటిడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడును ఇంతవాఁడని పరిమాణములేనివాఁడును నైన పరమాత్మస్వరూపుఁడైన వైశ్వానరుని ఉపాసించుచున్నాఁడు. (ఛాందో. ౫. ౧. ౧) అను శ్రుతిలోఁ జెప్పఁబడిన పరిమాణము ఉపాసకులకై చెప్పఁబడెనని భావము.

30 మూ. అనుస్మృతేర్బాదరిః

అనుస్మృతేః=స్మరణ ననుసరించి అని బాదరిః=బాదరియనియె.

సూ. లొటిడితెఁడు మాత్రమె పరిమాణముగల హృదయమందలి మనస్సుచే స్మరింపఁబడినవాఁడగుటవల్ల ఆస్మరణనుబట్టి పరమాత్మ లొటిడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడుగఁ జెప్పఁబడుచున్నాఁడని బాదరి యనెను.

31. మూ. సంపత్తేరితి జైమిని స్తథాహి దర్శయతి.

సంపత్తేః=అవయవాది సంపత్తివలన, ఇతి=అని, జైమినిః=జైమిని యనెను. తథాహి=అట్లే, దర్శయతి=బ్రాహ్మణము చూపుచున్నది.

సూ. తల మొదలుకొని గడ్డము వఱకుఁగల యవయవముల సంపత్తి గలవాఁడగుట వలనఁ బరమాత్మ లొటిడితెఁడు మాత్రమె పరిమాణముగలవాఁడని చెప్పఁబడినది యని జైమిని యనెను. అట్లె వాజసనేయ బ్రాహ్మణమును జూపుచున్నది.

"ప్రాదేశమాత్ర మివహవైదేవాః సువిదితా అభిసంపన్నాస్తథా తు వ ఏతాన్ వక్ష్యామి యథా ప్రదేశ మాత్రమేవాభి సంపాదయిష్యామీతి." దేవతలు లొటిడితెఁడు పరిమాణము గలవానివలె నున్న యీశ్వరుని దెలిసికొని

వానినే పొందిరి. లొడితెఁడంత గలవానిగనే ఈ యీశ్వరుని పొందించఁగలను అని" "సహోవాచ మూర్ధాన ముపదిశ న్నువా చైషవా అతిష్ఠా వైశ్వానరఇతి. చక్షుషీ ఉపదిశ న్నువా చైష వైసుతేజా వైశ్వానరఇతి, నాసికే ఉపదిశ న్నువా చైష వైపృథగ్వర్త్మాత్మా వైశ్వానరఇతి" "అశ్వపతిరాజు ప్రాచీనశాలాదులతోఁ జెప్పి తన శిరస్సును జూపుచు ఇదే ద్యులోకమను వైశ్వానరుని శిరమని చెప్పెను. కన్నులను జూపుచు శుభతేజస్సుగల సూర్యుఁడను వైశ్వానరుని కన్నులనెను ముక్కులలోని ప్రాణమును జూపుచు ఇదే వాయురూపమైన వైశ్వానరుని ప్రాణమనెను." "ముఖ్య మాకాశ ముపదిశన్ ఉవాచైషవై బహులో వైశ్వానరఇతి. ముఖ్యా అప ఉపదిశన్నువాచైషవై రయి ర్వైశ్వానరఇతి. చుబుక ముపదిశన్ ఉవాచైషవై ప్రతిష్ఠా వైశ్వానరఇతి" నోటిలోని ఆకాశమును జూపుచు ఇదే బహుగుణముగల యాకాశమను వైశ్వానరుని దేహమధ్యభాగ మనెను. నోటిలోని చొంగనీటిని జూపుచు ఇదే వైశ్వానరుని పొత్తికడుపులోని జలమనెను. చుబుకమును జూపుచు ఇదే పృథివి యను వైశ్వానరుని పాదము లనెను." ఈ శ్రుతిలో తలదగ్గర నుండి చిబుకమువఱకుఁ గల యవయవములు లొడితెఁడు పరిమాణము గలుగుటచే లొడితెఁడు పరిమాణముగల వాఁడుగఁ జెప్పఁబడెననిభావము.

32. సూ. ఆమనంతి చైనమస్మిన్.

ఏవం=ఈ బ్రహ్మమును, అస్మిన్=ఈ ప్రదేశమందు, ఆమనంతిచ= చెప్పుచున్నారుగూడ.

సూ. ఈ పరమాత్మను లొడితెఁడు మాత్రమె పరిమాణముగల తలకు చిబుకమునకు మధ్యగల ప్రదేశము గలవానినిగ జాబాలురు చెప్పుచున్నారుగూడ.

ఇది
శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁడగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మ మీమాంసా దర్శన మందు మొదటి యధ్యాయమున
స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయమను
రెండవ పాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

మొదటి యధ్యాయమున మూఁడవ పాదము.

జ్ఞేయబ్రహ్మబోధకాఽస్పష్టశ్రుతి వాక్యసమన్వయము.

## ౧. ద్యుభ్వాద్యధికరణము

1. మూ. ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్.

స్వశబ్దాత్=ఆత్మశబ్దమునుబట్టి, ద్యుభ్వాద్యాయతనం=ద్యులోక భూలో కాదులకు స్థానము బ్రహ్మమె.

సూ. "ద్యులోకము భూలోకము అంతరిక్షము, సర్వప్రాణములతో మనస్సును దేనియందుఁ గలిసియున్నవో దానిని ఒక్కటె యగు నాత్మనుగాఁ దెలిసి కొనుఁడు. ఇతర వాక్కులను వీడుఁడు. ఇది మోక్షమునకు వంతెన" ఇత్యాది శ్రుతులలో ఆత్మశబ్దమును ప్రయోగించుటవలన ద్యులోక భూలోకాదులకు స్థానమైనది పరమాత్మయెగాని ప్రధానమును వాయ్వాదులునుగావు.

"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనస్సహప్రాణైశ్చ సర్వై స్తదేకం జానథ ఆత్మాన, మన్యావాచోవిముంచథ అమృతస్యైష సేతుః (ముండక. ౨ ౨ ౫.)"

2. మూ. ముక్తోపసృప్యవ్యపదేశాత్.

ముక్త=ముక్తులచే, ఉపసృప్య=పొందఁదగినవాఁడుగ, వ్యపదేశాత్= వ్యపదేశింపఁబడుటవలన.

సూ. రాగద్వేషాది దోషముక్తులచేఁ బొందఁదగినవాఁడుగ వ్యపదేశింపఁ బడుటవలన ద్యులోకాదులకు స్థానమైనది చేతనమగు పరమాత్మయెగాని జడము లగు ప్రధానాదులుగావు.

"భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" కార్యకారణరూపమగు బ్రహ్మము చూడఁబడఁగా

హృదయబంధములు విడిపోవును. అన్ని సంశయములు పోవును కర్మలంటవు" అని చెప్పి "తథా విద్వాన్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అట్లు విద్వాంసుఁడు నామరూపములనుండి విముక్తుఁడై పరాత్పరుఁడు దివ్యుఁడునగు పురుషుని పొందును" అని చెప్పఁబడియె, "యదాసర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృది స్థితాః అథమర్త్యోఽమర్త్యోభవతి అత్రబ్రహ్మ సమశ్నుతే" (బృహ. ౪. ౪. ౭.) ఏని హృదయములందున్న సర్వకామములు పోయినప్పుడు మర్త్యుఁడు ముక్తుఁడై యీ లోకముననే బ్రహ్మమును పొందును" ఇత్యాది శ్రుతు లందుఁ బొందఁదగినవాఁడుగఁ జెప్పఁబడుటచే నాపొంచఁదగినవాఁడు బ్రహ్మమె గాని జడమైన ప్రధానాదులు గావని భావము.

3. మూ. నానుమాన మతచ్ఛబ్దాత్.

అతచ్ఛబ్దాత్ = ప్రధానాదులను బోధించు శబ్దములు లేకపోవుటవలన అనుమానం=అనుమాసిద్ధము న=కాదు.

సూ. శ్రుతులలోఁ బరమాత్మను ప్రతిపాదించు శబ్దములేగాని జడములగు ప్రధానాదులను ప్రతిపాదించు శబ్దములు లేకపోవుటవలన నిట ద్యులోక భూలో కాదులకు స్థానము ప్రధానాదులగునని యనుమాన ప్రమాణముచే నూహింపరాదు.

4. మూ. ప్రాణభృచ్చ.

ప్రాణభృచ్చ=ప్రాణధారియగు జీవుఁడును (న=కాదు)
సూ. సర్వజ్ఞత్వాది ధర్మములు సంభవింపకపోవుటవలనఁ బ్రాణధారి యగు జీవుఁడును ద్యులోకాదులకు స్థానముగాఁడు.

5. మూ. భేద వ్యపదేశాత్.

భేదవ్యపదేశాత్=వేఱుగ వ్యపదేశించుటవలన.

సూ. జీవునిదెలిసికొనువాఁడుగను, పరమాత్మను దెలిసికొనఁదగినదిగను భిన్నముగ వ్యపదేశించుటవలనను జీవుఁడు ద్యులోకాదులకు స్థానముగాఁడు.

6. మూ. స్థిత్యదనాభ్యాంచ.

స్థిత్యదనాభ్యాంచ=సాక్షిగానుండుటవలనఁ గర్మ ఫలానుభవము వలనను.

సూ. "మంచి పక్షములు గలిగి కలిసియున్న జీవేశ్వరు లనెడి రెండు పక్షులు ఒక చెట్టునే యాశ్రయించియున్నవి. వానిలో జీవుఁడు రుచికరమైన

కర్మఫలము ననుభవించును. మఱియొకఁడు అనుభవింపక సాక్షియై యున్నాఁడు" (ముండక. ౩. ౧. ౧.) అనుశ్రుతిలో బ్రహ్మము కర్మలకు సాక్షిగా నుండుట యును జీవుఁడు కర్మఫలమును అనుభవించుటయును జెప్పుటచేతను జీవుఁడు ద్యులోకాదులకు స్థానముగాఁడు.

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి. (ము. ౩. ౧. ౧.)

## ౨. భూమాధికరణము

7. సూ. భూమా సంప్రసాదా దధ్యుపదేశాత్.

సంప్రసాదాత్=ప్రాణముకంటె, అధి=ఎక్కువగా, ఉపదేశాత్=ఉప దేశించుటవల్ల.

సూ. నామాదులకంటె ఆశను ఆశకంటెఁ బ్రాణమును గొప్పదిగాఁజెప్పి ప్రాణముకంటెఁ బిదప "భూమతత్త్వమె తెలియఁగోరఁదగినది" అని యుప దేశించుటచే భూమతత్త్వము (=ఆ గొప్ప తత్త్వము.) బ్రహ్మమెగాని ప్రాణ వాయువుగాదు.

"అస్తిభగవోనామ్నో భూయఇతి" భగవంతుఁడా! నామముకంటె గొప్ప దున్నదా? అని సనత్కుమారుని నారదుఁడడిగెను" "వాగ్వావనామ్నో భూయసీ" "వాక్కెనామముకంటె గొప్పది అనెను". "అస్తిభగవోవాచో భూయః" "భగవంతుఁడా! వాక్కుకంటె గొప్పదున్నదా" "మనోవావాచో భూయః" "మనస్సె వాక్కుకంటె గొప్పది" ఈ విధముగ ప్రాణము వఱకుఁ జెప్పి "ప్రాణోవా ఆశాయా భూయాన్" "ప్రాణమె ఆశకంటె గొప్పది" (ఛా. ౭. ౧౫. ౧.) అని శ్రుతులలోఁ జెప్పి ప్రాణముకంటె నింకేమియుఁ జెప్పక "భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" "భూమతత్త్వమె తెలిసికొనఁ గోరఁదగినది" "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా" (ఛా. ౭. ౨౪. ౨.) వేఱొకటి చూడఁడో వేఱొకటి వినఁడో వేఱొకటి తెలియఁడో అదె భూమము అపరిచ్ఛిన్నము" అని యీ భూమతత్త్వమును జివరఁ జెప్పుటచే నన్నిటికంటె గొప్పది భూమతత్త్వము అని చెప్పుటచే ఆ భూమమె బ్రహ్మము అని భావము.

8. సూ. ధర్మోపపత్తేశ్చ.

ధర్మోపపత్తేశ్చ=సుఖరూపత్వాది ధర్మములు ఉపపన్నములగుట వలనను.

సూ. భూమమునకుఁ జెప్పఁబడిన సుఖరూపత్వాది ధర్మములు బ్రహ్మ మని చెప్పినప్పుడే యుపపన్నము లగుటవలనను భూమమనఁగా బ్రహ్మమెగాని భూతాకాశముగాదు.

"యోవై భూమాతత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవసుఖం" ఏది భూమమో అదియె సుఖము. అల్పమందు సుఖములేదు. భూమమెసుఖము" "యోవై భూమా తదమృతం" "ఏదిభూమమో అదియె యమృతము" (ఛాందో. ౭. ౨౩. ౯.) అనిశ్రుతులందు భూమమునకుఁ జెప్పఁబడిన సుఖత్వాది ధర్మములు భూతాకాశమునకు సంభవింపవుగాన భూమమనఁగా బ్రహ్మమని భావము.

## ౩. అక్షరాధికరణము

9. మూ. అక్షర మంబరాంత ధృతేః

అంబరాంత ధృతేః=ఆకాశము వఱకు ధరించుటవలన, అక్షరం=అక్షర మనఁగా బ్రహ్మమె.

సూ. భూమి మొదలుకొని యాకాశమువఱకు అక్షరము ధరించుచున్న దని శ్రుతియందుఁ జెప్పఁబడుటవలన ఆ యక్షరమనఁగా బ్రహ్మమె గాని వర్ణములుగావు.

"కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" "ఆకాశము దేనియందుఁ బడుగు పేకలందు వస్త్రమువలెఁ గలిసియున్నది." అని యాజ్ఞవల్క్యుని గార్గి యడుగఁగా "సహోవాచ ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంత్య స్థూలమనణు" ఓ గార్గి! ఆకలిసి మెలసి యున్నది యక్షరమని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. అది స్థూలమునుగాదు. సూక్ష్మమునుగాదు." అని యాజ్ఞవల్క్యుఁ డనెను. (బృహ. ౩. ౮. ౮.) అని శ్రుతి.

10. మూ. సాచప్రశాసనాత్.

సా చ=ఆశ్రుతియును, ప్రశాసనాత్=శాసించుటవలన.

సూ. ఓ గార్గీ! ఈ యక్షరుని శాసనమందు సూర్యచంద్రులు నిలఁబడి యున్నారు" అనుశ్రుతిలో శాసనము చెప్పఁబడుటవలన భూమి మొదలుకొని ఆకాశము వఱకును ధరించుట పరమాత్మ యొక్క కర్మయె.

"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యా చంద్రమసౌ విధృతౌ. తిష్ఠతః" (బృహ ౩. ౮ ౯) అని శ్రుతి.

11. మూ. అన్యభావవ్యావృత్తేశ్చ

అన్యభావవ్యావృత్తేశ్చ=ఇతర భావములను నివర్తింపఁజేయుట వలనను.

సూ. పరమాత్మకంటె నితరమగు ప్రధానాదుల ధర్మములు ఈ యక్షరుని యందు నివర్తింపఁజేయుటవలనను అక్షరపదమునకు బ్రహ్మమె యర్థము.

"తద్వా ఏతదక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ అశ్రుతం శ్రోతృ అమతం మంతృ అవిజ్ఞాతం విజ్ఞాతృ" "ఓ గార్గీ! చూడఁబడని దానిని జూచునదియుఁ వినఁబడనిదానిని వినునదియు, మననము చేయఁబడనిదానిని మనము చేయునదియు, డెలియఁబడనిదానిని తెలిసికొనునదియు నగునది యీ యక్షరమె" (బృహ. ౩. ౮. ౧. ౧౻) అని శ్రుతిలో జడమగు ప్రధానధర్మములగు చూడకపోవుట మొదలగునవి యీ యక్షరమందు నివర్తింపఁజేయఁబడెను. "అచక్షుష్కమశ్రోత్రమవా గమనః" ఈ యక్షరము కన్నులులేనిది చెవులులేనిది వాక్కులు లేనిది మనస్సు లేనిది (బృహ. ౩. ౮. ౮.) అని చెప్పుటచే దీనికి జీవుఁడనిగాని అర్థము చెప్పరాదని భావము.

## ౪. ఈక్షతికర్మాధికరణము

12. మూ. ఈక్షతికర్మ వ్యపదేశాత్ సః

ఈక్షతి=చూచుటలో, కర్మవ్యపదేశాత్=బ్రహ్మమును కర్మగా వ్యపదేశించుటవలన, సః=అతఁడు బ్రహ్మమె

సూ. శ్రుతిలోఁ జివర "స్థావరజంగమములకంటెఁ బరుఁడైన హిరణ్యగర్భునికంటెఁ బరుఁడై యెల్లశరీరములందున్న పరమాత్మను త్రిమాత్రకమైన యోంకారమును ఉపాసించినవాఁడు చూచుచున్నాఁడనుచోట చూచుటలో బ్రహ్మమును గర్మగా వ్యపదేశించుటవలనఁ దత్పూర్వశ్రుతి యందును జెప్పఁబడిన యోంకారముచే నుపాసింపఁదగినవాఁడు పరమాత్మయేగాని అపరుఁడగు హిరణ్యగర్భుఁడుగాఁడు.

వివ:- "ఏతద్వై సత్యకామ పరంచాపరంచ బ్రహ్మ యదోంకారస్తస్మాద్విద్వానేతేనైవాయతనే నైకతర మన్వేతి" ఓ సత్యకామ! పరుఁడగు పర

మాత్మయు అపరుఁడగు కార్యబ్రహ్మయు అనఁగా హిరణ్య గర్భుఁడును ఓంకారమె. విద్వాంసుఁడు ఈ యోంకారోపాసనచేతనే పరమాత్మనో హిరణ్య గర్భునినో ఎవరో యొకరిని పొందుచున్నాఁడు. అని ప్రారంభించి "యః పునరేతంత్రిమాత్రేణోమిత్యేతే నైవాక్షరేణ పరంపురుష మభిధ్యాయీత" (ప్ర. ౫. ౨. ౫.) ఎవఁడు త్రిమాత్రకమైన ఓం అను నక్షరముచే పరమ పురుషుని ధ్యానించునో అనుచోట నుపాసింపఁదగినవాఁడు హిరణ్య గర్భుఁడా ? పరమాత్మయా ? అని సందేహము గలుగఁగా "స ఏతస్మా జ్జీవ ఘనాత్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే" (ప్ర. ౫. ౫.) స్థావరజంగమములకంటెఁ బరుఁడగు హిరణ్యగర్భునికంటెఁ బరుఁడై యెల్ల శరీరములందున్న పరమాత్మను త్రిమాత్రక మగు నోంకారము నుపాసించినవాఁడు చూచుచున్నాఁడు. అని పై శ్రుతులకుఁ జివరఁ గర్మగా ఆత్మ జెప్పఁబడుట వలన ఓంకారముచే నుపాసింపఁదగినవాఁడు పరమాత్మయేగాని హిరణ్య గర్భుఁడు గాఁడని భావము.

## ౫. దహరాధికరణము

౧౪. సూ. దహర ఉత్తరేభ్యః

ఉత్తరేభ్యః=చివర చెప్పఁబడిన కారణముల బట్టి, దహరః=సూక్ష్మము (బ్రహ్మమె)

సూ. శ్రుతిలోఁ జివరఁ జెప్పఁబడిన దహరా (సూక్ష్మా) కాశస్థితి ప్రభృతి వ్యాది కారణములఁ బట్టియు అపహతపాప్మత్వాదికారణములఁ బట్టియు దహర (సూక్ష్మ) మనఁగాఁ బరమాత్మయెగాని భూతాకాశ జీవులు గారు.

వివః-"అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోస్మిన్నంతరాకాశ స్తస్మిన్యదంత స్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యం" (ఛాందో. ౮. ౧. ౧.) మఱి యీ బ్రహ్మపురమగు శరీరమందు దహర (సూక్ష్మ) మైన పద్మమువంటి గృహమున్నది. దీనియందు దహర (సూక్ష్మ) మైన ఆకాశరూప బ్రహ్మము గలదు. ఆ హృదయపద్మమందలి దహరాకాశము (అనఁగ బ్రహ్మము) వెదకఁ దగినది. అదే తెలిసికొనఁదగినది. అను శ్రుతిలో దహరాకాశమనఁగా భూతాకాశమా జీవుఁడా ? పరమాత్మయా అను సందేహము గలుగఁగా "స బ్రూయాద్యావాన్వా అయమాకాశస్తావా నేషోంతర హృదయ ఆకాశ ఉభేఅస్మిన్ద్యావాపృథివీ అంతరేవ సమాహితే" ఈ భూతాకాశ మెంత

పరిమాణము గలదో యీ హృదయాకాశము గూడ నంతయె పరిమాణముగలది భూమ్యాకాశములు రెండునులోని యీ బ్రహ్మకాశమందే యున్నవి. అని చెప్ప వలయును. అని శ్రుతిలో దహరాకాశమందు భూమ్యాకాశములున్న వనుట వలనను, "ఏష ఆత్మా౽పహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో౽విజిఘత్సో౽పిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః" ఈ దహరాకాశరూపమగు పరమాత్మ పాపములు లేనివాఁడు, ముసలితనము లేనివాఁడు, మృత్యువులేనివాఁడు, శోకము లేనివాఁడు, భోజనేచ్ఛలేనివాఁడు, దప్పికలేనివాఁడు, సత్యకాముఁడు సత్య సంకల్పుఁడు, ఇత్యాదులలో పాపములేనివాఁడు మొదలగు ధర్మములు గలవాఁ డగుటవలనను దహరాకాశము పరమాత్మయె. భూతాకాశము భూమ్యాకాశము లందు పాపములు లేకపోవుట మొదలగు ధర్మములు లేకపోవుటచే దహరాకాశ పదవాచ్యముగాదని భావము.

**14.** మూ. గతిశబ్దాభ్యాం తథాహి దృష్టం లింగంచ.

గతిశబ్దాభ్యాం=బ్రహ్మలోకగతిచేత బ్రహ్మలోక శబ్దప్రయోగముచేతను, తదాహి=అట్లును, దృష్టం=చూపఁబడినది, లింగంచ=సూచకమును.

సూ. "జీవులెల్లరు సుషుప్తికాలమున రోజురోజు ఈ బ్రహ్మలోకముఁ బొందుచు దానిని బొందినట్లు తెలిసికొనరు" అను శ్రుతిలో బ్రహ్మలోకమును బొందునట్లు చెప్పుటచేతను, దహరాకాశమునకు బదులుగ బ్రహ్మలోక శబ్దమును బ్రయోగించుటచేతను, శ్రుత్యంతరమున నట్లే "ఓ సౌమ్యుఁడా నిద్రాకాలమందు జీవుఁడు సద్రూపుఁడగు బ్రహ్మముతోఁ గలిసినవాఁడగుచున్నాఁడు" అని గని పించుటచేతను, దహరమనఁగఁ బరమాత్మయె, రోజురోజు బ్రహ్మలోకగమనమె దహరము పరమాత్మయనుటకు సూచకము.

వివ:- "ఇమాః సర్వాః ప్రజా అహరహ ర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం నవిందంతి" (ఛాం. ౮. ౩. ౨) అని శ్రుతి. "సతాసోమ్య తదా సంపన్నో భవతి" (ఛా. ౬. ౮. ౧) అనునది శ్రుత్యంతరము.

వివ:- బ్రహ్మలోకమను చోట బ్రహ్మమే లోకము బ్రహ్మలోకములని చెప్పవలయును. లోకమునగా నిద్ర పొందిన వానిని "బ్రహ్మమైన వాఁడు బ్రహ్మత్వమును బొందును" అనియు, ననుట దృష్టము.

15. మూ. ధృతేశ్చమహిమ్నోఽ స్యాస్మిన్నుపలబ్ధేః.

ధృతేః=లోకధారణ రూపమైన, మహిమ్నః చ=మహిమ వల్లను, అస్య= దీనికి, అస్మిన్=దీనియందు, ఉపలబ్ధేః=అ మహిమ యుపలబ్ధమగుట వల్లను.

సూ. ఈ దహరాకాశమునకు శ్రుతిలో లోకధారణ రూపమగు మహిమ చెప్పఁబడుటవలన శ్రుత్యంతరమున నా మహిమ యుపలబ్దమగుట వలనను దహ రాకాశమన దానికిఁ బరమాత్మయె యర్థము.

విద:- "దహరోస్మిన్నంతరాకాశః" దీనిలోనున్న దహరము అకాశము వంటిది అని దహరమును బ్రస్తావించి ఆకాశముతో సామ్యమును జెప్పి దాని యందే యాత్మశబ్దమును బ్రయోగించి "అథ య ఆత్మా స సేతు ర్విధృతి రేషాం లోకానామసంభేదాయ (ఛాం. ౮. ౪. ౧)" దహరాకాశ రూపమైన యాత్మ భూరాదిలోకముల రక్షణ కొఱకు సేతువు వానిని ధరించునది. అను శ్రుతిలో లోకధారణము చెప్పఁబడినది. "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యా చంద్రమ సౌ విధృతౌతిష్ఠతః" (బృ. ౩. ౮. ౯.) ఓగార్గీ యా యక్షరుని శాసన మందు సూర్యచంద్రులు నియమింపఁబడి యున్నారు. అని ధారణ మహిమకు శ్రుత్యంతరము. "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్వి ధరణ ఏషాం లోకానామసంభేదాయ" (ఛా. ౮. ౪. ౧.) ఇతఁడే సర్వేశ్వరుఁడు ఇతఁడే భూతనాధుఁడు, ఇతడు భూతరక్షకుఁడు, ఇతడు లోకరక్షణకు సేతువు ధరించువాఁడు" అనియు శ్రుతి.

## ౬. ఉత్తరాధికరణము

16. మూ. ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు

ఉత్తరాత్=ఉత్తరశ్రుతి వాక్యపరామర్శవలన, చేత్=అన్నచో అవిర్భూత స్వరూపఃతు=ఆవిర్భవించిన స్వరూపముగలవాఁడు.

సూ. "ఈ జీవుఁడు ఈ శరీరమునుండి లేచి పరమాత్మజ్యోతిని పొంది తన స్వరూపమును పొందును అతఁడు ఉత్తమపురుషుఁడు" అను తరువాతి శ్రుతివాక్యమును బరామర్శించుటవలనను దహరాకాశమనఁగా జీవుఁడె యగు నతనియందుఁ బరమాత్మ ధర్మములను సంభవించునన్నచో నచ్చటఁగూడఁ దన స్వరూపమగు బ్రహ్మరూపము ఆవిర్భవింపఁగా బ్రహ్మత్వమును బొందిన జీవుఁడె యిట వివక్షింపఁబడెను గాన బ్రహ్మత్వమును బొందని జీవుఁడిట నర్థముగాదు.

వివ:- "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుప సంపద్య స్వేనరూపే ణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః" అని తరువాతి శ్రుతి. "సయోహవై తత్పరమంబ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముం. ౩. ౨. ౯.) ఆ పరమబ్రహ్మము దెలిసినవాఁడు బ్రహ్మమే యగును" ఇత్యాది శ్రుతులనుబట్టి జీవుఁడు బ్రహ్మమగును. ఆ బ్రహ్మస్వరూపమును బొందని జీవుని దహరాకాశ పదమున కర్థము చెప్పినచో నిట అపహతపాప్మత్వాదిధర్మ వైరుధ్యముండును ఇంక బ్రహ్మత్వమును బొందిన జీవుఁడు బ్రహ్మమే గనుక ఆ బ్రహ్మత్వమును బొందిన జీవుని జెప్పినచో అపహతపాప్మత్వాదిధర్మవిరోధములు గలుగవని భావము.

17. మూ. అన్యార్థశ్చ పరామర్శః.

అన్యార్థః చ=అన్యప్రయోజనార్థమును, పరామర్శః=పరామర్శము.

సూ. పరమజ్యోతియు నపహతపాప్మత్వాది ధర్మములు గల పర మాత్మయె యుపాసింపఁదగినవాఁడు అతని నుపాసించిన జీవుఁడు బ్రహ్మముతో నైక్యము పొందునను మఱియొక ప్రయోజనమునకై గూడ నిట జీవుఁడు పరా మర్శింపఁబడెను.

18. మూ. అల్పశ్రుతేరితిచేత్తదుక్తం.

అల్పశ్రుతేః=అల్పత్వమును జెప్పు శ్రుతినిబట్టి ఇతిచేత్=అన్నచో తత్= ఆ సంగతి ఉక్తం=ఇదివరకె చెప్పబడినది.

సూ. "ఇతని లోపలనున్న యాకాశము సూక్ష్మమైనది" అనుశ్రుతిలో అల్పత్వము శ్రుతమగుటవలన నిట దహరాకాశమనఁగా జీవుఁడె యగునన్నచో ఉపాసనకై యల్పత్వముగ నిదివఱకె చెప్పఁబడెను గాన నిట జీవుఁడని చెప్పరాదు.

వివ:- (చూ. బ్రహ్మమీమాం ౧ అ. ౨ పా. ౭ సూ.)

## ౭. అనుకృత్యధికరణము

19. మూ. అనుకృతేస్తస్యచ.

తస్య=ఆ బ్రహ్మముయొక్క, అనుకృతేః =అనుకరణము వలనను

సూ. సూర్యచంద్రాదులు ఆ బ్రహ్మము ననుకరించి ప్రకాశించుచున్నవని చెప్పుట వలన "అతని కాంతిచే నిది యంతయుఁ బ్రకాశించుచున్నది" అను

శ్రుతిలో 'అతని' అనఁగాఁ బరమాత్మయొక్క అనియెగాని తేజోభూతము యొక్క అని అర్థము గాదు.

వివ:- "నతత్ర సూర్యోభాతి నచంద్ర తారకం నేమావిద్యుతోభాంతి కుతోఽయమగ్నిః తమేవభాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" (ముం. ౨. ౨. ౧౦.) ఆ బ్రహ్మము ముందట సూర్యుఁడు ప్రకాశింపలేఁడు, చంద్రుఁడు నక్షత్రములు ప్రకాశింపలేవు, ఈ మెఱపులు మెఱయ లేవు, ఈ యగ్ని యెక్కడఁ బ్రకాశింపఁగలదు, ప్రకాశించునతని ననుసరించియే యిది యంతయుఁ బ్రకాశించుచున్నది. అతని కాంతిచేత నిది యంతయుఁ బ్రకాశించుచున్నది. అనిశ్రుతి.

20. మూ. అపిచస్మర్యతే.

వివ:- స్మృతులందుఁ జెప్పఁబడుచున్నదిగూడ.

సూ. పరమాత్మ కిట్టి రూపము స్మృతులందును జెప్పఁబడుచున్నది.

వివ:- "నతద్భాసయతే సూర్యోనశశాంకో నపావకః, యద్గత్వాన నివర్తంతే తద్ధామ పరమంమమ" (గీత. ౧౫. ౧౨.)ఏనాపరమధామమును బొంది తిరిగిరారో యట్టిదాని సూర్యుఁడు ప్రకాశింపఁజేయలేఁడు, చంద్రుఁడు ప్రకాశింపఁ జేయలేఁడు, అగ్ని ప్రకాశింపఁజేయలేఁడు. "యదాదిత్యగీతం తేజో జగద్భాస యతేఽఖిలం యచ్చంద్రమసియచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకం (గీత. ౧౫. ౬. ౧౨ ) సకలజగత్తును బ్రకాశింపఁజేయు సూర్యుని తేజస్సును చంద్రునితేజస్సును, అగ్ని తేజస్సును, నా తేజస్సునుగాఁ దెలిసికొనుము" అని భగవద్గీత.

22. మూ. శబ్దాదేవప్రమితః

శబ్దాదేవ=భూతభవ్యములకు ఈశానుఁడను శబ్దమువల్లనే ప్రమితః= బొటనవ్రేలంత ప్రమాణము గలవాఁడు.

సూ. "మూఁడు కాలములందలి వస్తువులకుఁ బ్రభువగు పురుషుఁడు శరీరమధ్య బొటనవ్రేలంతయై యున్నాఁడు" ఇత్యాది శ్రుతులలో "మూఁడు కాలములందలి వస్తువులకుఁ బ్రభువు" అను శబ్దమును బ్రయోగించుటవలన బొటనవ్రేలంత పరిమాణము గలవాఁడు పరమాత్మయె.

వివ:- "అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మనితిష్ఠతి ఈశానో భూత భవ్యస్య" (కఠ. ౨. ౧. ౧౨.)అనిశ్రుతి.

23. మూ. హృద్యపేక్షయాతు మనుష్యాధికారత్వాత్.

మనుష్యాధికారిత్వాత్ = మనుష్యుఁడె అధికారి యగుటవలన, హృద్య పేక్షయాతు=హృదయమునుబట్టియె.

సూ. శాస్త్రమునకును ఉపాసనాజ్ఞానములకును మనుష్యుఁడె యధికారి కాన ఆ మనుష్యుని హృదయముయొక్క పరిమాణమునుబట్టియె సర్వగతుఁడైన పరమాత్మకు అంగుష్ఠమాత్ర పరిమాణత్వము చెప్పఁబడినది.

## ౮. దేవతాధికరణము

24. మూ. తదుపర్యపి బాదరాయణః సంభవాత్

సంభవాత్=సంభవించుటవలన, తదుపరిఅపి=మనుష్యులకంటె పైవారగు దేవతలకునని, బాదరాయణః=బాదరాయణుఁడు.

మనుష్యులకంటెఁ బైనున్న దేవతలకును శాస్త్రాదులందు అధికారము సంభవించుటవలన దేవతల హృదయ పరిమాణమునుబట్టియుఁ బరమాత్మకు దేవతల అంగుష్ఠమాత్ర పరిమాణత్వము చెప్పవచ్చునని బాదరాయణుఁడు.

25. మూ. విరోధః కర్మణీతిచేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్.

కర్మణి=కర్మలందు, విరోధః=విరోధము, ఇతిచేత్=ఉన్నదన్నచో, అనేక ప్రతిపత్తేః=అనేకమైనచోట్ల ప్రతిపన్నమగుట, దర్శనాత్=పురాణాదులలోఁ గనిపించుటవలన న=అట్లనరాదు.

సూ. మనుష్యులకు వలెనే దేవతలకును శరీరములున్నట్లు లంగీకరించి దేవతల హృదయపరిమాణమంతగ పరమాత్మ అంగుష్ఠమాత్రుఁడై యుండునని యంగీకరించినపుడు అనేకస్థలములందు అనేకులగుజనులచే నొక్కసమయముననే చేయఁబడు యాగకర్మలందు దేవతలు హవిస్సులు భుజించుటకై వచ్చుట విరోధించునుగదా యన్నచో దేవతలు ఒక సమయముననే యనేక రూపములు ధరించుట, యణిమాది సిద్ధులుగల యోగులకువలెఁ బురాణాదులందుఁ గనిపించుట వలన విరోధింపదు.

26. మూ. శబ్దఇతిచేన్నాంతః ప్రభవాత్ ప్రత్యక్షానుమానాభ్యామ్.

శబ్దా=వేదసంబంధివిరోధము, ఇతిచేత్=అన్నచో, ప్రత్యక్షానుమానాభ్యాం= శ్రుతిస్మృతులఁబట్టి, అంతః ప్రభవాత్=దేవతలు ఆ వేదములనుండి పుట్టుటవలన న=ఆవిరోధములేదు.

సూ. దేవతలకు శరీరమును అంగీకరించినపుడు ఆ శరీరములకు నాశము సంభవించును గాన నశించిపోవు దేవతలను గురించి చెప్పు వేదశబ్దములు అనిత్యములని విరోధము సంభవించునన్నచో శ్రుతి స్మృతి ప్రమాణములఁబట్టి దేవతాది సకల ప్రపంచము ఆవేదములనుండి ప్రభవించుచున్నదని తెలియుచుండుటవలన నట్టి విరోధమునులేదు.

వివ:- ద్రవ్య గుణకర్మలవల్ల అశ్వాది వ్యక్తులు పుట్టును. ఆ యశ్వాది వ్యక్తులకును శబ్దములకును సంబంధములేదు. శబ్దములకును ఆ వ్యక్తుల యాకృతికిని మాత్రము సంబంధము గలదు. వ్యక్తులనంతములు గాన శబ్దమువల్ల వ్యక్తులు గ్రహింపఁబడవు. దేవాదుల ఆకృతి నిత్యము గాన ఆకృతి బోధకములగు వేద శబ్దములు నిత్యమగుటలో విరోధములేదు. శబ్దమనఁగా వర్ణాద్యవయవాత్మకమైనను వర్ణవిశేషరచనాభిన్నమై అర్థమును స్ఫుటముచేయు స్ఫోటశబ్దమని గ్రహింపవలెను. "ఏత ఇతి వై ప్రజాపతిర్దేవా నసృజత్" (బృ. ౧. ౨. ౪.) వేదము వలన దేవతలిట్టివారని బ్రహ్మ ఆదేవతలను సృజించెను, "వేదేన నామరూపే వ్యాకరోత్సతాసతీ ప్రజాపతిః" సదసదాత్మకమగు నామరూపములను వేద సహాయముచేఁ బ్రజాపతి సృజించెను. "స భూరితి వ్యాహరన్ స భూమి మసృజత్" (తై. బ్రా. ౨. ౨. ౪. ౨.) భూలోకమని పలికి భూమిని సృజించెను. ఇత్యాది శ్రుతులనుబట్టియు, "అనాది నిధనా నిత్యావా గుత్సృష్టా స్వయంభువా, ఆదౌ వేదమయీ దివ్యాయతః సర్వాః ప్రవృత్తయః" సర్వప్రవృత్తులకుఁ గారణమైనట్టియు, ఆద్యంతములు లేనట్టియు, వేదమయవాక్కు ప్రజాపతిచే ప్రకాశింపఁజేయబడెను. "నామరూపంచ భూతానాం కర్మణాంచ ప్రవర్తనం, వేదశబ్దేభ్యఏవాదౌ నిర్మమే స మహేశ్వరః (మను. ౧. ౨౧) సర్వప్రాణుల నామరూపములను, కర్మల ప్రవర్తనములను మహేశ్వరుఁడు ఆదియందు వేదశబ్దముల నుండియె సృజించెను. "సర్వేషాంతు సనామాని కర్మాణి పృథక్ పృథక్, వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే" అన్ని ప్రాణుల నామములను, కర్మలను, వేఱువేఱు అవయవములను వేఱువేఱుగ నితఁడు వేదశబ్దములనుండి నిర్మించెను. ఇత్యాది స్మృతులను బట్టియు వేదములనుండి లోకోత్పత్తి యగుచున్నదని భావము.

27. సూ. అతఏవచనిత్యత్వమ్.

అతఏవచ=కనుకనే, నిత్యత్వం=వేదములకు నిత్యత్వము.

సూ. దేవతాది సకల ప్రపంచము ఆవేదములనుండి ప్రభవించుచున్నది గనుకనె వేదములు నిత్యములు.

వివ:- "యజ్ఞేనవాచః పదవీయ మాయన్తా మన్వవిందన్నృషిషు ప్రవిష్టాం" (ఋ సం. ౧౦. ౭ ౧ ౩.) యజ్ఞములు చేయు యజమానులు యజ్ఞముచేత వేదములను గ్రహించు నర్హతను పొందినవారై మంత్రద్రష్టలగు ఋషులందు నిలిచియున్న వేదవాక్కును గ్రహించిరి అని శ్రుతి. "యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః, లేభిరే తపసాపూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా" అతీతానాగతజ్ఞానముగల మహర్షులు ప్రళయకాలమున మఱుఁగుపడియున్న, యితిహాసములతోఁ గూడిన వేదములను స్వయంభువుచేఁ జక్కఁగఁ దెలుపఁబడినవారై తపస్సుచే సృష్టికి మొదట గ్రహించిరి. అని వ్యాసస్మృతి.

28. సూ. సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధోదర్శనాత్స్మృతేశ్చ.

ఆవృత్తావపి = మరలమరల సృష్టివచ్చుటయందును, సమాననామరూపత్వాత్=సమానమైన నామరూపములు గలదగుటవలన, దర్శనాత్=అట్లు గనిపించుటవలన, స్మృతేః చ=స్మృతినిబట్టియు, అవిరోధః=విరోధములేదు.

సూ దేవతాది సకలప్రపంచముయొక్క పుట్టుకకు నాశమునకు మూలమైన మహాసృష్టిప్రళయములు మరలమరల వచ్చుచున్నను శ్రుతిస్మృతులనుబట్టి దేవతాది సకల ప్రపంచముయొక్క నామరూపములు పూర్వసృష్టితో సమానముగ నుండునట్లు తెలియుటవలన "ప్రళయములో వేదములు నశించును గదాయను విరోధముగాని యట్టివానికి అప్రామాణ్యరూపవిరోధముగాని" గలుగదు.

వివ:- "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తంహి దేవమాత్మ బుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే" (శ్వేతా. ౬. ౧౮.) ఎవఁడు పూర్వము బ్రహ్మను సృజించెనో, ఆ బ్రహ్మకొఱకెవ్వఁడు వేదము లిచ్చెనో యట్టి బుద్ధిప్రకాశకుడైన వానిని మోక్షకామినై నేను శరణు పొందుదును. "సూర్యాచంద్రమసౌధాతా యథాపూర్వమకల్పయత్" (ఋ. సం. ౧౦. ౧౯౦. ౩.) బ్రహ్మ సూర్యచంద్రులను పూర్వమువలె సృజించెను ఇత్యాది శ్రుతులను బట్టియు, "ఋషీణాం నామధేయాని యాశ్చవేదేషు దృష్టయః, శర్వర్యంతే ప్రసూతానాం తాన్యే వైభ్యోదదాత్యజః, యథర్తావృతులింగాని నానారూపాణి పర్యయే దృశ్యంతే తానితాన్యేవ తథాభావాయుగాదిషు

యథాభిమానినోఽతీతస్తుల్యాస్తే సాంప్రతైరిహ దేవాదేవైరతీతైర్హి రూపైర్నామభి రేవచ" బ్రహ్మకు రాత్రియగు ప్రళయము చివర జన్మించిన ఋషులకు పేర్లను, వేదములను గుఱించిన జ్ఞానములను పూర్వసృష్టి యందలి వానిని ఇచ్చుచున్నాఁడు. పూర్వసృష్టియందున్న నామరూపములలోనే, సృజించెను. పూర్వదేవతలు ఇప్పటి చక్షురాద్యభిమానదేవతలతో సమానముగనే యుండిరి." ఇత్యాది స్మృతులను బట్టియు ప్రతికల్పనమునందు సకలదేవతాది ప్రపంచము సమాననామరూపములతో నున్నట్లు తెలియుచున్నది. కాన మహాప్రళయమున వేదములు వాసనారూపముగ పరమేశ్వరుని యందున్నవి గాన నవి నిత్యములు. వానిని ఈశ్వరుఁడు సృష్టిలో బ్రహ్మకు ప్రకటము చేయుచుండెను గాన వాని కనిత్యత్వముగాని యప్రామాణ్యము గాని లేదని భావము.

2౯. మూ. మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః.

మధ్వాదిషు=మధూపాసనాదులందు, అసంభవాత్=ఒకదేవత నింకొకదేవత ఉపాసించుట అసంభవమగుటవలన, అనధికారం = దేవతలకధికారములేదని, జైమినిః=జైమిని.

సూ. "ఈ సూర్యుని దేవతలకు మధువుగ నుపాసింపవలెను" ఇత్యాది శ్రుతులబట్టి సూర్యదేవతను దేవతయగు నింకొక సూర్యుఁడు ఉపాసించుట అసంభవము గాన ఈ దృశశ్రుతికంటె నభిన్నమగు బ్రహ్మవిద్య నభ్యసించుటకు దేవతల కధికారములేదని జైమిని యనియె.

వివ:- "అసావాదిత్యో దేవమధు" (ఛాందో. ౩. ౧. ౧.) అనిశ్రుతి.

3౦. మూ జ్యోతిషిభావాచ్చ.

జ్యోతిషి=జ్యోతిర్మండలమందు, భావాచ్చ=ప్రయోగముండుటవలనను.

సూ. సూర్యాది శబ్దములు అచేతనమగు తేజోమండలమందు ప్రయోగింపఁబడుటవలనను సూర్యాది దేవతలకు బ్రహ్మవిద్యయందు అధికారములేదు.

వివ:- పురాణాదులందు సూర్యాదులకుఁ జేతనత్వము చెప్పఁబడెను. ఆ పురాణాదులు పౌరుషేయములు గాన నవి ప్రమాణములు గావని మీమాంసకులు అందురు.

31. మూ. భావంతుబాదరాయణోఽస్తిహి.

భావంతు = విద్యాధికారముండుటనైతే బాదరాయణః = బాదరాయణుఁడు అంగీకరించున్నాడు, అస్తిహి=అధికారమున్నదిగదా.

సూ. దేవాదులకు బ్రహ్మవిద్యయందు నధికారము మాత్రమున్నదని బాదరాయణుఁడు తలఁచుచున్నాఁడు గాన దేవాదులకు బ్రహ్మవిద్య యందు అధికారమున్నది.

వివ:- అదిత్యాదిదేవతావాచకములగు పదములు వానివాని మండలముల యధిదేవతలను జెప్పుచున్నవి గాని యచేతనమగు తేజోమండలములనుగూర్చి చెప్పుటలేదు. "తద్యోయోదేవానాం ప్రత్యబధ్యత సఏవ తదవభత్త ఋర్షాణాం తథామనుష్యాణాం" (బృ. ౧. ౪. ౧౦) దేవతలలో నెవ్వడెవ్వడు ఆ బ్రహ్మ మును దెలిసికొనెనో వాఁడు ఆ బ్రహ్మమే యయ్యెను, అట్లే ఋషులలోను మను ష్యులలోను బ్రహ్మమును దెలిసికొన్నవాఁడు బ్రహ్మమె అగును. ఇత్యాదులను బట్టి దేవతలకును బ్రహ్మవిద్యాధికారమున్నదని తెలియుచున్నదని భావము. "మేధాతిథిం హకాణ్వాయన మింద్రో మేషో భూత్వా జహార" (షడ్వింశ. బ్రా. ౧. ౧) ఇంద్రుఁడు మేషమై కాణ్వాయణుఁడైన మేథాతిథి యను మునిసుతుని హరించెను "ఆదిత్యో పురుషో భూత్వా కుంతీముపససార" సూర్యుఁడు పురుష రూపము గలవాఁడై కుంతిని సమీపించెను. ఇత్యాది స్మృతులనుబట్టి సూర్యాదులు అధిదేవతలుగ గ్రహింపవలయునని భావము.

## ౯. అపశూద్రాధికరణము

32. మూ. శుగస్య తదనాదర శ్రవణాత్తదాద్రవణాత్ సూచ్యతేహి.

తదనాదర శ్రవణాత్ = ఆ హంసల యనాదరవాక్యముల వినుటవలన, తదాద్రవణాత్=అపుడు రైక్వునిదగ్గరకు పరుగెత్తుటవలన అస్య=ఈ జానశ్రుతి యను రాజునకు శుక్ దుఃఖము, సూచ్యతేహి=సూచింపఁబడుచున్నదిగదా.

సూ. హంసల యనాదరవాక్యములు వినుటవలన వెంటనే జానశ్రుతి యను రాజు శోకముఁబొంది రైక్వుఁడను ముని దగ్గరకు ఆత్మజ్ఞానము పొందుటకు పరువెత్తఁగా నా రైక్వుఁడు అతని దుఃఖము చూచి సంబోధించిన "ఓ శూద్రా" అను పదముచే శోకము సూచింపఁబడుచున్నది గాని శూద్రజాతివాఁడా! యని

సూచింపఁబడుటలేదు గాన "అయ్యో ఓ శూద్రా! (=దుఃఖించినరాజా!) శుక్= దుఃఖముచే, ద్రా=రైక్వునిదగ్గరకు పరుగెత్తినవాఁడా. హారములలోఁ గూడిన యీ రథము గోవులతోఁ గూడ నీకే యుండుఁగాక" అను శ్రుతిలో శూద్రపదమునుబట్టి శూద్రునకు బ్రహ్మవిద్యాధికారమున్నదనరాదు

వివః- "పూర్వము అన్నదాతయగు జానశ్రుతియను రాజు గలఁడు. అతని యన్నదానమునకు సంతసించి ఋషులు అతనికి మేలుచేయగోరి జానశ్రుతి మేడపై నిద్రించుచుండఁగా హంసరూపములు ధరించి యతనిపైనుండి పోవుచుండిరి. అప్పుడు ముందు హంసను జూచి వెనుకటి హంస "ఓయీ యీ నిద్రించు జానశ్రుతి తేజస్సు స్వర్గమును సైతము వ్యాపించినది యతనిపైనుండి పోయినచో ఆ తేజము కాల్చివైచును అనఁగా రెండవ హంస "ఓయీ విద్యావిహీనుఁడగు నితనిని బండిక్రింద ధ్యానమునందున్న రైక్వునితోఁ బోల్చితివే బ్రహ్మనిష్ఠుఁడగు రైక్వుని తేజము దురతిక్రమముగాని యాత్మజ్ఞానము లేని యితని తేజము అట్టిదిగాదని పలుకఁగా మొదటి హంస "ఈ రాజు మనమాటలకు ఖిన్నుఁడై రైక్వునాశ్రయించి విద్య నేర్చుకొనును" అని పలికెను. అంత రాజా మాటలు విని దుఃఖించి రైక్వుని జేరి గోవులను రథములను ఇచ్చి విద్యోపదేశము చేయుమనఁగా రైక్వుఁడు "అహ హారేత్వా శూద్ర తవైవ సహగోభిరస్తు" (ఛాందో. ౪. ౨ ౩) అయ్యో ఓ శూద్రా (=దుఃఖముచే పరువెత్తినవాఁడా) హారములతోఁ గూడి యీ రథము గోవులతోఁ గూడ నీకేయుండుఁగాక అని యనెను.

౩౩. సూ. క్షత్రియత్వావగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్.

ఉత్తరత్ర=ముందుముందు, చైత్రరథేన=చైత్రరథునితో, లింగాత్= సంబంధమున్న లింగమునుబట్టి, క్షత్రియత్వావగతేశ్చ=క్షత్రియుఁడని తెలియుట వలనను.

సూ. ముందు ముందు సంసర్గవిద్యావాక్యశేషమున క్షత్రియుఁడగు చైత్రరథునితో నీజానశ్రుతికి సంబంధమున్న కారణమునుబట్టి యితఁడును క్షత్రియుఁడై యని తెలియుటవలనను జానశ్రుతిని శూద్రజాతివాఁడా యని పిలుచుట తగదు గాన నిట శూద్రపదమునకు దుఃఖముచే పరువెత్తినవాడా యని యౌగికార్థమునే చెప్పవలయు.

వివ:- "తస్మాచ్చైత్ర రథిర్నామైకః క్షత్రపతిరజాయత" (ఆ చిత్ర రథుని వలన చైత్రరథియను క్షత్రియుఁడు పుట్టెను) అనుదానిచే చైత్రరథుఁడు క్షత్రియుఁడు అని తెలియుచున్నది.

84. మూ. సంస్కార పరామర్శా త్తదభావాభిలాపాచ్చ.

సంస్కార పరామర్శాత్=ద్విజులకే ఉపనయనాది సంస్కార పరామర్శ వలన, తదభావాభిలాపాచ్చ=ఇతరుల కాసంస్కారము లేదని చెప్పుట వలనను.

సూ. బ్రహ్మక్షత్రియవైశ్యులకే శ్రుతులందు ఉపనయన వేదాధ్యయనాది సంస్కారము విధించుట వలనను శూద్రుల కట్టియుపనయనాది సంస్కారము లేకపోవుట వలనను శూద్రునకు బ్రహ్మవిద్య యందధికారము లేదు.

85. మూ. తదభావనిర్ధారణేచ ప్రవృత్తేః

తదభావనిర్ధారణే = అశూద్రత్వము లేదని నిర్ధారణ చేయుటయందు, ప్రవృత్తేః=ప్రవర్తించుటవలన.

సూ. సత్యము పలుకుటచే జాబాలుని యందు శూద్రత్వము లేదని బ్రాహ్మణుఁడని నిశ్చయించి గౌతముఁడు వానికి ఉపనయనము వేదాది విద్య లుపదేశించుటకుఁ బ్రవర్తించుట వలనను శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము లేదు.

వివ:- "నైత దబ్రాహ్మణో వివక్తు మర్హతి సమిధం సోమ్యాహరోప త్వానేష్యే న సత్యాదగాః "(ఛాం. ౪. ౪. ౫) (ఈ సత్యమును బ్రాహ్మణుఁడు గానివాఁడు చెప్పఁడు ఓ సౌమ్యుఁడా ! సమిధలను తెమ్ము నీకు బ్రహ్మవిద్యనుపదేశించుటకు ఉపనయింతును (దగ్గఱకుఁ దీసికొందును) నీవు సత్యము నుండి తొలఁగలేదు) అనుశ్రుతినిబట్టి సత్యము పలికినవాడు బ్రాహ్మణుఁడు గాన సత్యము పలుకుట బ్రాహ్మణ లక్షణము. అందు చేసత్యము పలుకనివాఁడు శూద్రుఁడు అట్టి శూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదని భావము.

86. మూ. శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ స్మృతేశ్చ.

శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్=వేదశ్రవణమును పాఠమును అర్థమును నిషేదించుట వలన, స్మృతేశ్చ=స్మృతివలనను.

సూ. వేదశ్రవణమును, వేదాధ్యయనమును, వేదార్థమునుదెలిసికొనుటయు స్మృతులందుఁ బ్రతిషేధింపఁబడుట వలనను శూద్రునికి బ్రహ్మవిద్యాధికారములేదు.

వివ :- "ద్విజాతీనా మధ్యయన మిజ్యా దానం" (ద్విజులకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు వేదాధ్యయనము, యజ్ఞము దానమును గర్మలు) అని చెప్పుటచే శూద్రులకు వేదాధికారము లేదని భావము. "శ్రావయే చ్చతురోవర్ణాన్" (నాలుగు వర్ణములవారికి ఇతిహాస పురాణములను వినిపింపవలయును) అనుటచే ఇతిహాసపురాణములను దెలిసికొనుటకేగాని వేదమున కధికారము లేదని తెలియు చున్నది.

## ౧౦. కంపనాధికరణము

37. సూ. కంపనాత్.

కంపనాత్=కంపించుటవల్ల.

సూ. 'ఈ జగమంతయుఁ బ్రాణముయొక్క కదలికవల్లనే పుట్టుచున్నది' యని శ్రుతిలోఁ జెప్పుటవల్ల అందులోఁ బ్రాణమనఁగా నిట బ్రహ్మమే గాని గాలిగాదు.

వివ:- "యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతం" (కాఠ. ౨. ౬. ౨) అనిశ్రుతి. గాలివల్లఁ బ్రపంచము పుట్టదు గావునను ఆ శ్రుతి పూర్వాపరములందు బ్రహ్మమును గుఱించి చెప్పఁబడినది గానను అటఁ బ్రాణ మనఁగా బ్రహ్మమని చెప్పవలయునని భావము.

## ౧౧. జ్యోతి రధికరణము

38. సూ జ్యోతిర్దర్శనాత్.

దర్శనాత్=శ్రుతిలోఁ గనిపించుటవలన. జ్యోతిః=జ్యోతి అన బ్రహ్మమె.

సూ. "ఈ జీవుఁడు శరీరమునుండి లేచి పరమమైన జ్యోతిని పొంది తన రూపమును బొందుచున్నాఁడు" అను శ్రుతిలోని జ్యోతిః పదమునకు శ్రుతి వాక్యముల ప్రకరణమున బ్రహ్మమే యని యర్థము కనిపించుటవలన జ్యోతి యనఁగా బ్రహ్మమనియె గాని భౌతిక తేజస్సు అని అర్థము చెప్పరాదు.

వివ:- "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుప సంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" (ఛా. ౮. ౧౨. ౩) అని శ్రుతి. య ఆత్మా

అపహతపాప్మా... సోన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః (ఛా. ౮. ౭ ౧) (అపహత పాప్మమయిన యాత్మ యన్వేషింపదగినది తెలిసికొనఁదగినది) "అశరీరంవావ సంతం ప్రియాప్రియే స్పృశతః (ఛాం. ౮. ౧౨. ౧) (తాను శరీరములేనివాఁడని తెలిసికొన్నవానిని ప్రియముగాని అప్రియముగాని స్పృశింపవు) అను శ్రుతి ప్రకరణమునఁ జెప్పఁబడిన పాపరాహిత్యము శరీరశూన్యత్వము మొదలగు గుణములు గల జ్యోతి బ్రహ్మమే గాని భౌతిక తేజస్సు గాదని భావము.

## ౧౨. అర్థాంతరత్వవ్యపదేశాధికరణము

౩౭. మూ. ఆకాశోఽర్థాంతరత్వాది వ్యపదేశాత్.

అర్థాంతరత్వాదివ్యపదేశాత్ = నామరూపాదులకంటె నితరమైనది మొదలుగా వ్యపదేశించుటవల్ల, ఆకాశః=ఆకాశపదము బ్రహ్మపరము.

సూ. "ఆకాశమె నామరూపములను నిర్వహించునది ఆ నామరూపములు దేనికంటె భిన్నములో యది బ్రహ్మ" అను శ్రుతిలో ఆకాశమును నామరూపములకంటె వేఱొకదానిగ వ్యపదేశించుట మొదలగువానివల్ల అందలి యాకాశపదము బ్రహ్మపరమైనది.

వివ:- 'ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితాతేయదంతరా తద్బ్రహ్మ' అని (ఛాం. ౮. ౧౪. ౧) అని శ్రుతి నామరూపములకంటె భిన్నమైనది బ్రహ్మ మొక్కటె మిగిలిన ప్రపంచమంతకు నామరూపములు గలవు గాన నామరూపములకంటె వేఱుగఁ జెప్పఁబడినది బ్రహ్మమె యగునని భావము

## ౧౩. సుషుప్త్యధికరణము

40. మూ. సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన.

సుషుప్త్యుత్క్రాంత్యోః=సుషుప్తియందు దేహము విడుచునపుడు భేదేన= భేదముగ చెప్పుటచే.

సూ. 'ఆత్మయెవఁడు' అని జనకుండు ప్రశ్నింపఁగా "విజ్ఞానమయుఁడును ప్రాణములందును, హృదయములోపల జ్యోతిస్స్వరూపుఁడునగు పురుషుఁడె యా యాత్మ" అని యాజ్ఞవల్క్యుఁడు సమాధానముగఁ జెప్పిన శ్రుతిలోని పురుషుని, ప్రకరణమున సుషుప్తియందు దేహము విడచుసమయమందు శరీర గత

జీవునికంటె భేదముగ వ్యపదేశించుట వలన నీ పురుషుఁడు పరమాత్మయెగాని జీవుఁడుగాఁడు.

వివ:- "కతమ ఆత్మేతి" "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంత ర్జ్యోతిః పురుషః" (బృ. ౪. ౩. ౭) అని శ్రుతిలోని పురుషునిగూర్చి సందేహము "అయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరం" (బృ ౪. ౩. ౨౧) (ఈ జీవుఁడు పరమాత్మచేఁ గౌఁగిలింపఁబడి బాహ్యమును ఆంతరమును దెలిసికొనఁడు) అని సుషుప్తియందు పరమేశ్వరునికంటె జీవుఁడు భిన్నుఁడుగఁ జెప్పబడెను. 'అయంశారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మ నాన్వారూఢ ఉపసర్జన్యాతియత్రైతి దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి' (బృ. ౪. ౩. ౩౫) ఈ జీవుఁడు దేహము విడునపుడు పైకి నూపిరి కలవాఁడై పరమేశ్వరునిచేఁ గూడినవాఁడై ధ్వనిచేయుచుఁ బోవుచున్నాఁడు) అని దేహము విడచునపుడు ఈ జీవునికంటెఁ బరమేశ్వరుఁడు భిన్నుఁడుగఁ జెప్పఁబడెను.

41. మూ. పత్యాధిశబ్దేభ్యః

పత్యాధిశబ్దేభ్యః=అధిపతి మొదలగు శబ్దములఁబట్టి

సూ. "ఇతఁడు సర్వమును వశమందుంచుకొన్నవాఁడు, సర్వమున కీశ్వరుఁడు, సర్వమున కధిపతి" అను తరువాతి శ్రుతిలోని అధిపతి మొదలగు పదములనుబట్టియు ఈ పురుషుఁడు పరమేశ్వరుఁడెగాని జీవుఁడుగాఁడు.

వివ:- "సర్వస్యవశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః" (బృ. అని శ్రుతి.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మ మీమాంసా దర్శన మందు మొదటి యధ్యాయమున
స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయమను
మూఁడవపాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

మొదటి యధ్యాయమున నాలుగవ పాదము.
బ్రహ్మబోధకాఽస్పష్టశ్రుతి వాక్యసమన్వయము.

## ౧. ఆనుమానికాధికరణము

1. మూ. అనుమానికమ ప్యేకేషా మితిచేన్న శరీరరూపక విన్యస్తగృహీతే ర్దర్శయతి చ.

ఆనుమానికమపి=అనుమానప్రమాణసిద్ధమగు ప్రధానముగూడ. ఏకేషాం= కొందఱియొక్క మతమున, ఇతిచేత్‌న = అన్నచో అట్లనరాదు, శరీరరూపక విన్యస్త గృహీతేః=శరీరమును రూపకముగానుంచి గ్రహించుటవలన, దర్శయతిచ=అట్లని శ్రుతి చూపుచున్నదిగూడ.

సూ, 'మహత్తుకంటె అవ్యక్తము గొప్పది యవ్యక్తముకంటెఁ బురుషుఁడు గొప్పవాఁడు' అను శ్రుతిలోని యవ్యక్తము అనఁగా అనుమానప్రమాణముచే సిద్ధమైన ప్రధానమే కొందఱి మతమున నగునన్నచో 'ఆత్మను రథికునిగాఁ దెలియుము శరీరమును రథముగాఁ దెలియుము' అనుచోట రథముగా నారోపింపఁబడిన శరీరమే యిట అవ్యక్తపదముచే గ్రహింపఁబడుటవలన అవ్యక్త మనఁగా శరీరమేగాని ప్రధానముగాదు. ఇట్లే యుత్తర శ్రుతియందుఁ గనిపించుచున్నది.

వివ:- 'మహతః పరమవ్య క్తమవ్యక్తాత్పురుషః పరః (కాఠ. ౧ ౩ ౧౧) అని శ్రుతిలోని అవ్యక్తపదమునకు, 'ఆత్మానంరథికం విద్ధి శరీరం రథమేవచ' అను తరువాతి శ్రుతిలో రథముగ నారోపింపఁబడిన శరీరమే అర్థమని శ్రుతి చూపుచున్నదని భావము.

2. మూ. సూక్ష్మంతు తదర్హత్వాత్.

తదర్హత్వాత్ = అవ్యక్తపదమున కర్హమగుటవల్ల, సూక్ష్మంతు = అవ్యక్త మనగా సూక్ష్మశరీరమే.

సూ శరీరము వ్యక్తమగుచున్నది గాన అవ్యక్తపదముచే శరీరమని చెప్పుట తగదన్నచో సూక్ష్మశరీరమైనచో అవ్యక్తపదార్థమునకు అర్హమై యుండుట వలన అవ్యక్తపదముచే శరీరమె యని యర్థము చెప్పుటలో విరోధములేదు.

3. మూ. తదధీనత్వాదర్థవత్.

తదధీనత్వాత్=అవ్యక్తము ఆ యీశ్వరుని కధీనమగుటవల్ల, అర్థవత్= సృష్టిలో సార్థకమగుచున్నది.

సూ. స్థూల శరీరమునకు బీజరూపముగా నున్న యవ్యక్తము ఈశ్వరాధీన మగుటవలనఁ బ్రపంచసృష్టి రూపప్రయోజనము చేయుటలో సార్థకమగుచున్నది.

ఈ సూత్రము కర్థాంతరమగు సూత్రము.

స్థూలశరీరము సూక్ష్మ శరీరమున కధీనమై యుండుటవలన అవ్యక్త పదము శరీరమున కర్థవంతమగుచున్నది.

4. మూ. జ్ఞేయత్వావచనాచ్చ.

జ్ఞేయత్వావచనాచ్చ = అవ్యక్తము తెలిసికొనదగినదిగాఁ జెప్పకపోవుట వలనను.

సూ. ప్రధానము దెలిసికొనఁదగిన దానినిగ సాంఖ్యులచేఁ జెప్పఁబడినట్లు అవ్యక్తము దెలిసికొనఁదగినదని యిందుఁ జెప్పఁబడకపోవుటవలనను అవ్యక్త మనఁగా శరీరమెగాని ప్రధానముగాదు.

5. మూ. వదతీతిచేన్న ప్రాజ్ఞోహి ప్రకరణాత్.

వదతీతిచేత్=శ్రుతిచెప్పుచున్నదన్నచో, న=అట్లుగాదు, ప్రకరణాత్=ప్రకరణమునుబట్టి, ప్రాజ్ఞోహి=ప్రాజ్ఞుఁడగు బ్రహ్మమె.

సూ. "శబ్దము, స్పర్శము, రూపము, మార్పు, రసము గంధము లేనిదియు నిత్యమైనదియు ఆద్యంతము లేనిదియు మహత్తు కంటె నతీతమైనదియు, ధ్రువమైనదియు నగుదానిని దెలిసి మృత్యుముఖము నుండి విడువఁబడుచున్నాఁడు" (కాఠ. ౨.౩ ౧౫)అను శ్రుతి అవ్యక్తమును దెలిసికొనవలయునని చెప్పుచున్నది గదా యన్నచో అక్కడఁ బ్రకరణమునుబట్టి ప్రాజ్ఞుఁడైన పరమాత్మనె తెలిసికొన వలయునని శ్రుతి చెప్పుచున్నదే గాని యవ్యక్తమును జెప్పుటలేదు.

6. మూ. త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ.

త్రయాణామేవచైవం=అగ్ని జీవపరమాత్మల ముమ్వురికేఇట్లు, ఉపన్యాసః= ఉపన్యాసము, ప్రశ్నశ్చ=ప్రశ్నయును.

సూ ఆ కఠవల్లి ప్రకరణమందు అగ్ని, జీవ, పరమాత్మలు ముమ్వురిని గూర్చియె ఇట్లు ప్రస్తావించుటయు, ప్రశ్నించుటయుఁ గలదు గాని ప్రధానమును గూర్చి యటఁ బ్రస్తావింపఁబడలేదు.

7 మూ. మహద్వచ్చ.

మహద్వచ్చ=మహత్పదమువలెను.

సూ. సత్త్వగుణప్రధాన ప్రకృతియొక్క పరిమాణమైన సత్తామాత్రమందు సాంఖ్యులచే వాడఁబడిన మహత్తు అను శబ్దము శ్రుతులందు వేఱుగ వాడఁబడినట్లు అవ్యక్తపదమును శ్రుతులలో వేఱుగ వాడఁబడుట వలనను అవ్యక్తమనఁగాఁ బ్రధానముగాదు.

వివ:- "బుద్ధేరాత్మా మహాన్పరః (కాఠ. ౧. ౩. ౧౦) బుద్ధికంటే ఆత్మ ఎక్కువ మహత్తుగలది 'వేదాహమేతం పురుషం మహాంతం (శ్వే. ౩. ౮)' (ఎక్కువవ్యాపకుడగు ఈ పురుషుని నే నెఱుఁగుదును ఇత్యాది శ్రుతులందు మహత్పదము ప్రధానార్థమందు వాడఁబడలేదని భావము.

## ౨. చమసాధికరణము

8. మూ. చమసవదవిశేషాత్.

చమసవత్=చమసశబ్దమునకువలె, అవిశేషాత్=సామాన్యవాచియగుటవలన.

సూ చమస శబ్దమునకువలె అజాశబ్దమునకు ఈ యర్థవిశేషమునే చెప్పవలయునను నియమము లేకపోవుట వలన అజాశబ్దమునకుఁ బ్రధానమను నర్థమును జెప్పరాదు.

వివ:- 'అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః' (బృ. ౨. ౨ ౩) (పైని గుండ్రనియాకారము గలిగి క్రింద బిలమున్నది చమసము) ఇక్కడ చమసమను దానికి పైని గుండ్రని యాకారము క్రింద బిలముగల పదార్థమేదైనను అర్థమే యగును. అంతియేగాని విశేషముగ నిట్టిదే చమసము అనుటకు వీలులేదు ఇట్లే 'అజామేకాం లోహిత్ శుక్లకృష్ణాంబహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః, అజో

హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః' (శ్వే. ౪. ౫) ఒక మేఁకపోతు ఎఱుపు తెలుపు నలుపు రంగులుగల, తనతో సమానాకారము గల చాల పిల్లలను గనుచున్న యొకయాఁడు మేఁకను ప్రేమించుచున్నదై యనుస రించుచున్నది. మఱియొక మేఁకపోతు అనుభవింపఁబడిన యాఁడు మేఁకను వదలిపోవుచున్నది. అనుశ్రుతిలో అజా అనుదానికి పుట్టుకలేనిది యను వ్యుత్పత్తిచే ప్రధానమునుజెప్పి, ఎఱుపు తెలుపు నలుపు రంగులచే రజోగుణము, సత్త్వగుణము తమోగుణము అని చెప్పి, చాల పిల్లలను అనఁగా సంతానమును అనిచెప్పి, అజుడు అనగా నొక పురుషుడు అజను అనగా ఆ ప్రకృతిని అవిద్యచే ప్రేమించుచు అవివేకముచే నదియే యాత్మ యని నేను సుఖిని నేను దుఃఖిని నేను మూఢుఁడను, అని యనుసరించుచున్నాఁడు. మఱియొక పురుషుఁడు విరక్తుఁడై భోగాపవర్గములుగల యీ ప్రకృతిని విడచుచున్నాఁడు అని ప్రధాన పరముగాఁ జెప్పవచ్చును కాని ప్రధానపరముగాఁ జెప్పవలయునని నియమము చేయు సూచనలు లేకపోవుటచే అజా అను దానికి చమసపదమునకువలె సామా న్యార్థమునే చెప్పవలయునేగాని ప్రధానమని చెప్పరాదనిభావము.

9. సూ. జ్యోతిరుపక్రమా తు తథా హ్యధీయత ఏకే.

జ్యోతిరుపక్రమా తు=అజాపదము జ్యోతిస్సు మొదలగు వానికిఁ బ్రకృతియగు నదియే, తథాహి=అట్లే, ఏకే=కొన్నిశాఖలవారు, అధీయతే=పఠించుచున్నారు.

సూ. తేజోజలాన్నరూపమై పరమేశ్వరునివల్ల జనించి పృథివ్యప్తేజోవాయు వులకుఁ బ్రకృతియై యుండు దానినే యజాపదమునకు అర్థముగాఁ జెప్పవలయును. అట్లే కొందఱు సామశాఖలవారు గానము చేయుచున్నారు.

వివ:- 'యదగ్రేరోహితం రూపం తేజస స్తద్రూపం యచ్ఛుక్లం తదపాం, యత్కృష్ణం తదన్నస్య' (ఏది ఎఱ్ఱనిదై యున్నదో అది తేజస్సుయొక్క రూపము, తెలుపు నీళ్ళ రూపము. నలుపు అన్నముయొక్క రూపము) "మా యాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం" (మాయను ప్రకృతిగను, మహేశ్వరుని మాయగల వానినిగ దెలియుము) "యోయోనిం యోనిమధి తిష్ఠ త్యేకః" (శ్వేతశ్వ. ౪. ౧౦. ౧౧) (ఒక్కఁడగు పరమేశ్వరుఁడె ప్రతి జీవోపాధు లను ప్రేరేపించుచున్నాడు. పైవానినిబట్టి అజ అనఁగా పరమేశ్వరుని కధీనమై యుండి ప్రకృతియని పిలవఁబడునదేగాని స్వతంత్రముగా సాంఖ్యులచేఁ జెప్పబడు ప్రధానము మాత్రము గాదని తెలియునది

10. మూ. కల్పనోపదేశాచ్చ మధ్వాదివ దవిరోధః

మధ్వాదివత్=సూర్యాదులను మధువు మొదలగువానివలెను, కల్పనోప దేశాచ్చ=కల్పించి యుపదేశించుటవలనను, అవిరోధః=విరోధము లేదు.

సూ. సూర్యుని మధువుగను, వాక్కును గోవుగను, ద్యులోకాదులను అగ్న్యాదులు గను గల్పన చేసి చెప్పినట్లు అవ్యక్తమును మేకగాఁ గల్పనచేసి యుపదేశించుట వల్ల "అజాపదమునకుఁ బ్రకృతియను నర్థముచెప్పుట" విరోధించుననరాదు.

వివ:- "అసౌవా ఆదిత్యో దేవమధు" ఇత్యాదులందు సూర్యాదులను మధ్వాదులుగఁ గల్పన చేయఁబడినదని భావము.

## ౩. సంఖ్యోప సంగ్రహాధికరణము

11. మూ. నసంఖ్యోప సంగ్రహాదపి నానాభావా దతిరేకాచ్చ.

సంఖ్యోపసంగ్రహాద్దపి = అయిదయిదు సంఖ్యలచే సంగ్రహింపఁబడు చున్నప్పటికిని నానాభావాత్=వేఱుగా నుండుటవల్లను, అతిరేకాచ్చ=ఆత్మాకాశ ములు ఎక్కువగా నుండుటవల్లను, న=ప్రధానమనరాదు.

సూ. శ్రుతియందు చెప్పఁబడిన అయిదు అయిదు సంఖ్యలచే నిరువది యైదు తత్త్వములు సంగ్రహింపఁబడుచున్నవి. గాన అవి సాంఖ్యులచే లెక్కింపఁ బడుటచే శ్రుతిలోని అజాపదముచేఁ బ్రధానమే గ్రహింపఁబడునన్నను, ఆ యిరు వదియైదు తత్త్వములు అయిదేసి చొప్పున సజాతీయముగా నుండక వేఱువేఱు భావములుగ నుండుటవల్లను, ఇరువదియైదుకంటె నెక్కువగా ఆత్మాకాశములు ఉండుటవల్లను, ప్రధానమని చెప్పరాదు.

వివ:- "యస్మిన్ పంచ పంచ జనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః తమేవమన్య ఆత్మానం, విద్వాన్ బ్రహ్మఽమృతోఽమృతం" (బృ. ౪. ౪. ౧) (పంచజన సంజ్ఞగల యైదు (ప్రాణ చక్షుశ్శ్రోత్రాన్నమనంబులు) ఆకాశమును ఏ బ్రహ్మ మునందుఁ గల్పింపఁబడినవో ఆ బ్రహ్మమునే నేను అని తలఁచుచున్నాను. అమృతస్వరూపమగు బ్రహ్మమును దెలిసినవాఁడనై నేను అమృతస్వరూపమగు చున్నాను. మఱియు 5 జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు 5 పంచభూత ములు 5 శబ్దస్పర్శరూప రసగంధములు. ఈ నాలుగు గణములు సజాతీయము లైనను ప్రధానము మహత్తత్త్వము, అంతఃకరణము, బుద్ధి, అహంకారములు

ఒక జాతికిఁ జెందకపోవుట 5వది సజాతీయగణనముగాదు గానఐదు పంచజనము లనగా పంచవింశతితత్త్వములు గావని భావము.

12. మూ. ప్రాణాదయో వాక్యశేషాత్.

వాక్యశేషాత్=తరువాతివాక్యశేషమునుబట్టి, ప్రాణాదయః=ప్రాణాదులను గ్రహింపవలయును.

సూ. తరువాతి వాక్యశేషమునుబట్టి ఆ యయిదును పంచప్రాణములని గ్రహింపవలయును.

వివః- 'ప్రాణస్యప్రాణముత చక్షుషశ్చక్షు రుతశ్రోత్రస్య శ్రోత్రమన్న స్యాన్నం మనసో యేమనోవిదుః' ప్రాణమునకుఁ బ్రాణమైనదానిని, కంటికిఁ గన్నైనదానిని, చెవికిఁ జెవియైనదానిని అన్నమునకు అన్నమైనదానిని, మనస్సుకు మనస్సైనదానిని ఎవరు తెలిసికొందురో వారు బ్రహ్మము నెఱుఁగుదురు అని తరువాతి వాక్యములోఁ జెప్పఁబడినదానిని బట్టి ఆ పంచజనములు ప్రాణము, కన్ను, చెవి, అన్నము, మనస్సు అని తెలియునది యని భావము జనము అనగా జన్యములు ఇంద్రియములని చెప్పవచ్చును. లేక జనులు అనఁగా పురుషులు అని చెప్పవచ్చును. "తేవా ఏతే పంచ బ్రహ్మపురుషాః" (ఛా. ౩. ౧౩. ౬) అను శ్రుతిలో పైని జెప్పఁబడిన ప్రాణాదులైదును మహారాజునకు ద్వారపాలకులువలె బ్రహ్మమునకు ద్వారపాలకులయిన పురుషులు ఆ యయిదు జనులు పురుషులుగ వ్యవహరింపఁబడిరి. కనుక ప్రధానము వేదప్రతిపాదితముగాదని భావము.

13. మూ. జ్యోతి షైకేషామసత్యన్నే.

ఏకేషాం=కొందఱమతమున, అన్నే=అన్నపదము, అసతి=లేకపోఁగా, జ్యోతిషా=సూర్యజ్యోతిస్సుచే అయిదగును.

సూ. కొందఱ శ్రుతిపాఠములో 'అన్నమునకన్నమైనదానిని' అను పాఠము లేకపోయినను పూర్వవాక్యమునందలి జ్యోతిస్సు పదముచే సూర్య జ్యోతిస్సు గ్రహింపఁబడును గాన అన్నపదము లేనప్పుడు సూర్యజ్యోతిస్సుచే అయిదు అగును.

వివః- 'తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతం' ఆ దేవతలు సూర్యాది జ్యోతిస్సులకు జ్యోతియయిన బ్రహ్మమును అయువుగ నుపాసించు

వివ:- 'తత్సత్యమిత్యాచక్షతే' అనుదానిని 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' (ఛాం. ౩. ౧౯. ౧) ఈ శ్రుతి సమాకర్ష చేయుచున్నదని భావము.

## ౫. జగద్వాచిత్వాధికరణము

16. మూ. జగద్వాచిత్వాత్.

జగద్వాచిత్వాత్=ఏతత్ పదము జగత్తును జెప్పునది యగుటవలన.

సూ. 'బలాకా పుత్రుఁడనైన యో బ్రాహ్మణుఁడా! యెవఁ డీపురుషులకుఁ గర్తయో, యిది యెవని కర్మయో యతఁడె తెలిసికొనఁదగినవాఁడు' అను శ్రుతిలోని 'ఇది' యను పదము జగత్తును జెప్పునది గాన నీ శ్రుతిలోఁ దెలిసికొనఁదగినది బ్రహ్మమె గాని ప్రాణాదులు గావు.

వివ:- 'యోవై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తాయస్యవై తత్కర్మ స వై వేదితవ్యః (కౌ. బ్రా. ౪. ౧౯) అను శ్రుతిలోని ఏతత్ పదము జగద్వాచకమని భావము.

17. మూ. జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతం.

జీవముఖ్యప్రాణలింగాత్=జీవునిముఖ్యప్రాణలింగమువలన, న=అట్లనరాదని ఇతిచేత్=అన్నచో, తత్=అది, వ్యాఖ్యాతం=వ్యాఖ్యానింపబడినది.

సూ. పూర్వశ్రుతి వాక్యశేషమందు జీవుని, ముఖ్యప్రాణమును సూచించు లింగములుండుటవలన నిట జీవుఁడని గాని, ముఖ్యప్రాణమనిగాని చెప్పుట న్యాయము బ్రహ్మమని చెప్పుట న్యాయము గాదన్నచో ఉపాసనకై యట్లు చెప్పఁబడినదని పూర్వము వ్యాఖ్యానింపఁబడినదిగాన నిట బ్రహ్మమె చెప్పఁబడినది.

వివ:- (చూ. అధ్యాయ. ౧ పాద. ౧. ౩౧. సూ.)

18. మూ. అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యా మపి చైకే.

ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం = ప్రశ్నోత్తరములఁబట్టియు, అన్యార్థంతు = అన్యప్రయోజనముకొఱకె అని, జైమినిః=జైమిని, అపిచ=మఱియు, ఏకే=కొందఱు శాఖలవారు నిట్లే.

సూ. శ్రుతియందలి ప్రశ్నోత్తరములనుబట్టి యందు జీవప్రాణముల నుదాహరించుట బ్రహ్మను దెలుపుటకె యని జైమిని తలంచుచున్నాఁడు. వాజసనేయులు నిట్లె తలఁచుచున్నారు.

వివ:- 'తత్సత్యమిత్యాచక్షతే' అనుదానిని 'అసద్వా ఇదమగ్ర ఆ సీ (ఛాం. ౩. ౧౯. ౧) ఈ శ్రుతి సమాకర్ష చేయుచున్నదని భావము.

### ౫. జగద్వాచిత్వాధికరణము

16. మూ. జగద్వాచిత్వాత్.

జగద్వాచిత్వాత్=ఏతత్ పదము జగత్తును జెప్పునది యగుటవలన.

సూ. 'బలాకా పుత్రుఁడనైన యో బ్రాహ్మణుఁడా! యెవఁ డీపురు అకుఁ గర్తయో, యిది యెవని కర్మయో యతఁడె తెలిసికొనఁదగినవాఁడు' అ శ్రుతిలోని 'ఇది' యను పదము జగత్తును జెప్పునది గాన నీ శ్రుతిలోఁ దెలి కొనఁదగినది బ్రహ్మమె గాని ప్రాణాదులు గావు.

వివ:- 'యోవై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తాయస్యనై తత్కర్మ స వై వేదితవ్యః (కౌ. బ్రా. ౪. ౧౯) అను శ్రుతిలోని ఏతత్ పదము జగద్వా చకమని భావము.

17. మూ. జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతం.

జీవముఖ్యప్రాణలింగాత్=జీవునిముఖ్యప్రాణలింగమువలన, న=అట్లనరాదని ఇతిచేత్=అన్నచో, తత్=అది, వ్యాఖ్యాతం=వ్యాఖ్యానింపబడినది.

సూ. పూర్వశ్రుతి వాక్యశేషమందు జీవుని, ముఖ్యప్రాణమును సూచించు లింగములుండుటవలన నిట జీవుఁడని గాని, ముఖ్యప్రాణమనిగాని చెప్పుట న్యాయము బ్రహ్మమని చెప్పుట న్యాయము గాదన్నచో ఉపాసనకై యట్లు చెప్పఁబడినదని పూర్వము వ్యాఖ్యానింపఁబడినదిగాన నిట బ్రహ్మమె చెప్పఁబడినది.

వివ:- (చూ. అధ్యాయ. ౧ పాద. ౧. ౩౧. సూ.)

18. మూ. అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యా మపి చైకే.

ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం = ప్రశ్నోత్తరములఁబట్టియు, అన్యార్థంతు = అన్య ప్రయోజనముకొఱకె అని, జైమినిః=జైమిని, అపిచ=మఱియు, ఏకే=కొందఱు శాఖలవారు నిట్లే.

సూ. శ్రుతియందలి ప్రశ్నోత్తరములనుబట్టి యందు జీవప్రాణముల నుదాహరించుట బ్రహ్మను దెలుపుటకె యని జైమిని తలంచుచున్నాఁడు. వాజస నేయులు నిట్లె తలఁచుచున్నారు.

వివ:- "క్వైష ఏతద్బాలాకే పురుషోఽశయిష్ట క్వవా ఏత దభూత్కుత ఏత దాగాత్" (కౌ. బ్రా. ४. ౧౯) (ఓ బాలాకీ ఈ జీవుఁడు భేదజ్ఞాము లేకుండునట్లు ఎందు నిద్రించెను. ఇది యెట నుండెను, ఇది యెట నుండి వచ్చెను అని ప్రశ్నము. "యదాస్వప్త స్స్వప్నం నకంచన పశ్యత్య థాస్మిన్ ప్రాణ ఏవైకథా భవతి" నిద్రించువాఁడు ఎప్పుడు ఎట్టి స్వప్నమును జూడఁడో అప్పుడు ఈ ప్రాణమునందె ఏకీభవించుచున్నాఁడు అనియు "ఏతస్మా దాత్మన స్సర్వేప్రాణా యథా యతనం విప్రతిష్ఠంతే, ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః" (కౌ. బ్రా. ४. ౨౦) ఎల్లప్రాణములు ఈ యాత్మనుండియె వాని స్థానముల ననుసరించి వివిధముగఁ ప్రవేశించుచున్నవి. ప్రాణములకంటె దేవతలు దేవతల కంటె లోకములు వాని వాని స్థానముల ననుసరించి ప్రవేశించుచున్నవి. అనియు నుత్తరము గానిపించుచున్నది. సుషుప్తి కాలమందు జీవుఁడు పరబ్రహ్మములో నైక్యమగుటయు, ప్రాణాదులుగ సర్వజగము బ్రహ్మము నుండియె పుట్టుటయు వేదాంత మర్యాద. ఇట్లే వాజసనేయులు. "యఏష విజ్ఞానమయః పురుషక్వైష తదాభూత్కుత ఏతదగాత్, (బృహ. ౨.౧. ౧౬) విజ్ఞానమయుఁడగు పురుషుడు సుషుప్తిలో నెందుండెను. ఈస్థితిలో ఎట నుండి వచ్చెను అని ప్రశ్న. "యఏషోంత ర్హృదయ ఆకాశ స్తస్మింఛ్చేతే" పురుషుఁడు హృదయమధ్యమందున్న ఆకాశము నందు శయనించుచున్నాఁడు. అనియు, సర్వఏత ఆత్మనోవ్యుచ్చరంతి" (ఈ జీవులెల్ల ఆత్మనుండియె బయలు దేఱుచున్నవి. అనియు నుత్తరము వాజస నేయులు చెప్పుచున్నారని భావము.

## ౬. వాక్యాన్వయాధికరణము

19. సూ. వాక్యాన్వయాత్.

వాక్యాన్వయాత్=పూర్వాపరశ్రుతివాక్యాన్వయమునుబట్టి.

సూ. "ఓ మైత్రేయి ! ఆ యాత్మయె చూడఁదగినది వినఁదగినది మననము చేయఁదగినది ధ్యానింపఁదగినది" అను శ్రుతిలోని ఆత్మపదము పూర్వా పరశ్రుతి వాక్యపర్యాలోచనమును బట్టి పరమాత్మమునె దెలుపును.

వివ:- "నవా అరే పత్యుః కామాయ పతిఃప్రియోభవతి" ఓ మైత్రేయీ? భర్తయొక్క కోరిక కొఱకు భార్యకు భర్తప్రియుఁడుగాఁడు తన ఆత్మయొక్క కోరిక కొఱకే భర్త తనకుఁ బ్రియుఁడుఅగును. అని యుపక్రమించి, "నవా

అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవత్యాత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానే నేదం సర్వం విదితం" (బృ. ౪. ౫) ఓ మైత్రేయి! అన్నిటియొక్క కోరికకై అన్నియుఁ బ్రియములుగ తన ఆత్మయొక్క ప్రియము కొఱకే యన్నియుఁ బ్రియము లగుచున్నవి క ఓ మైత్రేయి ఆ యాత్మయె చూడఁదగినది వినఁదగినది, మననము చేయఁదగిన ధ్యానింపఁదగినది. ఓ మైత్రేయి! ఆత్మయొక్క దర్శన, శ్రవణ, మననధ్యా ములచేతనే యిది యంతయుఁ దెలియఁదగినది" అను శ్రుతిలో ఆత్మపదమున జీవుఁడా? బ్రహ్మమా? అర్థము చెప్పవలయునని సంశయము. "అమృతత్వస్య నా శాస్తి విత్తేన" (బృ. ౪. ౫) ధనముచే అమలితత్వమును పొందు నాశలే బ్రహ్మతం పరాదా ద్యోన్యత్రాత్మనో బ్రహ్మవేద" ఎవఁడు బ్రహ్మమును ద కంటె వేఱుగాఁ జూచునో వానిని బ్రహ్మము శ్రేయస్సునుండి భ్రష్టుని జేయున ఇత్యాది పూర్వాపర శ్రుతి పర్యాలోచనచే ఆత్మ యన బ్రహ్మమే యర్థమ భావము.

20. మూ. ప్రతిజ్ఞా ప్రసిద్ధే ర్లింగమాశ్మరథ్యః

ప్రతిజ్ఞాప్రసిద్ధేః=ప్రతిజ్ఞాప్రసిద్ధికి, లింగం=లింగమని, ఆశ్మరథ్యః=ఆశ రథ్యుఁడు.

సూ. ఓ మైత్రేయి! ఆత్మయె చూడఁదగినది వినఁదగినది మననము చేయ దగినది ధ్యానింపదగినది" అను శ్రుతిలో ప్రియముగా సూచింపఁబడిన యాత్మన చూడఁదగినది వినఁదగినది మొదలుగాఁ బరమాత్మరూపమైన యాత్మనె గూర్చి అభేదముగా జెప్పఁబడిన లింగమునుబట్టి "ఆత్మ తెలియఁబడఁగా నిది యంతయు దెలియఁబడినదగు" ఇది యంతయు ఆత్మయె" ఇత్యాది శ్రుతులందుఁ జెప్ప బడిన ప్రతిజ్ఞ సిద్ధించుచున్నది అని యాశ్మరథ్యుఁడు అనియె.

వివ:- తెలిసికొనువాఁడు జీవుఁడు, తెలిసికొనఁదగినవాఁడు పరమాత్మ అన్నపుడు జీవ పరమాత్మలకు భేదము. అట్టి యాత్మయె తెలియదగినది అన్నపుడు ఆత్మయనఁగా పరమాత్మ గాన నభేదము. జీవాత్ముఁడు పరమాత్మ కంటె భిన్నుఁడన్నచో పరమాత్మ తెలియఁబడఁగా నిది యంతయుఁ దెలియునన్న ప్రతిజ్ఞకు భంగము కలుగును గాన నిట ఇద్దఱకు అభేదము కనుక భేదాభేదము గలదని ఆశ్మరథ్యుఁడనెనని భావము.

21. మూ. ఉత్క్రమిష్యత ఏవంభావా దిత్యౌడులోమిః

ఉత్క్రమిష్యతః = దేహమునుండి వెడలువానికి, ఏవంభావాత్=ఐక్యము గలుగుటవల్ల, ఇతి=అని, ఔడులోమిః=ఔడులోమి.

సూ. ఇంద్రియ మనోబుద్ధి సంఘాత రూపమగు దేహసంబంధముచేఁ గలుషితుఁడై జ్ఞానధ్యానాదులచే నిర్మలుఁడైన జీవుఁడు దేహము నుండి వెడలి పరమాత్మతో నైక్యము పొందుట యుపపన్నమగుటవల్ల శ్రుతియందు జీవాత్మ పరమాత్మలకు అభేదముగ ప్రారంభమునఁ జెపఁబడెనని యౌడులోమి యనియె.

వివ:- "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుప సంపద్య స్వేన రూపే ణాభిసంపద్యతే" (ఛాం. ౮. ౧౨. ౩) ఈ జీవుఁడు ఈ శరీరము నుండి బయలు వెడలి పరజ్యోతిని పొంది తన రూపమును పొందును అను శ్రుతియు, "యథానద్యః స్యందమానాః సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ, తథా విద్వాన్నామ రూపాద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి" (ముం. ౩. ౨. ౮) నదులు ప్రవహించుచు తమతమ వేఱువేఱైన నామరూప ములను విడిచి సముద్రమున నైక్యము పొందినట్లే విద్వాంసుఁడు నామరూపముల వీడి పరాత్పరుఁడైన పురుషునిఁ బొందుచున్నాఁడు అను స్మృతియు నా యర్థ మునే తెలుపుచున్నవి.

22. మూ. అనవస్థితేరితి కాశకృత్స్నః

అనవస్థితేః=భిన్నముగా ఉండకపోవుటవల్ల, ఇతి=అని, కాశకృత్స్నః= కాశకృత్స్నుఁడు.

సూ. ఈ పరమాత్మయే ఆ జీవాత్మ రూపముగా నుండుటవల్ల జీవాత్మ పరమాత్మలకు అభేదముగా నుపక్రమించి చెప్పుట యుపపన్నమగునని కాశ కృత్స్నుఁడనియె.

వివ:- "అనేన జీవేనాత్మ నాఽ నుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"

(ఛాం. ౬. ౩. ౨) ఈ జీవాత్మ రూపముగాఁ బ్రవేశించి నామరూపము లను వివరింతును ఇత్యాది శ్రుతులనుబట్టి పరమాత్మయే జీవాత్మ రూపము పొందినట్లు తెలియుచున్నదిగాక జీవాత్మ పరమాత్మలకు అభేదము ఉపపన్నమని భావము.

## ౭. ప్రకృత్యధికరణము

23. మూ. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్.

ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్=ప్రతిజ్ఞాదృష్టాంతములు విరోధింపకపోవుట వలన, ప్రకృతి, చ=ఉపాదానకారణమును.

సూ. మట్టినిగూర్చి తెలిసికొనఁగా మట్టితోఁజేయఁబడిన కుండ మొదలగు సర్వకార్యములు తెలియఁబడినట్లు పరమాత్మజ్ఞానముచే సర్వము తెలియఁబడు నిత్యాది దృష్టాంత ప్రతిజ్ఞలు విరోధింపవుగానఁ బరమాత్మయె సర్వమునకు ఉపాదానకారణము, నిమిత్త కారణమునునగు.

వివ:- "ఉత తమాదేశమప్రాక్ష్యో యే నాశ్రుతం శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతం" (ఛాం. ౬. ౧. ౨) ఏ యాదేశముచే వినఁబడ నిది వినఁబడినదగునో మననము చేయఁబడనిది మననము చేయఁబడినదగునో తెలియఁబడనిది తెలియఁబడినదగునో యట్టి యా దేశమును గురువు నడిగి తెలిసి కొంటివా? అని యుద్దాలకుఁడు కొడుకగు శ్వేతకేతువు నడిగిన ప్రశ్నయు శ్రుతి యందలి ప్రతిజ్ఞయు, "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాద్వాచారంభణం వికారోనామధేయం మృత్తి కేత్యేవ సత్యం (ఛాం. ౬ ౧. ౪) ఓ సౌమ్యుఁడా! ఘటాదికారణమగు మట్టిముద్దను గూర్చి తెలియఁగా సర్వమైన మట్టివస్తువులు తెలియఁబడును. సర్వవికారరూపములకు వాక్కులకు నాధారమైన పేరులు మాత్రమే భేదముగాని వస్తువులకు మాత్రము భేదములేదు అన్నిటిలోను మట్టిమాత్రమే సత్యముగానున్న వస్తువు అను దృష్టాంతములును పరమాత్మయె యన్నిటికి ఉపాదాన కారణము (ముఖ్యకారణము) నిమిత్తకారణ (అముఖ్యకారణము)మును అగుటలో విరోధింపవు గాన పరమాత్మయె యుపాదాన నిమిత్తకారణము లగునని భావము.

మూ. అభిధ్యోపదేశాచ్చ

అభిధ్యోపదేశాత్ చ=సృష్టివిషయకధ్యానమున్నట్లు ఉపదేశించుటవలనను

24. సూ. పరమేశ్వరునికి సృష్టిసంకల్ప విషయకధ్యాన మున్నట్లు శ్రుతు లందు ఉపదేశించుటవల్లను సర్వమునకు పరమాత్మ యుపాదానకారణము నిమిత్త కారణమునగును.

వివ : "సో౽కామయత బహుస్యాం ప్రజాయేయ" ఎక్కువమంది సంతాన మును గనుదును అని యతఁడు తలఁచెను. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ." అనేకసంతానము గనుదునని యతఁడు చూచెను.

25. మూ. సాక్షాచ్చోభయామ్నానాత్.

సాక్షాత్ చ=సాక్షాత్తుగాఁగూడ, ఉభయామ్నానాత్ = సృష్టిప్రళయములు రెండు చెప్పుటవలన.

సూ. సృష్టిప్రళయములు రెండును పరమాత్మ నుండియె యగునని శ్రుతి యందు సాక్షాత్తుగఁ జెప్పఁబడుటవలనను సర్వమునకు పరమాత్మయె ఉపాదాన కారణము నిమిత్తకారణము నగును.

వివ:- "సర్వాణిహవా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తంయంతి" (ఛాం. ౧. ౯. ౧) ఈ సర్వప్రాణులును ఆకాశరూపమగు బ్రహ్మ నుండియె పుట్టుచున్నవి అందెలయించుచున్నవి. పరమాత్మయుపాదా నకారణము గానిచో పరమాత్మ నుండి పుట్టుటయు అందెలయించుటయుఁగుదుర దని భావము.

26. మూ. ఆత్మకృతేః పరిణామాత్.

ఆత్మకృతేః=తన్నుఁదానే చేసికొనుటవల్ల, పరిణామాత్ = ప్రపంచముగా మాఱుటవల్ల.

సూ. పరమాత్మ తన్నుఁదానే చేసికొనుటవల్లను, దానే ప్రపంచరూపముగా మారుటవల్లను పరమాత్మ యుపాదాన కారణము నిమిత్తకారణమునునగు.

వివ:- "తదాత్మానం స్వయ మకురుత" (తై. ౨. ౭) ఆ పరమాత్మ తన్నుఁదానేచేసికొనెను" అని శ్రుతి. సచ్చత్యచ్చా౽భవత్ నిరుక్తంచా౽నిరుక్తంచ" (తై. ౨. ౬) ఆ పరమాత్మ సద్రూపములగు భూమి, నీరు తేజస్సులుగను అసద్రూపములగు గాలి యాకాశములుగను నిర్వచింపఁదగిన యెఱుపు మొదలగు రూపములుగలదై, నిర్వచింప రాని ఆయారూపాదికమును గలదై యయ్యెను ఇత్యాది శ్రుతులనుబట్టి పరమాత్మయె సర్వకారణములయ్యెనని భావము.

27. మూ. యోనిశ్చ గీయతే.

యోనిశ్చ=కారణముగను, గీయతే=గానముచేయఁబడుచున్నది.

సూ. పరమాత్మ సర్వజగములకుఁ గారణముగఁ గూడ గానము చేయఁ బడుచున్నది.

వివః- "కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం" (ముండ. ౩ ౧. ౩) విద్వాంసులు కర్తయు ప్రభువు ప్రత్యగాత్మయనగు బ్రహ్మమును జగత్తులకుఁ గారణమని చెప్పుచున్నారు. "యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" (ముండ. ౧. ౧. ౬) ధీరులు దేనిని సర్వప్రాణులకుఁ గారణమని చెప్పుచున్నారో ఇత్యాదులందు బ్రహ్మము సర్వమునకుఁ గారణమని చెప్పఁబడినదని భావము.

౨౮. మూ. ఏతేన సర్వేవ్యాఖ్యాతాః వ్యాఖ్యాతాః

ఏతేన=దానిచే, సర్వే = అన్ని, వ్యాఖ్యాతాః = వ్యాఖ్యానింపఁబడినవి, వ్యాఖ్యాతేః=వ్యాఖ్యానింపఁబడినవి.).

సూ. జడమగుప్రధానము జగత్తులకుఁ గారణమను వాదము నిట్లు నిరాకరించుటచేత నింక మిగిలిన యణ్వాదికారణ వాదములన్నియు నిరాకరింపఁబడినట్లు తెలియఁదగినదె.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మ మీమాంసా దర్శన మందు మొదటి యధ్యాయమున
స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయమున
నాల్గవ పాదము.



# బ్రహ్మ మీమాంసా దర్శనము

రెండవ యధ్యాయమున మొదటి పాదము.

బ్రహ్మబోధకాఽస్పష్టశ్రుతి వాక్యసమన్వయము.

## ౧. స్మృత్యధికరణము

1. మూ స్మృత్యనవకాశ ప్రసంగ ఇతిచేన్నాన్యస్మృత్యనవకాశ దోష ప్రసంగాత్.

స్మృత్యనకాశ ప్రసంగః=సాంఖ్యస్మృతుల కవకాశము లేకపోవలసివచ్చును, ఇతిచేత్=అన్నచో, న=అట్లనరాదు, అన్యస్మృత్యనవకాశదోష ప్రసంగాత్= అపుడు వైదికస్మృతులు వ్యర్థములగునను దోషము ప్రసక్తమగుట వలన.

సూ. చైతన్యమగు బ్రహ్మమే జగత్తులకుఁ గారణమని యంగీకరించి జడమగు ప్రధానము కారణముగాదనినపుడు ప్రధానమె కారణమని తెలుపు సాంఖ్యస్మృతులు వ్యర్థమగునని ప్రధానమును గారణముగ నంగీకరించినచోఁ జైతన్యమె కారణమని చెప్పు స్మృతులన్నియు వ్యర్థము గావలసివచ్చును గాన సాంఖ్యస్మృతి వ్యర్థమగునను కారణముచేత మాత్రము ప్రధానమును గారణముగ నంగీకరింపవలెననరాదు.

వివ:- వేదమునందు సర్వజ్ఞుఁడుగఁ జెప్పఁబడిన కపిలుఁడు భగవదవతారము. సాంఖ్యస్మృతిని వ్రాసినకపిలుఁడు మఱియొకఁడు. వేదములం దుదాహరింపనివాఁడు గాన వేదవిరోధము లేదని తెలియునది.

2. మూ. ఇతరేషాంచానుపలబ్ధేః

ఇతరములగు మహదాదితత్త్వములు, అనుపలబ్ధేః = వేదలోకముల ఉపలబ్ధముగాకపోవుటవలన.

సూ. ప్రధానముతోపాటు సాంఖ్యస్మృతియందుఁ జెప్పఁబడిన మహదాది తత్త్వములు వేదమునఁగాని లోకమునఁగాని యుపలబ్ధముగాకపోవుటవలనను

సాంఖ్యస్మృతి వ్యర్థమగునను కారణముచేమాత్రము ప్రధానమును గారణముగ నంగీకరింపవలెననరాదు.

## ౨. యోగప్రత్యుక్త్యధికరణము

. మూ. ఏతేన యోగః ప్రత్యుక్తః

ఏతేన = ఇట్లు ప్రధానవాద నిరాకరణచే, యోగః = యోగస్మృతియు, ప్రత్యుక్తః=నిరాకరింపఁబడినది.

సూ. సాంఖ్యస్మృతిని నిరాకరించుటయే యోగస్మృతియు నిరాకరింపఁబడినట్లే తెలియవలయు.

వివ: - సంఖ్య=సమ్యగ్బుద్ధి. దానితోఁ బ్రవర్తించువారు సాంఖ్యులు. ప్రధానకారణతావాదము లు అ ప్రమాణమను విషయముననే గాని యమాద్యష్టాంగ సాధనముల విషయమున నావాక్యము ప్రవర్తింపదుగాన నవి ప్రమాణములేయని తెలియునది.

## ౩. నవిలక్షణత్వాధికరణము

4. మూ. న విలక్షణత్వాదస్య తథాత్వంచ శబ్దాత్.

అస్య=ఈజడజగత్తు, విలక్షణత్వాత్=చైతన్యముకంటె విలక్షణమగుటవల్ల, న=ఉపాదానకారణమనరాదు, తథాత్వంచ=అట్లువివిధవస్తువులుపుట్టుట, శబ్దాత్= వేదమువలన తెలియుచున్నది.

సూ. సజాతీయవస్తువులనుండి సజాతీయములె గాని విజాతీయములు పుట్టుట విరుద్ధమగుటచేఁ జైతన్యమగు బ్రహ్మమునుండి విజాతీయమగు జడ ప్రపంచముపుట్టుట విలక్షణముగాన బ్రహ్మము జగములకు ఉపాదానకారణమనరాదు. అట్లు బ్రహ్మమునుండి విలక్షణ ప్రపంచము పుట్టినట్లును వేదమువల్లఁ దెలియుచున్నది.

వివ:- "విజ్ఞానంచాఽవిజ్ఞానంచ" (తై. ౨. ౬) అ బ్రహ్మమునుండి విజ్ఞానము అవిజ్ఞానమును పుట్టెను అని వేదముచే విలక్షణ సృష్టి గలిగినట్లు తెలియుచున్నది. లోకమునఁగూడ మట్టి నుండి సజాతీయములగు కుండలు మొదలగునవేగాని విజాతీయములగు బంగారు వస్తువులు మొదలగునవి పుట్టుట చూడఁబడుటలేదు గాన బ్రహ్మము ప్రపంచమున కుపాదానకారణమని చెప్పరాదని తార్కికుల పూర్వపక్షమిది.

5. మూ. అభిమాని వ్యపదేశస్తు విశేషగతిభ్యాం.

విశేషగతిభ్యాం=విశేషములబట్టి అనుగమనమునుబట్టి, అభిమానివ్యపదేశః తు= అభిమానిదేవతా వ్యపదేశమైతే చేయఁబడినది.

సూ. (1) "భూమి పలికెను" (2) "నీళ్లు పలికెను" (3) "ఆ తేజస్సు సంకల్పించెను" ఇత్యాది శ్రుతులలో చేతనగుణ క్రియాదిరూపమైన పలుకుట మొదలగు విశేషగుణములుండుటవల్లను, (4) "అగ్ని వాక్కురూపుపొంది ముఖము చొచ్చెను" (5) "ఆ ప్రాణములు తండ్రియైన ప్రజాపతిని సమీపించి పలికెను" ఇత్యాదులలో "చొచ్చుట సమీపించుట" అని ముఖమునుగూర్చి ప్రజాపతినిగూర్చి యనుగమనము చెప్పుటవలనను, అందున్న భూమి, నీళ్లు, తెజస్సు, అగ్ని, ప్రాణములను భూమాద్యభిమానినులగు దేవతలుగా వ్యవహారమైతే చేయఁబడినది గాన మిగిలిన సమస్త జడప్రపంచమందు చేతనవ్యవహారము సంభవింపకపోవుటచే చేతనమగు బ్రహ్మము విజాతీయమగు జడ ప్రపంచమునకు ఉపాదాన కారణ మనరాదు.

వివ:- (1) "మృదబ్రవీత్" (2) "ఆపోఽబ్రువన్" (3) "తత్తేజ ఐక్షత్" (ఛా. ౬. ౨. ౩) (4) "అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" (ఐ. ఆ. ౨. ౪. ౨. ౪) (5) "తేహప్రాణాః ప్రజాపతిం పితరమేత్యోచుః" (ఛా. ౫. ౧. ౭) అని శ్రుతులు. ఇదియుఁ దార్కికుల పూర్వపక్ష సూత్రము.

6. మూ. దృశ్యతేతు.

దశ్యతేతు=కనిపించుచున్నదిగదా.

సూ. చేతనములుగఁ బ్రసిద్ధములైన పురుషులనుండి యచేతనములగు కేశ నఖాదులు సాలెపురుగునుండి దారములును పుట్టుటయు, అచేతనములుగాఁ బ్రసిద్ధములైన పేడ, చెమట మొదలగు వానినుండి త్రేళ్లు, పేలు మొదలగునవి చేతనములు పుట్టుటయు లోకమునఁ గన్పించుచున్నదే గాన చేతనమగు బ్రహ్మము నుండి యచేతనమగు ప్రపంచము పుట్టుట విరుద్ధముగాదు.

వివ:- ఇది సిద్ధాంతసూత్రము.

7. మూ. అసదితిచేన్న ప్రతిషేధ మాత్రత్వాత్.

అసత్=సృష్టి పూర్వములేనేలేదుగదా, ఇతిచేత్=అన్నచో, న=అట్లనరాదు, సృష్టికి ముందు మరొకటి లేనేలేదు అని ప్రతిషేధమాత్రత్వాత్=ప్రతిషేధించుట మాత్రమె యగుటవలన.

సూ. చేతనము శుద్ధమునగు బ్రహ్మమునుండి జడమునశుద్ధమునగు ప్రపంచము పుట్టెనని చెప్పినపుడు సత్తునుండి విరుద్ధమైన యసత్తు పుట్టును గాన అసత్తు అనఁగా ఏమియు లేకపోవుట కనుక సృష్టి కార్యమునకుఁ బూర్వము ఏమియు లేదని చెప్పినపుడు, గార్యరూపమైన సత్పదార్థము సృష్టికిఁ బూర్వము కారణరూపముగా నున్నదను వేదాంతమతమునకు విరుద్ధమగు నసత్తున్నదని చెప్పవలసివచ్చు నన్నచో లేకపోవుటయనుదానికి ఉన్నదానిని బ్రతిషేధించుట యందే తాత్పర్యము గాన సృష్టికిఁ బూర్వము ఏమియు లేనపుడు అసలు ప్రతిషే ధింపఁదగినదేలేదు కనుక ఈ ప్రతిషేధము ఊరక చెప్పుటకు మాత్రమే గాన విరోధము లేదు.

వివ:- ఎట్లు వర్తమానకాలమందున్న యీ సమస్త కార్యములును గారణ మగు బ్రహ్మరూపముగ నున్నవో యట్లే యుత్పత్తికిఁ బూర్వమందును గారణ రూపముగనే యున్నవి. ఈ కార్యము లన్నియుఁ గారణరూపముగఁ గాక స్వతంత్రముగ నుండనే యుండవని భావము. "సర్వంతం పరాదాద్యోఽన్యత్రా త్మనః సర్వంవేద" (బృ. ౨. ౪. ౬) ఎవ్వఁడు పైని జెప్పఁబడినదియుఁ జెప్పఁబడనిదియునగు సర్వము బ్రహ్మముకంటె వేఱుగ నున్నదని తెలిసికొనునో వానిని అది యంతయు శ్రేయోమార్గమునుండి తొలగించును అని శ్రుతి చెప్పుచున్నది.

౬. సూ. అపీతౌ తద్వత్ ప్రసంగా దసమంజసమ్.

అపీతౌ=ప్రళయమందునైక్యమగునపుడు, ప్రపంచమునందుగలదోషములు ప్రసంగించుటవలన బ్రహ్మకారణమగుట, అసమంజసమె=తగదు.

సూ స్థూలత్వము అచేతనత్వము, సావయతత్వము మొదలగు గుణములు గల ప్రపంచము చేతనము శుద్ధము నిర్గుణమునగు బ్రహ్మమునందుఁ బ్రళయ కాలమున నైక్యమయినపుడు స్థూలత్వాది దోషములుగల ప్రపంచముయొక్క సంపర్కదోషమువల్ల బ్రహ్మముగూడ దుష్టముగా వలసివచ్చుటయు, ముక్తులు బద్ధులు వేఱువేఱునామరూప గుణాదిభేదములునగు ప్రపంచము బ్రహ్మములో లీనమైనపుడు భేదములేకయుండుటచే జన్మమోక్షాదులు సంకరమై నియమము లేక యొకరి ఫలము లొకరికి సంభవించుటయు ఒకటే రకముగఁ బుట్టుటయు బ్రహ్మములో వేటికవి విభిన్నములై యున్నవన్నచోఁ బ్రళయమే లేదని చెప్పవలసి

వచ్చుటయు గలుగును గాన బ్రహ్మము జగమునకుఁ గారణమని చెప్పుట సమంజముగాదు.

వివ:- ఇది పూర్వపక్షము.

౯. మూ. నతు దృష్టాంతభావాత్ = దృష్టాంతములుండుటవల్ల, నతు= అట్లు కారణముగాదనరాదు.

సూ. భూమి మొదలగు భూతములవల్లఁ గలిగిన పాత్రలందును ప్రాణులందును గల దోషములు తమకు కారణములైన భూమి మొదలగు వానికి నంటునట్లును స్వప్నము చూచినవానికి స్వప్నగతదోషములంటునట్లును, ప్రాణులందలి యజ్ఞానము జ్ఞానము మొదలగునవి నిద్రాసమాధ్యాదిదశలందు వానిలో లీనమై మరలఁ బ్రబోధసమయమందు అజ్ఞానము జ్ఞానము స్ఫురించినట్లును, లోకమున దృష్టాంతములు కనిపించుటవల్లను వేదాంతమతమున బ్రహ్మముకంటె వేఱుగా జగము ఉండదు గాన పై దోషములు ప్రవర్తింపవుఅందుచే బ్రహ్మము జగమునకుఁ గారణమనుట సమంజసమే.

వివ:- "సర్వంఖల్విదంబ్రహ్మ" ఇది యంతయు బ్రహ్మమే ఇత్యాది శ్రుతులంధు కార్యజగత్తు కారణమగు బ్రహ్మమే అని చెప్పఁబడెను.

10. మూ. స్వపక్షదోషాచ్చ.

స్వపక్షదోషాచ్చ = ప్రధానము జగత్తునకుఁ గారణమను స్వపక్షమందు దోషము ఉండుటవలనను.

సూ. బ్రహ్మము జగమునకుఁ గారణమని చెప్పినవుడే యే దోషములు చెప్పఁబడెనో యవి యన్నియును శబ్దాదులుగల జగత్తునకు శబ్దాది హీనమగు విజాతీయమగు ప్రధానము కారణమని చెప్పినప్పుడును సంభవించుచున్నవి. పైని చెప్పిన రీతిని వేదాంతమతమున దోషము లేకపోఁగా సాంఖ్యమతమందే యా దోషములున్నవి గాని బ్రహ్మము జగత్తునకు కారణమనుటలో అసమంజసమేమియు లేదు.

11. మూ. తర్కాప్రతిష్ఠానాదప్యన్యథాఽమేయమితిచే దేవమ ప్యనిర్మోక్షప్రసంగః

తర్కాప్రతిష్ఠానాత్ అపి = తర్కమునకు వాదినిబట్టి నిలుకడ లేకపోవుట వల్లను, అన్యథా=దోషమురానట్లు, అనుమేయం=అనుమానింపఁదగినది, ఇతిచేత్=

ఇట్లన్నను, ఏవమపి=అట్లు తర్కముచే ననుమానించినను, అనిర్మోక్షప్రసంగః= దోషమునుండి తప్పించుకొనుటకు వీలులేక పోవలసివచ్చును.

సూ. వాదిప్రాబల్యమునుబట్టి తర్కమునకు స్థిరమైన నిలుకడ లేకుండి నప్పటికిని నిలుకడలేకపోవుట అను దోషము తగులకుండునట్లు ప్రధానము విషయమున అనుమానప్రమాణముచే నూహింపఁదగునుగదా యన్నచో నిట్లు ఊహించినను నిలుకడలేని స్థితిప్రసక్తము గాకమానదు.

వివః- కనుక తర్కముమీద ఆధారపడి సాంఖ్యశాస్త్రోక్త హేతువునుబట్టి ప్రధానము జగత్తునకుఁ గారణమని చెప్పరాదని భావము. సాంఖ్యమతసిద్ధాంతము నకు గౌతమకణాదపతంజలిజైమిన్యాదుల మతము విరుద్ధముగ నున్నది. కపిల గౌతమాదులు సర్వజ్ఞులేయయ్యు వారిమతము పరస్పర విరుద్ధములై యుండుటఁ బట్టి తర్కము నిలుకడలేనిదని తోచుచున్నదిగదా. కాన శ్రుతిప్రమాణమునుబట్టి బ్రహ్మము జగత్తునకుఁ గారణమని చెప్పితీరవలయునని భావము.

## ౪. శిష్టాపరిగ్రహాధికరణము

12. సూ. ఏతేన శిష్టాపరిగ్రహా అపివ్యాఖ్యాతాః

ఏతేన=ఈప్రధానవాదనిరాకరణచే, శిష్టాపరిగ్రహాఅపి=శిష్టులగుమన్వాదు లచే గ్రహింపఁబడవియు, వ్యాఖ్యాతాః=నిరాకరింపఁబడినట్టు వ్యాఖ్యాతములు.

సూ. బలవత్తమమైన ప్రధానవాద నిరాకరణమువల్ల శిష్టులగు మనువు మొదలగు వారిచే గ్రహింపఁబడని "యణువు మొదలైనవి ప్రపంచమునకుఁ గారణము" మొదలైనవాదములుగూడ నిరాకరింపఁబడినవని తెలియఁదగు.

## ౫. భోక్త్రాపత్త్యధికరణము

13. సూ. భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్.

భోక్త్రాపత్తేః = అంతయు భోక్తయైన బ్రహ్మమేయగుటవలన, అవిభాగః చేత్స్యాత్=భోజ్యభోక్తలవిభాగము లేకపోవలసివచ్చునన్నచో, లోకవత్=సము ద్రము నురుగువలె లోకవ్యవహారము గ్రహింపవలయును.

సూ. బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదానకారణమని చెప్పఁగా అంతయు భోక్తయైన బ్రహ్మమే కావలసివచ్చుటవలన జీవుఁడు భుజించువాఁడును విషయా దులు భుజింపఁదగినవి యను విభాగము లేకపోవలసివచ్చునన్నచో లోకమందు

నురుగు, కెరటములు బుడగలు సముద్రరూపముకంటె నితరము గాకపోయినను సముద్రమనియు నురుగు కెరటములు, బుడగలనియు వేఱువేఱుగ వ్యవహరింపఁబడునట్లు అంతయు బ్రహ్మమైనను జీవుని భోక్తగను విషయాదులను భోగ్యముగను వ్యవహరింపవచ్చును గాన దోషము లేదు.

వివ:- మురికిగానున్న యద్దమందుఁ బ్రతిఫలించిన ముఖము మురికిగాఁగనిపించును గాని ముఖము మురికిదిగాదు. అట్లే దోషయుక్తమగు శరీరమందుఁ బ్రతిఫలించిన పరమేశ్వరుఁడు శరీరము నందున్న దోషములనుబట్టి దోషయుక్తుఁడుగఁ దోఁచుచున్నాఁడు. అప్పుడే వానికి బద్ధుఁ డనువ్యవహారము గలిగినది. కాని స్వతస్సిద్ధముగాఁ బరమేశ్వరుఁడు ముక్తుఁడేయని భావము.

14. మూ. తదనన్యత్వ మారంభరణ శబ్దాదిభ్యః

ఆరంభణశబ్దాదిభ్యః=ఆధారము మొదలగు శబ్దాదులనుబట్టి, తదన్యత్వం=బ్రహ్మభిన్నముగాదు.

సూ. "వాక్కుల కాధారమైన పేరులకు మాత్రమె భేదము గాని వస్తువులకు భేదములేదు అన్నిటిలోను మట్టి మాత్రమే సత్యముగా నున్నది" ఇత్యాది శ్రుతులలో ఆధారము మొదలగు శబ్దములఁబట్టి ప్రపంచము బ్రహ్మముకంటె భిన్నమైనదిగాదు

వివ:- (చూడుము మూలశ్రుతి చూ. ౧ అ. ४. పా. ౨౩ సూత్రము క్రింది వివరణము) కలలోఁదోఁచిన వస్తువులన్నియు మెలుకువగలిగినపుడు అసత్యములైనట్లే భోక్తృభోగ్యాదిభేద వ్యవహారము కల్పించుకొన్నదే గాని వాస్తవికము గాదు గాన సర్వము బ్రహ్మమే గాని వేఱేమియులేదని భావము. "తత్త్వమసి" (ఛాం. ౬. ౮. ౭) ఆ బ్రహ్మము నీవై యున్నావు "బ్రహ్మైవేదం సర్వం" (ముం. ౨. ౨. ౧౧) ఇది యంతయు బ్రహ్మమే 'నేహనానాస్తి కించన' (బృ. ४. ४. ౧౯) ఇందు భిన్నత్వము లేదు. 'మృత్యోః స్సమృత్యుమాప్నోతి యఇహనానేవ పశ్యతి' (బృ. ४. ४. ౧౯) ఎవఁడు ఇందు భిన్నత్వమును జూచునో వాడు మృత్యువునుండి మృత్యువును పొందును ఇత్యాది శ్రుతులన్నియు బ్రహ్మముకంటె వేఱేమియులేదని తెలుపుచున్నవి.

15. మూ. భావేచోపలబ్ధేః

భావేచ=కారణములున్నపుడే, ఉపలబ్ధేః=కార్యములు కనిపించుటవల్ల,

సూ. మట్టి, దారములు మొదలగు కారణములున్నపుడే కుండ, బట్ట మొదలగు కార్యములు గనిపించుటవల్లఁ గారణమగు బ్రహ్మముకంటెఁ బ్రపంచము వేఱుగాదు

## ఇ. అర్థాంతరమున సూత్రము

మట్టికంటె వేఱుగఁ గుండయును దారములకంటె వేఱుగ బట్టయుఁ గనిపింపక మట్టియందె కుండ దారములందే బట్టయుఁ బ్రత్యక్షమగుటవల్లఁ గార్య కారణములకు భేదములేదు.

16. మూ. సత్త్వాచ్చావరణస్య.

అపరణస్య=కార్యము, సత్త్వాత్ చ=కారణముగా నుండుటవలనను.

సూ. "ఓ సౌమ్యుఁడా! ఈ జగమంతయు సృష్టికిఁ బూర్వము సత్ప దార్థముగనే యుండెను" (ఛా. ఉ. ౨. ౧) ఇత్యాది శ్రుతులలో సృష్టికి ముందు కార్యము కారణరూపముగా నున్నట్లు తెలియుటవలనను బ్రపంచకార్యము కారణ రూపముగా నున్నట్లు తెలియుటవలనను బ్రపంచకార్యము కారణమగు బ్రహ్మము కంటె వేఱైనదిగాదు.

17. మూ. అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాంతరేణవాక్య శేషాత్.

అసద్వ్యపదేశాత్=సృష్టికిముందు అసత్తుగనున్నదని, వ్యపదేశించుటవలన, నఇతిచేత్=కార్యములేదన్నచో, ధర్మాంతరేణ = ఇతరధర్మముతోనున్నట్లు వాక్య శేషమునుయిట్టి, న=అట్లనరాదు.

సూ. "ఈ ప్రపంచము సృష్టికిఁ బూర్వము అసత్తుగనే యుండెను" ఇత్యాది శ్రుతులందు సృష్టికి ముందు ఈ ప్రపంచమును అసత్తుగానే వ్యపదేశింపఁ బడుటవలన సృష్టికి ముందు కార్యమన్నది లేదుగదా యన్నచో "ఆయసద్రూప ముగానున్న ప్రపంచము సద్రూపముగ నుండెను" అని తరువాతివాక్యశేషమును బట్టి సృష్టికిఁ బిదప వ్యాకృత నామరూపములుగల ప్రపంచము సృష్టికి ముందు వ్యాకృతనామరూపములు లేక యుండెనని సృష్టికిఁ బిదపటి ధర్మము కంటె నితర ధర్మములతో సృష్టికి ముందున్నదని చెప్పుటకే యట్లు వ్యపదేశింపఁబడినది గాన దోషములేదు.

వివః- "అసదే వేదమగ్రఆసీత్" (ఛాం ౩. ౧౯. ౧) అని శ్రుతి. "తత్సదాసీత్" అని వాక్యశేషమందున్న శ్రుతి.

18. మూ. యుక్తేశ్శబ్దాంతరాచ్చ.

యుక్తేః=యుక్తినిబట్టి. శబ్దాంతరాత్‌చ = సత్తుగనేయుండెనని శబ్దాంతరమునుబట్టియు.

సూ. పెరుగునకుఁ బాలును, కంకణములకు బంగారము, కుండకు మట్టియు నియతకారణములై, పాలనుండి కంకణములుగాని కుండగాని, బంగారమునుండి పాలుగాని కుండగాని, మట్టినుండి కంకణముగాని పాలుగాని కాక, పాలకంటె వేఱుగ పెఱుగును, బంగారముకంటె వేఱుగ కంకణములును, మట్టి కంటె వేఱుగ కుండయునుండక కారణములగు పాలు బంగారము మట్టి మొదలగువాని రూపముగా పెఱుగు మొదలగునవియున్నట్లు బ్రహ్మము కార్యమగు ప్రపంచమునకు నియతకారణమై ప్రపంచముకంటె వేఱుగాక యొకటిగానున్న యుక్తినిబట్టియు, (1) "అసత్తు నుండి సత్తు ఎట్లు పుట్టును" అని యాక్షేపించి "ఓ సౌమ్యుఁడా! ఈ ప్రపంచమంతయు సృష్టికిఁ బూర్వము సద్రూపముగనే యుండెను" అనినిర్ధారణచేయు "సద్రూపముగనే" అను శబ్దాంతరమునుబట్టియుఁ గార్యమగు ప్రపంచము కారణమగు బ్రహ్మముకంటె వేఱైనదిగాదు.

వివ:- (1) "కథమసతః సజ్జాయేత్" అని యాక్షేపశ్రుతి" సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" (ఛా ౬. ౨. ౧) అన్నది నిర్ధారణ చేయు శ్రుతి.

సూ. మడతపెట్టఁబడిన బట్ట విప్పఁబడిన బట్ట కంటె మఱియొకటిగాపట్లు, దారములగు కారణరూపముగనుండి నాడిమగ్గము సాలెవాడు మొదలగువాని కార్యములవల్ల వ్యక్తమైన బట్ట దారముకంటె వేఱుగానట్లు బ్రహ్మముకంటెఁ బ్రపంచము వేఱు గాదు.

వివ:- మడతపెట్టఁబడిన బట్ట మడతలో సూక్ష్మరూపముగనున్నట్లు ప్రళయమున ప్రపంచము సూక్ష్మముగ నున్నదని భావము.

20. మూ. యథాచప్రాణాది.

యథాచప్రాణాది=ప్రాణోపానాదులవలెనే.

సూ, వాయువొక్కటె యా యాస్థానములందుండి ప్రాణము, అపానము, ఉదానము, వ్యానము, సంవ్యానము అను భేదములను పొంది యాయా కార్యములు చేయుచుఁ, బ్రాణాయామముచే నిరోధింపఁబడి ప్రాణరూపమై జీవన కార్యమును

జేయుచుఁ దన కార్యములగు ప్రాణాదులకంటె వేఱు గానట్లే బ్రహ్మమును ప్రపంచముకంటె వేఱుగాదు.

వివ:- నవద్వారములందు సంచరించు వాయువు యోగుల ప్రాణాయామావస్థయందు సూక్ష్మముగా నున్నట్లు ప్రళయమున సూక్ష్మముగ బ్రహ్మమందున్నదని భావము.

## ౬. హితాకరణాదిదోషప్రసక్త్యధికరణము

21. మూ ఇతర వ్యపదేశా ద్ధితాకరణాదిదోషప్రసక్తిః

ఇతరవ్యపదేశాత్=బ్రహ్మమునకు జీవత్వవ్యపదేశమువల్ల, హితాకరణాది దోషప్రసక్తిః = హితముచేయకపోవుట మొదలగు దోషములు ప్రసక్తించును.

సూ. జీవునకు బ్రహ్మత్వమును, బ్రహ్మమునకు జీవాత్మత్వమును శ్రుతిలో వ్యవదేశింపఁబడుటవలన జీవాత్మత్వరూపమునుబట్టి హితము చేయకపోవుట, జన్మము, మృత్యువు, రోగము, ముసలితనము మొదలగు దోషములు ప్రసక్తము గావలసివచ్చును.

వివ:- ఇది పూర్వపక్షసూత్రము "సఆత్మాతత్త్వమసిశ్వేతకేతో" (ఛాం. ౬. ౮. ౭) ఓ శ్వేతకేతూ! ఆ ఆత్మయె బ్రహ్మమె నీవై యున్నావు "తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్" ఆ ప్రపంచమును సృజించి బ్రహ్మము ఆ ప పంచమునే ప్రవేశించెను ఇత్యాదులలో జీవాత్మత్వ బ్రహ్మత్వములు వ్యపదేశింపఁబడినవి.

22. మూ. అధికంతు భేదనిర్దేశాత్.

భేదనిర్దేశాత్ = జీవాత్మకంటె పరమాత్మకుభేదము, అధికంతు = పరమాత్మకు అధికగుణములున్నవిగదా.

సూ. "ఆ నిర్దోషమగు నాత్మయె యన్వేషింపఁదగినది యదియె తెలిసికొనఁదగినది" ఇత్యాది శ్రుతులందు జీవాత్మకంటెఁ బరమాత్మను వేఱుగ నిర్దేశించుటవల్ల జీవాత్మకంటెఁ బరమాత్మకు నిత్యశుద్ధత్వము, బుద్ధత్వము ముక్తత్వము జగత్స్రష్టృత్వము మొదలగు గుణములు అధికములుగ నుండుటవలన హితము చేయకపోవుట మొదలగు దోషములు ప్రసక్తములుగావు.

వివ:- (1) సోఽన్వేష్టవ్యః సవిజిజ్ఞాసితవ్యః (ఛాం. ౮. ౭. ౧) ఇత్యాది శ్రుతులు. జీవాత్మ పరమాత్మయి వాస్తవమునకు భిన్నులు గాకపోయినను ఘటాకాశ మహాకాశాది వ్యవహారముపలె భిన్నులు నభిన్నులని భావము.

23. అశ్మాదివచ్చ తదనుపపత్తిః

అశ్మాదివత్ చ=రాళ్లు మొదలైనవివలెను, తదనుపపత్తిః=ఆ దోషములు ఉపపన్నములుగావు.

సూ. మట్టి, రాళ్లు, గాజుపెంకులు, సూర్యకాంతములు, వజ్రవైడూర్యములు మొదలగునవి యన్నియు భూమి రూపములైనను విచిత్రముగ నున్నట్లే బ్రహ్మమునకు జీవాత్మ పరమాత్మ భేదమును వాని కార్యములందు వైచిత్ర్యమును గనిపించుచున్నది గానఁ బైని జెప్పఁబడిన దోషములు ఉపపన్నములుగావు.

వివ:- ఒక మట్టిని ఆశ్రయించిన బీజములు అనేకములగు ఆకులు పువ్వులు పండ్లు కలిగినట్లును అన్నరసమొకటైనను ఆ యన్నరసమువలన రక్తము, మాంసము, ఎముకలు, గోళ్లు, వెంట్రుకలును విచిత్రముగఁ గలిగినట్లు బ్రహ్మము ఒకటైనను గార్యవైచిత్ర్యము గలుగునని భావము.

## ౮. ఉపసంహారదర్శనాధికరణము

24. మూ. ఉపసంహార దర్శనా న్నేతిచేన్న క్షీరవద్ధి.

ఉపసంహారదర్శనాత్=బ్రహ్మకు సాధన సామగ్నులు లేకపోవుట గనిపించుటవల్ల, న ఇతిచేత్=కారణము గాదన్నచో, న=అట్లనరాదు, క్షీరవత్ హి=పాల వలె నగునుగదా.

సూ. లోకమునఁ గుమ్మరి మొదలగువారికి సారె మొదలగు సాధన సామగ్రులు గనిపించుటవల్ల నచట కుండ మొదలగు కార్యములు గనిపించుచున్నవి యిందు బ్రహ్మమునకు సాధన సామగ్రులు లేవు గనుక నిందు బ్రహ్మము జగమునకుఁ గారణమనుట యుపపన్నము గాదిన్నచోఁ బాలుస్వభావసిద్ధముగఁ బెఱుగుగ నైనట్లు బ్రహ్మము జగద్రూపముగ నగుటలోఁ గారణము ఉపపన్నమగుచున్నది గాన దోషము లేదు.

వివ:- పాలు స్వభావముగనే పెరుగుగ నగుచున్నది గాని వేడిచేయుటకు. గాచుటవల్ల మజ్జిగ కలుపుటవల్ల ఆ పాలు పెరుగుగఁ ద్వరగనగునని తెలియునది

పెరుగుగనగు స్వభావము పాలలో లేనిచోఁ గేవలము కాచుట మొదలగువానివల్లఁ బెరుగుగఁ గానేకాదు. కేవలము వేడిచేయుటచే గాలి గాని మఱియొకటిగాని పెరుగు గాదుగదా. కాచుటవల్ల మజ్జిగ కలుపుటవల్ల పెరుగునకు సంపూర్ణత్వము సిద్ధించును. బ్రహ్మము పరిపూర్ణమే గాన దానికి మఱొకదానివల్ల సంపూర్ణత్వము గలిగింపనవసరములేదు. "నతస్యకార్యంకరణంచ విద్యతే, నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే, పరాస్య శక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" (శ్వే. ౬ ౮) అతనికిఁ గార్యముగాని ముఖ్యసాధనముగానిలేదు అతనితో సముఁడుగాని అధికుఁడుగాని కనిపింపఁడు. అతని శక్తి గొప్పదై యనేక విధములని వినఁబడుచున్నది. అతనికి జ్ఞానబలక్రియలు స్వభావసిద్ధమైనవి అనియు శ్రుతి.

25. మూ. దేవాదివదపి లోకే

లోకే=లోకమున, దేవాదివత్ అపి=దేవాదులవలెను.

సూ. లోకమందు దేవతలు మహర్షులు మొదలగువారు బాహ్యసాధనములు లేకయె అనేక శరీరములను రథ ప్రాసాదాది వస్తువులను నిర్మించునట్లు సర్వశక్తులు గల బ్రహ్మము బాహ్యసాధనములు లేకయె జగత్తులను సృజింపఁ గలదు గాన బ్రహ్మము జగత్తులకుఁ గారణమనుటలో అసమంజసమేమియులేదు.

## ౯, కృత్స్నప్రసక్త్యధికరణము

26. మూ. కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దప్రకోపోవా.

సూ. కృత్స్నప్రసక్తిః = బ్రహ్మమంతయు ప్రపంచముగావలసివచ్చును. నిరవయవత్వశబ్దప్రకోపఃవా = అవయవయములు కానిదని చెప్పు శ్రుతులు ప్రకోపించుటగూడనగును.

సూ. బ్రహ్మము అవయవములు లేనిదని చెప్పినచో సర్వబ్రహ్మము ప్రపంచరూపముగాఁ బరిణమించును గాన నింకఁ బ్రపంచముకంటె వేఱుగ బ్రహ్మ లేకపోవలసివచ్చును. మఱి యింక అవయవములు గలదని చెప్పినచో బ్రహ్మము అవయవములు లేనిదని తెలుపు "బ్రహ్మము కళలు లేనిది క్రియలు లేనిది శాంతమైనది నిరవద్యమైనది నిరంజనమైనది" ఇత్యాది శ్రుతులన్నియు విరోధించును.

వివ:- "ఇది పూర్వపక్షసూత్రము, నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" (శ్వే ఉ. ౧౯) ఇత్యాది శ్రుతులు విరోధించుననని భావము.

28. మూ. శ్రుతేస్తు శబ్దమూలత్వాత్.

శ్రుతేఃతు=శ్రుతి అయితే శబ్దమూలత్వాత్=వేదమే ప్రమాణమగుటవలన.

సూ. ఇంద్రియములకు గోచరముకాని విషయముల యాథార్థ్యమును దెలుపు శ్రుతికి నిలుకడలేని తర్కము ప్రమాణము గాక వేదమే ప్రమాణముగా నుండుటవల్ల ఆ శబ్దప్రమాణమగు (1) "ఈ జీవాత్మతోఁ గూడఁ బ్రవేశించి నామరూపములను వివరింతును" (2) "ఇతని ప్రపంచ మహిమ యంతటివి ఈ ప్రపంచముకంటెఁ బురుషుఁడు గొప్పవాఁడు సర్వభూతము లితని నాల్గవ భాగము, ఇతని మూఁడు పాదములుగల యమృతము సూర్యమండలమందున్నది" (3) ఇతఁడు కంటిచేఁగాని వాక్కులచేఁ గాని గ్రహింపఁబడఁడు" ఇత్యాది శ్రుతులనుబట్టి పరమాత్మ ప్రపంచరూపముగానేగాక వేఱుగాఁగూడ నుండినట్లు తెలియుచున్నదిగాన పరమాత్మ యవయవములు లేనివాఁడని చెప్పుటచే దోషము లేదు. మఱి యింక నిరవయవుఁడనినప్పుడు నిరవయత్వమును జెప్పు శ్రుతులును విరోధింపవు.

వివ:- ఇది సిద్ధాంతసూత్రము, (1) "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛాం. 6. 3 2) "తావానస్యమహిమా తతో జ్యాయాంశ్చ పురుషః పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యాఽమృతం దివి" (ఛాం ౩. ౧౨ ౬) (3) న చక్షుషా గృహ్యతే నాపివాచా" ఇత్యాదులు శ్రుతులు.

28. మూ. ఆత్మని చైవం విచిత్రాశ్చహి,

ఏవం=ఇట్లు ఆత్మని చ ఆత్మయందు, విచిత్రాఃచహి=విచిత్రములునుగదా.

సూ. తామున్నవారున్నట్లుండఁగనే జనులు వేఱుగఁ గలయందు రథాశ్వ రత్నసౌధాదులను విచిత్రములుగ సృజించునట్లును; దేవాసురులు దమకంటె వేఱుగఁ దమ స్వరూపము పోకుండనె యేనుఁగులు గుఱ్ఱములు మొదలగు విచిత్రములు సృజించినట్లును గనిపించుచుండుటవల్ల బ్రహ్మము దనరూపము పోవకుండనె విచిత్ర సృష్టులను చేయుట యసమంజసముగాదు.

29. మూ స్వపక్షదోషాచ్చ.

స్వపక్షదోషాత్చ=స్వపక్షమున దోషమువలనను.

సూ. ప్రధానము జగమునకుఁ గారణమన్న స్వపక్షమందును ఈ దోషములు సమానముగాన బ్రహ్మము జగమునకుఁ గారణమను మాపక్షమున నీ దోషములు చెప్పఁదగినవిగావు.

## ౧౦. సర్వోపేతాధికరణము

30. మూ. సర్వోపేతాచ తద్దర్శనాత్.

తద్దర్శనాత్=అట్లు గనిపించుటవలన, సర్వోపేతా=బ్రహ్మము సర్వశక్తులు గలిగినది.

సూ. పరమాత్మ సర్వశక్తులు గలవాఁడని శ్రుతులందుఁ గనిపించుటవలనను బ్రహ్మము అట్టిదే.

వివ:- "సర్వకర్మా సర్వకామః" (ఛాం. ౩. ౧౪ ౪) సర్వమును రచించినవాఁడు ఆప్త కాముఁడు "యస్సర్వజ్ఞః సర్వవిత్" (ముం. ౧ ౧. ౯). అన్నివిధముల అన్ని దెలిసినవాఁడు "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌతిష్ఠతః" (బృ. ౩. ౮ ౯) ఓ గార్గీ యితని శాసనమందే సూర్యచంద్రులు ధరింపఁబడియున్నారు. ఇత్యాది శ్రుతులు పరమేశ్వరునికి సర్వశక్తులు బోధించుచున్నవని భావము

31. మూ. వికరణత్వాన్నేతిచేత్తదుక్తం

వికరణత్వాత్=ఇంద్రియములు లేకపోవుటవలన, నఇతిచేత్=అట్లుగాదన్నచో తత్=అది, ఉక్తం=వెనుకచెప్పబడినది.

సూ బ్రహ్మము దేహేంద్రియాదులు లేనిదిగదా యెట్లు జగత్తులను సృజింపఁగలదన్నచో నీ సంగతి యిదివరకె చెప్పఁబడినది.

వివ:- (చూ. నవిలక్షణత్వాధికరణము)

## ౧౧. న ప్రయోజనవత్త్వాధికరణము

32. మూ. న ప్రయోజనవత్త్వాత్.

న ప్రయోజనవత్త్వాత్=ఇతనికెట్టి ప్రయోజనములు లేకపోవుటవలన.

సూ. సర్వ ప్రవృత్తులును ప్రయోజనాపేక్ష గలిగియుండుటవలన నితని ప్రయోజనములేదు గానఁ పరమాత్మ ప్రపంచమునకుఁ గారణముగాదు.

వివ:- ఇది పూర్వపక్ష సూత్రము.

33. మూ. లోకవత్తు లీలాకైవల్యం.

లోకవత్=లోకమందువలె, లీలాకైవల్యం=కేవలము బ్రహ్మకులీలయె.

సూ. లోకమున సర్వకామములు దీరిన రాజు అమాత్యులును కేవలము గాఱకు విహరించుచున్నట్లే పరమాత్మయుఁ గేవలము లీలకొఱకే జగత్సృ కిఁ బ్రవర్తించుచున్నాఁడు గాన దోషము లేదు.

వివ:- ఇది సిద్ధాంత సూత్రము.

## ౧౨. వైషమ్యనైర్ఘృణ్యాధికరణము

34. మూ. వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహిదర్శయతి.

సాపేక్షత్వాత్=ధర్మాధర్మాపేక్షగలవాఁడగుటవలన, వైషమ్యనైర్ఘృణ్యే= మత్వ నిర్దయత్వములు, న=లేవు, తథాహి = అట్లే, దర్శయతి = శ్రుతి ంచుచున్నది.

సూ. పరమాత్మ ప్రాణులు చేయు ధర్మాధర్మముల నపేక్షించినవాఁ టవలన వారిధర్మాధర్మములఁబట్టి గొందఱకు సుఖమును గొందఱకు దుఃఖ ు గొందఱకు పశ్వాది నీచ జన్మలు కొందఱకు మనుష్యాది శ్రేష్ఠజన్మలును ుచున్నవి గాని పరమాత్మ విషమచిత్తము గలవాఁడని గాని నిర్దయుఁడని రాదు. అట్లే శ్రుతియుఁ జూపుచున్నది.

వివ:- "ఏషహ్యేవ సాధుకర్మకారయతి తంయమేభ్యోలోకేభ్య ఉన్ని ి ఏషఉ ఏవాఽసాధుకర్మ కారయతి తం యమధో నినీషతే" (కౌ. బ్రా. ) ఈ యీశ్వరుఁడే ఎవనిని పైలోకములను బొందింపఁగోరుచున్నాఁడో చే మంచి కర్మలను జేయించుచున్నాఁడు. ఎవనిని క్రిందిలోకములను ింపఁ గోరుచున్నాఁడో వానిచే చెడ్డకర్మలను జేయించుచున్నాఁడు. "పుణ్యో ణ్యేనకర్మణా భవతిపాపః పాపేన" (బృ. ३. ౨. ౧३) పుణ్యకర్మచేఁ ్యఁడుగను బాపకర్మచేఁ బాపాత్ముఁడుగను అగుచున్నాఁడు. ఇత్యాది ులనుబట్టియు "యేయథామాం ప్రపద్యంతే తాంస్తథైవభజామ్యహం"

(గీత. ౪. ౧౧) ఎవరు ఎట్లు నన్నుఁ బొందుదురో వారి నట్లే నేను బొందుదును. ఇత్యాది స్మృతులనుబట్టియు పరమాత్మ జనుల ధర్మాధర్మముల నపేక్షించు చున్నాఁడని భావము. పరమాత్మ మేఘమువలెఁ బ్రవర్తించును. బీజాదుల దోష గుణములఁబట్టి సస్యాదులకు దోషగుణములు గలుగునని గాని మేఘమువలనఁ గాదుగదా.

౩౫. మూ. న కర్మాఽవిభాగాదితి చేన్నానాదిత్వాత్.

కర్మాఽవిభాగాత్=సృష్టికి పూర్వము కర్మవిభాగము లేకపోవుటవలన, న=అట్లనరాదు. ఇతిచేత్=అన్నచో, అనాదిత్వాత్=సృష్టి అనాదియగుటవలన

సూ. సృష్టికిఁ బూర్వము కర్మవిభాగము లేకపోవుటవలన సృష్టియంతయు నొకటేవిధముగా నున్నది గాన బ్రహ్మము ప్రాణుల ధర్మాధర్మముల నపేక్షించి సృజించుట వీలుపడదన్నచోఁ బ్రాణి సంసారమంతయు అనాదియగుటవలన అనాదిగా నుండు ప్రాణుల ధర్మాధర్మముల నపేక్షించి సృజించుచుండుటవలన దోషము లేదు.

వివ:- గింజ ముందా మొక్క ముందా అనుదానివలె సంసారము అనాది గింజ లేనిచో మొక్క లేదు మొక్క లేనిచో గింజ లేదు ఇట్లే ప్రపంచము అనాది యని తెలియునది.

౩౬. మూ. ఉపపద్యతేచాప్యుపలభ్యతేచ

ఉపపద్యతేచ=ఉపపన్నమగుచున్నది, అపి=మఱియు, ఉపలభ్యతేచ= శ్రుతిలో నుపలబ్ధమగుచున్నది గూడ.

సూ. ప్రపంచము అనాదియనుట యుక్తియుక్తమును శ్రుతిప్రమాణము సిద్ధము నగుచున్నది.

వివ:- ప్రపంచమునకు ఆది కలదన్నచో ముక్తులకు పునర్జన్మమును, సృష్టివైషమ్యమము నిర్హేతుకమగుటయు సంభవించును. మఱియుఁ జేయని కర్మలకు ఫలము, చేసిన కర్మలకు ఫలము లేకపోవుటయుఁ గలుగును. అవిద్యయు నొక్కవిధమైనదే గాన నందఱకు ఒక విధమైన ఫలమునే కల్పించును. అవిద్యయు ప్రాణుల రాగద్వేషావాసనలఁబట్టి విషమఫలములను గల్పించునుగాని స్వయముగఁ గల్పింపదు. పుణ్యపాపకర్మ లేనిచో శరీరమును శరీరములేనిచో పుణ్యపాపకర్మలును సంభవింపవు. ఇట్లు అన్యోన్యాశ్రయదోషము కలుగును.

౹ ప్రపంచము అనాదియని చెప్పవలయును. "అనేన జీవేనాత్మ నానుప్రవిశ్య
రూపేవ్యాకరవాణి" ఈ జీవాత్మ రూపముగాఁ బ్రవేశించి నామరూపములను
రింతును. "సూర్యాచంద్రమసౌధాతా యథాపూర్వమకల్పయత్" బ్రహ్మ
ర్యచంద్రుల ఇదివఱకువలెఁ గల్పించెను. ఇత్యాది శ్రుతులను బట్టియు "న
పమస్యేహతథోపలభ్యతే నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా" ఈ ప్రపంచము
క్క రూపమెవ్వనిచేతను ఇందు తెలిసికొనఁబడదు. దీనికి అంతుగాని ఆది
మధ్యముగాని తెలియరానిది. ఇత్యాది స్మృతులనుబట్టి ఇతిహాస పురాణాదు
బట్టియు ప్రపంచము అనాదియని భావము.

## ౧౩. సర్వధర్మోపపత్త్యధికరణము

**37.** మూ. సర్వధర్మోపపత్తేశ్చ.

సర్వధర్మోపపత్తేఃచ = సర్వకారణధర్మములు ఉపపన్నములగుటవలనను.

సూ. బ్రహ్మమె జగమునకుఁ గారణము ఉపాదానకారణము అనిచెప్పఁగా
కారణధర్మములు ఉపపన్నములగుచున్నవిగావునను ఇందు శంకింపవలసిన
యేమియులేదు.

వివః- బ్రహ్మము సర్వమును దెలిసినది సర్వశక్తులుగలది మహామాయ
ది గాన అది జగములకుఁ గారణమనుటలో సందేహమేమాత్రమును లేదని
పము.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందు ద్వితీయాధ్యాయమున
స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయమను
మొదటి పాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

ద్వితీయాధ్యాయమున రెండవపాదము.
సాంఖ్యాది మతఖండనము.

## ౧. రచనాఽనుప పత్త్యధికరణము

1. మూ. రచనానుప పత్తేశ్చనానుమానం.

రచనానుపపత్తేచ = విచిత్రరచనగుదురకపోపుటవలనను, అనుమానం= ప్రధానానుమానము, న=తగదు.

సూ. అచేతనమగు ప్రధానము తనంతఁదానుగ వివిధ విచిత్రవస్తువులను రచించుట యుపపన్నముగాదు గావునఁ బ్రధానము జగత్తులకుఁ గారణమని యను మానింపఁదగదు.

2. మూ. ప్రవృత్తేశ్చ.

ప్రవృత్తేఃచ=ప్రవర్తించుటవలనను.

సూ. చేతనములగు కుమ్మరి మొదలగువారికేగాని యచేతనములగు మట్టి మొదలగువానికిఁ జేతనసంబంధము లేకుండఁ గార్యరచనయందుఁ బ్రవర్తించుట లేనట్లు జడమగు ప్రధానము జగద్రచన చేయుటకుఁ బ్రవర్తించుట యనుపపన్న మగుటవలనను ప్రధానము జగములకుఁ గారణమని యనుమానింపగాదు.

3. మూ. పయోఽంబువచ్చేత్తత్రాపి.

పయోంబవత్‌చేత్=పాలు నీళ్లువలె అన్నచో, తత్రఅపి=వాటిలోఁగూడ.

సూ. అచేతనములగు పాలు వత్సపోషణకును నీళ్లు లోకోపకారమునకును స్వభావసిద్ధముగఁ బ్రవర్తించునట్లు జడమగు ప్రధానము జగత్తుల రచనకుఁ బ్రవర్తించుట యనుపపన్నముగాదన్నచో ఆ పాలను నీళ్ళనుగూడ బరమేశ్వరుఁడే ప్రవర్తింపఁజేయుచున్నాఁడు గాని యవి స్వతంత్రముగాఁ బ్రవర్తించుటలేదు.

వివ:- "యోఽప్సుతిష్ఠన్ యోఽపోఽంతరోయమయతి" (బృ. ౩.౭.౪) **ఎవడు** నీళ్ళలో నుండెనో యేఁడు నీళ్ళలోనే యుండి వానిని బ్రవర్తింప

యుచున్నాఁడో యతఁడే యందఱకు ఆత్మయైనవాఁడు. "ఏతస్య వా అక్ష
స్య ప్రశాసనేగార్గి ప్రాచ్యోఽన్యా నద్యస్స్యందంతే" (ఓగార్గీ తూర్పునందలి
ంతర నదులును ఈ పరమేశ్వరుని శాసనముచేఁ బ్రవహించుచున్నవి. ఇత్యాది
ుతులు అన్నిటిలో నీశ్వరుఁడే యుండి నడపుచున్నాఁడని చెప్పుచున్నవి.
క్సయందలి ప్రేమచే ఆవు దూడకు ఆ దూడ త్రాగుచున్నపుడే యిచ్చుచున్నది
న అక్కడ చేతన ప్రయత్నమున్నది. నీరు పల్లమునుబట్టియేగాని స్వయ
ంగాఁ బ్రవహింపవు. ౨అ. ౪పాద. ౨౪ సూత్రములో పాలవలె స్వభావముగాఁ
వర్తించుచున్నది యను నుదాహరణము లోకదృష్టి ననుసరించి చెప్పఁబడినది.
ి వాస్తవమునకుఁ బరమేశ్వరుఁడే యన్నింటి యందున్నాఁడు గాన ఆ పాలును
రమేశ్వరుని బట్టియె ప్రవర్తించుచున్నవని తెలియునది.

4. మూ వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్.

అనపేక్షత్వాత్ = ప్రవర్తకుడు అపేక్షింపఁబడకపోవుటవలన, వ్యతిరేకా
వస్థితేఃచ=ప్రవర్తింపకపోవుట అనునది లేకపోవుటవలనను.

సూ. సత్త్వరజస్తమో గుణముల సామ్యావస్థయగు జడమైన ప్రధానము
ంఁ బ్రవర్తకుఁడగు వాఁడెవ్వఁడును అపేక్షింపఁబడగపోవుటవలన అది యెప్పు
ను బ్రవర్తించుచునే యుండును గాన ఒకమాఱు జగద్రూపముగా, బ్రవర్తించు
యు ఒకమాఱు ప్రవర్తింపక యుండుటయును సంభవింపదు గానఁ బ్రధానము
ముునకుఁ గారణమనరాదు.

వివ:- ఈశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడును, సర్వజ్ఞుఁడును, మహా
యగలవాఁడునుగాన అతనికొక మాఱు ప్రవృత్తియు ఒకమాఱు అప్రవృత్తియు
ిధింపవని భావము.

5. మూ. అన్యత్రాఽభావాచ్చ నతృణాదివత్.

అన్యత్రాఽభావాత్ చ = ఇతరమైనచోట్ల లేకపోవుటవలనను, తృణాదివత్=
మొదలగునవానివలె, న=కాదు.

సూ. పచ్చగడ్డి మొదలగునవి పాలు మొదలుగా స్వభావసిద్ధముగ మాఱు
ం ప్రధానము స్వభావసిద్ధముగ జగద్రూపముగఁ బరిణమించుచున్నదన్నచో
చ్చగడ్డి ఆవునకుఁ గాక మిగిలిన యెద్దు లోనగువానికిఁ బెట్టినపుడును ఆ
్చగడ్డిని ఒక గంపలో వేసినపుడును పాలుగా మాఱుటలేదు ఆ పచ్చగడ్డి

పొలుగా మాఱుటకు ఆవును దైవమును గారణమగుచున్నవి గాన అట్టి గారణము ప్రధానమునకు లేకపోవుటచేఁ బ్రధానము జగమునకుఁ గారణమనరాదు.

6. మూ. అభ్యుపగమేఽప్యర్థాభావాత్.

అభ్యుపగమేఽపి = ఏదోరీతిగ అంగీకరించినను, అర్థాభావాత్ = పురుషార్థము లేకపోవుటవలన.

సూ. ఏదోయొకరీతిగ జడమైన ప్రధానమునకు జగద్రచనలోఁ బ్రవృత్తి యున్నదని యంగీకరింతమన్నను జడమైన ప్రధానమున భోగమోక్షాది పురుషార్థ ప్రయోజనము సంభవింపదు గానఁ బ్రధానము జగమునకుఁ గారణమనుటలో దోషము తప్పదు.

వివ:- పరమేశ్వరునికిఁ గూడఁ బ్రయోజనము లేకపోయినను గేవలము లీలయుండుటవలనఁ బరమేశ్వరుఁడు జగమునకుఁ గారణమనుటలో దోషము లేదని భావము.

7. మూ. పురుషాశ్మవదితిచేత్తథాపి.

పురుషాశ్మవత్ = పురుషుఁడు, సూదంటురాయివలె, ఇతిచేత్=అన్నచో, తథాపి=అట్లయినను దోషమే.

సూ. కుంటివాఁడు గ్రుడ్డివానిని నడపించునట్లును, సూదంటురాయి ఇనుమును కదపునట్లును ప్రధానము జగములను బ్రవర్తింపఁజేయునన్నచో నట్లయినను ఈ కుంటివాని సూదంటురాతి దృష్టాంతములు సరిపడకపోవుటచేత స్వమత సిద్ధాంతములకు విరుద్ధము కలుగు దోషము సంభవించును.

వివ:- సాంఖ్యమందు అంగీకరింపఁబడిన పురుషుఁడు నిష్క్రియుఁడు నిర్గుణుఁడు ఉదాసీనుఁడును. అతఁడు జగములను బ్రవర్తింపఁజేయునని యందుఁ జెప్పఁబడలేదు. ప్రధానము స్వతంత్రముగనే ప్రవర్తించునని యంగీకరింపఁ బడెను. దృష్టాంతములోఁ గుంటివాఁడు గ్రుడ్డివానిని సూదంటురాయి ఇనుమును బ్రవర్తింపఁజేయునట్లు ప్రధానము జగమును బ్రవర్తింపచేయునని చెప్పఁబడు చున్నది. పురుషుఁడు ఉదాసీనుఁడని సాంఖ్యమతమునఁ జెప్పఁబడుటచే పురుషుఁడు ప్రధానమును బ్రవర్తింపఁజేయఁడు. ప్రధానము జడము గాన ప్రవర్తింపదు. స్వతంత్రముగ నెట్లు జడమగు ప్రధానము ప్రవర్తించును. పురుషుఁడు ప్రవర్తింపఁ

గానివానిని కలుపుటకు విడఁగొట్టుటకుఁ గర్మ గలిగించునని చెప్పదమన్న నవి జడములగుటవల్ల నవి గర్మకుఁ గారణములు గావు గనుక సృష్టియుఁ బ్రళయమును లేకపోవలసివచ్చును.

వివ:- ఇది వైశేషిక మతఖండనము. ఈ ప్రపంచమంతయుఁ బరమాణువులవల్లనె కలుగును అణువులందున్న రూపాదులనుబట్టి ద్వ్యణుకాదులందున్న రూపాదులు కల్గుగును. క్రమముగ ద్వ్యణుకాదులను బట్టి గాలి అగ్ని నీరు భూమి కలుగును. ఇట్లే ఇంద్రియములతోఁగూడిన శరీరములు గలుగునని వైశేషికమతము.

**13.** మూ. సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః

సమవాయాభ్యుపగమాత్ చ=సమవాయమను దానిని అంగీకరించుటవలనను, సామ్యాత్=సామ్యమునుబట్టి, అనవస్థితేః=అనవస్థగలుగుటవలనను.

సూ. గుణగుణులకు, అవయవావయవులకు జాతి వ్యక్తులకు క్రియా క్రియావంతములకు, నిత్యవిశేషద్రవ్యములకుఁ గల సంబంధమును సమవాయ సంబంధమని చెప్పి దానిని వేఱొక పదార్థముగ వైశేషికులంగీకరించుటవలనను, అవయవములగు పరమాణువుల వలన వీనికంటె భిన్నములైన అవయవులగు ద్వ్యణుకాదులు పుట్టుచుఁ బరమాణువులకంటె మిక్కిలి భిన్నమైనను సమవాయ సంబంధముచే వానితో సంబంధింపఁబడునని చెప్పినట్లు, సమవాయసంబంధము గూడ సమవాయసంబంధము గలవానికంటె మిక్కిలి భిన్నమైనను సమవాయ రూపమగు మఱియొక సంబంధముచే సమవాయ. సంబంధముగల వస్తువులతో సంబంధింపవలసి యుండును గాన ఈ సామ్యమునుబట్టి ప్రతిదానికిని ఒక్కొక్క సమవాయసంబంధము కల్పింపవలసియుండును గాన అనవస్థ (అనంతసమవాయ కల్పన) ప్రసక్తమగును గనుకఁ బరమాణువులకు కలయికయు, విడిపోవుటయు సంభవింపదు అందుచే సృష్టిగాని ప్రళయముగాని లేవనవలసి వచ్చును గానఁ బరమాణువులు జగత్కారణములనరాదు.

**14.** మూ. నిత్యమేవచ భావాత్.

నిత్యంఏవచ=ఎల్లపుడును, భావాత్=సృష్టియొకటేగాని ప్రళయమొక్కటే గాని యుండుటవలన.

సూ. పరమాణువులు ప్రవృత్తి స్వభావముగల వన్నచో నిత్యము సృష్టి మాత్రమొక్కటియు నివృత్తి స్వభావముగలవన్నచో నిత్యము ప్రళయముమాత్ర

మొక్కటియు నుండవలసివచ్చును నింక నుభయ స్వభావముగలవనుట విరుద్ధము గాన సమంజసముగాదు గానఁ బరమాణు కారణవాదము అయుక్తము.

15. మూ. రూపాదిమత్త్వాచ్చ విపర్యయోదర్శనాత్.

రూపాదిమత్త్వాచ్చ = రూపాదిగలవగుటవలన, దర్శనాత్=కానిపించుట వలన, విపర్యయము=విరుద్ధముగ జెప్పవలసివచ్చును.

సూ. నైయాయికమతమునఁ బరమాణువులకు రూపాదులంగీకరింపఁ బడుటవలనను ఆ రూపాదులు గల ఘటాదులకు అనిత్యత్వము సావయవత్వము గనిపించుటచేతను పరమాణువులు అనిత్యములని సావయవములని చెప్పవలసి వచ్చును గానఁ బరమాణువులు జగత్కారణమనుట యుక్తముగాదు.

16. మూ. ఉభయథా చ దోషాత్.

ఉభయథా చ=రెండు విధములను, దోషాత్=దోషము ఉండుటవలన.

సూ. పరమాణువులు అనేక గుణములు గలవా? లేక యొక్కొక గుణము గలవా? అనేక గుణములు గల వందమన్న నట్టి పరమాణువుల కధిక స్వరూపము గలుగును గానఁ బరమాణుత్వ హాని కలుగును. అందుచేఁ బరమాణుత్వసిద్ధికై యొక్కొకగుణము గలవన్నచోఁ దేజః పరమాణువులకు రూపమొకటెగాని స్పర్శ లేదనియు, జలపరమాణువులకు రసమెగాని రూపస్పర్శములు లేవనియు. పృథివీ పరమాణువులకు గంధమెగాని రూపరసస్పర్శములు లేవనియుఁ జెప్పవలసివచ్చును. పోని అన్ని పరమాణువులు నాలుగేసి గుణములు గలవన్నచో నీటియందు గంధ మును, తేజస్సున గంధరసములును వాయువున గంధరూపరసములును గనిపింప వలసివచ్చును. ఇది యనుభవ విరుద్ధముగానఁ బరమాణు కారణవాదము ఉప పన్నముగాదు.

17. మూ. అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా.

అపరిగ్రహాత్‌చ=మనువు మొదలగువారిచే గ్రహింపఁబడకపోవుటవలనను, అత్యంతం=మిగుల, అనపేక్షా=అపేక్షింపదగినదిగాదు.

సూ. శ్రుతులచేఁగాని స్మృతులచేఁగాని శిష్టులగు మన్వాదులచేఁగాని యీ పరమాణు కారణవాదము పరిగ్రహింపఁబడకపోవుటవలనను ఈ పరమాణు కారణ వాదము ఎంతమాత్రము అపేక్షింపఁదగినదిగాదు.

## ౪. సముదాయాధికరణము

18. సూ. సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః

సముదాయే=సృష్టిసముదాయము, ఉభయహేతుకేఽపి=రెండు హేతువులు గలదనినను, తదప్రాప్తిః=సృష్టిసముదాయము ప్రాప్తింపదు.

సూ. భూతములకు భౌతికవస్తువులకుఁ బరమాణువులు హేతువులనియు, రూప, విజ్ఞాన, వేదనా, సంజ్ఞాసంస్కారములుఅను పంచస్కంధములకు రూపాది స్కంధములు హేతువులనియు రెండువిధములుగ సర్వసృష్టి సముదాయమునకు హేతువులని చెప్పినను అవి జడములుగాన నా రెండిటికి ప్రేరకుఁడున్నాఁడని యంగీకరింపకపోవుటచే సమస్త సృష్టిసముదాయము ఉపపన్నముగాదు గానఁ బరమాణువులు జగత్కారణములనరాదు.

వివ:- సాంఖ్య వైశేషికనైయాయికులను అర్థవైనాశికులందురు. వీరు నిరవయవములగు పరమాణువులను ఆకాశ, దిక్కాలాత్మ మనస్సులను నిత్యము లందురు. సావయవములగు మిగిలిన సగము (అనఁగా పృథివ్యాదులు) నాశము చెందునందురు గాన అర్థ వైనాశికులందురు. ఇదివరకు సూత్రములలో వీరి మతము ఖండింపఁబడినది. అనాదిగా పూర్వమునుండి వచ్చు సాంఖ్య సిద్ధాంతములు తరువాత ఆయా నామములచే ప్రసిద్ధములైనవి. ఇంకఁ బ్రసంగవశమునఁ బూర్ణవైనాశికులగు బౌద్ధుల (బుద్ధ శిష్యుల) మతము ఖండింపఁబడుచున్నది. సర్వము క్షణికము ఇత్యాది భావములు బుద్ధునికంటె పూర్వుఁడగు వ్యాసునికి బూర్వమందును అను స్యూతముగా నున్నవే. అవి పిదప బౌద్ధాదిమతములుగాఁ బ్రసిద్ధికెక్కినవి గాన ఈ సూత్రములు బౌద్ధుల తరువాతివని ఆక్షేపమున కవకాశములేదు. వారి మతమున సర్వమును క్షణికము. ఈ క్షణమునందున్న రూపపరిమాణాదికములు ఉత్తరక్షణమున మార్పుచెందుచు నశించుచుఁ గ్రొత్త రూపాదులఁబొందును గాన సర్వమును ప్రతిక్షణమందుఁ బూర్ణముగా వినాశము చెందును అని వారనుటచే వారిని బూర్ణవైనాశికులందురు.

వివ:- పూర్ణవైనాశికుల సిద్ధాంతము వారి జ్ఞానమునుబట్టిగాని, శిష్యుల భేదమునుబట్టిగాని యనేక విధములుగ నున్నది. అందు సర్వాస్తిత్వవాదులు కొందఱు, విజ్ఞానాస్తిత్వమాత్రవాదులు కొందఱు, సర్వశూన్యత్వవాదులు కొందఱు. అందు సర్వాస్తిత్వవాదులు బాహ్యాభ్యంతర వస్తువులను, భూతములను,

భౌతికములను, చిత్తమును చిత్తమునకు సంబంధించినవానిని అంగీకరింతురు. భూతములు పృథివిధాతువులు. మొ. భౌతికములు=రూపాదులు, నేత్రాదులు. ఖరస్వభావముగల భూమి, స్నేహస్వభావముగల నీరు. ఉష్ణస్వభావముగల యగ్ని, ప్రేరణస్వభావముగలవాయువు, ఈ నాలుగింటి భూతముల పరమాణువులు పృథివ్యాదిరూపముగ సంఘాతములగునని వారు తలంతురు. అట్లే రూప, విజ్ఞాన వేదనా సంజ్ఞాసంస్కారములనెడి పంచస్కంధములును అధ్యాత్మ రూపమును సర్వవ్యవహారమునకు వీలుగా సంఘాతములగుననియు వారు తలతురు.

వారు గురువుయొక్క ప్రతిభనుబట్టి శిష్యుల బుద్ధులను బట్టి యనేక విధములుగ నున్నారు. ౧. మాధ్యమికులు ౨. యోగాచారులు ౩. సౌత్రాంతికులు ౪. వైభాషికులు అని వారు నాలుగు విధములుగనున్నారు. అందు మాధ్యమికులు "సర్వము శూన్యము" అని గురువు చెప్పిన రీతిగా గ్రహించి తమ బుద్ధి విశేషమునుబట్టి గురువు చెప్పినదానికి మించి గాని తగ్గిగాని నడువక మధ్యమ మార్గమున నడుచుటచే వారిని మాధ్యమికులనిరి. సర్వము శూన్యమని గురువు ఉపదేశింపఁగా విజ్ఞానముకంటె మిగిలినదంతయు శూన్యమని మఱి కొందఱు తమ బుద్ధివిశేషముచే గ్రహించి యా విజ్ఞానమును యోగమని తలఁచి యా విధముగా నాచరించినవారు గాన వారు యోగాచారులనంబడిరి. ప్రతీతి సిద్ధమైన యర్థము శూన్యము గాఁజాలదు గాన విజ్ఞానమువలె బాహ్యార్థమును సత్యమె యని చెప్పఁగా శిష్యులు అవును అది యట్లే కావచ్చునని తలఁచి బాహ్యార్థములు అనుమేయములు ప్రత్యక్షసిద్ధము గావని గురువు చెప్పఁగా ఈ సూత్ర మే యంతము వఱకు సరిపోవునని తలఁచు వారు సౌత్రాంతికులైరి. వీరు బాహ్యార్థములు అనుమేయములని యందురు. ఇంక ఇది ఘటము అను ప్రతీతి బాహ్యా వస్తువుల నంగీకరించినచో ఆ ప్రతీతి ప్రత్యక్షమగుటవలన దానిని బట్టి బాహ్యార్థములును బ్రత్యక్షములగును గాన ఆ ప్రతీతియును బ్రత్యక్షముగాదు అని విరుద్ధముగ భాషించువారగుటవలన నట్టి వారిని వైభాషికులనిరి. వీరు బాహ్యపదార్థములు ప్రత్యక్షములనువారు: ౧ విషయములు ఇంద్రియములు రూపస్కంధము ౨. నేను అను విజ్ఞానము విజ్ఞానస్కంధము ౩. సుఖదుఃఖాద్యనుభవము వేదనా స్కంధము ౪. నామభేదములచే దెలుపఁబడు జ్ఞానము సంజ్ఞాస్కంధము ౫. రాగ ద్వేష మోహధర్మాధర్మాదులు సంస్కారస్కంధము. విజ్ఞాన స్కంధమును చిత్తము ఆత్మయని యందురు. ప్రేరకుడు లేకపోవుటచే నవి సృష్టి సంఘాతముగా

నేర్పడవని భావము. ప్రేరకుఁడు లేకున్నను స్వభావముగనే సృష్టిసంఘాతముగ నగునన్నచో సృష్టి ప్రవృత్తికి విరామముగలుగదు గాన మోక్షము గాని ప్రళయము గాని సంభవింపదు గాన నా వాదము సమంజసము గాదని భావము.

19. మూ. ఇతరేతర ప్రత్యయత్వాదితిచేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్.

ఇతరేతర ప్రత్యయత్వాత్=ఒకదానికొకటి కారణమగుటవలన, ఇతిచేత్= అన్నచో, ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్ = తమపుట్టుకకుమాత్రమె కారణమగుటవల్ల న=అట్లనరాదు.

సూ. భూమి జలాది పరమాణువులు నవిద్యాదులు నొకదానికొకటి కారణమగుటవలన సృష్టిసంఘాత ముపపన్నమగునుకదా యన్నచో ఆ పరమాణువులు అవిద్యాదులును దమ పుట్టుకకు మాత్రమె గారణమగుఁ గాని- "వాటిని బరస్పరము కలుపు నీశ్వరుఁడు గాని జీవుఁడు గాని యున్నాఁడని వారంగీకరింపకపోవుటచే- సృష్టిసంఘాతమున కవి కారణములు గానేరవు.

వివ:- అవిద్యాదులు=అవిద్య, సంస్కారము, విజ్ఞానము, నామము, రూపము, షడాయతనములు, స్పర్శము, వేదన, తృష్ణ, ఉపాదానము, భవము, జాతి, జర, మరణము, శోకము, పరిదేవన, దుఃఖము, దుర్మనస్తలోనగునవి, క్షణికములందు ఇవి స్థిరము అను భ్రాంతి యవిద్య. దానినుండి రాగద్వేషాదులు సంస్కారములు, వానినుండి గర్భస్థుని మొదటి జ్ఞానమగు విజ్ఞానము. దానినుండి పృథివి, జలము, తేజస్సు, వాయువను భూతముల నామములు. వానినుండి రూపములు అనఁగా శుక్రశోణితములు వానినుండి షడాయతనములు=ఇంద్రియములు అయిదు మనస్సు. వాని నుండి స్పర్శము=తాకుట. దానినుండి వేదన=సుఖాదులు. వాని నుండి తృష్ణ=కోరిక. దానినుండి ఉపాదానము=విషయములందుఁ బ్రవృత్తి. దాని నుండి జాతి=దేహోత్పత్తి. దానినుండి జర=పంచస్కంధముల పరిపక్వస్థితయైన ముసలితనము. దానినుండి మరణము=స్కంధనాశము. దానినుండి శోకము, దాని నుండి ఏడుపు, దానినుండి దుఃఖము, దానినుండి దుర్మనస్త=మనోవ్యథయు గలుగునని బౌద్ధుల సిద్ధాంతము ఇవి పరస్పరము గారణములని యన్నను వానికి బ్రేరకుడు లేక పోవుటచే సృష్టి సంఘాతము గలుగకపోవలసివచ్చును. ఒక వేళ స్వభావముగనే సంఘాతమును బుట్టించునన్నచో తమతో సమానమైన సంఘమునే పుట్టింపవలసి యుండును అట్లగుచో సృష్టియంతయు ఒక్కవిధమై కావలసివచ్చును. అప్పుడు కీట జంతు పక్షి మనుష్య దేవాది భేదములు గలుగవు.

అట్లు గాక తమకంటె భిన్నమైన సంఘమునే నియమము లేక పుట్టించునన్నచో మనుష్యాదులు మరునిమిషమున గజాదులుగను, గజాదులు మరునిమిషమున మనుష్యాదులుగను గావలసివచ్చును. ఇట్లు జరుగుట విరుద్ధముగదా. కర్మ భుజించు స్థిరుఁడైన జీవుఁడు లేఁడను వారి వాదములో భోక్త లేక పోఁగా భోగమోక్షము లింక నెవనికి? అట్లు గాక భోగమోక్షములవరకు భోక్త యుండునన్నచో క్షణిక వాదమునకు బాధకలుగును. కాన నీ వాదము సమంజసము గాదని భావము.

20. మూ. ఉత్తరోత్పాదే పూర్వనిరోధాత్.

ఉత్తరోత్పాదే = తరువాతి కార్యము పుట్టుచుండఁగా, పూర్వనిరోధాత్= పూర్వపు కారణము నశించుటవలన.

సూ. ఉత్తరక్షణము పుట్టుచుండఁగాఁ బూర్వక్షణము నశించునని బౌద్ధ మతమునఁ జెప్పఁబడుటవలనఁ బూర్వకాలీనమగు హేతువున కధీనమైన యుత్తర కాలీనమగు కార్యము పుట్టుట సంభవింపదు గాన నీ వాదము సమంజసముగాదు.

21. మూ. అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా.

అసతి=కారణము ఉండదన్నచో, ప్రతిజ్ఞోపరోధః=స్వప్రతిజ్ఞకు హానియు, అన్యథా=మరొకరీతిగా చెప్పినచో, యౌగపద్యం=కార్యకారణములు ఒకమాటుగా నుండుటయు.

సూ. పోని కారణము లేకయె కార్యము పుట్టునని వారన్నచో విషయాది చతుర్విధహేతువులవలన రూపాదులు సుఖాదులు పుట్టు నను వారి ప్రతిజ్ఞకు హానియు, లేక మఱొకవిధముగా పూర్వక్షణము ఉత్తరక్షణము పుట్టునంత "సర్వ సంస్కారములు క్షణికములు" అను తమ ప్రతిజ్ఞకు భంగమును వాటిల్లును.

వివ:- విషయాదులు=విషయ, కరణ, సహకారి సంస్కారములు.

22. మూ. ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తి రవిచ్ఛేదాత్.

అవిచ్ఛేదాత్ = కార్యకారణవిచ్ఛేదము లేకపోవుటవలన, ప్రతిసంఖ్యాఽ ప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిః=జ్ఞానాజ్ఞానపూర్వకవినాశముప్రాప్తింపదు.

సూ. కార్యకారణములకును బదార్థ సంతతికిని విచ్ఛేదము లేకపోవుట వలన జ్ఞానపూర్వకమగు వినాశము గాని యజ్ఞానపూర్వకవినాశము గాని కలుగదు.

వివ:- "బుద్ధిబోధ్యం త్రయాదన్యత్సం స్కృతం క్షణికంచ" పదార్థములకు జ్ఞానపూర్వవినాశము పదార్థములకు అజ్ఞానపూర్వకవినాశము, ఆవరణాభావ రూపమైన యాకాశమును ఈ మూడిటికంటె నితరమగు బుద్ధిచేఁ దెలిసికొనఁదగి సంస్కరింపఁబడిన వస్తుజాతమంతయు క్షణికము అని వారి మతము. కార్యకారణ ప్రవాహమున కెప్పుడు విచ్ఛేదము లేకపోవుటవలన రెండు విధములైన కార్యకారణసంతానవినాశము వానికిఁ గలుగుననుట యుక్తముగాదు. ఆ వస్తువే యిది యని గురుతుపట్టుటవలనను ప్రతిక్షణము క్రొత్తవస్తువు పుట్టకపోవుటవలన వస్తువినాశమును లేదు గానఁ బూర్ణవైనాశికులమతము సంగతముగాదు.

23. మూ. ఉభయథాచదోషాత్.

ఉభయథాచ=రెండువిధములఁగూడ, దోషాత్=దోషము ఉండుటవలన.

సూ. జ్ఞానపూర్వకవినాశములో నంతర్భవించినదని చెప్పఁబడిన యవిద్యాదివినాశము యమనియమాదిసమ్యగ్జ్ఞానముచేఁ గలుగునన్నచో "నిర్హేతుకముగా వినాశము గలుగు" నను నావైనాశికుల సిద్ధాంతమునకు విరోధమును, ఏ సమ్యగ్జ్ఞానము లేకుండ స్వభావసిద్ధముగనే యవిద్యాదినాశము గలుగునన్నచో "సర్వము క్షణికము సర్వము దుఃఖము ఇత్యాదులను భావించిన నిర్వాణము గలుగు" నని నిర్వాణమార్గము ఉపదేశించుట వ్యర్థమగుటయుఁ గలుగును గాన నీ రెండు విధములచేఁగూడ దోషము ప్రసక్తించుచుండుటచే వైనాశికుల దర్శనము సంగతముగాదు.

24. మూ. ఆకాశే చావిశేషాత్.

ఆకాశేచ=ఆకాశమందును, అవిశేషాత్=విశేషము లేకపోవుటవలన.

సూ. ఆకాశముగూడ జ్ఞానాజ్ఞానపూర్వకవినాశములవలెఁ బదార్థమగుటలో విశేషము లేకపోవుటవలన ఆకాశము శూన్యమని చెప్పిన వైనాశికులమతము సంగతముగాదు.

వివ:- ఆవరణము లేకపోవుటయె యాకాశము. అది శూన్యము అని వైనాశికులమతము. "ఆత్మన ఆకాశస్సంభూతః" (తై. ౨. ౧) ఆత్మనుండి యాకాశము పుట్టినది. అని శ్రుతి చెప్పుచున్నది. వారు శ్రుతికిఁ బ్రామాణ్యము నంగీకరింపరు గాన గంధాదిగుణములు పృథివ్యాదుల నాశ్రయించినట్లు శబ్దము

ఆకాశము నాశ్రయించి యుండుటచే శబ్ద గుణమునుబట్టి యాకాశము ఊహింపఁ దగియున్నది. వైనాశికులు "వాయుః కింసంనిశ్చ్రయః" (వాయువు దేని నాశ్రయించియున్నది)అని ప్రశ్నించికొని "వాయురాకాశసంనిశ్రయః" (వాయువు ఆకాశమును ఆశ్రయించియున్నది) అని చెప్పఁబడినది. ఆకాశము పదార్థము కానిచో వాయువున కాకాశము ఆధారమైనది యని చెప్పు స్వవాక్యమునకు విరోధము గలుగును. అది గాక "నిరోధద్వయమాకాశం చత్రయ మప్యేత న్నిరుపాఖ్య, మవస్తు నిత్యంచ" (జ్ఞానాజ్ఞానపూర్వక వినాశద్వయమును ఆకాశమును ఈ మూఁడు శూన్యమైనవి, వస్తుభిన్నములు నిత్యములు) అనుచో ఆకాశమునకు నిత్యత్వవ్యవహారము చెప్పుట విరోధించును. వస్తువునకే నిత్యత్వాది వ్యవహారములు సంభవించును గాని శూన్యమునకు సంభవింపవు. నిత్యత్వాది ధర్మధర్మిభావము ఘటాదివస్తువులకే సంభవించును గాన ఈ వైనాశికుల మతము. సమంజసముగాదని భావము.

**౨౫.** మూ. అనుస్మృతేశ్చ.

అనుస్మృతేఃచ=అనుస్మరణమువలనను.

సూ, "సర్వము క్షణికము" అన్నప్పుడు ఆ క్షణికత్వమును దెలిసికొనెడి కర్తయైన యాత్మకుఁ గూడ క్షణికత్వము చెప్పవలసివచ్చును అట్టులు చెప్పినచో "మును పు దీనిని జూచితిని మరల దాని నిప్పుడు చూచుచున్నాను" అని పూర్వోత్తర వస్తు స్మరణము సంభవింపదు అట్టి స్మరణములోకానుభవమున సిద్ధమగుట వలనను ఆత్మకు క్షణికత్వము చెప్పరాదు.

**౨౬.** మూ. నాసతోఽదృష్టత్వాత్.

అదృష్టత్వాత్ = అట్లుగనిపింపకపోవుటవలన, అసతః=అభావమునుండి, న=పుట్టవు.

సూ. అనుగతమగుచు స్థిరముగా నుండు కారణము లేకుండఁ గార్యము యొక్క పుట్టుకలోకమునఁ గనిపింపకపోవుటవలన అభావము నుండి ఘటాది భావ పదార్థములు పుట్టవు.

వివః- "నానుపమృద్యప్రాదుర్భావాత్" (మట్టి మొదలైనవి నశింపకుండ ఘటాదు పుట్టకపోవుటవలన) అని చెప్పి "నశించిన బీజమునుండి యంకురము పుట్టుచున్నది, నశించిన పాలనుండి పెరుగు పుట్టుచున్నది, నశించిన మట్టిముద్ద

నుండి ఘటాదులు పుట్టుచున్నవి, నశింపని కారణము నుండి కార్యము పుట్టు నన్నచో ఉన్న స్థితికంటె విశేషము లేకపోవుటవలన అన్నియు అన్నింటివలనఁ బుట్టవలసివచ్చును. కనుక అభావము పొందిన బీజాదులనుండి అంకురాదులు పుట్టుటవలన అభావము నుండి భావపదార్థములు పుట్టుచున్నవనవలయునని వైనాశికులు తలఁచుచున్నారు. దానికిది ఖండనము. అభావమునుండి భావ పదార్థములు పుట్టునన్నచో అన్నియు అభావపదార్థములే గాన ఒక్కొక్కదానికి ఒక్కొక్కకారణమును విశేషముగా నంగీకరించుట వ్యర్థమగును. విశేషములేని యభావమునే కారణముగా నంగీకరించినచోఁ గుందేటికొమ్ము, ఆకాశపద్మము మొదలగునవానినుండి యంకురాదులును బుట్టవలసివచ్చును. కుందేటికొమ్ము వలెనే అభావము లేనిదగుటవల్ల దానివల్ల భావపదార్థములు పుట్టవు. అభావము వల్ల భావము పుట్టునన్నచో ఆ పుట్టిన పదార్థమును అభావమై కంటికిఁ గనిపింపక పోవలసివచ్చును. అది యనుభవవిరుద్ధము. స్థిర స్వభావము గలిగి గురు తింపఁబడుచున్న బంగారము మొదలగువి కడియములు మొదలగువానికిఁ గారణములుగాఁ గనిపించుచుండుటవలన కారణము నశించిననేగాని కార్యము పుట్టదనరాదు. నశించిపోకుండ అనుగతముగా వచ్చు బీజావయవములె యంకు రములకుఁ గారణమని యంగీకరించుటవలన నశించిననేగాని యంకురములు పుట్టవనరాదు. చతుర్భ్యశ్చిత్తచైత్తా ఉత్పద్యంతే, పరమాణుభ్యశ్చ భూత భౌతిక లక్షణః సముదాయ ఉత్పద్యతే" (విషయాదులు నాల్గింటివలన జ్ఞానము సుఖాదు లును, పరమాణువులనుండి పృథివ్యాదులును దేహాది సముదాయమును బుట్టు చున్నవి.) అని వైనాశికులు మొదట అంగీకరించి మరల అభావము నుండి భావములు పుట్టునని చెప్పుటలో స్వవచన వైరుధ్యము సంభవించుచున్నది. ఇట్టి విరుద్ధవచనములచే లోకులను వారు కంగారు పెట్టుటయు జరుగుచున్నది.

**27.** మూ. ఉదాసీనానామపిచైవం సిద్ధిః.

ఉదాసీనానాం=ఊరక కూర్చుండువారికిని, ఏవం=ఇట్లు, సిద్ధిః=సిద్ధింప వలసివచ్చును.

సూ. అభావమునుండి భావపదార్థములు పుట్టునన్నచో ఏపనియుఁ జేయక యూరక కూర్చుండువారికిఁ గూడ పంటలు, ఘటాదివస్తువులు, స్వర్గము మోక్షము మొదలగు ఫలములు సిద్ధింపవలసివచ్చును గాన నీ దర్శనము సంగతముగాదు.

## ౫. ఉపలబ్ధ్యధికరణము

28. మూ. నాభావ ఉపలబ్ధేః

ఉపలబ్ధేః=ఉపలబ్ధమగుటవలన, అభావః=వస్తువులు లేకపోవుట, న=లేదు.

సూ. "ఈ ఘటపటాది సర్వవ్యవహారములు అంతర్గతమైనవే గాని విజ్ఞానముకంటె నితరమగు బాహ్యపదార్థములేదు" అన్నచో ఘటపటాదులు మనయనుభవమున ఉపలబ్ధమగుటవలన బాహ్యపదార్థములు లేవనరాదు.

వివ:- "విజ్ఞానమే ఘటపటాది వస్తురూపము పొందుచున్నది. జ్ఞానమున్నప్పుడే ఆ వస్తుజ్ఞానము గలుగుచున్నది గాని వస్తువులు లేనేలేవు'' అను యోగాచారుల మతమిప్పుడు ఖండింపఁబడుచున్నది. వాసవా వైచిత్ర్యమునుబట్టి విజ్ఞానము స్వప్నమున బాహ్యవస్తువులు లేకున్నను స్వప్నప్రపంచముగను, ఎండమావులుగను, ఇంద్రజాలముగను బ్రకాశించునట్లు జాగ్రదవస్థయందును ఘటపటాదులుగఁ గనిపించుచున్నదని వారందురు. ఇది స్తంభము, కుడ్యము, ఘటము పటము; నేను భుజింపలేదు నాకు తృప్తి కలుగలేదు. ఇది తెల్లని గోవు ఇది నల్లని గోవు, ఇది పాల గంధము ఇది పాల రసము ఇత్యాది భిన్నభిన్న వస్తువులు అనుభవమున విజ్ఞానస్వరూపములుగఁ గాక విజ్ఞానవిషయములుగ ఉపలబ్ధమగుటవలన అవి లేవనరాదని భావము.

29. మూ. వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్.

వైధర్మ్యాచ్చ= విరుద్ధధర్మములు గలవగుటవలనను, స్వప్నాదివత్= స్వప్నాదులవంటివి, న=కావు.

సూ. స్వప్నావస్థయందలి పదార్థములవలె జాగ్రదవస్థయందలి పదార్థములును శూన్యములు గాన విజ్ఞానముకంటె నితర పదార్థములు లేవన్నచో స్వప్నాదులును జాగ్రదవస్థయును విరుద్ధధర్మములు గలవి గాన విరుద్ధములగు స్వప్నాది దృష్టాంతములనుబట్టి జాగ్రదవస్థ యందలి బాహ్యపదార్థములును లేవనరాదు.

వివ:- స్వప్నములోని పదార్థములు మేలుకొన్నప్పుడు బాధింపఁబడును. కనిపింపవు. అవి స్మృతి పథములో జ్ఞప్తికి వచ్చును గాని ఆ పదార్థములు లేవు. జాగ్రదవస్థలో అట్లుగాక ఉపలబ్ధములగు ఘటపటాదివస్తువులు ఏ యవస్థలోను బాధింపఁబడక కనిపించును. ఇట్లు స్వప్నావస్థకు జాగదవస్థకు సామ్యములేమ

గాన రెండును విరుద్ధములు గాన విరుద్ధమగు దానిచే బాహ్యవస్తువు లేదనుదానిని సాధింపరాదని భావము.

30. మూ. న భావోఽనుపలబ్ధేః

అనుపలబ్ధేః=బాహ్యపదార్థములు వారి మతమున ఉపలబ్ధము గాకపోవుట వలన, భావః=వాసనా వైచిత్ర్యభావము, న=లేదు.

సూ. బాహ్యపదార్థములు లేకున్నను వాసనా వైచిత్ర్యమును బట్టి ఘటపటాది జ్ఞానవైచిత్ర్యము గలుగునన్నచో "బాహ్యపదార్థములే యుపలబ్ధములు గావు" అని చెప్పిన యీ మతమున బాహ్యపదార్థములే లేనప్పుడు ఆ బాహ్యపదార్థములనుబట్టి గిలిగెడు వాసనా వైచిత్ర్యమును గలుగదు.

31. మూ. క్షణికత్వాచ్చ.

క్షణికత్వాత్.చ=క్షణికమగుటవలనను.

సూ. 'నిర్వాణము వఱకు నుండు నేను నే' ననెడి యాలయవిజ్ఞానము వాసనలకు ఆధారముగాఁ గల్పింపఁబడినను ఆ యాలయ విజ్ఞానము క్షణికమగుట వలనను ఆ విజ్ఞానము వాసనల కాధారము కానేరదు.

వివ:- ఆ విజ్ఞానము స్థిరమని యంగీకరించినచోఁ గూటస్థచైతన్యరూపమగు బ్రహ్మము నంగీకరించినట్లే యగును గాన స్వసిద్ధాంతహానియగునని భావము. క్షణికత్వనిమిత్తములైన దోషములు ఇదివరికె నిరాకరింపఁబడినవి. (చూ. ౨ అధ్యా. ౨ పాద. ౨౦ సూ.) శూన్యవాది పక్షము సర్వప్రమాణ నిషిద్ధము గాన దానిని నిరాకరింపఁ బనిలేదని భావము.

32. మూ. సర్వథానుపపత్తేశ్చ.

సర్వథాఅనుపపత్తేఃచ= అన్నివిధములనుపపన్నము గాకపోవుట వలనను.

సూ. అన్నివిథములచేత ఉపపన్నము గాకపోవుటవలనను వైనాశిక దర్శనము ఆదరింపఁదగినదిగాదు.

## ౭. ఏకస్మిన్నసంభవాధికరణము

33. నైకస్మిన్నసంభవాత్.

ఏకస్మిన్=ఒకకాలమందె, అసంభవాత్=సంభవింపకపోవుటవల్ల, న=కాదు.

ఒకకాలమందె యొక పదార్థమందు భావాభావాది విరుద్ధధర్మములు శీతోష్ణములవలె నుండుట సంభవింపదు గాన దిగంబరుల సిద్ధాంతము సమ్మతము గాదు.

వివ:- ఇంతవఱకు బౌద్ధదర్శనము ఖండింపఁబడినది. ఇంక దిగంబర మతము ఖండింపఁబడుచున్నది. వారి మతమున ౧. జీవుఁడు, ౨. అజీవము ౩. ఆస్రవము ౪. సంవరము ౫. నిర్జరము ౬. బంధము ౭. మోక్షము అను నేడు పదార్థములున్నవి, జీవుఁడు = భోక్త, అజీవము = భోగ్యవస్తువులు, ఆస్రవము=విషయములందు ఇంద్రియములు ప్రవర్తించుట, సంవరము=యమనియమాదులచే నివృత్తి, నిర్జరము=పాపము పోవుటకుఁగాల్చిన రాళ్ళపైకెక్కుట మొదలగునవి, బంధము=కర్మ మోక్షములు ఊర్ధ్వగతి, పైవేగాక యింక కొన్ని విధములైన న్యాయములను వారంగీకరింతురు, ౧. అస్తికాయము = వస్తువుకలదని యంగీకరించుట, ౨. పుద్గలాస్తికాయము = పరమాణురూపమగు శరీరము, ౩ స్యాదస్తి = వస్తువుకలదను నిచ్ఛయందొకవిధముగఁ గలదనుభావము, ౪. స్యాన్నాస్తి=లేదనునిచ్ఛయందొకవిధముకాదనుభావము, ౫ స్యాదస్తిచనాస్తిచ= కలదులేదను రెండు కోర్కులు గలుగునపుడు ఒక విధముగానున్నది వేఱొక విధముగా లేదను భావములు.

౬. స్యాదవక్తవ్యః=రెండు వాంఛలున్నపుడు పదార్థము గలదని గాని లేదని చెప్ప వీలులేకపోకపోవుటచే చెప్పరానిదను భావము, ౭. స్యాదస్తిచావక్తవ్యశ్చ= వస్తువు కలదు చెప్పరానిదనియను వాంఛ యందొకవిధముగాఁగలదు గాని చెప్పరానిదనుభావము, ౮. స్యాన్నాస్తిచావక్తవ్యశ్చ=వస్తువులేదు చెప్పనశక్యము నను వాంఛలు గలుగఁగా నొకవిధముగలేదు గాని చెప్పనశక్యము. ౯. స్యాదస్తి చ నాస్తి చావక్తవ్యశ్చ = వస్తువు గలదు లేదు అను వాంఛయు నవక్తవ్యమను వాంఛయుఁ గలుగునప్పుడు వస్తువొకవిధముగాఁ గలిగినఁ గలుగును లేకున్న లేకుండునని చెప్పరానిది.

ఇట్లు లోకేపదార్థమందిట్టి యనేక భావములుండునని దిగంబరులందురు. ఇట్టి విరుద్ధభావములు ఒకే సమయమున నొక వస్తువునందుండవు గాన నిది సమ్మతము గాదని భావము.

౩౪. సూ. ఏవంచాత్మాకార్త్స్న్యం.

ఏవంచ=ఇట్లున్నచో, ఆత్మాకార్త్స్న్యం=ఆత్మకు అసంపూర్ణతకలుగును.

సూ. దిగంబరమతమున నొక వస్తువునందు విరుద్ధధర్మములొకే సమయముననుండవను దోషమే గాక "ఆత్మ శరీరమంత పరిమాణము గలది" అని వారు చెప్పు దానిలో శరీరమంత పరిమాణమును నంగీకరించుటచే ఆత్మ పరిచ్ఛిన్నమైనదని యనిత్యమైనదని చెప్పవలసివచ్చు దోషముగూడ సంభవించును గాన ఆ మతము ఆదరణీయము గాదు.

వివ:- ఆత్మకు శరీరమంతపరిమాణమున్నపుడు ఒకే జన్మలో బాల్యమందలి యాత్మపరిమాణము కౌమార యౌవన వార్ధక్యములలో మారుచుండునని చెప్పవలసియుండును. ఒకటే పరిమాణముగల యాత్మ భిన్నావస్థలలో మారుటఎట్లు? మఱియు జన్మాంతరములలో చీమగాఁగాని పక్షిగాఁగాని ఏనుఁగుగాఁగాని పుట్టినచో మనుష్యజన్మలోఁ దనకున్న శరీరమంత పరిమాణము తగ్గుటగాని హెచ్చుటగాని సంభవింపదుగూడ నని తెలియుచున్నది. కాన ఈ మతము ఆదరణీయము గాదని భావము.

౩౫. మూ. న చ పర్యాయా దప్యవిరోధో వికారాదిభ్యః.

పర్యాయాదపి = ఒకసారి హెచ్చుచు నొకసారి తగ్గుచునుండునన్నను వికారాదిభ్యః=శరీరవికారాదులఁబట్టియు, న అవిరోధః=విరోధములేదు అనరాదు.

సూ. శరీరములనుబట్టి ఆత్మ పరిమాణము ఒకసారి తగ్గుచు ఒకసారి హెచ్చుచు నుండునందమన్నను ఆత్మ తగ్గుచు హెచ్చుచు వికారాదులను బొందుచుండుటవలన ఆత్మకు అనిత్యత్వదోషము విరోధింపకమానదు.

వివ:- పోని యెడతెగకుండ తగ్గుచు హెచ్చుచునుండు భావము ప్రవాహమువలె నిత్యమగు నందమన్నచో అట్టి యెగతెగకుండు భావము ఒక పదార్థము గాకపోవుటవలన ఆత్మ యనుపదార్థమే లేదనవలసివచ్చును. ఒకవేళ అది వస్తువన్నచో వికారాది దోషములు తప్పవని భావము.

౩౬. మూ. అంత్యావస్థితే శ్చోభయనిత్యత్వాదవిశేషః.

అంత్యావస్థితేఃచ=చివరనుండుటవలనను, ఉభయనిత్యత్వాత్=చివరమధ్య నిత్యమగుటవలన, అవిశేషః=విశేషము లేకపోవలసివచ్చును.

సూ. చివరియవస్థయగు మోక్షమందుండు జీవపరిమాణము నిత్యమని మా దిగంబరజైను లంగీకరించుచుండిరి గాన ఆత్మశరీరమంత పరిమాణము గలదని చెప్పినప్పుడు చివరి యవస్థయగు మోక్షమునందువలె ఆది మధ్యావస్థ

లందును ఆత్మ పరిమాణమునకు భేదము లేకపోవుటవలన ఆది మధ్యావస్థలందలి యాత్మకు నిత్యత్వము చెప్పవలసివచ్చును అప్పుడు మోక్షావస్థయందలి యాత్మకును ఆది మధ్యావస్థలందలి యాత్మకును విశేషము లేకపోవలసివచ్చును గాన వీరి దర్శనము సంగతము గాదు.

## ౭. పత్యధికరణము

37. మూ. పత్యు రసామంజస్యాత్.

అసామంజస్యాత్=సమంజసము గాలేకపోవుటవలన, పత్యుః=జగత్పతికి నిమిత్తకారణత్వములేదు.

సూ. ఒకచోట నీశ్వరుఁడు జగత్తునకు ఉపాదానకారణమనియు, ఒకచోట నిమిత్తకారణమనియు, ఒకచోట ఈశ్వరుని బరుషవిశేషునిగాఁజెప్పి యా పురుషుఁడు ఉదాసీనుఁడనియుఁ బరస్పర విరుద్ధముగాఁ బాశుమతమునఁ జెప్పుటచే ఆ చెప్పిన వాక్యములు సమంజసముగా లేకపోవుటవలన జగత్పతి జగత్తునకు నిమిత్తకారణ మనరాదు.

వివ:- ఇది వరకు దిగంబరజైనులమతము ఖండింపఁబడినది. ఇంకఁ బాశుపతము ఖండింపఁబడుచున్నది. మహేశ్వరమతానుసారులగు పాశుపతాదులు "కార్య, కారణ, విధి, యోగ, దుఃఖాంతములు అను నైదు పదార్థములు పశుపాశ (జీవబంధ) వినాశము కొఱకు పశుపతియైన యీశ్వరునిచే నుపదేశింపఁబడినవి పశుపతి నిమిత్తకారణము అని యందురు. కార్యము=మహత్తు, అమహత్తు, అహంకారము, మొ., కారణము=ప్రధానము, విధి=త్రిసంధ్యలందు స్నానవిధి, యోగము=ధ్యానాదులు, దుఃఖాంతము = మోక్షము, నిమిత్తకారణమనుటచే నీశ్వరునకుఁ బురుషునికివలె రాగద్వేషాదు లంగీకరింపవలసివచ్చును. రాగద్వేషాదులున్నవాఁడు ఈశ్వరుఁడెట్లగును? ప్రాణి కర్మచే నీశ్వరుఁడు ప్రవర్తించు నన్నచో ఈశ్వరునిచే కర్మ, కర్మచే నీశ్వరుఁడని అన్యోన్యాశ్రయదోషము, సృష్టియందుఁ బ్రవృత్తి, అప్రవృత్తి, ఉదాసీనత ఇట్టి విరుద్ధభావములు అంగీకరించుట వలన ఈ దర్శనము అసంగతమని భావము.

38. మూ. సంబంధానుపపత్తేశ్చ.

సంబంధానుపపత్తేశ్చ = సంయోగాది సంబంధములు ఉపపన్నముగాక పోవుట వలనను.

సూ. ప్రధానము, పురుషుఁడు, ఈశ్వరుఁడును సర్వవ్యాపకులు నిరవయవులు గాన జగమును బ్రవర్తింపఁజేయు నీశ్వరునకును, ఈశ్వరునిచేఁ బ్రవర్తింపఁజేయఁబడు ప్రధానమునకును, పురుషునికిని సంయోగాది సంబంధము లెవ్వియు నుపపన్నములు గావు గనుకను పాశుపతమతము సమంజసముగాదు.

వివ:- ప్రధానము పురుషుఁడు ఈశ్వరుఁడు ఈ మూఁడిటిలో ఒకటి చిన్నదిగాను ఒకటి పెద్దదిగాను, ఒకటి అవయవముగాను ఒకటి అవయవిగాను ఉన్నచో వాని సంయోగ సంబంధముగాని, ఆశ్రయాశ్రయి భావసంబంధముగాని, అవయవాయవయవి సంబంధముగాని ఇంక ఏదిగాని సంభవింపదు. బ్రహ్మవాదికి బ్రహ్మమునకు జగమునకుఁ దాదాత్మ్యరూపసంబంధమున్నది. బ్రహ్మవాది యాగమబలముచేఁ గారణాదులను నిరూపించును. అంతయు అదృష్టమైన కారణమునే యంగీకరింపవలయు నను నియమము అతనికి లేదు. ఇతరులు మాత్రము దృష్టాంతములనుబట్టి కారణాదులను నిరూపించుచు అంతయును అదృష్టముగనే యంగీకరింపవలసియున్నారు. సర్వజ్ఞుఁడు మొదలైనవారిచే రచింపఁబడిన శాస్త్రములు ఆగమములు గాన సర్వజ్ఞములు. అవి సర్వజ్ఞము లను నమ్మకమునుబట్టి యాగములు అను నన్యోన్యాశ్రయదోషము గలుగుటవలన అవి ప్రమాణములుగావు. కాన సాంఖ్యయోగవాదులు ఈశ్వరుని గల్పించుట యుపపన్నముగాదు. ఇట్లే యితరములైన వేదబాహ్యమతములందు గ్రహించునది.

39. సూ. అధిష్ఠానానుపపత్తేశ్చ.

అధిష్ఠానానుపపత్తేః చ=ఆధారము ఉపపన్నము గాకపోవుటవలనను.

సూ. రూపాదులు గలిగి ప్రత్యక్షమగు మట్టి మొదలగు వానికి కుమ్మరి మొదలగువారు ఆధారమైనట్లు రూపాదులు లేక ప్రత్యక్షముగాని ప్రధానాదులకు ఈశ్వరుఁడు ఆధారమగుట యుపపన్నము గాకపోవుటవల్లను తార్కికుల ఈశ్వర కల్పనము సంగతము గాదు.

ఈ సూత్రమునకు అర్థాంతరమందు సూత్రము.

సూ. లోకమున శరీరముతో నున్న రాజే రాష్ట్రమునకు రాజుగాఁ గనిపించునట్లు ఈశ్వరుఁడు సశరీరుఁడై యుండునని చెప్పదమన్నచో ఆధారమైన శరీరము సృష్టికిఁ బిదపనేగాని సృష్టికి ముందు ఉపపన్నముగాదు గానఁ దార్కికుల యీశ్వరకల్పనము సంగతముగాదు.

వివ:- ఆధారమగు శరీరము లేదన్నచో సృష్టిని జేయుట యుపపన్నము గాదని భావము.

40. మూ. కరణవచ్చేన్న భోగాదిభ్యః

కరణవత్ చేత్=ఇంద్రియములందువలెనన్నచో, భోగాదిభ్యః=భోగాదులను బట్టి, న=అట్లనరాదు.

సూ. రూపాదులు లేక ప్రత్యక్షముగాని కన్ను మొదలైన యింద్రియము లందుఁ బరుషుఁడున్నట్లుగా ఈశ్వరుఁడును రూపాదులులేని ప్రధానమందుండు నన్నచో ఇంద్రియములందున్న పురుషునకు సుఖదుఃఖాది భోగములు గనిపించు నట్లు ఈశ్వరునకును సుఖదుఃఖాది భోగము లుండవలసివచ్చును.

అర్థాంతరమున సూత్రము.

మూ. కరణవచ్చేన్న భోగాదిభ్యః

కరణవత్ చేత్=కరణములు గలవాఁడన్నచో, భోగాదిభ్యః=భోగాదులఁబట్టి న=అనరాదు.

సూ. లోకమునుబట్టి ఈశ్వరుడును ఇంద్రియముల కాధారమైన శరీరము గలవాఁడని యన్నచో సంసారి పురుషునకువలె సుఖదుఃఖాది భోగములు ప్రసక్త మగును అప్పుడు ఈశ్వరునికి అనీశ్వరత్వము సంభవించును.

41. మూ. అంతవత్త్వ మసర్వజ్ఞతా వా.

అంతవత్త్వం=అంతుగలిగియుండుట, అసర్వజ్ఞతా వా = సర్వజ్ఞత్వము లేకపోవుటగాని గలుగును.

సూ. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును అనంతుఁడుననియు, ప్రధానము అనంతమనియు; పురుషులు పరస్పరము భిన్నులై యనంతులై యుందురనియు, తార్కికులంగీకరింతురు ఆ పక్షమున ప్రధాన పురుషేశ్వరులు పరిమాణ పరిచ్ఛిన్ను లన్నచో లోకమందలి పరిమాణపరిచ్ఛిన్నములైన ఘటాదులకువలె అంతు గలిగి యుండుట యను దోషమును ప్రధానాదులు అపరిచ్ఛిన్నము లన్నచో ఈశ్వరునకు అసర్వజ్ఞత్వదోషమును సంభవించును.

వివ:- ఘటాదులకంతమున్నట్లే ప్రధానాదులకు అంతవత్త్వమును, దానిని బట్టి ఆదిమత్త్వమును, దానిని బట్టి శూన్యత్వమును సంభవించునని భావము.

లోకమున అంతుగల ఘటాదులు ఆదిగలవై, ఉత్పత్తికి పూర్వము శూన్యములై కనిపించుచున్నవిగదా, కాన తార్కికుల ఈశ్వర కారణవాదము అయుక్తమని భావము.

## ८. ఉత్పత్త్యసంభవాధికరణము

42. మూ. ఉత్పత్త్యసంభవాత్.

ఉత్పత్త్యసంభవాత్=పుట్టుకసంభవింపకపోవుటవలన.

సూ. అనిత్యత్వాదిదోషములు తగులుటచే జీవునికి పుట్టుక సంభవింపదు గాన వాసుదేవుఁడను పేరుగల భగవంతునినుండి సంకర్షణుఁడను పేరుగల జీవుఁడు పుట్టునని యనరాదు. ACC NO. 14892

వివ:- "భగవంతుఁడైన వాసుదేవుఁ డొక్కఁడె నిరంజన జ్ఞాన స్వరూపుఁడు పరమార్థతత్త్వము. అతఁడు ౧. వాసుదేవ వ్యూహము, ౨. సంకర్షణ వ్యూహము, ౩. ప్రద్యుమ్న వ్యూహము, ४. అనిరుద్ధవ్యూహము అను నాలుగు రూపములుగఁ దన్ను విభజించుకొనెను. వాసుదేవుఁడనఁగాఁ బరమాత్మ, సంకర్షణుఁడనఁగా జీవుఁడు, ప్రద్యుమ్నుఁడనగా మనస్సు, అనిరుద్ధుఁడనఁగా అహంకారము. వాసుదేవుఁడు పరప్రకృతి, ఇతరులగు సంకర్షణాదులు కార్యములు. ఇట్టి పరమేశ్వరుని సమీపించి ఆశ్రయించి, యజ్ఞ వేద యోగములచే నూఱేండ్లు పూజించి క్షీణక్లేశుఁడై భగవంతునినె పొందునని భాగవతులందురు. దానికీసూత్రము ఖండనము. జీవునికి పుట్టుక యున్నదన్నచో అనిత్యత్వమును నాశమును గలుగును గాన నశించుపోవు జీవునికి మోక్షసిద్ధి యెట్లు? కనుకనే "నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః" (చూ. ౨ అ. ౩ పా. ౧౭) అని యాచార్యుఁడు జీవునికిఁ బుట్టుకను నిషేధించుచున్నాఁడు. 181.42 10200 GAN

43. మూ. నచకర్తుఃకరణమ్.

కర్తుః=కర్తనుండి, కరణమ్=సాధనము, నచ=పుట్టవుగూడ.

సూ. కర్తనుండి సాధనసామగ్రి పుట్టుట లోకవిరుద్ధము గానఁ గర్తయగు జీవునినుండి కరణమగు మనస్సు అహంకారమును పుట్టుటయును విరుద్ధము.

వివ:- కుమ్మరి నుండి సాలె, దండములుగాని, సాలెవానినుండి మగ్గము, నాడిగాని పుట్టనట్లే కర్తనుండి మనస్సు అహంకారము పుట్టవు గాన భాగవతులు

కర్తయగు సంకర్షణుఁ డనుజీవునినుండె ప్రద్యుమ్నమను పేరుగల మనస్సును, ప్రద్యుమ్నమను పేరుగల మనస్సునుండి యనిరుద్ధమను పేరుగల యహంకారము పుట్టునని చెప్పుట అసంగత మని భావము.

44. మూ. విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః

విజ్ఞానాదిభావే వా=విజ్ఞానాదులున్న నన్నను, తదప్రతిషేధః=ఆదోషముల ప్రతిషేధము లేదు.

సూ. వాసుదేవుఁడు, సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు అనిరుద్ధుఁడు అను నల్వురును జీవాదులు గారు వీరందఱు విజ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజస్సులుగల యీశ్వరుని భావములే యని యంగీకరింతమన్నను పైని జెప్పిన దోషములు పట్టకమానవు.

వివ:- వాసుదేవాదులు నలుగురు ఈశ్వరరూపాంతరములన్నచో ఒకఁడే భగవంతుఁడైన యీశ్వరుఁడను తమ సిద్ధాంతమునకు హానియును, ఈశ్వర రూపములు నాలుగు సమానములన్నపుడు ఒకదానికంటె నొకదానికి అతిశయము లేదు గాన ఒకదానినుండి యొకటి పుట్టుట సంభవింపదు. ఇట్లు పుట్టునన్నచో పుట్టుకనాశము మొదలగు పైని జెప్పిన దోషములు పట్టకమానవని భావము.

45. మూ. విప్రతిషేధాచ్చ.

విప్రతిషేధాత్ చ=విరుద్ధకల్పనవలనను.

సూ. "జ్ఞానైశ్వర్యాదులు గుణములు. ఈ గుణములే యాత్మలు భగవత్స్వరూపములు వాసుదేవరూపములు" అని గుణములందు గుణిత్వకల్పనచేసి పరస్పరవిరోధముగాఁ జెప్పుట వలనను "నాలుగు వేదములందుఁ బరమశ్రేయస్సు పొందక శాండిల్యుఁడు ఈ శాస్త్రమును జదివెను" అని యీ విధముగా వేదనిందారూపమైన విరోధము గానిపించుటవలనను; వాసుదేవాది కల్పన సంగతముగాదు

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందు రెండవ యధ్యాయమున
స్పష్టబ్రహ్మ బోధకశ్రుతి వాక్యసమన్వయమను
రెండవ పాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

రెండవ యధ్యాయమున మూఁడవపాదము
పంచమహాభూత జీవశ్రుతి విరోధ పరిహారమము

## ౧. వియదధికరణము

1. సూ, న వియ దశ్రుతేః

అశ్రుతేః = శ్రుతియందుఁజెప్పకపోవుటవలన, వియత్=ఆకాశము, న= పుట్టుకలేనిది.

సూ. ఉత్పత్తి ప్రకరణములో పంచమహాభూతములలో మూఁడవదగు తేజస్సుతో మొదలుపెట్టి నీరు అన్నము మొదలగు వాని పుట్టుకయె గాని యాకాశముయొక్క పుట్టుక మాత్రము అతీంద్రియార్థ విజ్ఞానోత్పత్తియందుఁ బ్రమాణమైన శ్రుతులందుఁ జెప్పఁబడకపోవుటవలన ఆకాశమునకుఁ బుట్టుకలేదు.

వివ:- స్వమతమందు పరులచే శ్రుతివాక్యములందుఁ జూపు విరోధముల కీపాదమునందు సమాధానము చెప్పఁబడుచున్నది. ఇది పూర్వపక్షసూత్రము. బ్రహ్మమునకు పుట్టుక లేనట్లే స్వమతమునందలి ప్రధానపురుషేశ్వరులకును యాకాశమునకును బుట్టుక లేదని ప్రతివాది వాదించుచున్నాఁడు.

2. సూ. అస్తి తు.

అస్తి తు=ఒకచోట శ్రుతిలోఁ జెప్పఁబడియున్నదిగదా.

సూ. "ఆ యీ యాత్మ నుండి యాకాశము పుట్టినది" అని ఛాందోగ్యోపనిషత్తులో ఆకాశమునకుఁ బుట్టుక కూడఁ జెప్పఁబడియున్నది గాన నిట్లు ఒకచోఁ బుట్టుక లేనట్లును ఒకచోటఁ బుట్టుక యున్నటులను పరస్పర విరోధముగాఁ జెప్పఁబడుటచే నీ దృశ విరోధము శ్రుతులందును గలదు.

వివ:- ఇదియుఁ బూర్వపక్ష సూత్రము. (తై. ౨. ౧) "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" ఆయీ ఆత్మనుండి ఆకాశము పుట్టినది. అని శ్రుతి.

3. సూ. గౌణ్యసంభవాత్.

అసంభవాత్ = అసంభవమగుటవలన, గౌణీ = జన్మను జెప్పిన శ్రుతి గౌణమయినది.

సూ. ఆకాశమునకు జన్మ సంభవింపదు గాన "ఘటాకాశము గృహాకాశము ఇత్యాదులందు ఒకటేయగు నాకాశము గౌణముగా భేదవ్యవహారము చేయఁబడినది "ఆకాశము పుట్టినది" అనుచోటఁ గూడ జన్మ గౌణముగాఁ జెప్పఁబడినదనవచ్చునుగదా.

వివ:- లోకముననేగాక "ఆరణ్యానాకాశేష్వాలభేరన్" (అరణ్యమృగములను ఆవరణ లేని స్థలములందు ఆలభింపవలయును) ఇత్యాది వేదస్థలములందును గౌణముగ భేదవ్యవహారము చేయఁబడినది గాన పై శ్రుతిలోఁ గూడ పుట్టుకవ్యవరింపఁబడినదని పూర్వపక్షులలో నొకని వాదము.

4. సూ. శబ్దాచ్చ.

శబ్దాత్ చ=శ్రుతివాక్యప్రమాణము వలనను.

సూ. "వాయువు ఆకాశము నిది యమృతమైనది" బ్రహ్మము ఆకాశము వలె సర్వవ్యాపి నిత్యము "ఇత్యాది శ్రుతి ప్రమాణములవలనను ఆకాశమునకుఁ బుట్టుక లేదనవచ్చును.

వివ:- వాయుశ్చాంతరిక్షం చైతదమృతం "(బృ. ౨. ౩. ౩) ఆకాశవత్సర్వగతశ్చనిత్యః" ఇత్యాది శ్రుతులలో ఆకాశమునకు అమృతత్వము (మరణరాహిత్యము) ను, బ్రహ్మముతో సమానధర్మమును జెప్పుటచే నాకాశము నిత్యము గానఁ బుట్టుక లేదని యీ పూర్వపక్షివాదము.

5. సూ. స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్.

బ్రహ్మశబ్దవత్=బ్రహ్మశబ్దమునకువలె, ఏకస్య=ఒకశబ్దమునకె, స్యాత్ చ= గౌణముఖ్యార్థములు రెండును గావచ్చును.

సూ. "తపస్సుచే బ్రహ్మమును దెలిసికొనుము తపస్సెబ్రహ్మము" (తై. ౩. ౨) అను నధికారమున అన్నాదులందు బ్రహ్మశబ్దమును గౌణార్థకముగను ఆనందమందు ముఖ్యార్థకముగను బ్రయోగించినట్లు "ఆత్మనుండి ఆకాశము పుట్టినది" అనుచోట పుట్టినది అను దానికి గౌణార్థముగను మఱొకచోట ముఖ్యార్థ

ముగను ఒకేశబ్దమునకు రెండు అర్థములు చెప్పుటకు వీలగును గాన ఆకాశము నకుఁ బుట్టుకలేదనవచ్చును.

వివ:- ఇట్లు పూర్వపక్షిచేత శ్రుతులందును విరోధము చూపఁబడినది.

6. మూ. ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః

ప్రతిజ్ఞాహానిః = శ్రుతిప్రతిజ్ఞకుహానియు, శబ్దేభ్యః=శ్రుతులవల్ల, అవ్యతిరేకాత్‌చ=విరోధము లేకపోవుటవలనను.

సూ. ఓ సౌమ్యుఁడా! ఈ సత్పదార్థమె ముందుండెను, అదియొకటి యద్వితీయమైనది", ఆ యాత్మ చూచెను, "ఆ యాత్మ తేజస్సును సృజించెను" ఇత్యాది శ్రుతి వాక్యములవలన బ్రహ్మముయొక్క కార్యములకంటె "ఇది యంతయు ఈ యాత్మ స్వరూపమైనదె", అని యాత్మను అభిన్నముగఁ జెప్పుటవల్ల "ఆత్మ చూడఁబడఁగా మననము చేయఁబడఁగాఁ దెలిసికొనఁబడగా నిది యంతయుఁ దెలియఁబడెను" అను ప్రతిజ్ఞకు హాని లేకుండుటఁబట్టి యాకాశాదులు బ్రహ్మమునుండి యుత్పన్నమయ్యెనని తెలియఁబడుచున్నది గాన శ్రుతులకు పరస్పరము విరోధములేదు.

వివ:- ఆకాశము నిత్యమై బ్రహ్మము కంటె భిన్నమైనదైనచో బ్రహ్మము తెలియఁబడఁగా నిది యంతయుఁ దెలియఁబడినది" అను ప్రతిజ్ఞకు భంగము కలుగును. ఈ ప్రతిజ్ఞ అన్నిచోట్లఁ గనిపించుచున్నది. "తస్మాద్వా ఏతస్మా నాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః" (తై. ౨. ౧) ఆయా యాత్మనుండి ఆకాశము పుట్టినది ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్నియుఁ బుట్టెను) అను క్రమముగాఁ జెప్పఁబడినది. ఆ తేజస్సును సృజించెను అనుచోట మాత్రము ఆ యాకాశమును వాయువును సృజించి పిదపవదిగా తేజస్సును సృజించెను అని యర్థము చెప్పుకొనినచో ఒకసారి మొదట ఆకాశమును సృజించినట్లు ఒకసారి మొదట తేజస్సును సృజించినట్లు చెప్పఁబడెను అది యెట్లు అను విరోధము కలుగదని తెలియునది.

8. మూ. యావద్వికారంతు విభాగో లోకవత్.

లోకవత్=లోకమందువలె, యావద్వికారంతు=వికారముగల వానికన్నిటిని భాగః=విభాగముగ అగుగడా.

సూ. వికారములు పొందునని యావత్తును విభాగముగలవి గావున మట్టి యందు కుండ, మూకుడు, పిడత మొదలగు విభాగములును సముద్రమునందు కెరటములు, నురుగు, బుడగలు మొదలగు విభాగములును ఇట్లు లోకమునందు ఉన్నట్లె ఆకాశమునం గూడ ఘటాకాశాది విభాగములు గనిపించుచున్నవి గనుక ఆకాశమునకు జన్మ లేదన రాదు.

వివః- వికారము పొందనిది యేదియు దేనినుండి విభజింపఁబడక యుండదు. ఆకాశమునకుఁ బృథివ్యాదులకంటె విభాగము గనిపించుచున్నది. అందువల్ల నాకాశము వికారమెయగును. దీనినిబట్టి దిక్కు, కాలము, మనస్సు, పరమాణువు మొదలగువానికి విభాగమున్నదని తెలియునది. "ఆత్మన ఆకాశః సంభూతః" (తై. ౨ ౧) ఆత్మనుండి యాకాశము పుట్టినది అను శ్రుతి ప్రమాణమును బట్టియు ఆత్మ స్వతస్సిద్ధమై సర్వవ్యాపకమై అతీతానాగత వర్త మానజ్ఞానము గలదై నేను అను జ్ఞానమునకుసిద్ధమై యుండుట వలన ఆత్మకు వికారమున్నదనరాదు ప్రమాతయగు నాత్మనుబట్టి ప్రమాణములు సిద్ధించు చున్నవి గాని ప్రమాణములనుబట్టి ప్రమాతయగు నాత్మ సిద్ధించుటలేదు, ఆకాశాది పదార్థము లటులగాక ప్రత్యక్షాది ప్రమాణముల వలననే సిద్ధించుచున్నవి. ఆత్మ ప్రత్యక్షాది సర్వవ్యవహారములకు పూర్వమే యున్నది గాన "పురుషః స్వయం జ్యోతిః" అనియు "తస్యభాసాసర్వ మిదం విభాతి" అని శ్రుతి తెలుపుచున్నది. "ఆకాశము అమృతమైనది" అను దానిని 'దేవతలు అమృతులు' అను వ్యవ హారమువలె నెఱుంగునది. "బ్రహ్మము ఆకాశమువలె సర్వగతము నిత్యము" అని బ్రహ్మముతో పోల్చుట "బాణము వలె సూర్యుడు పరుగెత్తుచున్నాడు" ఇత్యాదులందు తీవ్రగతిని వలె నిరతిశయ మహత్త్వమును దెలుపుటకై యటుల చెప్పబడెను, ఇట్లే అనంతత్వ సమాన శ్రుతికిని దెలియునది. 'జ్యాయానాకాశాత్' ఆకాశముకంటె బ్రహ్మము గొప్పది. ఇత్యాది శ్రుతులంబట్టి బ్రహ్మముదగ్గర నుండి చిన్న పరిణామముగల యాకాశము సిద్ధించునటులు తెలియుచున్నది గాన ఆకాశమునకుఁ బుట్టుక గలదని భావము.

## ౨. మాతరిశ్వాధికరణము

8. సూ. ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః

ఏతేన = దీనిచే, మాతరిశ్వా = గాలిసంగతియు, వ్యాఖ్యాతః = వ్యాఖ్యా నము చేయబడినది.

సూ. ఆకాశమునకుఁ బుట్టుక కలదని చెప్పుటచేత ఆకాశమునకువలె గాలికిఁగూడ జన్మ కలదని వ్యాఖ్యానము చేయఁబడినదని తెలియఁదగు

వివ:- ఆకాశమునందుఁ గల పూర్వపక్షములకు వలెనే గాలి యందలి పూర్వపక్షములకును సిద్ధాంతము ఊహించునది.

## ౩. అసంభవాధికరణము

౯. మూ అసంభవస్తు సతోఽనుపపత్తేః

సతః = సద్రూపబ్రహ్మమునకు, అనుపపత్తేః = ఉపపన్నము గాదుగాన, అసంభవః=పుట్టుకలేదు.

సూ. సద్రూపమైన బ్రహ్మమునకు జన్మ యుపపన్నముగాదుగాన ఆ బ్రహ్మమునకు జన్మలేదు.

వివ:- ఆకాశమునకు బ్రహ్మము కారణమైనట్లే బ్రహ్మమునకును మఱి యొకటి కారణమున్నదని యనుమానింతురేమో యని యీ సూత్రము చెప్పఁబడినది. బ్రహ్మముకంటె గొప్పదగునది మఱియొకటి లేదు గాన ఈ బ్రహ్మమునకు మఱియొక్క దానివలనఁ బుట్టుక సంభవముగాదు. మట్టి మొదలగు సామాన్యవస్తువులు ఘటాది విశేషవస్తువులకుఁ గారణమగుఁ గాని ఘటాది విశేష వస్తువులు మట్టి మొదలగు సామాన్యవస్తువులకుఁ గారణము గావుగాన సామాన్య మగు బ్రహ్మమునకు విశేషములగు ఆకాశాదులు కారణములుగా నేరవు. ఆకాశ మునకు బ్రహ్మమును గారణముగా నంగీకరించినట్లు బ్రహ్మమునకు మరొకటి ఏదోయొకటి కారణముగా నంగీకరించినచో దానికింకొకటి దానికింకొకటి యని కారణములను గల్పించినచో అనవస్థా దోషము సంభవింగును. ఎట్లు చూచినను బ్రహ్మమునకుఁ బుట్టుక లేదని భావము.

౧౦. మూ. తేజోఽతస్తథాహ్యాహ.

అతః గాలి నుండి, తేజః=తేజస్సు పుట్టినవి, తథా హి=అట్లే [illegible] శ్రుతి చెప్పెను.

సూ. ఈ గాలినుండి తేజస్సు పుట్టినది. ఇట్లే శ్రుతియును జెప్పెను.

వివ:- "వాయోరగ్నిః" (గాలినుండి తేజస్సు పుట్టినది) అను శ్రుతినిబట్టి [తే]జస్సునకు గాలి కారణము. "తత్తేజోఽసృజత్" "ఆ బ్రహ్మము తేజస్సును

సృజించెను" అను శ్రుతికి బ్రహ్మము పరంపరగా గాలిద్వారా తేజస్సును సృజించెను అను నర్థముగాని కేవలము బ్రహ్మమునుండియె తేజస్సు గలిగెను అను నర్థముగాదు గాన శ్రుతులకుఁ బరస్పరము విరోధము లేదని తెలియుసది.

## ౫. అబధికరణము

11. సూ. ఆపః చ

ఆపః చ=నీరును

సూ. ఇట్లే నీరును తేజస్సు నుండి పుట్టినది. ఇట్లే శ్రుతియును జెప్పుచున్నది.

వివ:- "అగ్నేరాపః" (అగ్నినుండి నీరు పుట్టెను) అని శ్రుతి. "తదపోఽసృజత్" (ఆబ్రహ్మము నీటిని సృజించెను) అని శ్రుతికి బ్రహ్మము నీటిని బరంపరగాఁ బుట్టించెను అని యే తాత్పర్యము గాన శ్రుతి విరోధము లేదు.

## ౬. పృథివ్యధికారాధికరణము

12. సూ. పృథివ్యధికారరూప శబ్దాంతరేభ్యః

అధికారరూప శబ్దాంతరేభ్యః=ప్రకరణమునుబట్టి, రూపమునుబట్టి, ఇతర శ్రుతులబట్టియు, పృథివి=అన్న మన పృథివియె

సూ. ఆ నీళ్లు అన్నమును సృజించెను అను శ్రుతిలోని యన్న శబ్దమునకుఁ బ్రకరణమునుబట్టియు రూపమునుబట్టియు, శ్రుతివాక్యములను బట్టియు, బృథివి యనియె గాని యాహారరూపమైన యన్నమని యర్థము చెప్పరాదు.

వివ:- "తా అన్న మసృజంత" (ఛాం.౬.౨.౪) ఆ నీళ్ళు అన్నమను సృజించెను) అని శ్రుతి. ఆ బ్రహ్మము తేజస్సును సృజించెను నీళ్ళు సృజించెను అని పంచభూతముల సృష్టిప్రకరణముతోఁ జెప్పఁబడుటచే ఇట అన్న పదమునకు పృథివియనిచెప్పవలయును. ఆహారాదికమునకు నల్లనిరూపము నియమముగాలేదు. భూమికి నల్లనిరూపము బాహుళ్యముగ నియమముగనున్నది. కనుక "యత్కృష్ణంతదన్నస్య" నల్లనిరూపము అన్నము యొక్క రూపము. భూమి యొక్క అనిదాని రూపమునల్లనిదని చెపఁబడుటచే ఈయన్న మనఁగా భూమియని తెలియుచున్నది, "అద్భ్యః పృథివీ" నీళ్ళనుండి పృథివి పుట్టుచున్నది. ఈ శ్రుతినిబట్టి నీళ్ళనుండి పృథివిపుట్టినదని తెలియున్నది. కానపైశ్రుతిలోని అన్న పదమునకు

్ృథివి యని చెప్పవలయును. "పృథివ్యాఓషధయ ఓషధీభ్యోఽన్నం" (పృథివి ంౘడి ఓషధులు ఓషధులనుండి అన్నము పుట్టినవి) దీనినిబట్టి పృథివినుండి అన్నము పుట్టినట్లును దెలియుచున్నది. కాని ప్రకరణ, రూప, శ్రుతివాక్యములు ండి పై శ్రుతిలోని అన్న పదమునకు పృథివి యని యర్థము చెప్పవలయునని ంవము.

## ౩. తదభిధ్యానాధికరణము

13 మూ. తదభిధ్యానా దేవతు తల్లింగాత్సః.

తదభిధ్యానాదేవ = అతడె సంకల్పించుటవలననే, తల్లింగాత్ = ఆ శ్రుతి ంగమువలన, సః=ఆ బ్రహ్మయె సృష్టికర్త.

సూ. "1. పృథివిపయి నిల్చి, పృథివిలోపలఁజొచ్చి, పృథివిచేఁ దెలియఁ కనివాఁడై, పృథివీశరీరమును ధరించి, లోపలనుండియె పృథివిని నడపించు తఁడే మన కందఱకు ఆత్మము" అని శ్రుతియందుఁ జెప్పటవలన ఆ పర ్శ్వరుఁడె యాయా యాకాశాది రూపములను బొంది యన్నిటియందుండి సంక ్పించుటవలననే సృష్టి చేయుచున్నాఁడని తెలియుచున్నది. కాని కేవలము అచే ్నములైన యాకాశవాయ్వాదులు సృష్టిచేయుటలేదు.

వివ:- 1. యఃపృథివ్యాంతిష్ఠన్, యఃపృథివ్యా అంతరో, యం పృథివీ వేద యస్యపృథివీ శరీరం, యఃపృథివీ మంతరోయమయతి" (బృ ౩. ౭. ౩) ను శ్రుతినిబట్టి ఆకాశాదులందున్న పరమేశ్వరుఁడే కాని ఆకాశాదులు కేవలము ష్టికిఁగర్తలు గావు. "సచ్చత్యచ్చాభవత్" (తై. ౨. ౬ ౧) అతఁడు ్ర్తము అమూర్తము అయ్యెను ఇత్యాదిశ్రుతులును దీనినే తెలుపుచున్నవి.

## ౪. విపర్యయాధికరణము

14. మూ. విపర్యయేణతు క్రమోఽత ఉపపద్యతేచ.

విపర్యయేణతు = తలక్రిందుగనె, క్రమః = ప్రళయక్రమమును, అతః = మువల్ల, ఉపపద్యతేచ=ఉపపన్నమగుచున్నదిగూడ.

సూ. ఏక్రమము ననుసరించి యుత్పత్తిగలిగినదో యాక్రమమునకంటె రీతమగు క్రమముననుసరించి ప్రళయము జరుగుట యుపపన్నమగుచున్నది.

వివ:- ఆత్మనుండి, ఆకాశము; ఆకాశమునుండి వాయువు; వాయువు నుండి అగ్ని; అగ్నినుండి జలము; జలమునుండి భూమి; భూమినుండి ఓషధులు; ఓషధులనుండి అన్నము; అన్నమునుండి ప్రాణులు పుట్టుట క్రమము. దీనికి వ్యతిరేకముగా ప్రళయక్రమము జరుగును. ప్రాణులు అన్నమందు, అన్నము ఓషధులందు, ఓషధులు భూమియందు; భూమిజలమందు; జలము అగ్నియందు; అగ్ని వాయువునందు; వాయువు ఆకాశమునందు; ఆకాశము బ్రహ్మమందు లయించును. "జగతః ప్రతిష్ఠాదేవర్షే పృథివ్యప్సుప్రలీయతే, జ్యోతిష్యాపః ప్రలీయంతే, జ్యోతిర్వాయౌప్రలీయతే, వాయుశ్చలీయతేవ్యోమ్ని తచ్చావ్యక్తే ప్రలీయతే, అవ్యక్తంపురుషే బ్రహ్మన్, నిష్కలే సంప్రలీయతే" అని స్మృతులును ఈ సంగతినే తెలుపుచున్నవి

## ౫. అంతరా విజ్ఞానాధికరణము

15 సూ. అంతరా విజ్ఞానమనసీక్రమేణ తల్లింగాదితి చేన్నావిశేషాత్.

విజ్ఞానమనసీ=విజ్ఞానమును మనస్సులును. అంతరా=మధ్యగా చెప్పఁబడిన, క్రమేణ=సక్రమముచే, తల్లింగాత్ = ఆ లింగమునుబట్టి, ఇతిచేత్ = అన్నచో, అవిశేషాత్=ఎట్లన్నను విశేషములేకపోవుటవలన, న=అట్టిదోషములేదు.

సూ. 1. "ఈ పరమేశ్వరునుండి ప్రాణములు, మనస్సు, సర్వేంద్రియములును, ఆకాశము, వాయువు, జ్యోతిస్సు, నీరు, సర్వమును ధరించు భూమియుఁ బుట్టుచున్నవి" ఇత్యాది శ్రుతి వాక్యములనుబట్టి బుద్ధి మనస్సు ఇంద్రియములు పరమేశ్వరునికిని భూతములకును మధ్యఁ జెప్పఁబడిన యీ క్రమముచేఁ బూర్వము చెప్పఁబడిన భూతముల యుత్పత్తిక్రమమునకు భంగము కలుగునన్నచో బుద్ధి మొదలగునవి భూతములకంటె అభిన్నములన్నను భిన్నములన్నను విశేషము లేకపోవుటవలన భూతములయుత్పత్తి క్రమమునకు భంగములేదు.

వివ:- 1. "ఏతస్మాజ్జాయతే ప్రాణోమనః సర్వేంద్రియాణిచ ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ" (ముండ. 2 1. 3) అని శ్రుతి "అన్నమయంహి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వాక్" (ఛాం. 6. 5. 4) ఓ సౌమ్యుఁడా! మనస్సు అన్న రూపమైనది, ప్రాణము నీటిరూపమైనది, వాక్కు తేజోరూపమైనది అను శ్రుతినిబట్టి మనస్సు మొదలైనవి భౌతికములనవచ్చును. కాన అప్పుడు భూతోత్పత్తి క్రమమునకు భంగములేదు. పోని అభౌతములు

గావన్నచో మొదట మనస్సు మొదలైనవి పుట్టినపిదపనే భూతములు పుట్టె ననవచ్చును గాన అప్పుడు భూతోత్పత్తిక్రమములో విశేషము గలుగదు గాన భూతోత్పత్తిక్రమమునకు భంగము లేదని భావము.

## ౧౦ చరాచరవ్యపాశ్రయాధికరణము

16 మూ. చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావ భావిత్వాత్.

చరాచరవ్యపాశ్రయస్తు = జీవుని జన్మమరణములు చరాచరరూపముల ఆశ్రయించినవి. తద్భావభావిత్వాత్=అట్టి భావములను భావించుటవలన, తద్వ్యపదేశస్తు=జన్మమరణవ్యవహారమైతే, భాక్తః=గౌణమై, స్యాత్=అగును.

సూ. చరాచర రూపశరీరములు గనిపించుటయె జన్మమనియు, ఆ శరీరములు గనిపింపకపోవుటయె మృత్యువనియు వ్యవహారముఁ గలుగుచుండుటవలన చరాచరశరీరముల నాశ్రయించి కలిగిన "దేవదత్తుఁడు పుట్టెను, దేవదత్తుఁడు చనిపోయెను" మొదలగు వ్యవహారములు గౌణములు గాన దేవదత్తుని శరీరము కనిపించుచుండెను, దేవదత్తుని శరీరము కనిపించుటలేదు అనియె పై వ్యవహారముల కర్థము కనుక జీవునికి జన్మమరణములు లేవు.

## ౧౧. ఆత్మాధికరణము

17. మూ. నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః

అశ్రుతేః=ఉత్పత్తిప్రకరణములోఁ జెప్పకపోవుటవలనను, తాభ్యః=శ్రుతులఁ బట్టి నిత్యత్వాచ్చ=నిత్యమగుటవలనను, ఆత్మ=జీవాత్మ, న=పుట్టుకలేనిది.

సూ. ఉత్పత్తి ప్రకరణములోఁ జెప్పకపోవుటవలనను, "1. జీవుఁడు చనిపోఁడు" "2 పుట్టఁడు చావఁడు జ్ఞానముగలవాఁడు" 3 "ఈ యాత్మ పుట్టనిది నిత్యము శాశ్వతము ప్రాతది" అ బ్రహ్మము నీవై యున్నావు" నేను బ్రహ్మమనై యున్నాను" ఇత్యాది శ్రుతులనుబట్టి నిత్యుఁడని తెలియుటవలనను జీవాత్మకుఁ బుట్టుకయుఁ జావునులేవు "అజోనిత్యః శాశ్వతో౽యం పురాణః (కఠ. ౨ ౧౮) అని శ్రుతి.

## ౧౨. జ్ఞాధికరణము

18. మూ. జ్ఞో౽తఏవ

అతఏవ—పుట్టుకలేనివాడు గనుకనె జ్ఞః=చైతన్యముగలవాఁడు.

సూ. పుట్టుకలేనివాఁడగుటనలననె యీ జీవాత్మuఁడు నిత్యము చైతన్యము గలవాఁడు

వివ:- "యద్వైతన్నపశ్యతి, పశ్యన్వైతన్నపశ్యతి నహిద్రష్టుర్దృష్టేర్విపరిలోపోవిద్యతేఽవినాశిత్వాన్నతు తద్ద్వితీయమస్తితతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్ (బృ. ౪. ౩ ౨౩) నిద్రలోఁ జూచుట లేదనునది యెట్లనఁగా, అందు చూచుచునే చూచుటలేదు. ద్రష్టకువినాశము లేకపోవుటవలన దృష్టికిని వినాశములేదు. ఆ ద్రష్టకంటె వేఱైభిన్నముగాఁ జూడవలసిన రెండవపదార్థమేదియులేదు. అను శ్రుతిని బట్టి నిద్రాద్యవస్థలలో విషయములు లేకపోవుటచే జ్ఞానము లేదని వ్యవహారము గలుగుచున్నదే గాని చైతన్యము లేకపోవుటచేఁగాదని తెలియుచున్నది గాన జీవుఁడు నిత్యము చైతన్యము గలవాఁడని భావము.

## ౧౨. ఉత్క్రాంతిగత్యధికరణము

19. సూ. ఉత్క్రాంతిగత్యాగతీనాం.

ఉత్క్రాంతి = దేహమువిడుచుట, గతి = లోకాంతరగతి ఆగతీనాం= భూలోకాగమములయొక్క శ్రుతివల్ల.

సూ శరీరములను విడుచుచు, ఇతరలోకములకుఁ బోవుచు, ఈ భూలోక శరీరములఁ బొందుచునుండుటవలన జీవాత్మ అణుపరిణామముగలదని చెప్పవలయును.

వివ:- ఇది పూర్వపక్షసూత్రము.

20. సూ. స్వాత్మనాచోత్తరయోః

ఉత్తరయోః=రాకపోకలందు, స్వాత్మనా=తనఆత్మతో సంబంధముండుట వలన.

సూ. శరీరమందున్న యధికారమునే విడుచుటయే శరీరమును విడుచుట యగును గాని యసలు ఆత్మకుఁ జలనము లేదు గాన అణుపరిమాణము గలది గాదన్నను ఇతరలోకములకుఁ బోవుటలోను భూలోక శరీరములను బొందుటలోను ఆత్మకు సంబంధముండుటవలన ఆత్మ అణుపరిమాణము గలదనవచ్చును.

వివ:- ఇది పూర్వపక్షమును స్థాపించు సూత్రము.

౮౧. మూ. నాణురతచ్ఛ్రుతేరితిచేన్నేతరాధికారాత్.

అతచ్ఛ్రుతేః=అణు శ్రుతి లేకపోవుటవలన, అణుః=ఆత్మ అణువు, న ఇతి చేత్=కాదన్నదో, ఇతరాధికారాత్=ఆ ఆత్మ ఇతరమగు బ్రహ్మప్రకరణమును జెప్పఁబడుటచే, న=ఈ యాత్మ అణువుగాదనరాదు

సూ "ఈ యాత్మ వ్యాపకమైనగి పుట్టుకలేనిది" ఇత్యాది శ్రుతులనుబట్టి యాత్మ అణుపరిమాణము గలదిగాదన్నచో వ్యాపకమైనదిగాఁ జెప్పఁబడిన యా శ్రుతి బ్రహ్మప్రకరణమునఁ జెప్పఁబడినది గాన అక్కడఁ జెప్పఁబడిన యాత్మ బ్రహ్మమే గాన జీవాత్మకు అణ పరిమాణము గలదని చెప్పుటలో విరోధములేదు.

వివ:- "సవాఏష మహానజ ఆత్మా" (బృ ४. ४ ౨౨) అని శ్రుతి. ఇదియుఁ బూర్వపక్షమును స్థాపించు సూత్రమె.

౨౨. మూ. స్వశబ్దోన్మానాభ్యాంచ.

స్వశబ్దోన్మానాభ్యాంచ=అణుశబ్దమునుబట్టి తక్కువ పరిమాణము గలదని చెప్పుటనుబట్టియు.

సూ. 1. ఈ యణుపరిమాణముగల యాత్మ మనస్సుచేఁ దెలియఁ దగినది" అని శ్రుతియందు అణువుగఁ జెప్పుటచేతను 2. కట్టిచివర వేసిన యుపములు కొనయంత పరిమాణముగలదిగను అంతకన్నఁ దక్కువ పరిమాణముగలదిగను ఆత్మ చూడఁబడుచున్నది అని శ్రుతియందుఁ దక్కువ పరిమాణమున్నట్లు చెప్పఁబడుటచేతను ఆత్మ అణుపరిమాణముగలదనియె చెప్పవలయును.

వివ.- ఇదియుఁ బూర్వపక్షస్థాపక సూత్రమె.

మూ. అవిరోధశ్చందనవత్.

చందనవత్=గందపుబొట్టువలె అవిరోధః=దానికి విరోధములేదు

సూ. శరీరమునఁ బెట్టుకొన్న గందపుబొట్టు ఒక్కచోటనే యుండియు శరీరమంతకు సుఖమును గలిగించునట్లు అణువైన యాత్మ శరీరమున నొక చోటనెయుండి శరీరమునకంతకు సుఖదుఃఖాదులను గలిగించుటలో విరోధము లేదు గానను ఆత్మ అణుపరిమాణము గలదియె.

వివ:- ఇదియుఁ బూర్వపక్షస్థాపక సూత్రమె.

24. మూ. అవస్థితి వై శేష్యాదితిచేన్నాభ్యుపగమాద్హృదిహి.

అవస్థితివై శేష్యాత్ = ఉండుటలోవి శేషమును ఉండుటవల్ల, ఇతిచేత్= అన్నచో, న=అట్లనరాదు. హృది=హృదయ మందు, అభ్యుపగమాత్ హి=అంగీకరించుటవల్ల

సూ. గంధపుబొట్టు ఒక విశేషస్థలమందు మాత్రమె యుండి శరీరమున నంతకు సుఖమును గలిగించుచున్నది ఆత్మ యట్లుగాక చర్మమువలె శరీరమంతట వ్యాపించియుండవచ్చుఁ గాన గంధపుఁబొట్టునకు ఆత్మకును ఆ స్థితిలో విశేషముండుటవలన సామ్యము చెప్పుట గుదురదన్నచో 1. "ఈ యాత్మ హృదయమందున్నది" ఇత్యాద శ్రుతులనుబట్టి యాత్మకుఁగూడ హృదయము మాత్రమె విశేషస్థలమని తెలియుచున్నది గానఁ బైని జెప్పిన మంచి గంధపుఁ బొట్టు దృష్టాంతము సరిపోవుచున్నది గనుక ఆత్మ యణుపరిమాణము గలదనుటలో సందేహములేదు.

వివ.- 1. "హృదిహ్యేష ఆత్మా" (ప్ర ౩ ౬) అని శ్రుతి. ఇదియు బూర్వపక్షస్థాపకసూత్రమె.

25. మూ. గుణాద్వాలోకవత్.

లోకవత్=లోకమందువలె, గుణాత్ వా=చైతన్యగుణమువల్లఁగాని.

సూ. లోకమున దీపము మొదలగునవి యొకచోటనె యుండి కాంతిచే నింటినంతను బ్రకాశింపఁజేయునట్లు ఆత్మయును ఒకచోటనె యుండి దన చైతన్య గుణమువల్లఁగాని శరీరమునంతను జైతన్యవంతముగఁ జేయఁగలదు.

వివ:- ఇదియుఁ బూర్వపక్ష స్థాపకసూత్రమె.

26. మూ. వ్యతిరేకోగంధవత్.

గంధవత్=గంధమువలె, వ్యతిరేకః=విడిపోయియుండును.

సూ. పువ్వులు మొదలగునవి యొకచోటనె యుండి కదలకున్నను వాని నుండి విడిపోయి గంధము ఎల్లచోట వ్యాపించినట్లు జీవాత్మ హృదయమందుండి గదలకయున్నను దానినుండి విడిపోయి చైతన్యగుణము శరీరమునంతను వ్యాపింపవచ్చును గాన ఆత్మ యణువనుటలో బాధలేదు.

27. మూ. తథాచ దర్శయతి.

తథాచ=అట్లును, దర్శయతి=శ్రుతిచూపుచున్నది.

సూ ఆత్మ హృదయమున నున్నదనియు అణుపరిమాణముగలదనియుఁ జెప్పుటయేగాక 1. "ఆత్మ వెంట్రుకల వఱకు గోళ్ల చివరల వఱకు వ్యాపించి యున్నది" యని శ్రుతియుఁ జూపుచున్నది.

వివ:. 1. "ఆలోమభ్య ఆనఖాగ్రేభ్యః" (ఛా. ౮. ౮. ౧) అని శ్రుతి. ఇదియుఁ బూర్వపక్ష స్థాపకసూత్రమె

28. పృథగుపదేశాత్.

పృథగుపదేశాత్=వేఱుగానుపదేశించుటవలన.

సూ. "ఆత్మ ప్రజ్ఞచే శరీరమును బొంది సుఖదుఃఖములఁ బొందుచున్నది" ఇత్యాది శ్రుతులందు ఆత్మను గర్తగాను ప్రజ్ఞను గారణముగను జెప్పి ఆత్మ కంటెఁ జైతన్యమును వేఱుగ నుపదేశించుటవలనను ఆత్మ చైతన్యముచేతనే శరీరము నంతను వ్యాపించియున్నదని తెలియుచున్నది.

వివ:- ఈ పై సూత్రములచే ఆత్మకు అణుపరిమాణమును పూర్వపక్షి స్థాపించెను "ప్రజ్ఞయాశరీరం సమారుహ్య" (కౌషీ. ౩. ౬) అని శ్రుతి.

29. మూ. తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్.

ప్రాజ్ఞవత్ = సగుణబ్రహ్మమునకు వలె. తద్గుణసారత్వాత్తు=ఇచ్ఛాద్వేషాది గుణములచేసారముగుటవల్లను, తద్వ్యపదేశః=అణుత్వవ్యపదేశము చేయబడెను.

సూ సగుణోపాసనలందు నిర్గుణుఁడగు పరమేశ్వరునికి ఉపాధిగుణములఁ బట్టి యణుత్వాదిరూపములు చెప్పఁబడినట్లు జీవునికిని అతని యుపాధియగు బుద్ధియొక్క ఇచ్ఛాద్వేషాదిగుణములను ఆధారముగఁ జేసికొని కర్తృత్వభోక్తృ త్వాది సంసారిరూపములను బోధించినపుడు అణుత్వవ్యవహారము చేయఁబడినది గాని వాస్తవముగ జీవుడు అణుపరిమాణముగలవాఁడు గాఁదు.

వివ:- ఇది సిద్ధాంతసూత్రము, జీవునికిఁ బుట్టుక యెందును జెప్పఁబడ లేదు. బ్రహ్మమె భూతములను బ్రవేశించి ఆ భూతముల రూపములఁ బొందునని యుపదేశింపఁ బడుటవలనఁ బరబ్రహ్మమె జీవుఁడు. పరబ్రహ్మము వ్యాపియైనట్లు జీవుఁడును వ్యాపియె "సవా ఏష మహా నజ ఆత్మాయోఽయం విజ్ఞానమయః

ప్రాణేషు" (బృ ४ ३ ౨౨) ప్రాణములందు విజ్ఞానరూపముగనున్న యీ యాత్మ వ్యాపకమైనది పుట్టుకలేనిది. ఇత్యాది శ్రుతులు స్మృతులు జీవుఁడు వ్యాపకుఁడని తెలుపుచున్నవి. జీవుఁడణువన్నచో శరీరమంతట వేదన వ్యాప్త మగుట యనుపపన్నమగును చర్మము శరీరమంతటనున్నది గాన ఆ వేదన శరీరమంతట నుపపన్నమగునన్నచో ముల్లు చర్మమున ఒకచోట గ్రుచ్చుకొన్నను చర్మము శరీరమంతట నున్నది గాన శరీరమునకంతట ఆ ముల్లు బాధ కలి గింపవలసియుండును. ముల్లు గ్రుచ్చుకొన్ననాఁడు గ్రుచ్చుకొన్న ప్రదేశమునందె గాని శరీరమంతట బాధ ననుభవించుటలేదు: గుణము గుణియొక్క ప్రదేశమున మాత్రమె యున్నది గాన అణువునకు గుణత్వమునుబట్టి వ్యాపించుట తగదు. గుణము తన కాశ్రయమగు గుణిని వదలినచో దానికి గుణత్వమె పోవును గాన గంధత్వగుణమునుబట్టి అణువగు జీవుడు శరీరమంతట వ్యాపించినట్లు చెప్పుటయు సంగతముగాదు దట్టమైన తేజస్సు దీపము పలుచని తేజస్సు కాంతి గాన కాంతియు ద్రవ్యము ఆ ద్రవ్యమె వ్యాపించినది గాన ఒకచోటనున్న దీపమునుండి వేఱుగా కాంతి వ్యాపించుచున్నట్లు అణువగు జీవునుండి చైతన్యము వ్యాపించు చున్నదని దీపకాంతి దృష్టాంతమును దగదు. గంధము పృథివిగుణము నీటి యందును గాలి యందును గనిపించు గుణము పృథివిదె గాని నీటిదియు గాలి దియుఁ గాదు కాన నీటిలోను గాలిలోను పృథివి గలిసియున్నది గాన గంధము పృథివిని విడిచి గాలిలోను నీళ్ళలోను గలిసినదనరాదు. కాన దీనిబట్టి అణువైన జీవునిని విడిచి చైతన్యము శరీరమంతట వ్యాపించినదనియుఁ జెప్పరాదని భావము. జీవునికి చైతన్యమునకును గుణగుణి భావములేదు. ఉష్ణరూపమైన యగ్నిపలె జీవుఁడు చైతన్యస్వరూపుఁడు గాన సమస్త శరీరమందును చైతన్య మున్నది. "వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్యచ, భాగో జీవః స విజ్ఞేయః స చానంత్యాయ కల్పతే" (శ్వే. ౫ ౯) తోక చివరి భాగమును నూఱు భాగములుగాఁ జేయఁగానైన భాగమె జీవుఁడు అతఁడు అనంతుఁడుగఁ గల్పింపఁబడుచున్నాఁడు "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" (ముండ. ౩. ౧. ౯) ఈ యాత్మ యణుపరిమాణముగలవాఁడు మనస్సుచేఁ దెలియఁ దగినవాఁడు" ఇత్యాది శ్రుతులకు "ఆత్మ తెలిసికొన శక్యము గానిదనియు ఉపాధినిబట్టి అణువుగానున్నదనియుఁ దెలుపుటయె తాత్పర్యము. "ప్రజ్ఞయా శరీరం సమారుహ్య" (కౌషీ. ౩. ౬) "ఆత్మ ప్రజ్ఞచే శరీరమును పొంది సుఖ దుఃఖాదులను బొందుచున్నది" ఇత్యాది స్థలములందును ఉపాధియైన ప్రజ్ఞా

రూపమైన బుద్ధిచే జీవుఁడు శరీరమును పొంది సుఖాదులను బొందుచున్నాఁడు" అను నర్థమునె గ్రహింపవలయు రాతిబొమ్మయొక్క శరీర మనువ్యవహారము వలెనైన గ్రహింపఁదగును. ఆత్మ ఈ శరీరమును విడిచి స్వర్గాదిలోకములఁ బొందుచు ఈ శరీరమును బొందుచున్నదను వ్యవహారము గూడ బుద్ధియొక్క యుపాధినిబట్టియె గలిగినదని తెలియవలయునని భావము.

౬౦ మూ. యావదాత్మభావిత్వాచ్చ నదోష స్తద్దర్శనాత్.

యావదాత్మభావిత్వాత్ చ = ఆత్మ యున్నంతవఱకు బుద్ధితో సంబంధ ముండుటవలనను, నదోషః=దోషములేదు, తద్దర్శనాత్ = అది శ్రుతిలో గనిపించుటవలన.

సూ. బుద్ధి గుణము లగునిచ్ఛాద్వేషాదులను ఆధారము చేసికొని జీవుఁడు సంసారమందున్నాఁడని కల్పించినపుడు భిన్నములుగా నుండు బుద్ధికిని జీవాత్మకుఁ గలుగు సంబంధము ఎప్పుడో యొకప్పుడు విడిపోవుట తప్పదు గాన బుద్ధితో నాత్మ విడిపోఁగా ఆ విడిపోయిన యాత్మ కనిపింపకపోవుటవలన అది లేకపోవుటయు సంసారమునం దుండకపోవుటయు నను దోషము ప్రాప్తించు నన్నచో జీవునికి ఆ బుద్ధితో సంబంధ మున్నంత వఱకు జీవత్వమును సంసార ప్రవృత్తియుఁబోదు గాన దోషములేదు. 1. "బుద్ధి విజ్ఞానోపాధిని బొందిన జీవుఁడు ప్రాణములందును హృదయములోపలను నుండి జ్యోతిస్స్వరూపుఁడైన పురుషుఁడై యతఁడు బుద్ధితో సమానరూపమును బొందియుభయలోకములను సంచరించుచున్నాఁడు ధ్యానించువాఁడువలెఁ జలించువాఁడువలెనున్నాఁడు" (బృ. ౪. ౩. ౭) అని శ్రుతియు జీవునికి ఉభయలోకములఁ దిరుగుచున్నను బుద్ధి సంబంధము పోవుట లేదని చూపుచున్నది.

వివ:- "1. సోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః ససమానః సన్నుభౌ లోకావను సంచరతిధ్యాయతీవ లేలాయతీవ" అని శ్రుతి అసలు వాస్తవమందు బుద్ధ్యుపాధిచేఁ గల్పింపఁబడిన స్వరూపము కంటె వేఱుగా జీవుఁడనువాఁడు లేఁడు. "నాన్యోఽతోస్తి ద్రష్టా శ్రోతామంతా విజ్ఞాతా" (బృ. ౩. ౭. ౨౩) ఈ యంతర్యామికంటె వేఱొకఁడు చూచువాఁడు గాని వినువాఁడు గాని మననము చేయువాఁడు గాని దెలిసికొనువాఁడు గాని లేడు "తత్త్వమసి" (ఛాం. ౬. ౧ ౬) ఆ బ్రహ్మము నీకేయై యున్నావు "అహం

బ్రహ్మాస్మి" (బృ. ౧ ४. ౧) నే నా బ్రహ్మమునై యున్నాను ఇత్యాది శ్రుతులనుబట్టి యీశ్వరునికంటె భిన్నమగు జీవుఁడు లేనేలేఁడు కాని బుద్ధ్యుపాధితోడి సంబంధముచేతనే మిథ్యాజ్ఞానమును దానినిబట్టి సంసారప్రవృత్తియుఁ గలుగుచున్నది కాబట్టి యెంతవఱకు బ్రహ్మాత్మత్వజ్ఞానము కలుగదో యంతవఱకు బుద్ధ్యుపాధి శమించదు "వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ తమేవ విదిత్వాతిఽమృత్యుమేతి నాన్యః పంథా విద్యతే అయనాయ" (శ్వేతా. ౩. ౮) వ్యాపకుఁడైనట్టియు సూర్యవర్ణవర్ణము గలిగినట్టియు, తమస్సునుదాటినట్టియు నా పురుషుని నెఱుఁగుదును. జీవుడు ఆ పురుషుని దెలిసికొని మృత్యువును అతిక్రమించుచున్నాఁడు, మోక్షప్రాప్తికి ఇంతకన్న మార్గాంతరములేదు. అని శ్రుతియు నిదే తెలుపుచున్నది.

౮౧. మూ. పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్.

పుంస్త్వాదివత్=పురుషత్వాదులవలె, సతః=ఉన్న, అస్య=ఈ బుద్ధికి అభివ్యక్తియోగాత్=సమయములో అభివ్యక్తియగుటవలన.

సూ. జీవునికి బుద్ధిసంబంధము నిద్రయందును ప్రళయమందును నశించును గానఁ దిరిగి జీవునికి సంసారము పొందుటకై బుద్ధిసంబంధమెట్లు సంభవించునన్నచో బాల్యాదులందుఁ బైకి స్ఫుటముగాఁ గనిపింపకపోయినను బీజరూపములుగానుండి యౌవనాదిసమయములందు సంతానోత్పాదకశక్తియు గడ్డములు మీసములు మొదలగునవి యావిర్భవించినట్లు నిద్రాప్రళయములందు బీజరూపముగా నుండి కనిపింపకున్న బుద్ధిసంబంధము మెలుకవయందును బుట్టినప్పుడును అభివ్యక్తమగును గాన దోషములేదు.

వివః- "సతిసంపద్య న విదుస్సతి సంపత్స్యామహే" (ఛా. ౬. ౯. ౨) జీవులు సత్పదార్థమందేకీభవించియు సత్పదార్థమందేకీభవించితిమని తెలియుకున్నారు. "త ఇహ వ్యాఘ్రో సింహోవా... (ఛాం. ౬. ౯. ౩) యద్యద్భవంతి తదాభవంతి" జీవులు నిద్రాప్రళయములకుఁ బూర్వము సింహవ్యాఘ్రాదిజంతువులలో నెట్లు ఉండిరో జాగ్రవదవస్థయందును సృష్టియందును అట్లే యుందురు. ఇత్యాది శ్రుతులు నా భావమునే దృఢపఱచుచున్నవని భావము.

**౮౨. మూ. నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోఽన్యతరఽనియమోవాన్యథా.**

నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగః=ఎల్లప్పుడు ఉపలబ్ధమగుటగాని ఉపలబ్ధము గాకపోవుటగాని ప్రసక్తమగును, అన్యథా = అట్లుగానిచో, అన్యతరనియమః= ఏదోయొకటి యడ్డుతప్పక కలుగుటగాని యగును.

సూ. జీవుని కుపాధియైన యంతఃకరణమె లేదన్నచో నొక్కసారియె యన్ని విషయములు ఉపలబ్ధమగుటగాని యెల్లప్పుడు నుపలబ్ధముగాకుండుటగాని కలుగవలసివచ్చును. మఱియు ఆత్మ ప్రవర్తించునపుడు ఇంద్రియము లాత్మకు అడ్డుతగలుటగాని యింద్రియములు ప్రవర్తించునపుడు ఇంద్రియముల కాత్మ యడ్డుతగులుటగాని సంభవించును గాన- వివిధ వ్యాపారములనుబట్టి మన స్సనియు బుద్ధియనియు విజ్ఞానమనియుఁ జిత్తమనియు నామాంతరములుగల యంతఃకరణమును నంగీకరింపకతప్పదు.

వివ:- సంకల్పవికల్పాది వ్యాపారములుగల దానిని మనస్సందురు. నిశ్చయవ్యాపారముగలది బుద్ధి, గర్వ వృత్తిగల యహంకారము విజ్ఞానము. స్మృతిప్రధానమైనది చిత్తము. ఆత్మ వికారములేనిది గాన దాని శక్తికి ప్రతి బంధములేదు. ఇంద్రియ శక్తికిని ప్రతిబంధము లేదు. కాని మనసుయొక్క శ్రద్ధనుబట్టి ఇంద్రియము వస్తువులయెడఁ బనిచేయును. మనసునకు ఆ వస్తువు నెడల శ్రద్ధలేనిచో అప్పుడింద్రియమును బనిచేయదు. అందువలననే మనసునుబట్టియె యదివరకున్న వస్తువుగూడ ఒకసారి కనిపించుటయు ఒకసారి కనిపింపకపోవుటయు జరుగుచున్నది, "అన్యత్ర మనా అభూవం నాదర్శ మన్యత్ర మనా అభూవం నాశ్రౌషం" (బృ. ౧ ౫. ౩) విషయములు ఇంద్రియముల యెదుట నున్నను మఱియొకచోట మనస్సుగలవాఁడను గాన విననైతిని "మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతి" (బృ. ౧ ౫. ౩) మనసుచేతనే చూచు చున్నాఁడు. మనస్సుచేతనే వినుచున్నాఁడు. "కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతిః హ్రీర్ధీర్భీ రిత్యేతత్సర్వం మనఏవ" (బృ. ౧ ౫. ౩) కామము, సంకల్పము, సంశయము, శ్రద్ధయు, అశ్రద్ధయు, ధైర్యము, అధైర్యము, సిగ్గు, ప్రజ్ఞ, భయము, ఇదియంతయు మనస్సే" ఇత్యాది శ్రుతులనుబట్టి బాహ్యేంద్రియములకంటె భిన్నముగ మనస్సు గలదని భావము.

## ౧౪. కర్త్రధికరణము

౪౩. సూ. కర్తా శాస్త్రార్థవత్త్వాత్.

శాస్త్రార్థవత్త్వాత్=శాస్త్రములు అర్థవంతములగుటవలన, కర్తా=జీవుఁడు కర్త

సూ. 1. యజింపవలెను 2. హోమము చేయవలెను 3. దానము చేయవలెను 4. ఇతఁడేచూచువాడు మననముచేయువాఁడు తెలిసికొనువాఁడు చేయువాఁడు విజ్ఞానరూపుఁడు శరీరమను పురమున శయనించువాఁడు ఇత్యాది శాస్త్రార్థములు జీవుఁడు కర్తయని చెప్పినపుడే యర్థవంతములగునుగాన జీవుఁడు కర్తయని చెప్పవలయును.

వివ:- 1. యజేత 2. జుహుయాత్ 3. దద్యాత్ 4. ఏషహి ద్రష్టా శ్రోతా మంతాబోద్ధాకర్తా విజ్ఞానాత్మా పురుషః (ప్ర ౪. ౯) ఇత్యాదులుశాస్త్రములు

34. మూ. విహారోపదేశాత్.

విహారోపదేశాత్=విహరించునట్లుఉపదేశించుటవలన.

సూ. 1. ఆ యాత్మ యెందుఁ గామమును గోరునో దానిగూర్చి పోవుచున్నాఁడు 2. తన శరీరమునందు తన యిష్టమువచ్చినట్లు జీవుఁడు సంచరించుచున్నాఁడు ఇత్యాది శ్రుతులందు జీవప్రకరణమున స్వప్నములో విహరించుచున్నట్లు ఉపదేశించుటవలన జీవునకుఁ గర్తృత్వము గలదు.

వివ:- 1. స ఈయతేఽమృతో యత్రకామం (బృ. ౪. ౩. ౧౨) 2. స్వేశరీరే యథాకామం పరివర్తతే (బృ ౨ ౧. ౧౮) అని శ్రుతులలో నుపదేశించుటవలన జీవుడు కర్త యగుచున్నాడు.

35. మూ ఉపాదానాత్.

ఉపాదానాత్=గ్రహించుటవలన.

సూ. 1. "నిద్రలో ఈ యింద్రియముల విజ్ఞానమును విశేషజ్ఞానముచే గ్రహించి జీవుఁడు శయనించుచున్నాఁడు" 2. రాజువలె జీవుఁడు ఇంద్రియముల గ్రహించి శరీరమున సంచరించుచున్నాఁడు" ఇత్యాది శ్రుతులలో నింద్రియములను గ్రహించినట్లు చెప్పఁబడుటవలన జీవుఁడు కర్తయగును.

వివ:- 1. "తదేషాంప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ(బృ ౨౧. ౧. ౧౭) ప్రాణాన్గృహీత్వా" (బృ. ౨౧. ౧. ౧౮) ఇత్యాది శ్రుతులును జీవునికిఁ గర్తృత్వమును దెలుపుచున్నవి.

86. సూ. వ్యపదేశాచ్చ క్రియాయాం నచేన్నిర్దేశవిపర్యయః

క్రియాయాం=క్రియయందు, వ్యపదేశాత్ చ=కర్తగా వ్యవదేశించుటవలనను, నచేత్=అట్లుగానిచో, నిర్దేశవిపర్యయః = నిర్దేశించుటలో తృతీయచే మార్పుచేసి యుండును.

సూ. 1. "విజ్ఞానము=(జీవుఁడు) యజ్ఞమును చేయుచున్నది కర్మలను గూడఁ జేయుచున్నది". అని శాస్త్రమున లౌకిక వైదిక క్రియలకు కర్తగా వ్యపదేశించుటవలనను; శ్రుతిలోని విజ్ఞానపదమునకు బుద్ధియని యర్థము గాని జీవుఁడు గాదన్నచో విజ్ఞానపదమునకు బుద్ధియే యర్థమైనయెడల విజ్ఞానముచేత అని హేతువుగా నిర్దేశించి యుండును గాన నట్లు తృతీయా నిర్దేశము లేకపోవుట వలన విజ్ఞానపదమునకు జీవుఁడనియే యర్థము చేయఁదగి యుండుటవలనను జీవుఁడు కర్తయగు.

వివ:- "1. విజ్ఞానం యజ్ఞంతనుతే కర్మాణితనుతేఽపిచ" (తై ౨. ౫ ౧) అని శ్రుతి. విజ్ఞానపదమునకు బుద్ధియని యర్థమేయైనచో "తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ" (బృ, ౨ ౧ ౧౭) అనుచోటవలె విజ్ఞానేన అని తృతీయా విభక్తి నిర్దేశముచేయఁబడి యుండెడిది

87. సూ. ఉపలబ్ధివదనియమః

ఉపలబ్ధివత్ = ఇష్టానిష్టోపలబ్ధివలె, అనియమః=ఇష్టానిష్ట వస్తువులను బొందుటలో నియమములేదు.

సూ బుద్ధికంటె జీవుఁడు భిన్నుఁడైన కర్తయనినచో హితమును ఇష్టము మాత్రము నియమముగా సంపాదించునన్నచో జీవుఁడు ఆత్మజ్ఞానమును బొందుటలో స్వతంత్రుఁడయ్యును దేశకాలముల నపేక్షించిన వాఁడగుటవలన నియమము లేకుండ ఇష్టానిష్టములను బొందునట్లు ఇష్టానిష్టవస్తువులను గూడ నియమము లేకయె పొందుచున్నాఁడు గాన బుద్ధికంటె జీవుఁడు భిన్నుఁడు.

వివ:- నీరు కట్టెలు బియ్యము సహాయముగనున్నను పాచకునకు పాచకత్వమున్నట్లు దేశకాలాదుల సహాయము నపేక్షించును, కర్తకుఁ గర్తృత్వముండును సహకారి వస్తువుల వైచిత్ర్యముచుబట్టి ఇష్టానిష్టములైన పనులయందు ఆత్మకు నియమము లేకుండఁ బ్రవృత్తి కలుగునని భావము.

38. సూ. శక్తివిపర్యయాత్.

శక్తివిపర్యయాత్=శక్తివిపరీతముగఁ బ్రసక్తమగుటవలన.

సూ. సాధనమైన బుద్ధికి సాధకుఁడైన జీవునియొక్క కర్తృత్వశక్తి యున్నదన్నచో సాధనమైన బుద్ధికి సాధనశక్తిపోయి కర్తృత్వశక్తి విపరీతముగ బ్రసక్తమగుట వలన ఆ కర్తయైన బుద్ధికి ఇంకొక సాధనమును కల్పింపవలసి వచ్చును ఇది విరుద్ధము గాన బుద్ధికి సాధనత్వమె గాని కర్తృత్వము లేదు.

వివ:– "నేను వెళ్లుచున్నాను తినుచున్నాను, నేను త్రాగుచున్నాను" ఇత్యాది జ్ఞానములలో బుద్ధినె కర్తగా చెప్పవలసియుండును లోకమున కర్త కరణమును సంపాదించుకొని కార్యములందుఁ బ్రవర్తించుట గనిపించుచున్నది. ఆ బుద్ధికె యింకొక కరణమున్నదన్నచో బుద్ధిని కర్తగను ఇంకొక దానిని కరణముగను జెప్పినచో నామభేదమెగాని వస్తుభేదము లేదు గాన ఆ కర్తనె జీవుఁడని కరణమునె బుద్ధియని యనుట సమంజసమని భావము.

39. సూ. సమాధ్యభావాచ్చ.

సమాధ్యభావాత్‌చ=సమాధి లేకపోవుటవలనను.

సూ. ఉపనిషదాదులందుఁ జెప్పఁబడిన బ్రహ్మాత్మ రూపమును బొందుట యను సమాధి బుద్ధికి లేకపోవుటవలన జీవుఁడె కర్తగాని బుద్ధి కర్తగాదు.

వివ:– "ఆత్మావా అరేద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః సోఽన్వేష్టవ్యః సవిజ్ఞాసితవ్యః" (బృ. ౨. ౪. ౫) ఓసీ యాత్మయె చూడఁదగినది వినఁదగినది మననము చేయఁదగినది, ధ్యానింపదగినది, అన్వేషింపదగినది. తెలిసికొనదగినది, "ఓ మిత్యేవం ధ్యాయథ ఆత్మానం (ముండ ౨. ౨. ౬) బ్రహ్మప్రాప్తికై ఆత్మను ఓమ్ అని ధ్యానింపుఁడు. ఇత్యాది శ్రుతులందుఁ జెప్పఁబడిన బ్రహ్మాత్మ ప్రాప్తి రూపసమాధి బుద్ధికి లేకపోవుటవలన జీవుఁడె కర్తయని భావము. అది ఆత్మకు కర్తృత్వము చెప్పనపుడు సంభవింపదు.

## ౧౫. తక్షాధికరణము

40. సూ. యథాచతక్షోభయథా.

యథాచతక్షా=వడ్రంగివలె, ఉభయథా=కర్తయు సాధనము రెండునగును.

సూ ఉలి మొదలగు సాధనములతోఁ గూడినపుడు వడ్రంగి కర్తయై ఆ సాధనములు లేనప్పుడు అకర్తయై యున్నట్లు అవిద్యాకృతమయిన బుద్ధి యుపాధితోఁ గూడినపుడు ఆత్మ కర్తగను ఆ యుపాధి రహితమైనపుడు అకర్త గను ఉన్నది గాన ఆత్మకు గర్తృత్వము ఉపాధికల్పితముగాని స్వాభావికముగాదు.

వివ:- ఆత్మస్వభావసిద్ధముగఁ గర్తయని యన్నచో మోక్షము లేక పోవలసివచ్చును సంతతము సుఖదుఃఖాదులతోఁ గూడినది కావలసివచ్చును. కాననే "ధ్యాయతీవలేలాయతీవ" (బృ. ౪. ౩, ౭) ధ్యానించుచున్నదివలెఁ జరించుచున్నదివలె ఆత్మయున్నది. "ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః" (కఠ, ౩. ౪) ఇంద్రియ మనస్సులతోఁ గూడిన యాత్మను భోక్తయని మనీషులందురు అని ఇత్యాది శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. పైని జెప్పఁబడిన కర్తృత్వ ప్రతిపాదక సూత్రములు అనువాద రూపములైనవి. అవిద్యాకృతమైన కర్తృత్వమును స్వీకరించియె విధిశాస్త్రములు ప్రవర్తించును గానఁ బై సూత్రములు ఉపాధికృతకర్తృత్వమును బోధించునవియే గాని స్వాభావిక కర్తృత్వమును బోధించునవిగావని తెలియునది. అట్లు గాదన్నచో జీవుఁడు బ్రహ్మత్వమును బొందును అని యుపదేశించు శ్రుతులు వ్యర్థముగావలసివచ్చును. కాన జీవునికిఁ గర్తృత్వము ఉపాధికృతమే గాని స్వాభావికముగాదని తెలియునది.

## ౧౬. పరాయత్తాధికరణము

41. మూ. పరాత్తు తచ్ఛ్రుతేః.

తత్=ఆకర్తృత్వము, శ్రుతేః=శ్రుతినిబట్టి, పరాత్తు = ఈశ్వరునివల్లనై తె గలిగినది.

సూ. 1. "ఈ లోకములకంటె నుత్తమలోకములను బొందింపఁదలఁచిన వానిచే మంచి కర్మను, క్రింది లోకములను బొందింపఁదలఁచిన వానిచే చెడ్డ కర్మను ఈశ్వరుఁడు చేయించుచున్నాఁడు" ఇత్యాది శ్రుతులనుబట్టి, ఉపాధిచేఁ కలిగిన జీవుని కర్తృత్వమును ఈశ్వరునివల్లనె కలిగినది.

వివ:- 1. ఏషహ్యేవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషత ఏషహ్యేవాఽసాధుకర్మకారయతితం యమధోనినీషతే" (కౌషీ. ౩.౮) అని శ్రుతి.

42. మూ. కృతప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః.

విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః = విధిప్రతిషేధశాస్త్రములు వ్యర్థము గాక పోవుట మొదలగు వానిని బట్టి. కృతేప్రయత్నాపేక్షస్తు= ఈశ్వరుడు చేయఁబడిన ధర్మాధర్మ ప్రయత్నముల నపేక్షించినవాడుగనే యుండును

సూ ఈశ్వరుఁడు జీవుని ధర్మాధర్మములనుబట్టి వానిని ప్రేరేపించును గాన ఈశ్వరుని కొకని యెడలఁ బక్షపాతమును ఒకనియెడ విరోధాదులను ప్రసక్తింపవందువలననే విధి నిషేధశాస్త్రములు సార్థములగును.

వివ:- ఈశ్వరుడు ధర్మాధర్మముల నపేక్షింపనిచో పురుషకారమును దేశకాల నిమిత్తములను వ్యర్థమగుటయును. ప్రయత్నింపకయె జీవునికి ఫలసిద్ధి యగుటయు సంభవింపవలసి వచ్చును. జీవుని ధర్మాధర్మములు అనాదులు గాన పరస్పరాశ్రయ దోషమును గలుగదని భావము.

## ౧౩ అంశాధికరణము

43. సూ అంశో నానావ్యపదేశాదన్యథా చాపి దాశకితవాదిత్వ మధీయత ఏకే

నానావ్యపదేశాత్=జీవేశ్వరులవేఱుగా వ్యవహరించుటవలన, అన్యథాచాపి= మరొక రీతిగాఁగూడ. దాశకితవాదిత్వం=బ్రహ్మమునకు పల్లె, జూదరిభావమును, ఏకే=కొన్ని శాఖలవారు, అధీయతే = చదువుచున్నారు. కాని, అంశః = జీవుఁడీశ్వరునంశము.

సూ. "1. అతఁడు వెదకఁదగినవాఁడు అతఁడు తెలిసికొనఁదగినవాఁడు "2. ఇతనినే తెలిసికొని ముని యగుచున్నాఁడు" ఇత్యాది శ్రుతులందు జీవేశ్వరులను భేదముగ వ్యవహరించుటవలనను మఱియొక విధముగాఁగూడ "3. పల్లెవాండ్రును బ్రహ్మమె సేవకులును బ్రహ్మమె ఈ జూదరులును బ్రహ్మమె" అని కొన్ని శాఖలవారు జీవుని ఈశ్వరుని అభేదముగఁ జెప్పుటవలనను అగ్నికి నెరసు వలె ఈశ్వరునికి జీవుఁడంశము.

వివ:- "1. సోఽన్వేష్టవ్యః సవిజిజ్ఞాసితవ్యః (ఛాం ౮. ౭. ౧) ఏతమేవ విదిత్వామునిర్భవతి" "3. బ్రహ్మదాశా బ్రహ్మదాసా బ్రహ్మైవేమేకితవాః" ఇత్యాదిశ్రుతులు. "త్వం స్త్రీత్వంపుమానసిత్వం కుమార, ఉతవాకుమారీ" (శ్వే. ౪ ౩) "నీవు స్త్రీవి నీవు పురుషుడవు నీవు కుమారుఁడవు నీవు కుమారివి" ఇత్యాదులును బ్రహ్మ జీవులకు అభేదమును దెలుపుచున్నవి.

44. మూ. మంత్రవర్ణాచ్చ.

మంత్రవర్ణాత్ చ=మంత్రవర్ణమునుబట్టియు.

సూ. "ఈ సహస్ర శీర్షుఁడగు పురుషుఁడు ఈ ప్రపంచముకంటె గొప్పవాఁడు, సర్వభూతములును ఇతని పాదము (నాల్గవభాగము). ఇతని మూఁడు అంశములుగల విభూతి ఆకాశమునఁ గలదు" అను మంత్రవర్ణమువలనను జీవుఁడీశ్వరుని యంశమెయగు.

వివ:- "తావానస్యమహిమా తతోజ్యాయాంశ్చ పురుషః పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతందివి" (ఛాం. ౩. ౧౨. ౬) ఇది మంత్ర వర్ణము.

45. మూ. అపిచస్మర్యతే.

అపిచస్మర్యతే=స్మృతులందు స్మరింపఁబడుచున్నదిగూడ.

సూ. "జీవలోకమందు సనాతనుఁడైన జీవుఁడు నాయొక్క యంశమె" ఇత్యాది స్మృతులందును జీవుఁడు ఈశ్వరుని యంశమని చెప్పఁబడుచున్నది గూడ.

వివ:- "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అని (గీత. ౧౫. ౭)

46. మూ. ప్రకాశాది వన్నైవం పరః.

ప్రకాశాదివత్ = సూర్యప్రకాశమువలె, ఏవం=ఇట్లు, పరః=ఈశ్వరుఁడు, న=సుఖాదులు పొందఁడు.

సూ, జీవుఁడు ఈశ్వరుని యంశమన్నపుడు అంశమగు జీవుని సుఖదుఃఖాదులు అంశవంతుఁడగు నీశ్వరునియందు గలుగునుగదా యన్నచో సూర్యాదుల ప్రకాశము అంగుళిజలాదులైన యుపాధులనుబట్టి ఋజు వక్రాది భావమును చలనమునుబొందుచున్నను సూర్యాదులు ఒకే రీతిగ కదలక యుండున్నట్లు అవిద్యాద్యుపాధులందు జీవుఁడు సుఖదుఃఖాదులందుచున్నను ఈశ్వరుఁడు సుఖాదులను బొందఁడు.

47. మూ. స్మరంతిచ.

స్మరంతిచ=స్మృతులు స్మరించుచున్నవిగూడ.

సూ. వ్యాసాదిమునులును వేదమును జీవుని దుఃఖముచే నీశ్వరుఁడు దుఃఖమును బొందఁడనియుఁ జెప్పుచున్నారు.

వివ:- "తత్రయః పరమాత్మాహి సనిత్యో నిర్గుణః స్మృతః, నలిప్యతే ఫలైశ్చాపి పద్మపత్ర మివాంభసా, కర్మాత్మా త్వపరోయోఽసౌ మోక్షబంధైస్సయుజ్యతే స సప్తదశకేనాపి రాశినాయుజ్యతే పునః" జీవేశ్వరులందుఁ బరమేశ్వరుఁడు నిర్గుణుఁడని చెప్పఁబడెను. నీటిచేఁ దామరాకువలె కర్మఫలముచే నంటఁబడఁడు. కర్మల నాశ్రయించిన రెండవవాఁడగు జీవుఁడు మోక్షముతోడను బంధముతోడను గలిసియుండును. అతఁడే జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు పంచప్రాణములు మనస్సు బుద్ధి అను పదునేడిగుంపు గల లింగశరీరముతోడను గూడి యుండును. "తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి"(శ్వే. ౪.౬) ఆ జీవేశ్వరులలో నొకఁడగు జీవుడురుచి గల కర్మఫలమును భుజించుచున్నాడు. రెండవవాఁడగు నీశ్వరుఁడు భుజింపనివాఁడై సాక్షిగా నున్నాఁడు "ఏకస్తథా సర్వభూతాంతరాత్మా నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః" (కఠ. ౫ ౧౧) సూర్యునివలె ఒకఁడైన యీశ్వరుఁడు అన్ని భూతములలోపలనుండి లోక దుఃఖములచే బాహ్యుఁడై అంటబడఁడు ఇత్యాది శ్రుతులు వ్యాసాదివాక్యములు స్మృతులు నిదే సంగతి చెప్పుచున్నవని భావము.

48 సూ. అనుజ్ఞాపరిహారౌ దేహబంధాజ్జ్యోతిరాదివత్.

జ్యోతిరాదివత్=సూర్యాదిజ్యోతులవలె, దేహసంబంధాత్=దేహసంబంధము వలన, అనుజ్ఞాపరిహారౌ=విధినిషేధములు గలుగును.

సూ. ఆయా స్థానములనుబట్టి సూర్యాదులు గ్రహింపఁబడినవిగను గ్రహింపరానిగను నున్నట్లే దేహసంబంధమునుబట్టి "ధర్మము నాచరింపుము, హింస చేయకుము" ఇత్యాది విధి నిషేధములు జీవునికుపపన్నములగును.

వివ:- శుచిప్రదేశమందలి సూర్యకాంతి గ్రహింపఁదగినది అశుచి ప్రదేశములందలి సూర్యకాంతి గ్రహింపరానివి. హోమాగ్ని గ్రహింపఁదగినవి శ్మశానాగ్ని గ్రహింపరానిది గోమూత్రపురీషములు గ్రహింపదగినది. ఇతరజంతువులవి గ్రహింపరానివి సూర్యాదులు శుద్ధులై ఒకటే స్వరూపము గలవయ్యును స్థానభేదమునుబట్టి గ్రాహ్యముగను అగ్రాహ్యముగను ఉన్నట్లే జీవుఁడు పరిశుద్ధుఁ

డైనను అవిద్యాదికృత దేహసంబంధమునుబట్టి విధి నిషేధములను బొందు చున్నాఁడని భావము

49. సూ. అసంతతేశ్చాఽవ్యతికరః

అసంతతేఃచ=సంబంధము లేకపోవుటవలనను, అవ్యతికరః=సాంకర్యము లేదు.

సూ. కర్తయు భోక్తయునగు జీవునికి ఉపాధియగు బుద్ధితోడనేగాని శరీరములతో సంబంధములేదు గాన శరీరభేదములఁబట్టి కలుగు కర్మ సాంకర్యముగాని ఫలసాంకర్యముగాని లేదు.

వివ:- దేహములు వేఱైనను స్వామియగు జీవుఁడొక్కఁడే గాన అన్యకృత కర్మఫలముగూడఁ బ్రతి జీవునికిఁ గలుగు నను నాక్షేప పరిహారముకై యిది చెప్పఁబడినది.

50. సూ, ఆభాస ఏవచ

ఆభాస ఏవచ=ప్రతిబింబమేగూడ.

సూ. జీవుఁడు పరమేశ్వరుని ప్రతిబింబముగనే యున్నాఁడుగూడ.

వివ:- నీటిలోఁ బ్రతిబింబించిన సూర్యుఁడు సాక్షాత్తుగా సూర్యుడును గాఁడు సూర్యునికంటె నితరుఁడునుగాఁడు. అట్లే జీవుఁడునని తెలియునది చెఱువులో ప్రతిబింబించిన సూర్యుఁడు చెఱువు కదలికచేఁ గదలినను ఆ చెఱువులోని సూర్యుని కదలికనుబట్టి మఱియొకచోట ఘటమునఁ బ్రతిబింబించిన సూర్యుఁడు కదలనట్లే ఒకయుపాధిని బొందిన జీవుడు ఆయుపాధిలోని జీవుఁడు కదలినను మఱొక యుపాధిలోని జీవుఁడు కదలఁడు గాన జీవుల కర్మఫలములకు సాంకర్యములేదని భావము. అవిద్యచేతనే ప్రతిబింబితుఁడై జీవుఁడు సంసారమందుండును కాన అట్టి యవిద్యానాశమునకే బ్రహ్మాత్మోపదేశము చేయఁబడుచున్నది. జీవునికి ఈశ్వరునికిఁ గల సంబంధము ముఖమునకును అద్దములోఁ బ్రతిబింబించు ముఖమునకును గల సంబంధము వంటిది కాని వెండికి ముత్యపుఁజిప్పకుఁగల సంబంధమువంటిదిగాదు. ముత్యపుఁజిప్ప వెండికాదని తెలియఁగానే వెండి యచట లేదని తెలియుచున్నది. కాని అద్దముననున్నది ముఖము కాదని తెలిసినను ముఖముపోదు. ఇట్లే జీవుని సంగతియునని భావము.

51. మూ. అదృష్టాఽ నియమాత్.

అదృష్టాఽనియమాత్=అదృష్టములలో నియమములేకపోవుటవలన.

సూ. అదృష్టవశముచే జీవులకు సుఖదుఃఖములు నియమముగఁ గలుగ నన్నచో ఈ యదృష్టమీయాత్మది యా యదృష్టము మఱియొక యాత్మ యను నియమము లేకపోవుటదలనఁ గర్మఫలములకు సాంకర్యము గలుగఁ మానదు కాన జీవుని నీశ్వరుని ప్రతిబింబముగనె గ్రహింపవలయు

వివ:- అదృష్టము ఆత్మయందున్నదని కాణాదులును ప్రధానమందున్న దని సాంఖ్యులును దలచుచున్నారు. వారి మతములలో అదృష్టమునకు నియ మములేదు కాన ఒకరి సుఖము మఱియొకనికి ఒకరి దుఃఖము మఱియొకనికిఁ గలిగి సాంకర్యము గలుగునని భావము.

52. మూ. అభిసంధ్యాదిష్వపిచైవం.

అభిసంధ్యాదిష్వపిచైవం=రాగద్వేషాదులందు నిట్లే.

సూ. అదృష్టమందువలె రాగద్వేషాదులందును "నేను దానిని బొంది దను నేను దానిని త్యజించెదను" అను నియము లేకపోవుటవలనను గర్మ సాంకర్యముగలుగును గాన జీవుఁడు ఈశ్వరుని ప్రతిబింబమె.

53. మూ. ప్రదేశాదితి చేన్నాంతర్భావాత్.

ప్రదేశాత్=స్థానమునుబట్టి, ఇతిచేత్=అన్నచో అంతర్భావాత్=ఆత్మ ములంతర్భవించుటవలన, న=కాదు.

సూ. దేహాదిస్థానభేదములఁబట్టి రాగద్వేషాదులకు అదృష్టమునకున నియమవ్యవస్థ కలుగునన్నచో ఆత్మలు వ్యాపించియుండునవి గాన సర్వశరీరము లందును ఆత్మలు అంతర్భవించి యుండుటవలన ఈ శరీరమే యాత్మది దానిఁ కాదు అను నియమము తేకపోవుటవలన అట్టి వ్యవస్థ కలుగదు.

వివ:- కాన జీవుఁడు ఈశ్వరుని ప్రతిబింబమె గాన నాత్మ యొకటే గాఁ భిన్నము గాదని భావము.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందు ద్వితీయాధ్యాయమున
పంచమహాభూతజీవశ్రుతుల విరోధపరిహారమను
మూఁడవపాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

## ద్వితీయాధ్యాయమున నాల్గవపాదము

### ౧. ప్రాణోత్పత్త్యధికరణము

1. మూ తథాప్రాణాః

సూ. తథాప్రాణాః=అట్లే ప్రాణములు.

సూ. ఆకాశాదులవలెఁ బ్రాణములును బ్రహ్మమువలననె పుట్టినవి.

2. మూ. గౌణ్యసంభవాత్.

గౌణ్యసంభవాత్=గౌణార్థము సంభవింపకపోవుటవలన.

సూ. "1. ఓ భగవంతుఁడా! ఏది తెలియఁగానిది యంతయుఁ దెలియఁబడినదగును" అను శ్రుతియందు చెప్పఁబడిన బ్రహ్మము తెలియఁగా ప్రాణములు తెలియఁబడినవగును అను ప్రతిజ్ఞచేత "ఈ 2. పరమాత్మనుండి ప్రాణము పుట్టుచున్నది" అను శ్రుతియందు గౌణార్థము చెప్పుట సంభవింపకపోవుటవలన దానికి ముఖ్యార్థమె చెప్పవలయును గానఁ బ్రాణములు బ్రహ్మమువలననె పుట్టినవనవలెను.

వివ:- 1. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ముండ. ౧. ౧. ౩) ౨. "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (ముండ. ౨. ౧ ౩) అని శ్రుతులు. ఉత్పత్తిప్రకరణమందు ప్రాణసృష్టి చెప్పక మఱియొకచోట ప్రాణోత్పత్తి చెప్పుటవలన ఆ శ్రుతులకుఁ బరస్పర విరోధము గలుగుచున్నది గాన ప్రాణోత్పత్తి శ్రుతులు గౌణములగునను సందేహమును వారించుటకై యిది చెప్పఁబడినది. ప్రాణములు పుట్టనివన్నచో నవి బ్రహ్మమునకన్న భిన్నములు గాన బ్రహ్మముచే తెలియఁబడవు అప్పుడు బ్రహ్మము తెలియఁబడగా నిది యంతయుఁ దెలియఁబడు" నను శ్రుతి ప్రతిజ్ఞకు భంగము గలుగును గానఁ బ్రాణసృష్టి గౌణముగాదు ముఖ్యార్థకమనియు సిద్ధాంతీకరించుచున్నాఁడు.

3 మూ. తత్రాప్రాక్క్ష్యతేశ్చ.

తత్రాప్రాక్క్ష్యతేఃచ = ఆకాశాదిపదములకంటె ముందు వినఁబడుటవలనను

సూ. 1. "ఈ బ్రహ్మమునుండి ప్రాణము పుట్టుచున్నది మనస్సు సర్వేంద్రియములును ఆకాశము వాయువు, జ్యోతిస్సు, నీళ్ళు, విశ్వమును ధరించు భూమియును" ఇత్యాది శ్రుతులలో "పుట్టుచున్నది" మొదలగు పదములు ఆకాశాదిపదములకంటెఁ బూర్వము వినఁబడుటవల్ల ప్రాణములో సందర్భించు "పుట్టుచున్నది" ఇత్యాదిపదములు తరువాతివగు ఆకాశము మొదలగువానితో సందర్భించుటవల్ల ఆకాశాదులతో సందర్భించునప్పుడు "పుట్టుచున్నది" ఇత్యాది పదములకు ఒకచో ముఖ్యార్థమును ప్రాణముతో సందర్భించునపుడు గౌణార్థమును జెప్పుట న్యాయముగాదు గావునను "ప్రాణము పుట్టుచున్నది" అను దానికి ముఖ్యార్థమె చెప్పవలయును గాన ప్రాణము బ్రహ్మ నుండి పుట్టినదె.

వివ:- 1. "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ, ఖం వాయుర్జ్యోతిరాపఃపృథివీ విశ్వస్య ధారిణీ" (ముండ. ౨ ౧ ౩) "స ప్రాణ మసృజత, ప్రాణాచ్ఛ్రద్ధాం" (ప్రశ్న. ౬. ౪) ఆతఁడు ప్రాణమును సృజించెను ప్రాణమునుండి శ్రద్ధను "ఏతస్మాదాత్మన స్సర్వే ప్రాణాస్సర్వే లోకా స్సర్వే దేవాస్సర్వాణి భూతానిచ వ్యుచ్చరంతి" ఈ యాత్మ నుండి సర్వప్రాణములు సర్వలోకములు సర్వదేవులు సర్వభూతములును బయలు దేఱుచున్నవి ఇత్యాదులందును సృజించెను బయలుదేఱుచున్నవి అను పదములకును ఒకచో ముఖ్యార్థమును ఒకచో గౌణార్థమును జెప్పుట న్యాయముగాదు గావునను అన్ని చోట్ల ముఖ్యార్థమె చెప్పవలయును గాన బ్రహ్మమునుండి ప్రాణములు పుట్టుచున్నవనియె తెలియుచున్నదని భావము.

4. మూ. తత్పూర్వకత్వాద్వాచః.

వాచః = వాక్కు మొదలైనవి, తత్పూర్వకత్వాత్ = బ్రహ్మప్రకృతికము లగుటవల్ల.

సూ 1. "అతడు తేజస్సును సృజించెను" అను ప్రకరణములో ప్రాణముల పుట్టుక చెప్పఁబడలేదుగదా అన్నచో వాక్కు ప్రాణములు మనస్సు ఇవి బ్రహ్మము ప్రకృతిగాఁగల తేజస్సు నీరు అన్నములకుఁ బూర్వములుగాఁ జెప్పఁబడుటవలన వాక్ప్రాణ మనస్సులలోఁ బఠింపఁబడిన ప్రాణములును బ్రహ్మ

ప్రకృతికములని తెలియుచున్నది గాన ప్రాణములు బ్రహ్మమునుండి పుట్టినవె.

వివ:- 1. "తత్తేజోఽసృజత" (ఛాం. ౬.౨ ౩) అని శ్రుతి. అదియుఁ గాక "యేనాఽశ్రుతం శ్రుతం భవతి" (ఛాం. ౬. ౧ ౩) దేని దెలిసికొనుటచే వినఁబడనిది వినఁబడునో" అని యుపక్రమించి "ఐతదాత్మ్యమిదం సర్వం" (ఛాం. ౬. ౮. ౭) ఇదంతయు నీ యాత్మస్వరూపమైనదె అని ఉపసంహారముచేసి చెప్పఁబడుటవలనను ప్రాణములు బ్రహ్మకర్తృకనామరూపములోఁ జేరుటచే ప్రాణములును బ్రహ్మమునుండియే పుట్టుచున్నవని "స ప్రాణ మసృజత" (ప్రశ్న. ౬. ४) అతఁడు ప్రాణమును సృజించెను అని శ్రుతిగూడ నున్నది గాన ప్రాణములు బ్రహ్మమునుండి పుట్టినవనుటలో సందేహము లేదని భావము.

## ౨. సప్తగత్యధికరణము

౫. సూ. సప్తగతేర్విశేషితత్వాచ్చ.

గతేః=ప్రాణగతి, విశేషితత్వాత్ చ=విశేషించిచెప్పుటవలనను, సప్త=ఏడే.

సూ. శ్రుతులలో అక్కడక్కడ ప్రాణములు ఏడని యొకచోటను (ముం. ౨. ౧. ౮) ఎనిమిదని యొకచోటను, (బృ. ౩. ౨. ౧) పదని యొక చోటను పదునొకండని యొకచోటను (బృ. ౩. ౯. ४) పంద్రెండని యొక చోటను (బృ. ౨. ४. ౧౧) పదుమూఁడని యొక చోటను (బృ. ४. ౮) ఇట్లనేక విధములుగాఁ జెప్పఁబడినను 1. "ఆ యాత్మ నుండి యేడు ప్రాణములు పుట్టు చున్న" వని శ్రుతినిబట్టి తెలియుట వలనను2. "శిరస్సునందలి ప్రాణము లేడే" యని శ్రుతియందు విశేషించి చెప్పఁబడుట వలనను ప్రాణములేడే. ఈ యేడు ప్రాణములందును మిగిలినవి యంతర్భవించును.

వివ:- "సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్" (ముం. ౨. ౧ ౮) అని యేడుగను, "అష్టౌగ్రహా అతిగ్రహాః" (బృ. ౩. ౨. ౧.) అని యెనిమిదిగను "సప్తవై శీర్షణ్యాః ప్రాణాద్వావవాంచౌ" (తై. సం. ౫. ౧. ౭. ౧) అని తొమ్మిదిగను, "నవవై పురుషే ప్రాణానాభిర్దశమీ" అని పదిగను, "దశమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః" (బృ. ౩. ౯. ४) అని పదునొకండుగను, "సర్వేషాం స్పర్శానాంత్వగేకాయతనం" (బృ. ౨.४.౧౧) అని పంద్రెండుగను "చక్షుశ్చద్రష్టవ్యం" (బృ. ४. ౮) అని పదుమూఁడుగను జెప్పఁబడెను.

1. "సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్" (ముండ. ౨. ౧ ౮) 2 "సప్త వై శీర్షణ్యాః ప్రాణాః" (తై. సం ౫. ౧. ౭ ౧) అని శ్రుతులు. ఈ సూత్రము పూర్వపక్ష సూత్రము.

6. సూ. హస్తాదయస్తుస్థితేఽతోనైవమ్.

హస్తాదయఃతు=హస్తాదులైతేయున్నవి, స్థితే=ఇట్లుండగా. అతఃన ఏవం= ఏడని ఇట్లనరాదు.

సూ. శ్రుతులందు ఏడింటికంటె నెక్కువగా హస్తములు మొదలగు ప్రాణములున్నట్లు తెలియుటవలనను ఎక్కువ సంఖ్యలో తక్కువ సంఖ్య యంతర్భవించును గాని తక్కువ సంఖ్యలో ఎక్కువ సంఖ్య యంతర్భవింపదు గావునను లాఘవమునుబట్టి ప్రాణములేడే యనరాదు శ్రుతులందలి యుత్తర సంఖ్యనుబట్టి పదునొకండు ప్రాణము లగును.

వివ:- "దశేమే పురుషేప్రాణా ఆత్మైకాదశః" (బృ ౩. ౯ ౪) పురుషుని యందు ఈ పది ప్రాణము లున్నవి. ఆత్మ పదునొకండవది. ఇది యింద్రియముల ప్రకరణములోనిది గాన ఇందు ఆత్మపదమునకు మనస్సని యర్థము. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునవి బుద్ధి భేదములు వానికి విషయములైన యింద్రియములు జ్ఞానేంద్రియములైదు. పలుకుట, గ్రహించుట, నడచుట, విడచుట, అనందించుట అనునవి కర్మ భేదములు వానికి విషయములైన యింద్రియములు కర్మేంద్రియములు అయిదు. అన్నిటిని గ్రహించుచు అన్ని కాలములందుండి అనేక వృత్తులుగల మనస్సు ఒకటి. ఇట్లు మొత్తము పదునొకండు. ప్రాణశక్తితత్త్వ భేదములనుబట్టి పదునొకండె ప్రాణములు. ఏడని, ఎనిమిదని, పండ్రెండని, పదుమూడని శీర్షాది స్థానభేదమునుబట్టి చక్షురాది రంధ్రభేదములఁబట్టి చెప్పఁబడినవి. అసలు తత్త్వ మునుబట్టి పదునొకండె. మనస్సు, బుద్ధి, అహంకారము చిత్తము అని మనస్సు యొక్క వృత్తులు నాలుగని చెప్పఁబడెను గాని తత్త్వమునుబట్టి యొక్కటె. భేదకథనములోఁ దత్త్వభేదమునుబట్టి చేయుట న్యాయము గాని స్థానాది భేదము లనుబట్టి చేయుట న్యాయముగాదు గానఁ బ్రాణములు పదునొకండనుటయే యుక్తమని భావము

## 3. ప్రాణాణుత్వాధికరణము

7. మూ. అణవశ్చ.

అణవఃచ=అణువులును.

సూ ప్రాణములు అణుపరిమాణము గలవి.

వివ:_ అణువులంత పరిణామము గలవనఁగా సూక్ష్మములును బరిచ్ఛిన్నములునగును గనుక మరణకాలమున శరీరమునుండి పోవునపుడును గనిపించుట లేదని భావము.

## 4. శ్రేష్ఠాధికరణము

8 మూ. శ్రేష్ఠశ్చ.

శ్రేష్ఠఃచ=శ్రేష్ఠమగు ప్రాణమును.

సూ. ఇతరమగు వాయువులవలె ముఖ్య శ్రేష్ఠమగు ప్రాణమును బ్రహ్మమునుండి పుట్టినది.

## 5. వాయుక్రియాధికరణము

9. మూ. న వాయుక్రియే పృథగుపదేశాత్.

పృథక్=వేఱుగా, ఉపదేశాత్ = ఉపదేశించుటవలన, వాయుక్రియే=వాయువుగాని ఇంద్రియ క్రియగాని, న=గాదు.

సూ. ప్రాణమే మనోరూప బ్రహ్మముయొక్క నాల్గవపాదము అది వాయువుచే అభివ్యక్తమగుచున్నది తపించుచున్నదిగూడ "ఈ బ్రహ్మమునుండి ప్రాణము పుట్టుచున్నది మనస్సును సర్వేంద్రియములును ఆకాశము వాయువును" ఇత్యాది శ్రుతులందు వాయువు కంటె ప్రాణమును వేఱుగ నుపదేశించుటవలనఁ బ్రాణమనఁగా వాయువుగాని సాంఖ్యులు చెప్పినట్లు ఇంద్రియ వ్యాపారముగాని గాదు.

వివ:_ "ప్రాణ ఏవ బ్రహ్మణశ్చతుర్థ పాదస్సవాయునాభాతిచ తపతిచ" (ఛాం. ३. ౧౮. ४) "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ ఖం వాయుః" (ముం. ౨ ౧ ३) అని శ్రుతులు. "యఃప్రాణఃసవాయుః" ఏది

ప్రాణమో అది వాయువు అని శ్రుతి వాయువు శరీరమునుజొచ్చి ప్రాణనాది పంచావస్థలనుబొంది విశేషాకారమున నుండి ప్రాణమని చెప్పఁబడుచున్నది యని చెప్పుటకేగాని ప్రాణము వాయువు ఒక్కటే యని చెప్పుటకుఁ గాదని తెలియు నది "సామాన్యాకరణవృత్తిః ప్రాణాద్యావాయవః పంచ" పంచప్రాణములు అను వాయువులు ఇంద్రియ సముదాయముయొక్క వ్యాపారమె అని సాంఖ్యుల మతము. అనేక పక్షులు గూడి యొక పంజరమును గదలించునట్లు పదునొకం డింద్రియములు తమతమ పనులు చేసికొనుచు అన్నియునుగూడి ప్రాణవ్యాపారము చేయునని సాంఖ్యు లందురు. పక్షులవలె నింద్రియములట్లు చేయుననుటలోఁ ప్రమాణము లేకపోవుటవలనను ప్రాణనవ్యాపారము శ్రవణాది వ్యాపారముల కంటె విలక్షణమైనదగుటవలనను ఇంద్రియ వ్యాపారమె ప్రాణము గాదు గాన సాంఖ్యుల మతము యుక్తముగాదని భావము.

10. మూ. చక్షురాదివత్తుతత్సహశిష్ట్యాదిభ్యః

తత్సహ శిష్ట్యాదిభ్యః = ఇంద్రియములతోపాటు శాసింపఁబడుటవలన, చక్షురాదివత్ తు=కన్నులు మొదలయినవానివలెనే యుండును.

సూ. కన్నులు మొదలగు నింద్రియములతోపాటు శ్రుతియందు ఉపదేశింపఁబడుట లోనగుకారణములవలనఁ గన్నులు మొదలగు నింద్రియముల వలెఁ ప్రాణములును జీవునికి సాధనములెగాని స్వతంత్రములుగావు.

వివ:- లోనగు కారణములు అనుదానిలోని లోనగుపదముచే ప్రాణములు నావయవయములు జడములును గాన వానికి స్వాతంత్ర్యమును లేదని భావము.

11. మూ. అకరణత్వాచ్చ న దోష స్తథాహి దర్శయతి.

అకరణత్వాత్ చ=ఇంద్రియము గాకపోవుటవలనను, నదోషః=దోషము లేదు, తథాహి=అట్లే, దర్శయతి=చూపుచున్నది.

సూ. కన్నులు మొదలగువానికి రూపము మొదలగు విషయములున్నట్లే ప్రాణములకును విషయములుండవలయు అట్టి విషయము లేకపోవుటవలన నది ంంద్రియముకాదు ఇంద్రియము కాకపోవుటవలనను దానికింకొక విషయము కల్పింపవలసివచ్చు నను దోషము ప్రసక్తించునన్నచో 1. "ముఖ్యమగు ప్రాణము ఆ యింద్రియములనుగూర్చి పలికెను మీరు అజ్ఞానము బొందకుఁడు నేనె నా స్వరూపమును ఐదు విధములుగా విభజించి ఈ శరీరమునవలంబించి

ధరించుచున్నాను" ఇత్యాది శ్రుతులలోఁ బ్రాణమునకు శరీరధారణాది కార్యము లున్నట్లు శ్రుతి చూపుచున్నదిగానఁ బైని జెప్పిన దోషము ప్రసక్తింపదు.

వివ:- 1 తాన్వరిష్ఠః ప్రాణ ఉవాచ మామోహమాపద్యథాహమేవై తత్పంచధాత్మానం ప్రవిభజ్య తత్బాణ మవష్టభ్యవిధారయామి" ఇత్యాదులందు శరీరధారణము, శరీరలక్షణము, శరీరేంద్రియ పుష్టియు ప్రాణనిమిత్తమైన జీవుడు శరీరమందుండుట విడుచుట యను కార్యములున్నట్లు గనిపించుచున్నది గాన దానికి విషయములులేవనరాదని భావము.

12. సూ. పంచవృత్తి ర్మనోవత్ వ్యపదిశ్యతే.

మనోవత్=మనస్సునకువలె, పంచవృత్తిః = అయిదువృత్తులు గలదిగా, వ్యపదిశ్యతే=చెప్పఁబడుచున్నది.

సూ. ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతులు అను నైదు వృత్తులు మనస్సునకున్నట్లె ప్రాణములకును ప్రాణాపాన వ్యానోదాన సమానము లను నైదు వృత్తులునున్నట్లు శ్రుతులందు వ్యవహరింపఁబడుటవలనను ప్రాణములు జీవునికుపకరణములెగాని స్వతంత్రములుగావు.

వివ:- ప్రమాణము=యథార్థజ్ఞానము, విపర్యయము = భ్రాంతిజ్ఞానము, వికల్పము=ఆకాశపు సుగంధము చెవుల పిల్లికొమ్ములు మొదలైన లేని వస్తువులు ఉన్నవని చెప్పుట. నిద్రాస్మృతులు లోకప్రసిద్ధములైన విషయములె.

ప్రాణము=హృదయమున నుండియుచ్ఛ్వాసాదులను జేయుట, అపానము=గుద స్థానమున నుండి నిఃశ్వాసాదులనుజేయుట, వ్యానము=ప్రాణాపానములమధ్యనుఁ వీర్యయుక్త కర్మలనుజేయుట, ఉదానము=కంఠముననుండి యూర్ధ్వ వృత్తిగలి యుత్క్రాంతికార్యముచేయుట, సమానము=నాభిస్థానముననుండియున్న రసమును సర్వాంగములకు జేర్చుట ఇవి ప్రాణవ్యాపారములు.

## 6. శ్రేష్ఠాణుత్వాధికరణము

13. సూ. అణుశ్చ.

అణుశ్చ=అణువుగూడ.

ఈ ముఖ్యప్రాణమును అణువైనదిగూడ.

వివ:- అణుత్వమన్న సూక్ష్మత్వము పరిచ్ఛిన్నత్వమును కనుకనే మరణ సమయామలందుఁ గనిపింపదని భావము. "సమః ప్లుషిణా సమోమశకేన సమోనాగేన సమఏభిస్త్రిభిర్లోకైస్సమోఽనేన సర్వేణ" (బృ ౧. ३. ౨౨) ముఖ్యప్రాణము చిన్న పురుగుతో సమానమైనది దోమతో సమానమైనది. ఏనుఁగుతో సమానమైనది ఈ మూడు లోకములతో సమానమైనది ఈ జగమంతతో సమానమైనది. ఇత్యాది శ్రుతులందు సమష్టి వ్యష్టిరూపమైన హైరణ్యగర్భ స్వరూపప్రాణముచే వ్యాపకత్వము చెప్పఁబడినది గాని యాధ్యాత్మిక ప్రాణస్వరూపముచే చెప్పఁబడలేదు గాన దోషము లేదని తెలియునది.

## 7. జ్యోతిరాద్యధికరణము

14. సూ. జ్యోతిరాద్యధిష్ఠానంతు తదామననాత్.

**తదామననాత్=అట్లు చెప్పుటవలన, జ్యోతిరాద్యధిష్ఠానంతు=అగ్న్యాద్యధిష్ఠాన దేవతలె చేయును.**

సూ. "అగ్ని వాక్కు రూపముదాల్చి ముఖమును బ్రవేశించెను" ఇత్యాదులలో అగ్ని మొదలైన యధిష్ఠాన దేవతలు ఆయా యింద్రియములలోఁ బ్రవేశించి కార్యములను జేయఁగలుగుచున్నవని చెప్పఁబడుటవలనఁ బ్రాణములును అధిష్ఠాన దేవతలనుబట్టియేగాని స్వతంత్రముగఁ గార్యకరణశక్తి గలిగినవిగావు

వివ:- "అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్" (ఐత. ౨. ४) ఇత్యాదులు శ్రుతులు 15 సూ. "పిదపఁ గన్ను ఈ కంటి యాకాశమును బ్రకాశించినప్పుడు ఆ పురుషుడు కంటి నభిమానించు ద్రష్టయగును. అతనికిఁ గన్ను చూచుటకే యగును. పుటి గంధము వాసన చూతునని తలచు ఆ జీవుడు గంధముకొఱకు ఘ్రాణేంద్రియమును స్వీకరించును" (ఐత. ౨ ४) ఇత్యాది శ్రుతులనుబట్టి ప్రాణవంతుఁడు భోక్తయగు జీవుని సంబంధము గలిగినవాఁడని తెలియుటవలన ఇంద్రియములు భోగసాధనములును జీవుఁడు భోక్తయు నగుచున్నాఁడు. కాని అధిష్ఠాన దేవతలు మాత్రము అనుభవించునవిగానేరవు.

వివ:- "అథయత్రైతదాకాశ మనువిషణ్ణంచక్షుస్స చాక్షుషః పురుషో దర్శనాయ చక్షురథయో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మాగంధాయ" (ఛాం. 8. ౧౨ ४) ఇత్యాదులు శ్రుతులు.

16. మూ. తస్యచనిత్యత్వాత్.

తస్య=ఆజీవుఁడె, నిత్యత్వాత్=నియతముగ ...ండు వాఁడగుటవలన.

సూ తన కర్మలచే సంపాదించుకొన్న యీ శరీరమందు జీవుఁడె సుఖదుఃఖాదుల నియతముగ ననుభవించువాఁడగుటవలన దేవతలు కరణములకు సహాయము చేయువారు. మహైశ్వర్యమందుండు వారేగాని వారినీచమగుఫల ములననుభవించువారుగారుగాన అధిష్ఠాన దేవతలకిట భోగములేదు.

వివ :- "పుణ్యమేవాముం గచ్ఛతి న హవై దేవాన్ పాపం గచ్ఛతి" (బృ. ౧ ౫ ౩) పుణ్యమె వీనిని పొందును గాని దేవతలనుగూర్చి పాపము పొందదు అను శ్రుతియు దేవతలకు నీచఫలములు లేవని తెలుపుచున్నది.

## 8. ఇంద్రియాధికరణము

17. మూ త ఇంద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్.

శ్రేష్ఠాత్=ముఖ్యప్రాణముకంటే, అన్యత్ర=వేఱుగ, వ్యపదేశాత్=వ్యప దేశించుటవలన, చక్షురాదులె ఇంద్రియాణి=ఇంద్రియములు.

సూ "ఈ యాత్మనుండి ప్రాణము పుట్టుచున్నది మనస్సును సర్వేం ద్రియములును" ఇత్యాదులందు ముఖ్యప్రాణముకంటె ఏకాదశేంద్రియములను వేఱుగఁ జెప్పుటవలన అవి యింద్రియములనఁబడుచున్నవి. వాని కంటెఁ ద త్త్వములో భేదము గనిపించుటవలనఁ బ్రాణము ఇంద్రియముగాదు.

వివ :- "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ" ఇత్యాదుల శ్రుతులు.

18. మూ. భేదశ్రుతేః.

భేదశ్రుతేః=ప్రాణమును వేఱుగ చెప్పు శ్రుతివలన.

సూ. శ్రుతులలో, వాగాదులైన యింద్రియములు పదునొకండు కంటె భిన్నముగఁ జెప్పఁబడుటవల్ల ప్రాణము ఇంద్రియముగాదు.

19. మూ. వైలక్షణ్యాచ్చ.

వైలక్షణ్యాచ్చ=విలక్షణముగా నుండుటవలనను.

సూ. నిద్రాద్యవస్థలందు నాగాదులైన యింద్రియములకంటె విలక్షణముగనుండి దేహధారణాది కర్మలను జేయుట వలనను ప్రాణము ఇంద్రియముకంటె భిన్నమైనది గాన నది యింద్రియముగాదు.

వివ:- ప్రాణము ఇంద్రియాదులవలె ఉపకరణముగాదు కాని రాజునకు మంత్రివలె జీవునికి ఇంద్రియాది వ్యాపారములు చేయించునది యని భావము.

## 9. సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము

10. సూ. సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్.

త్రివృత్కుర్వతః=ఈశ్వరుఁడె, త్రివృత్కరణముచేసినట్లు, ఉపదేశాత్=ఉపదేశించుటవలన, సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు=సంజ్ఞాకల్పనయైతే ఈశ్వరునిదే

సూ. "ఇప్పుడు నేను తేజస్సు నీరు అన్నము అను నీ ముగ్గురు దేవతలను ఈ జీవాత్మరూపముతోఁ బ్రవేశించి నామరూపములను స్పష్టపఱచెదను" అని యీ దేవత చూచెను అనియు వాటిలో ఒక్కొక్కదానిని మూటితోఁగూడిన దానినిగా మూటితోఁగూడినదానినిగాఁ జేయుదును" అనియు శ్రుతియందుఁ బరమేశ్వరుఁడె నామరూపములను జేసి నట్లును త్రివృత్కరణము చేసినట్లును ఉపదేశించుటవలన పరమేశ్వరునిచేతనె నామరూపాది కల్పనము చేయఁబడుచున్నది గాని జీవునిచేఁగాదు.

వివ :- 1. "సేయందేవతైక్షత హంతాహమిమాస్తిస్రోదేవతా అనేనజీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛాం. ఉ. ౩. ౨) అని శ్రుతి. 2 "తాసాంత్రివృతంత్రివృతమేకైకాంకరవాణి" అనియు శ్రుతి. జీవుఁడు గిరినదీసముద్రాదుల నామరూపాదులను జేయఁలేడు గానఁ బరమేశ్వరుఁడే గాని జీవుఁడు నామరూపాదులు జేయఁలేడని భావము.

వివ:- "త్రివృత్కరణము=పృథివ్యప్తేజస్సలిలములు అను మూఁడుభూతములలో ఒక్కొక్కదానిని రెండు భాగములు నేసి అందొక భాగము నట్లేయుంచి రెండవభాగమును దిరుగ రెండు భాగములుచేసి మొదటి సగముతోఁ దిరుగ రెండు భాగము చేసిన భాగమును ఒక్కొక్కటి కలపవలయును. వీనిలో ఏ భూతముయొక్క భాగము ఎక్కువయుండునో దానికిఁ బ్రాధాన్యమును ఎక్కువ భాగముగల భూతమునుబట్టి దానికా పేరును గలుగును. అందుచే ఇది భూమి ఇది

నీరు ఇది గాలి అని నామ వ్యవహారము కలిగెను. దీనిని త్రివృత్కరణమందురు. 2 పాళ్ళు భూమి 1 పాలు నీరు 1 పాలు తేజస్సు గలది భూమి యనఁబడును. 2 పాళ్ళు నీరు 1 పాలు భూమి 1 పాలు తేజస్సుగలది నీరు అనఁబడును. 2 పాళ్ళు తేజస్సు 1 పాలు భూమి 1 పాలు నీరు గలది తేజస్సు. ఇట్లు మహా భూతములు గలిగెను. దీనిని త్రివృత్కరణమందురు.

21. మూ. మాంసాది భౌమం యథాశబ్దమితరయోశ్చ.

మాంసాది = మాంసము మొదలగునవి, భౌమం=భూమిరూపమును, ఇతరయోఃచ=నీరుతేజస్సులకు, యథాశబ్దం=శ్రుతిలో జెప్పఁబడినట్లు రక్తాదిరూపములను బొందును.

సూ. త్రివృత్కరణము చేయఁబడిన భూమి మాంసాది రూపములను త్రివృత్కరణము చేయఁబడిన యితరములగు నీరు తేజస్సులు రక్తాది రూపములను బొందుచున్నట్లు శ్రుత్యనుసారముగఁ దెలియునది.

వివ:- "అన్నమశితం త్రేధా విధీయతే తస్యయస్థ్సవిష్ఠోధాతుస్తత్పురీషం భవతి యోమధ్యమస్తన్మాంసం యోఽణిష్ఠస్తన్మనః" (ఛాం. ౬. ౫ ౧) పురుషునిచే భుజింపఁబడిన యన్నము మూఁడు విధములుగఁ జేయఁబడుచున్నది. ఆ యన్నములోని గట్టి పదార్థము మలమగును. మధ్యమభాగము మాంసమగును. అత్యంత సూక్ష్మభాగము మనస్సగును. మూత్రము రక్తము ప్రాణము ఇవి నీటి కార్యములనియు, ఎముక మజ్జ వాక్కులు తేజఃకార్యములనియుఁ దెలియునది.

మూ. వైశేష్యాత్తు తద్వాదః తద్వాదః

వైశేష్యాత్తు = ఆయాభూతభాగము లెక్కువగా నుండుట వలన; తద్వాదః=ఆయావ్యవహారము తద్వాదః=ఆయా వ్యవహారము గలుగును.

సూ. త్రివృత్కరణము చేయఁబడిన యా యాభూతభాగములందు ఆయా భూతముల భాగములు విశేషముగనుండుటవలన ఆయా భూతముల వ్యవహారము కలిగినది. ఆయా భూతముల వ్యవహారము గలిగినది.

ఇది శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁడగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందు ద్వితీయాధ్యాయమున
లింగశరీర శ్రుతి విరోధపరిహారమను
నాలవ పాదము.

# బ్రహ్మ మీమాంసా దర్శనము

## మూఁడవ యధ్యాయమున వైరాగ్యము కొఱకు జీవుల యాతాయాత చింత అను మొదటి పాదము

### 1. తదంతర ప్రతిపత్త్యధికరణము

1. సూ. తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్న నిరూపణాభ్యాం.

ప్రశ్ననిరూపణాభ్యాం = ప్రశ్న సమాధానములచే. తదంతర ప్రతిపత్తౌ= దేహమువీడి మఱొక దేహములోనికిఁ బ్రవేశించునపుడు, సంపరిష్వక్తః = జీవుఁడు సూక్ష్మ భూతములచేఁ జుట్టఁబడినవాఁడై, రంహతి=పోవుచున్నాఁడు.

సూ. "ఓ శ్వేతకేతూ! స్త్రీరూపమైన యయిదవయాహుతియందు వ్రేల్చఁబడిన జలములు సూక్ష్మభూతములు. పురుషశబ్దవాచ్యములైన యాకాశములుగ నెట్లగుచున్నవో యెఱుఁగుదువా?" అను ప్రశ్నచేతను, దానికి సమాధానముగ ద్యులోకాగ్నియందు శ్రద్ధను, మేఘాగ్నియందు సోమమును భూమ్యగ్నియందు వర్షమును, పురుషాగ్నియందు అన్నమును వనితాగ్నియందు రేతస్సును హోమము చేయవలయు"నని చెప్పుచు "ఇట్లు వనితాగ్నియందు రేతోరూపమైన హోమద్రవ్యమును హోమము చేయఁగా జలములు రేతోరూపమును బొందిన పెరుగు, నేయి, సమిధలు, పురోడాశము హవిస్సులు పురుష శబ్దవాచ్యమైన రూపముగలవగుచున్నవి" అని జలరూపమును సూక్ష్మరూపము పొందినట్లు చెప్పుటచేతను జీవుఁడు ఒక దేహమునుండి మఱియొక దేహమును బొందునపుడు దేహమునకుఁ గారణములైన సూక్ష్మ భూతములతోఁ గూడినవాఁడై వెళ్ళుచున్నాఁడని తెలియుచున్నది.

వివ:- "వేత్థ యథా పంచమ్యామాహుతావాపః పురుషవచసోభవంతి (ఛాం. ౫, ౩. ౩) అనునది ప్రశ్నరూపమైన శ్రుతి. ఇతితుపంచమ్యామాహుతావాపః పురుషవచసోభవంతి (ఛా. ౫. ౯. ౧) అని ప్రతివచన శ్రుతి "తద్యథా తృణజలాయుకా" (బృ. ౪. ౪. ౩) గడ్డిమీఁదఁదిరుగు పచ్చని పురుగు వేఱొక గడ్డిపోచను బట్టుకొని యప్పుడు మొదటి గడ్డిపోచను వదలునట్లు జీవుఁడు

వేఱొక శరీరమును బట్టుకొని పూర్వశరీరమును విడుచును" అను శ్రుతికి "కర్మవాసనా పురస్కృతమైన భావిదేహము బుద్ధిలోఁ దోఁచగా ఆ భావనా ధైర్యముచే భావిదేహమును భావించుచున్నాఁడను భావమే చెప్పుకొనవలయును గాన సాక్షాత్తుగా దేహాంతరమును గ్రహించుట యని తాత్పర్యము కాదు కాన ఈ శ్రుతి విరోధింపదని తెలియునది.

2. మూ. త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్.

త్ర్యాత్మకత్వాత్తు = భూతత్రయాత్మకమగుట వల్లనే, భూయస్త్వాత్= ఆధిక్యమునుబట్టి జలవ్యవహారము చేయఁబడినది.

సూ. ప్రశ్న ప్రతివచనరూపమైన పై శ్రుతులందు జలములె పురుషాకారమును బొందునని చెప్పుటచేతను త్రివృత్కరణ శ్రుతినిబట్టి జలములు శరీరములును, భూమి జల తేజోరూపభూతములు మూఁడింటి రూపమైనవగుట చేతను 'సూక్ష్మభూతములతోఁ గూడినవాఁడై జీవుఁడు వెళ్లుచున్నాఁ'డనుట యెట్లు సంభవించునన్నచో మూఁడు భూతములతో నిండిన శరీరమునందు రసరక్తాది ద్రవజల భాగము ఎక్కువగా నుండుటవలన అట్లు వ్యపదేశింపఁబడినది గాన దోషము లేదు.

3. మూ. ప్రాణగతేశ్చ.

ప్రాణగతేఃచ=ప్రాణగమనము చెప్పఁబడుటవలనను.

సూ. 1. "శరీరము వీడిపోవుచున్న యా జీవుని అనుసరించి ప్రాణము పోవుచున్నది ప్రాణము అనుసరించి పోవుచుండఁగా సర్వప్రాణములు దాని ననుసరించి పోవుచున్నవి" అని శ్రుతియందుఁ బ్రాణములు జీవుని వెంటఁ బోవునని చెప్పఁబడుట వలనను వాని కాశ్రయములగు సూక్ష్మభూతములు లేకుండఁ బ్రాణములుండుట సంభవింపదు గాన జీవునితోఁగూడ సూక్ష్మభూతములు పోవుచున్నవని సిద్ధించుచున్నది.

వివ:- 1. "తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణముత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి" (బృ. ౪. ౪. ౨) అని శ్రుతి.

4. మూ. అగ్న్యాదిగతిశ్రుతేరితిచేన్నభాక్తత్వాత్.

అగ్న్యాదిగతిశ్రుతేః = అగ్న్యాదులనుబొందుచున్నవను శ్రుతివిబట్టి, ఇతి చేత్=అన్నచో, భాక్తత్వాత్=అదిగౌణార్థకమగుటవలన, న=శ్రుతివిరోధములేదు.

సూ. 1. "ఈతఁడు మరణింపఁగా ఇతని వాక్కు అగ్నినిబొందుచున్నది ప్రాణము మహావాయువును పొందుచున్నది" ఇత్యాది శ్రుతులనుబట్టి వాక్కు ప్రాణము మొదలగునవి అగ్ని వాయువు మొదలగువానిని బొందుచున్నవని తెలియుటవలనఁ బ్రాణములు శరీరమును విడచునపుడు జీవునితోఁ బోక యగ్న్యాదులను బొందునుగదా యన్నచో ఆ శ్రుతియందే 2. "ఈతడు మరణింపఁగా...శరీరమందలి వెంద్రుకలు ఓషధులను తల వెంద్రుకలు చెట్లను బొందుచున్నవి" అనియుఁ జెప్పఁబడుటచే వెంద్రుకలు ఓషధులను చెట్లను బొందుట సంభవింపదు గాన అట "గౌణార్థముగా వాక్కు మొదలగువానికి అగ్ని మొదలైన యధిష్ఠానదేవతలు ఉపకారబుద్ధిచే కలిగించిన శక్తులు తిరిగి ఆ యధిష్ఠానదేవతలనే పొందుచున్నవి యని చెప్పకొనవలయును గాన శ్రుతి విరోధము లేదు.

వివ:- 1. యత్రాస్య మృతస్యాగ్నిం వాగప్యేతి వాతంప్రాణః" అని శ్రుతి. 2. యత్రాస్యమృతస్యాగ్నిం... ఓషధీర్లోమాని వనస్పతీన్ కేశాః" (బృ. ౩. ౨. ౧౩) అని శ్రుతి.

౫. సూ. ప్రథమేఽశ్రవణాదితిచేన్న తాఏవహ్యుపపత్తేః

ప్రథమే=మొదటిశ్రుతివాక్యమందు, అశ్రవణాత్ = జలములు వినఁబడక పోవుటవల్ల, ఇతిచేత్=అన్నచో, తాఃఏవహి=ఆ జలములే, ఉపపత్తేః=శ్రద్ధగా ఆరోపణము చేయుటఁబట్టి యుపపన్నమగుటవల్ల, న=దోషములేదు.

సూ. 1. "ఓ గౌతమ! ఈ ద్యులోకమె యగ్ని... ఆ యీ ద్యులోకమందె యధిష్ఠానదేవతలు శ్రద్ధను హోమము చేయుచున్నారు" అను శ్రుతిలో ద్యులోకాగ్నియందు శ్రద్ధనేగాని సూక్ష్మభూతరూపములైన జలమును హోమము చేయుచున్నట్లు వినఁబడకపోవుటవలన ద్యులోకాగ్నిలో సూక్ష్మభూతములను హోమముచేయుటయు దానినిబట్టి జీవుఁడు సూక్ష్మభూతములతోఁగూడి శరీరాంతరమును బొందుటయు సంభవింపదుగదా యన్నచో 2. "శ్రద్ధయే జలములు" అని శ్రుతి ప్రయోగమునుబట్టియు సింహబలుని సింహముగా నారోపించి చెప్పినట్లు జలములను శ్రద్ధారూపముగఁ జెప్పుట యుపపన్నమగుట వలన శ్రద్ధను

హోమము చేయుచున్నారు అనినప్పుడు ఆ శ్రద్ధాపదముచే జలములని యర్థము చెప్పవచ్చును గానఁ బైని జెప్పిన దోషము లేదు.

వివ:- 1. అసౌవాలోకో గౌతమాగ్ని... తస్మి న్నేతస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాంజుహ్వతి" (ఛాం. ౫. ౪. ౨) 2. "శ్రద్ధావా ఆపః" అని శ్రుతులు. "ఆపోహాస్మైశ్రద్ధాం సంనమంతే పుణ్యాయకర్మణే" (జలములెగదా ఈ యజమానునికొఱకు శ్రద్ధను బుట్టించుచున్నవి) అని శ్రుతినిబట్టియు శ్రద్ధకుఁ గారణమైన జలములను శ్రద్ధయనియు వ్యవహరించుటయు దోషముగాదు గాన జలములు శ్రద్ధయని చెప్పఁబడినవని భావము.

6. సూ. అశ్రుతత్వాదితిచేన్నేష్టాది కారిణాం ప్రతీతేః

అశ్రుతత్వాత్=జలశక్తులతోడి జీవులు పోవుచున్నారని వినఁబడకపోవుట వల్ల, ఇతిచేత్=అన్నచో, ఇష్టాదికారిణాం=యాగాదులను జేసినవారికి, ప్రతీతేః=స్వర్గాదులు తోఁచుటవలన, న=దోషములేదు.

సూ. 1. జలములు పురుషశబ్దవాచ్యమైన రూపము గలవగుచున్నవి." అను శ్రుతియందు జలములె యగుచున్నవనియె గాని జలశక్తులతోఁగూడిన జీవులు పోవుచున్నారని వినఁబడకపోవుట వలన జీవులు సూక్ష్మభూతములతోఁగూడి పోవుచున్నారని చెప్పరాదన్నచో 2. పిదప ఏ గృహస్థులు తమ గ్రామమున ఇష్టాపూర్తములను, దానమును గురుసేవాదులను ఉపాసించుచున్నారో వారు ధూమముఁ పొందుచున్నారు. అని మొదలుపెట్టి 3. వారు క్రమముగా ధూమాదులద్వారా ఆకాశమునుండి చంద్రుని బొందుదురు. ఈ చంద్రుఁడే వారికి రాజు ఇత్యాది శ్రుతులతో చెప్పినదానినిబట్టి యాగములు చేసినవారికి స్వర్గాదిలోకములు గలుగునని తోఁచుచుండుటవలన అక్కడ జీవులను పదము లేకున్నను జీవులె పోవుచున్నారని తోఁచుచున్నది గాన దోషము లేదు.

వివ:- 1. "ఆపః పురుష వచసోభవంతి" 2. అథ య ఇమేగ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తేధూమమభి సంభవంతి" (ఛాం. ౫. ౧౦. ౩) 3. "ఆకాశాచ్చంద్రమసమేషసోమోరాజా" (ఛాం. ౫. ౧౦. ౪) అని మూలశ్రుతులు. పెరుగు, నేయి, మొదలగునవి హోమము చేయఁబడి కర్మలద్వారా యపూర్వమను సంస్కారరూపముగా యాగకర్తలను కర్మలు చేసినవారిని ఆశ్రయించి మరణకాలమున వారితోఁ బోవుచున్నవని భావము.

7. సూ. భాక్తంవానాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి.

వఆత్మవిత్త్వాత్=యాగాదులు చేసినవారు ఆత్మవేత్తలు గాకపోవుటవలన, భాక్తం=అన్నమవుదురనుదానికి ఉపకరణమవుదురను గౌణార్థకము, తథాహి= అట్లే, దర్శయతి=శ్రుతిచూపుచున్నది.

సూ. జీవులు ధూమాదులద్వారా చంద్రలోకమును బొంది దేవతలకన్న మవుదురని శ్రుతి చెప్పుటచే పెద్దపులి మొదలగువానిచేఁ దినఁబడినవారువలె దేవతలచే భక్షింపఁబడినవారు స్వర్గాదులనుభవించుట యెట్లన్నచో స్వర్గాది భోగ ములకై యాగాదులు చేసినవారు ఆత్మజ్ఞానము లేనివారుగాన జీవులు దేవతలకు అన్నమువలె పశువులవలె ఉపకరణమువంటివారవుదురని గౌణార్థము చెప్ప వలయును గాన అన్నమువలెఁ దినఁబడువారుగారు ఇట్లే 1. "పశువువలె జీవుడు దేవతల కుపకరణమగును" అను శ్రుతియుఁ జూపుచున్నది గాన స్వర్గాది భోగము లనుభవించుటలో దోషము గలుగదు.

వివ:- "యథా పశురేవం సదేవానాం" (బృ. ౧. ४. ౧౦) అని శ్రుతి. "తేచంద్రంప్రాప్య అన్నం భవంతి తాంస్తత్ర దేవాయథాసోమం రాజాన మాప్యాయస్వ అపక్షీయస్వ ఇత్యేవయేతాం స్తత్రభక్షయంతి" (బృ. ౬.౨. ౧౬) ఆ జీవులు చంద్రుని బొంది యన్నమవుదురు. ఋత్విక్కులు శ్రేష్ఠమగు సోమరసమును పోసికొని మరల మరల భక్షించునట్లు దేవతలు వారిని భక్షింతురు "ఏషసోమోరాజా తద్దేవానా మన్నం తం దేవా భక్షయంతి" (ఛాం. ౫.౧౦.४) చంద్రలోకమునకుఁ బోవువారు పొందునట్టివాఁడు రాజైన యీ చంద్రుఁడె. ఆ చంద్రుని శరీరము దేవతలకు అన్నము దానిని దేవతలు భుజింతురు. ఇత్యాది శ్రుతులనుబట్టి జీవులు అన్నమై దేవతలకాహారమవుదురని యాక్షేపము. "విశో న్నం రాజ్ఞాం, పశవోన్నం విశాం" రాజులకు వైశ్యులు అన్నము. వైశ్యులకు పశువులు అన్నము ఇత్యాది శ్రుతులలో అన్నపదము భోగోపకరణమను నర్థ ములో నుపయోగింపఁబడినట్లు ఇటను అన్నపదము ఉపకరణపదమని భావము. కనుకనే "నవైదేవా అశ్నంతి పిబంత్యేతదేవామృతందృష్ట్వా తృప్యంతి" (ఛాం. ३. ౬. ౧) దేవతలు భుజింపరు, త్రావరు, ఈ యమృతమును జూచియే తృప్తిపొందుదురు. దానిని బట్టి దేవతలు ఉంద్రాళ్ళనువలె దినరనియుఁ జూచియే తృప్తిపడుదురని చెప్పఁబడుటచే దేవతలకు వారు చంద్రలోకములో పశువులవలె

సాధనములవుదురని భావము. కనుకనే "స్వర్గకామోయజేత" స్వర్గమందు గోరికకలవాఁడు యాగము చేయవలయు ఇత్యాది విధులు సార్థకమగును. అట్లు గానిచో దేవతలె జీవులను తిన్నచో వారికింక యాగమువలన స్వర్గమెట్లు లభించును. కాన జీవులు సూక్ష్మభూతములతోఁ గూడినవారై శరీరాంతరములను బొందుదురనుట యుక్తమె యని తెలియునది.

## ౨. కృతాత్యయాధికరణము

7. మూ. కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవంచ.

కృతాత్యయే=చేసినపుణ్యకర్మ నశింపఁగా, అనుశయవాన్=సంచితకర్మ గలవాఁడై, యథేతం=వెళ్ళినట్లు గాని, అనేవంచ = మరొకదారినిగాని; దృష్ట స్మృతిభ్యాం=శ్రుతిస్మృతులనుబట్టి భూలోకమును ప్రవేశించును.

సూ. చేసిన పుణ్యకర్మలు నశింపఁగా భుజింపఁగా మిగిలిన సంచితకర్మ కలవాఁడై తాను వెళ్ళిన మార్గముగుండఁ గాని మార్గాంతరముగుండఁగాని భూలోక మును మరలఁ బ్రవేశించుచున్నాఁడని శ్రుతి స్మృతులఁబట్టి తెలియుచున్నది.

వివ:- "యథేత మాకాశ, మాకాశాద్వాయుం, వాయుర్భూత్వాధూ మోభవతి, ధూమోభూత్వా అభ్రంభవతి, అభ్రంభూత్వామేఘోభవతి మేఘో భూత్వా ప్రవర్షతిత ఇహవ్రీహియవా ఓషధివనస్పతయ స్తిలమాషా ఇతిజాయంతే అతోవైఖలుదుర్నిష్ప్రపతరం (ఛాం. ౫. ౧౦. ౫) పుణ్యము క్షీణింపఁగా దిరిగి ఈ యాకాశమును పొంది ఆకాశమునుండి వాయువునుండి వాయువై పొగ యగును పొగయై, అభ్రమగును, అభ్రమై మేఘమగును మేఘమై వర్షించును అది భూమియందు వడ్లు, యవలు, ఓషధులు, చెట్లు, నువ్వులు మినుములుగా పుట్టుదురు అవి భక్షించి రేతో రూపము పొంది యందుండి క్రమముగ పొంద రాని మనుష్యాది జన్మలు పొందుదురు. "తద్యఇహరమణీయ చరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వాక్షత్రియయోనిం వావైశ్యయోనింవాఅథ యఇహ కపూయచరణా అభ్యాశోహ యత్తేకపూయాం యోనిమాపద్యేరన్శ్వయోనిం వా సూకరయోనిం వాచండాలయోనింవా (ఛాం. ౫. ౧౦. ౭) పుణ్యమునను భవించినపిదప శుభమైన యాచరణము గలవారు శుభజన్మనుగాని బ్రాహ్మణజన్మనుగాని, క్షత్రియజన్మనుగాని, వైశ్యజన్మనుగాని

వెంటనే పొందుదురు. దుష్టాచరణము గలవారు వెంటనే నీచజన్మనుగాని కుక్క జన్మనుగాని పందిజన్మనుగాని చండాలజన్మనుగానిపొందుదురు. ఇత్యాదిశ్రుతులను బట్టియు "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" పుణ్యము క్షీణింపఁగా మర్త్య (మరణముగల) జన్మనుపొందుదురు. ఇత్యాదిస్మృతులనుబట్టియు తిరిగి జన్మించునట్లు తెలియుచున్నదని భావము.

9. మూ. చరణాదితిచేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః

చరణాత్=శుభాచరణమువల్లనె, ఇతిచేత్=అన్నచో, న=అట్లనరాదు, ఉపలక్షణార్థా=అట్లనుట ఉపలక్షణముకొఱకు, ఇతి=అని, కార్ష్ణాజినిః=కార్ష్ణాజిని.

సూ. శ్రుతియందుఁ శుభాచరణాదులనుబట్టి జీవుఁడు బ్రాహ్మణాది జన్మలను బొందునని చెప్పఁబడినది గాని పుణ్యము క్షీణింప మిగిలిన సంచితకర్మను బట్టి పొందునని చెప్పఁబడలేదుగదా యన్నచో సంచితాదికర్మలకు ఆచరణము మూలము గాన ఆచరణమునుబట్టి బ్రాహ్మణాది జన్మలు గలుగునని యుపలక్షణముకై చెప్పఁబడినది గాన దోషము లేదని కార్ష్ణాజిని యనియె.

10. మూ. ఆనర్థక్య మితిచేన్న తదపేక్షత్వాత్.

ఆనర్థక్యం = ఆచరణపదమునకు వైయర్థమగు, ఇతిచేత్ = అన్నచో, తదపేక్షత్వాత్=యాగాదులు ఆచరణపేక్షగలవి గాన, న=దోషములేదు.

సూ. శ్రుతిలోని ఆచరణపదమునకు ప్రవర్తనమని యర్థమును జెప్పక గౌణముగా సంచితకర్మమని యర్థము చెప్పినయెడల ఆచరణపదము ఆనర్థకమగునన్నచో యాగాది కర్మలు ఆచరణము నపేక్షించినవగుటవలన శుభాద్యాచరణము లేనివాఁడు దేనికిని అధికారిగాఁడు గాన ఆచరణపదము సార్థకమగునే గాని యనర్థకముగాదు గనుక పైదోషము ప్రవర్తింపదు.

వివః- "ఆచారహీనం న పునంతివేదాః" సత్ప్రవర్తనము లేనివానిని వేదములుగూడఁ బవిత్రము చేయవు అను స్మృతివాక్యము ఈ యర్థమునే తెలుపుచున్నది గాన సంచితాది కర్మలకు సత్ప్రవర్తనాదులే కారణమని భావము

11. మూ. సుకృతదుష్కృతే ఏవేతితుబాదరిః

సుకృతదుష్కృతేఏవేతి = ఆచరణమనఁగా పుణ్యపాపములే యని, బాదరిః=బాదరియనెను.

సూ. బాదరిమాత్రము ఆచరణమనఁగా సుకృత దుష్కృతములె యగు ననెను.

## ౩. అనిష్టాదికార్యధికరణము

12. మూ. అనిష్టాదికారిణామపిచ శ్రుతమ్.

అనిష్టాదికారిణాంఅపిచ=యాగాదులు చేయనివారికిఁగూడ, శ్రుతం=చంద్రలోకగమనము శ్రుతమగుచున్నది.

సూ. 1. "ఎవరైతే ఈ లోకమునుండి పోవుచున్నారో వారందఱును చంద్రలోకమునె పొందుదురు" అని శ్రుతిలో వినఁబడుచున్నది గాన యాగాది కర్మలు చేసినవారలెగాక యాగాది కర్మలు చేయనివారు గూడ చంద్రలోకమును బొందుదురని చెప్పవలయును.

వివః- ఇది పూర్వపక్షసూత్రము 1. "యేవై కేచాస్మా లోకాత్ప్రయంతి చంద్రమసమేవతే సర్వేగచ్ఛంతి" (కౌషీ. ౧. ౨) అని శ్రుతి.

22. మూ. సంయమనేత్వనుభూ యేతరేషా మారోహారోహా తద్గతి దర్శనాత్.

సంయమనేతు=యమలోకమునందైతే, అనుభూయ = యాతనలననుభవించి, ఇతరేషాం=యాగాదులు చేయనివారికి, తద్గతిదర్శనాత్=యమలోకగతి చూపుటవలన ఆరోహావరోహౌ = భూలోక యమలోకములకు రాకపోకలు గలుగును.

సూ. యాగాది కర్మలు చేయనివారు యమలోకమునకుఁ బోదురని శ్రుతి చూపుచుండుటవలన వారు యమలోకమున యాతనలననుభవించి యీ లోకమునకు వచ్చుచున్నారు. వారికీరీతిగా భూలోకయములోకములకు రాకపోకలు గలుగుచున్నవి గాన అందఱు చంద్రలోకమునకుఁ బోదురనుట యుక్తముగాను.

వివః- "నసాంపరాయః ప్రతిభాతిబాలం ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం అయంలోకో నాస్తిపర ఇతిమానీ పునఃపునర్వశమాపద్యతేమే" (కఠ.

వి. ఉ) పుత్రాదిభ్రాంతిలో పడువానికిని ధనమోహముచే మూఢుఁడైనవానికిని బరలోకము ప్రకాశింపదు. ఈ లోకమెగాని పరలోకము లేదని తలఁచువాఁడు మాటిమాటికి నావశమును బొందును" అని నచికేతునకు యముఁడు చెప్పిన సందర్భములోని శ్రుతినిబట్టి ధనపుత్రాది మోహముచే ప్రవర్తించు మూఢుఁడు యమలోకమును బొందునని తెలియుచున్నదని భావము. యాగ మనఁగా సత్య తపోజ్ఞానాది రూపమైన యాగమునని చెప్పుకొనవచ్చును.

14. స్మరంతిచ.

స్మరంతిచ=స్మృతులు స్మరించుచున్నవిగూడ.

సూ. స్మృతికర్తలును బాపకర్మ చేసినవారికి యమలోకము గలుగునని చెప్పుచున్నారు గూడ.

15. అపిచసప్త.

అపిచ=మఱియును, సప్త=నరకము లేడు.

సూ. మఱియును నరకములేడని పౌరాణికులు చెప్పుట వలనను బాప కర్ములు నరకలోకములకేగాని చంద్రలోకమునకుఁ బోవరు.

వివ:- 1. తపనము 2. అవీచి 3. మహారౌరవము 4. రౌరవము 5. సంఘాతము 6. కాలసూత్రము 7. కుంభీపాకము అని నరకము లేడని పౌరాణికులు.

16. మూ. తత్రాపిచతద్వ్యాపారాదవిరోధః

తత్రాపిచ=అందులోను, తద్వ్యాపారాత్=యమునియధికారముండుటవలన అవిరోధః=విరోధములేదు.

సూ. ఆ యేడు నరకములందును చిత్రగుప్తాదులకు యముఁడే యధికారి యగుటవలన "స్మృతులందు చిత్రగుప్తాదులధికారులని జెప్పఁబడెనేగాని యము నికి వశులుగారు గానఁ బాపకర్ములుయమునికి వశులై యాతనలననుభవింతురు అని చెప్పుట యెట్లు" అను దోషము గలుగదు.

17. మూ. విద్యాకర్మణోరితితు ప్రకృతత్వాత్

ప్రకృతత్వాత్=ప్రస్తుతమగుటవలన, విద్యాకర్మణోః ఇతితు=ఉపాసనలు, కర్మలకు మాత్రమె ఆ రెండు మార్గములుగలుగును.

17. సూ. 1. ఇష్టాపూర్తములను విద్యను బొందనివారు ఈ రెండు మార్గములలో (పంచాగ్ని విద్యోపాసనవల్లఁ గలుగు దేవయాన మార్గములోను కర్మలవలనఁ గలుగు పితృయాణ మార్గములోను) నే మార్గముచేతను బ్రహ్మ లోకమునకుఁగాని చంద్రలోకమునకుఁగాని పోవరు. ఈ క్షుద్రప్రాణులు చావుఁ బుట్టుకలలో మరల మరలఁ దిరుగుచుండును. పుట్టుము చావుము అను నియ్యదె మూఁడవస్థానము. కనుక ఈ ప్రాణులు పుట్టుచు చచ్చుచు నీ లోకమందె యుండుచుండును గాన ఈ పితృయాణమునఁ గలుగు చంద్రలోకము నిండి పోదు అను నీ శ్రుతిలోని ఈ రెండు మార్గములలో అనుదానికి, ప్రస్తుత ప్రకరణ మునుబట్టి పంచాగ్ని విద్యోపాసనవలనఁ గల్గు దేవయాన మార్గమును, కర్మల వలన, గలుగు పితృయాణమార్గమును ఈ రెండె యర్థమగును గాన పంచాగ్ని విద్యను ఉపాసింపక యాగాది కర్మలు చేయక నీచకర్మలు చేయువారు ఈ మూఁడవ మార్గమగు చావుఁ బుట్టుకలతోఁ గూడిన యా లోకమునె పొందుదు రని తెలియవలయును

వివ:- 1. అథైతయోః పథోర్న కతరేణచన: తానీమానిక్షుద్రాణ్యస కృదావర్తీని భూతాని భవంతి జాయస్వమ్రియస్వేత్యే తత్తృతీయం స్థానం తేనాసౌలోకో నసంపూర్యతే (ఛాం. ౫. ౧౦. ౮) అని శ్రుతి. పంచాగ్నులు= ద్యులోక, మేఘ, భూమి, పురుష, వనితాగ్నులు (చూ ౩అ ౧పా. ౧సూ.)

18. మూ. నతృతీయో తథోప బ్ధేః

తథా అట్లు, ఉపలబ్ధేః=ఉపలబ్ధమగుటవలన, తృతీయే = మూఁదవ మార్గ మందు, న=హోమనియమములేదు.

సూ. "ఇట్లు అయిదవ వనితాగ్నియందు రేతోరూపమైన హోమ ద్రవ్యమును హోమము చేయఁగా జలములు పురుషశబ్ద వాచ్యమయిన రూపము గలవగుచున్నవి" అని శ్రుతియందు చెప్పఁబడిన ప్రకారము హోమము చేయ కయే చావుఁబుట్టుకలతోఁ గూడిన మూఁడవ మార్గమును ప్రవేశించినవారికి దేహ ప్రాప్తి యుపలబ్ధమగుటవలన వారు దేహము పొందుటకు హోమము చేయవలయు నన్న నియమమక్కఱలేదు.

వివ:- "ఇతితు పంచమ్యా మాహుతావాపః పురుషవచసోభవంతి" అని శ్రుతి. అయిదవ వనితాగ్నియందు హోమము చేసినవారు పురుషదేహమును

బొందుదురు అని చెప్పఁబడినది. పురుషదేహ మనగా మనుష్యదేహము. కాన ఈ యాహుతి చేయనివారు కీటపతంగాది రూపమును బొందుదురని భావము. మఱియు అయిదవ యాహుతియందు పురుష దేహమును బొందుదురని చెప్పఁబడినది గాని మిగిలిన యాహుతియందు పురుషదేహమును బొందరని నిషేధింపఁబడలేదు కాన ఇతరాహుతులందును పురుషదేహమును బొందవచ్చును. అయిదవ యాహుతి వ్రేల్చినవారు చంద్రలోకమును బొంది యట పుణ్యానుభవించి తిరిగి భూలోకమునకు వత్తురు. ఇంక నే యాహుతియు వ్రేల్చనివారికి భూతాంతరములతోఁ గూడిన జలములతో దేహము గలుగునని భావము.

19. మూ. స్మర్యతేఽపిచలోకే.

లోకే=లోకమందు, స్మర్యతేఽపి=ద్రోణాద్యయోనిజ జన్మలు స్మరింపఁబడుచున్నవికూడ.

సూ. అయిదవ యాహుతియగు వనితాగ్నియందు రేతోరూపహోమమును వ్రేల్చకయే ద్రోణమునందు ద్రోణుఁడు అగ్నివేదికియందు ధృష్టద్యుమ్నుఁడు ద్రౌపది, నాగటి చాలున సీత మొదలగువారు అయోనిజులై పుట్టిరి. బలాక పక్షి రేతస్సంబంధములేకయె పుట్టినది ఇట్లు లోకమునఁ బుట్టినట్లు పురాణాదుల స్మరింపఁబడుచున్నదికూడ.

వివ:- స్థావరములగు భూమి జలములకంటె జంగమ జంతువులు విలక్షణములు గాన జీవజములు వేఱుగాఁ జెప్పఁబడినవని భావము.

20. మూ. దర్శనాచ్చ.

దర్శనాత్‌చ=కనిపించుటవలనను.

సూ. స్వేదజములగు నల్లులు పేలు మొదలగునవియు, ఉద్భిజ్జములగు చెట్లు మొదలగునవియు స్త్రీ పురుష సంబంధము లేకయె పుట్టుట కనిపించుట వలనను యాగాదులు చేయనివారికి ఆహుతి చేయవలయునను నియమమక్కఱలేదు.

వివ:- స్వేదజములు = చెమటనుండి పుట్టు ప్రాణులు. ఉద్భిజ్జములు= భూమిని జీల్చుకొని పైకివచ్చు ప్రాణులు.

21. మూ. తృతీయ శబ్దావరోధః సంశోకజస్య.

సంశోకజస్య = స్వేదజసృష్టికి, తృతీయశబ్దావరోధః = మూడవదగు ఉద్భిజ్జపదములో నంతర్భావము.

సూ. అండజములు, జీవజములు ఉద్భిజ్జములు అని శ్రుతియందు మూఁడు రకముల సృష్టియేగాని నాల్గవరకమగు స్వేదజ సృష్టి చెప్పఁబడలేదే యన్నచో ఉద్భిజ్జములనఁగా పైకిఁ జీల్చుకొని వచ్చునవి యర్థము గాన చెట్లు ఎట్లు భూమిని జీల్చుకొని వచ్చినవో యట్లే స్వేదజములు నీటిని జీల్చుకొని వచ్చునవి గాన సామ్యమునుబట్టి ఉద్భిజ్జపదముచేతనే స్వేదజములు గ్రహింపఁబడుచున్నవి గాన దోషములేదు.

## 4 సాభావ్యాపత్త్యధికరణము

22. సూ తత్సాభావ్యాపత్తిరుపపత్తేః

ఉపపత్తేః=ఉపపన్నమగుటవలన, తత్సాభావ్యాపత్తిః = ఆకాశాదులతో సమాన భావమును పొందును.

సూ. యాగాది కర్మలు చేయువారు చంద్రలోకమును బొంది పుణ్యము నశింపఁగాఁ దిరిగి భూలోకమును బొందునపుడు యుక్తి యుక్తమగుటవలన ఆకాశాదులతో సమాన భావమునె పొందుదురు గాని యాకాశాది స్వరూపములఁ బొందరు.

వివ:- "అథైతమే వాధ్వానం పునర్నివర్తంతే యథేత మాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమోభవతి ధూమోభూత్వా అభ్రంభవత్యభ్రం భూత్వా మేఘోభవతి మేఘోభూత్వా ప్రవర్షతి (ఛాం. ౧౦. ౫) మతి చంద్ర లోకమునకుఁ బోయినవాఁడు పుణ్యము నశింపఁగా పోయిన మార్గముననే తిరిగి మరలుదురు. వారు ఈ యా దేశమును బొంది ఆ యాకాశమునుండి వాయువును బొంది వాయువునుండి ధూమమై ధూమమునుండి యభ్రమై యభ్రమునుండి మేఘమై మేఘమునుండి వర్షించును ఇట తిరిగివచ్చునప్పుడు ఆకాశవాయ్వభ్రమేఘాదులతో సమానములగు భావమును బొందుదురని లక్షణచే గ్రహింపవలయునని భావము.

23. సూ. నాతిచిరేణ విశేషాత్.

విశేషాత్=విశేషమువలన, అతిచిరేణ=చాలకాలము, న=పుట్టదు.

సూ. 1. "వడ్లు యవల రూపమునుపొందిన పిదప అన్న రేతో రూపాదులను బొందుట దీర్ఘకాలము పట్టును" అని శ్రుతి యందు వడ్లు యవలు మొదలగువాని రూపములను బొందిన పిదపనేగాని వడ్లు యవల రూపములను బొందకపూర్వము ఆకాశాది రూపసాదృశ్యము పొందుటకు దీర్ఘకాలము పట్టదని విశేషము తెలియుటచే స్వల్పకాలములోనే యాకాశాది రూపసాదృశ్యములను బొందుదురు.

వివ:- 1. "అతోవై ఖలు దుర్నిష్ప్రపతరం" (ఛాం. ౫ ౧౦ ౬) ఇందు మూల శ్రుతిలో ఒక తకారము లోపించుట ఛాందసము కాన "దుర్నిష్ప్రపతతరం" అని చెప్పుకొనవలయును దానికి దుర్నిష్క్రమతరమైనది యని యర్థము.

## 6. అన్యాధిష్ఠితాధికరణము

24. మూ. అన్యాధిష్ఠితేషు పూర్వవదభిలాపాత్.

పూర్వవత్=ఇదివరకువలె, అభిలాపాత్=చెప్పుటవలన, అన్యాధిష్ఠితేషు=ఇతరమగు యవలు మొదలగువాని యధిష్ఠానములందు సుఖాదులు గలుగవు.

సూ. జీవులు ఆకాశాది రూపసాదృశ్యమునుపొంది క్రమముగ వడ్లు యవలు మొదలగు నన్నముల రూపమును పొందునప్పుడు ఆకాశాది రూపసాదృశ్యమునుపొందిన సమయములో సుఖదుఃఖాదులను పొందక యాకాశాదులతో సంశ్లేషమును మాత్రము పొందినట్లే వడ్లు యవలు మొదలగువాని రూపమును పొందినప్పుడును వానితో సంశ్లేషమును మాత్రమే పొందునని చెప్పుకొనుటవలన-ఆ జీవులకు వడ్లు యవల రూపములో సుఖదుఃఖాది భోక్తృత్వము గలుగదు.

వివ:- "రమణీయ చరణాః...కపూయచరణాః" (ఛాం ౫. ౧౦ ౭) శుభమైన యాచరణము గలవారు... దుష్టమైన యాచరణము గలవారు అని శ్రుతిలో సుఖదుఃఖాదుల ననుభవించునపుడు శుభప్రవర్తన దుష్టప్రవర్తన యుండునని వ్యాపారము చెప్పఁబడినది. వడ్లు యవల రూపమొందునప్పుడు శుభాది ప్రవర్తనలు చెప్పకపోవుటచే అట సుఖదుఃఖాదులు గలుగనేరవు. జీవులు వడ్లు యవలు మొదలగువాని రూపమొంది సుఖదుఃఖాదులను బొందుచుందు

రన్నచో వడ్లు మొదలగునవి కోసినప్పుడు చీల్చఁబడినపుడు తినఁబడినప్పుడు వాని యందలి జీవులు లేచిపోదురుగదా అప్పుడు వారు స్త్రీ పురుష రేతోరూపములఁ పొందుట యెట్లు సంభవించును. అట్లు రేతోరూపము పొందనపుడు "యో యో హ్యన్న మత్తి యో రేతః స్త్రియాం సించతి తద్భూయ ఏవభవతి" (ఛాం. ౫. ౧౦ ౬) ఎవ్వఁడెప్పుఁడు వడ్లు యవలు మొదలగు నన్నములు భుజించునో భుజించిన యన్నము యా రేతోరూపము పొందఁగా ఆ రేతస్సు నెవ్వఁడు స్త్రీ యందుంచునో వాని రూపమునె కర్మ మిగిలిన జీవులు తిరిగి తిరిగి పొందుదురు అని శ్రుతి వచనము ఎట్లు సందర్భించును? కాన జీవులు వడ్లు మొదలగువానితో సంశ్లేషమునెగాని తద్రూపము పొంది సుఖదుఃఖాదులను బొందరు. దీనిని బట్టి వడ్లు యవలు మొదలగునవి యనుభవయోగ్యములు గాకపోవు. పాప బలమునుబట్టి స్థావరరూపమును బొందిన యితర జీవులకు అవి భోగస్థానము గావచ్చును గాని చంద్రలోకమునుండి దిగువారు మాత్రము స్థావరభావమును బొందరని తెలియునది.

25. మూ. అశుద్ధమితిచేన్న శబ్దాత్.

అశుద్ధం ఇతిచేత్=వైదికపశుహింస దుష్టమన్నచో, శబ్దాత్=వేదప్రమాణము వలన, న=దుష్టముగాదు.

సూ. పశుహింసాసంబంధమువలన వేదోక్త యజ్ఞకర్మలు దుష్టమగుటచే అనిష్టఫలము గలుగవచ్చును గాన పుణ్యకర్మ శేషింప మిగిలిన కర్మలనుబట్టి వడ్లు యవలు మొదలగువానితో సంశ్లేషము మాత్రమె గాక వడ్లు యవలు మొదలగువాని జన్మమునె చంద్రలోకమునుండి దిగిన జీవులు పొందె సుఖ దుఃఖాదులను బొందుదురన్నచో ధర్మాధర్మ విషయక విజ్ఞానము అతీంద్రియ జ్ఞానమూలకము గాన అది శాస్త్రమువలననే సిద్ధించుటచే అట్టి శాస్త్రములకు మూలమగు శ్రుతి ప్రమాణమునుబట్టి వేదోక్త పశుహింస దుష్టముగాదు గాన వడ్లు మొదలగువానితో సంశ్లేషమెగాని వాని జన్మమును పొంది జీవులు సుఖదుఃఖాదులను బొందరు.

వివః- "న హింస్యాత్సర్వాభూతాని" ఏ భూతములను హింసింపరాదు అను శ్రుతి సామాన్యమైనది. "అగ్నిషోమీయం పశుమాలభేత" అగ్నియు సోముఁడును దేవతగాఁ గల పశువును యజ్ఞమునఁ జంపవలయు ననునది విశేష

శాస్త్రము. ఈ విశేషశాస్త్రముచే యజ్ఞమందు పశుహింస దుష్టః
కలియుగమున పశ్వాలంభనము మొదలగునవి నిషిద్ధములని స్
నవి యిప్పుడును చేయరాదు. ఆలంభన పదమునకు హిం
కొందఱు చెప్పుదురు.

26. మూ. రేతస్సిగ్యోగో౽థ

అథ = పిదప, రేతస్సిగ్యోగః = రేతస్సు ఉంచువాని
మాత్రమె.

సూ. "ఎవ్వఁడెవ్వఁడు వడ్లు యవలు మొదలైన యన్నః
భుజించిన యన్నము ఆ రేతోరూపమును పొందఁగా ఆ రేతః
యందుంచునో వానితోడి సంబంధమునె పుణ్యము గలిగిన
తిరిగి తిరిగి పొందుదురు." అను శ్రుతియందు వడ్లు యవలు
రూపమును పొందినపిదప పుణ్యకర్మ నశింపఁగా మిగిలిన కర
రేతస్సు ఉంచువానితో సంబంధమును పొందుదురని చెప్పుటచే
గల పురుషులతోఁగూడ సంబంధమునెగాని యా పురుషుల రూప
చెప్పకపోవుటవల్ల వడ్లు యవలు మొదలగువానితోడ సంబంధ
యవలు మొదలగువాని రూపమును బొందరు.

వివః- భుజింపఁబడిన యన్నమున నున్న జీవి అన్నవ
గల పురుషుఁడగుట సంభవింపదు. చాలకాలము క్రిందటనే పుక్
ములకుఁ బిదప యౌవనము పొందిన పిదపనే గాని పురుష
రేతస్సునుంచుటసంభవింపదుగదా కాన పుణ్యమునశింపఁగా చం
దిగి మిగిలిన కర్మగల జీవి ఆకాశాది రూపములద్వారా వడ్లు య
వానితో సంబంధమును బొంది పిదప అ వడ్లు యవలు మొదలై
భుజించిన రేతస్సుగల పురుషులతో సంయోగమమును పొందుచున
అట్లుగానిచో వడ్లు యవలు మొదలైన యన్నమును దిని వెంట
వఱకు వేచియుండకయే రేతస్సుగల పురుషుఁడై స్త్రీయందు రేత
వచ్చుట యను నసంభవ విషయము నంగీకరింపవలసి వచ్చును అ

27. మూ. యోనేశ్శరీరమ్.

యోనేః=యోనివల్ల, శరీరమ్=శరీరమగును.

సూ. పిదప యోనియందు రేతస్సు ఉంచఁబడఁగా అందుండి శరీరము పుట్టుచున్నది.

వివః- "శుభమైన యాచరణముగలవారు" అను పూర్వోక్త శ్రుతినిబట్టి పుణ్యము నశింపఁగా చంద్రలోకమునుండి దిగి మిగిలిన కర్మలను అనుభవించుటకు జీవులు ఆయా శరీరములను బొందుదురని తెలియుచున్నది. అంతియెకాని వడ్లు యవలరూపమును బొందినపుడు జీవులు సుఖదుఃఖాదులను బొందరు. కనుక ఆ జీవులు వడ్లు యవలు మొదలగువానితో సంబంధమును పొందుటనె వారి పుట్టుకగా గ్రహింపవలయును.

ఇట్లు స్వర్గనరకములకు రాకపోకలకుఁ గారణమైన పుణ్యపాపముల బంధింపఁబడక బ్రహ్మవిచారముచేసి ముక్తి పొందవలయునని ఈ పాదమునకు తాత్పర్యము.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందు మూఁడవ యధ్యాయమున
వైరాగ్యముకొఱకు జీవుల రాకపోకల విచారణ యను
మొదటి పాదము.

—:౦:—

# బ్రహ్మమీమాంసా దర్శనము

మూడవ యధ్యాయము

తత్త్వం అను పదార్థవివేకము రెండవ పాదము.

## ౧. సంధ్యాధికరణము

1. మూ. సంధ్యేసృష్టిరాహహి.

సంధ్యే = స్వప్నమందు, సృష్టిః = సృష్టిఅగునని, ఆహహి = శ్రుతి చెప్పెనుగదా.

సూ. 1. "ఆ స్వప్నమునందు రథములుగాని గుఱ్ఱములుగాని మార్గములుగాని లేవు మఱి యాత్మయె రథములను గుఱ్ఱములను మార్గములను సృజించుచున్నది... అదియె కర్త" అను శ్రుతి స్వప్నమందు ఆత్మ రథాదులను సృష్టించినట్లు చెప్పెను గాన ఆ స్వాప్నికసృష్టి వాస్తవికమనవలయును.

వివ:- ఇది పూర్వపక్షసూత్రము. 1. "న తత్రరథానరథయోగాన పంథానోభవంత్యథ రథాన్‌రథయోగాన్ పృథక్సృజతే (బృ. ౪ ౩ ౧౦) సహి కర్తేతి" అని శ్రుతి.

2. మూ. నిర్మాతారంచైకే పుత్రాదయశ్చ.

నిర్మాతారంచ=నిర్మాతగను, పుత్రాదయశ్చ = పుత్రాదులు కర్మ అని, ఏకే=కొందఱుశాఖీయులు.

సూ. 1. "ఈ యింద్రియములు నిద్రించుచుండ ఏ పురుషుఁడు పుత్రాది కామముల నిర్మించుచున్నాడో వాఁడె పరబ్రహ్మము" అని శ్రుతియందుఁగఠ శాఖీయులు ఆత్మను నిర్మాణమునకుఁ గర్తగను కామములను బుత్రాదులను గర్మగను జెప్పుచున్నారు గావునను స్వప్నసృష్టి వాస్తవిక మనవలయును.

వివ:- ఇదియును బూర్వపక్షసూత్రము "య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః" (కఠ. ౫. ౮) అని శ్రుతి.

3 మూ. మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్.

కార్త్స్న్యేన=పూర్తిగా దేశకాలాదులు, అనభివ్యక్తి స్వరూపత్వాత్= వ్యక్తముగాని స్వరూపము గలుగుటవల్ల, మాయామాత్రంతు=స్వప్న విషయములు మాయామాత్రములు.

సూ. రథాది స్వప్నవిషయముల స్వరూపము పూర్తిగా తత్తద్దేశకాలము లందుండక పోవుటవలనను మెలఁకువయందు ఆ విషయములకు బాధకలుగుట వలనను రథాది స్వప్నవిషయములు మాయామాత్రములేగాని వాస్తవికములు గావు

వివ,— ఇది సిద్ధాంత సూత్రము. స్వప్నవిషయములు వాస్తవికము లన్నచో స్వప్నమునఁ గనిపించిన యా రథాదులు ఏకాలమందైనను నేదేశ మందైనను మెలఁకునవచ్చినప్పుడును ఉండవలసివచ్చును స్వప్నములో ఒకచోట నుండి యనేక దేశములు దిరిగివచ్చునట్లుగ లోకమున అనుభవనున లేవు గాన వాస్తవికములు గావని భావము "బహితస్కులాయా దమృతశ్చరిత్వాసఈ యతేఽమృతో యత్రకామం" (బృ. ౪ ౩. ౧౨) ఈ పురుషుఁడు మరణము లేనివాఁడై శరీరముకంటె వెలుపల సంచరించి కామములున్నచోటకు పోవు చున్నాఁడు అను శ్రుతికి "పురుషుఁడు శరీరమందున్నను దానివలనఁ బ్రయోజ నము పొందక శరీరమునుండి వెలుపలకుఁ బోయినవాఁడువలె నగుచున్నాఁడు" అని గౌణముగా వ్యాఖ్య చేసికొనవలయును. అప్పుడు ఈ శ్రుతి పైవిషయము నకు విరోధింపదని తెలిసికొనవలయును.

4. మూ. సూచకశ్చహి శ్రుతే రాచక్షతే చతద్విదః

తద్విదః = స్వప్న ఫలవేత్తలు, ఆచక్షతే = చెప్పుచున్నారు గానను, శ్రుతేః=శ్రుతినిబట్టి, సూచకఃచ=శుభాశుభ సూచకమగును గూడ.

సూ. "(1) కామ్యకర్మలు చేయునప్పుడు స్వప్నమున స్త్రీని జూచినచో ఆ స్వప్న నిదర్శనమునుబట్టి వానికి కర్మలు సిద్ధించును" ఇత్యాది శ్రుతులబట్టి స్వప్నఫలవేత్తలు స్వప్నము రాఁబోవు శుభాశుభ ఫలములను సూచించునని తెలుపుదురు కాన స్వప్నదృశ్యములగు వస్తువులు వాస్తవికములు గాకున్నను వానినిబట్టి కలుగు కలుగు ఫలములు సత్యములగునని తెలియునది.

వివ :– (1) యదాకామ్యేషు కర్మసు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృద్ధిం తత్ర జానీయాత్తస్మిన్ స్వప్న నిదర్శనే (ఛాం. ౫ -౨. ౯.) అని శ్రుతి మెల్కువలో విషయేంద్రియ సంయోగముండుట వలనను సూర్యాది తేజస్సు సహాయపడుటవలనను ఆత్మకు వస్తుజ్ఞానము గలుగుచున్నదే గాని దానికి స్వయముగా ప్రకాశించు శక్తిలేదను నాక్షేపణము ను పరిహరించుటకై విషయేంద్రియ సంయోగముగాని సూర్యాది తేజస్సుల సహాయముగాని లేని స్వప్నమున ఆత్మకు స్వయంప్రకాశకత్వ మున్నదని తెలుపుటకై స్వప్నోదాహరణము చెప్పఁబడినదిగాని స్వప్నమున ఆత్మ రథాదులను సృజించుటకు గాదు. స్వప్నమున గనునట్టి రథాదులవలన హర్షభయాదులు కలుగుచున్నవి గాన వానికి పుణ్యాపాపములు కారణములు. ఈ పుణ్యాపాపకర్తృత్వమును, నాగలి పశువుల బ్రతికింపఁజేయును అను వాక్యమునందువలె ఆత్మబట్టి గౌణముగా కర్తగనట్లు చెప్పఁబడినది గాన శ్రుతివైరుధ్ధ్యము లేదు. ఇట్లే పుత్రాది కామముల సృజించునట్లు తెలుపు శ్రుతికి గౌణార్థము చెప్పవలయును గాన వైరుధ్ధ్యము రేదని భావము.

౫. మూ. బంధ విపర్యయౌ.

బంధ విపర్యయౌ=బంధ మోక్షములు.

సూ: అవిద్యాదులచే బంధమోక్షములు తిరోహితమైన యీశ్వరశక్తి జీవునికి ఈశ్వర ధ్యానమువలననేగదా కలుగుచున్నది కనుక ఆ యీశ్వరుని ఆగ్రహానుగ్రహములబట్టియె బంధమోక్షములు గలుగుచున్నవిగాన జీవుడు ఈశ్వరుని యంశమెయైనను అవిద్యచే జీవునందు ఈశ్వర శక్తి తిరోహితమగుటచే "జీవునికి జ్ఞానైశ్వర్య వశమువలన స్వప్నమునందు కల్పించిన వస్తువులు వాస్తవికములగు"నని యనరాదు.

6. మూ. దేహయోగాద్వా సోఽపి.

దేహయోగాద్వా=దేహసంబంధమువలనఁ గాని, సోఽపి=స్వప్న వస్తువును.

సూ. దేహాదుల సంబంధవశము వలనఁగాని జీవునికి జ్ఞానైశ్వర్యములు తిరోహితమగుట కలుగుచున్నది గాన జ్ఞానైశ్వర్య శక్తిలేని జీవుఁడు స్వప్నమునఁ గల్పించిన వస్తువును వాస్తవము గాదు.

## ౨. తదభావాధికరణము

7. మూ. తదభావోనాడీషు తచ్ఛ్రుతే రాత్మనిచ.

తదభావః=స్వప్నదర్శనము లేదు. తచ్ఛ్రుతేః=ఆ శ్రుతినిబట్టి, నాడీషు=నాడులందు ఆత్మనిచ=ఆత్మ యందును.

సూ. (1) "నిద్రించు జీవుఁడు ఎప్పుడు ఎట్టి స్వప్నమును జూడఁడో యప్పుడు ఆనాడుల యందును ఈ పరమాత్మయందును ఏకీభవించుచున్నాఁడు" అను శ్రుతినిబట్టి స్వప్నములుగాంచని సుషుప్తిస్థానమును జీవుఁడు నాడులందును హృదయమునకుఁ జుట్టుకొనియున్న పెద్దప్రేగునందును దాని ద్వారా పరమాత్మ యందును సుషుప్తిని బొందుచున్నాడు.

వివ :- (1) "తాసు తదాభవతి యదాసుప్త స్స్వప్నం నకంచన పశ్యత్యథాఽస్మిన్ ప్రాణ ఏకైకథాభవతి" (కౌషీ. ౪. ౧౯) అని శ్రుతి. ఇందలి ప్రాణపదము పరమాత్మపరమైనది. (చూ. ౧ అ. ౨. పా. ౨౮. సూ.)

8. సూ. అతః ప్రబోధోఽస్మాత్.

అతః = కనుక, అస్మాత్=ఈ పరమాత్మనుండి, ప్రబోధః = మెలఁకువ.

సూ. జీవుఁడు నాడులు మొదలగు వానిద్వారా పరమాత్మ యందె సుషుప్తిని బొందుచున్నాఁడుగాన ఆ పరమాత్మ నుండియె యితనికి మెలఁకువ గలుగుచున్నది.

వివ :- "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంత్యేవమే వాస్మాదాత్మనః సర్వేప్రాణాః" (బృ. ౨. ౧. ౨౦) అగ్నినుండె యెట్లు చిన్న చిన్న నెఱసులు బయలుదేఱుచున్నవో యట్లే యీ యాత్మనుండి సర్వేంద్రియములు బయలుదేఱుచున్నవి. "సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహే" (ఛాం. ౬. ౧౦. ౨) సత్తు నుండి వచ్చియు సత్తు నుండి వచ్చుచున్నామని జీవులు తెలియరు ఇత్యాది శ్రుతులు ఆత్మనుండి మెలఁకువ గలఁగునట్లు చెప్పుచున్నవి.

## ౩. కర్మానుస్మృతి శబ్దవిధ్యధికరణము

9. మూ. స ఏవతు కర్మానుస్మృతి శబ్ద విధిభ్యః

కర్మానుస్మృతి=కర్మలను స్మరించుటవలన, శబ్ద విధిభ్యః=శ్రుతి విధానములఁబట్టియు, స ఏవతు=ఆ జీవుఁడే మేల్కొనును.

సూ. సుషుప్తావస్థకుఁ బూర్వము జీవుఁడు తానేయే కర్మములను జేసెనో యా కర్మలనే నిద్రించి లేచినపిదపఁ గూడ స్మరించి చేయుచుండుట వలనను, (1) "మరల జీవుఁడు ఆ యా యింద్రియ స్థానములను గూర్చి నియతమైన గతితో మేల్కొనుటకొఱకే వచ్చుచున్నాఁడు" (2) "ఈ ప్రజ లందఱు ప్రతిరోజు ఈ బ్రహ్మలోకమునకు వెళ్లుచుండియు వెళ్లినట్లు తెలియ కున్నారు" ఇత్యాది శ్రుతి విధులనుబట్టియు సుషుప్తావస్థయందు ఏ జీవుఁడు నాడులద్వారా పరమాత్మయందు ఏకీభవించుచున్నఁడో యాతఁడె జాగ్రదవస్థ యందు మేల్కొనుచున్నాఁడు గాని వేఱొకఁడుగాఁడు

వివ :- (1) పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాంతాయైవ" (బృ. ౪. ౩. ౧౬) (2) ఇమాః సర్వాః ప్రజా అహరహర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం నవిందంతి (ఛాం. ౮ ౩. ౨) ఇత్యాదులు శ్రుతులు. జలరాశి యందు ఏ నీటిబిందువు కలుపఁబడెనో తిరిగి యా నీటి బిందువే విడివడుట యసంభవమైనట్లే సుషుప్తి యందుఁ బరమాత్మ తానేకమైన ఆ జీవుఁడే తిరిగి విడివడుట అసంభవమను నాక్షేపమును నివారించుటకై యిది చెప్పఁబడెను. నీటి బిందువు వివేకములేని జడముగాన ఆ నీటిబిందువే విడివడదుగాని జీవుఁడు వివేకముగల వాఁడు గాన ఆ జీవుఁడే విడివడునని భావము.

### ౪. ముగ్ధాధికరణము

10. మూ. ముగ్ధేఽర్ధ సంపత్తిః పరిశేషాత్

ముగ్ధే=మూర్ఛపడిన వానియందు, అర్ధసంపత్తిః=సగము, సంబంధము పరిశేషాత్=ఎందును అంతర్భవింపకపోవుట వలన ఇది వేఱు అవస్థగాన పూర్ణనం బంధముగలదు.

సూ. మూర్ఛపడిన వాని శరీరమునవేడి, వణఁకుట మొదలగు గుణము లుండుటవలన మరణావస్థగాని, దేహ ధారణశక్తి లేకపోవుటవల్ల జాగ్రదవస్థ గాని, ప్రసన్న వదనత్వ నేత్రనిమీలనాది గుణములు లేకపోవుటవలన సుషుప్తావస్థ గాని యుండదుగాని యిది పైవానిలో నెందును అంతర్భవింపక గొన్ని మరణా వస్థ గుణములు కొన్ని సుషుప్తావస్థల గుణములుండుటవలన మూర్ఛావస్థ మరణ సుషుప్తావస్థల గుణములు గలిగిన వేఱొక యవస్థ యనియు బ్రహ్మముతో దానికి

సగము సంబంధము మాత్రమే గాక సుషుప్త్యావస్థయందువలె పూర్ణసంబంధము గలదనియు బ్రహ్మవిదులందురు.

11. సూ. న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్రహి

పరస్య=బ్రహ్మమునకు, స్థానతః అపి=ఉపాధిఁబట్టియు, సర్వత్రహి= అన్ని శ్రుతులలోను, ఉభయలింగం =సగుణ నిర్గుణ లింగమునులేదు

సూ కొన్నిచోట్ల శ్రుతులందు సగుణరూపము గలదని చెప్పఁబడినను అన్ని శ్రుతులందును ఒకేవిధముగ నిర్గుణమని చెప్పబడుటచే ఉపాధిస్థానమును బట్టి కూడఁ బరబ్రహ్మము సగుణ నిర్గుణ రూపమైన యుభయ చిహ్నములు గలది గాదు.

వివ: ఇఁక సుషుప్త్యాద్యవస్థలందు జీవుఁడేకీభవించు బ్రహ్మస్వరూపము తెలుపఁబడుచున్నది. "సర్వకర్మా సర్వ కామః సర్వగంధః సర్వరసః (ఛాం. ౩ ౧౪. ౨) బ్రహ్మము అన్ని కర్మలు గలది అన్ని కోరికలు గలది అన్ని వాసనలు గలది అన్ని రసములు గలది ఇత్యాది శ్రుతులు సగుణత్వ ప్రతిపాదకములు "అస్థూల మనణ్వహ్రస్వమదీర్ఘం" (బృ. ౩ ౮. ౮) బ్రహ్మము స్థూలమైనది కాదు అణువుగాదు పొట్టిదిగాదు పొడుగుదిగాదు "ఇత్యాది శ్రుతులు నిర్గుణత్వ ప్రతిపాదకములు, బ్రహ్మస్వరూపమును దెలుపునట్టి "అశబ్దమస్పర్శ, మరూప, మవ్యయం" (కఠ. ౩. ౧౫. ముక్తికో ౨ ౭౨) బ్రహ్మము శబ్దములేనిది స్పర్శలేనిది రూపములేనిది మార్పు లేదు ఇత్యాది శ్రుతివాక్యములందు ఎట్టి గుణములు లేనట్లు చెప్పఁబడుటచే బ్రహ్మము నిర్గుణమని ఉపాధులగు దృశ్యమాన ప్రపంచము భ్రమమూలకముగాన మిథ్యయనియు భావము. స్వచ్ఛస్వరూపమైన స్ఫటికము లత్తుక జేగురురంగు మొదలగు వాని సంబంధము వల్ల అస్వచ్ఛము గానట్లే నిర్గుణమగు బ్రహ్మము ఉపాధివశమువల్ల సగుణము గాదని భావము.

12 మూ. నభేదాదితిచేన్న ప్రత్యేక మతద్వచనాత్.

భేదాత్=భేదోక్తివల్ల, న=సగుణము గాదనరాదు, ఇతిచేత్=అన్నచో, ప్రత్యేకం=ప్రత్యేకముగా, అతద్వచనాత్=అట్లు చెప్పకపోవుటవలన, న=సగుణముగాదు.

సూ. "బ్రహ్మము నాలుగుపాదములుగలది, పదునాలుగు కళలుకలది, కర్మఫలములఁ బొందించునది, మూఁడు లోకములె శరీరముగఁ గఁది, వైశ్వానర మను పేరు గలది," అని యిట్లు ఉపాసనా విద్యయందు బ్రహ్మము భిన్నభిన్న ముగఁ జెప్పఁబడుటవలన "బ్రహ్మము సగుణమైనది గాదని చెప్పరా"దన్నచో "ఈ భూమియందుఁ దేజోమయుఁడై యమృతమయుఁడై యుగపురుషుఁడును, ఈ శరీరమునఁ దేజోమయుఁడై యమృతమయుఁడై యున్న పురుషుఁడును గూడ ఆ పరమాత్మయే" అని శ్రుతి భిన్నభిన్నమైన ప్రతియుపాధికిని బ్రహ్మ ముతో భేదమును బోధింపక అభేదమును బోధించుటచేతను, నాలుగు పాద ములు గలది ఇత్యాదులు ఉపాసనకోసము మాత్రమే చెప్పఁబడుటచేతను బ్రహ్మము నిర్గుణమెగాని సగుణము గాదు.

వివ : "యశ్చాయ మస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషో, యశ్చాయ మధ్యాత్మం శారీరస్తేజోమయోఽమృతమయః పురుషోయ మేవ స యోఽయమాత్మా" (బృ. ౨. ౫. ౧) ఇత్యాదులు అభిన్న శ్రుతులు.

13. మూ. అపిచైవమేకే

అపిచ=మఱియును, ఏవం=ఇట్లు, ఏకే=కొందఱు.

సూ. మఱియు "మనస్సుచేతనె యొక్కటైన యీ యాత్మ పొందఁ ẏగినది. ఈ యాత్మ విషయమున భిన్నత్వములేదు ఈ యాత్మను భిన్నముగఁ ాచువాఁడు మృత్యువునుండి మృత్యువును పొందును" "భోక్తయగు జీవునకు ోగ్యములగు విషయములను వీనిని ప్రేరేపించు నీశ్వరుని విచారించి నాకుఁ జెప్పఁబడిన ఈ మూఁడు విధములైన సర్వమును, బ్రహ్మమె" ఇత్యాది శ్రుతు లలోఁ గొన్ని శాఖలవారు భిన్నత్వమును నిందించి యభిన్నత్వమును జెప్పుటచే బ్రహ్మమునకు అభిన్నత్వమె వాస్తవమైనది.

వివ : "మనసైవేద మాప్తవ్యం నేహ నానాస్తికించన మృత్యోస్సమృత్యు మాప్నోతియ ఇహనా నేవపశ్యతి" (కఠ. ౪. ౧౧) భోక్తాభోక్తారం ప్రేదితారం చ మత్వాసర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్." (శ్వే. ౧. ౧౨) ఇత్యాది శ్రుతులు.

మూ. అరూపవదేవహి తత్ప్రధానత్వాత్

తత్ప్రధానత్వాత్. నిర్గుణ శ్రుతులే ప్రధానములగుటవలన, అరూపవదేవ= బ్రహ్మము రూపాదులు లేనిదే.)

14 సూ. శబ్దస్పర్శ రూపాద్యాకారములు లేనట్లు తెలుపు శ్రుతులే ప్రధానములగుటవలన, రూపాదులున్నట్లు తెలుపుశ్రుతులు ఉపాసనా విధిపరములును అప్రధానములునుగాన బ్రహ్మమురూపాదులులేనిదే.

మూ. ప్రకాశవచ్చావై యర్థ్యాత్.

ప్రకాశవచ్చ=సూర్యాది ప్రకాశములె, అవై యర్థ్యాత్=వ్యర్థముగాక పోవుటవలన

15 సూ. ఆకాశమంతటను వ్యాపించిన సూర్యచంద్రుల ప్రకాశము ఆయాయుపాధులలోఁబడి ఋజుత్వవక్రత్వాది రూపములను బొందునట్లు బ్రహ్మమును భూమిమొదలయిన యుపాధిరూపములను బొందినదై యుపాసనకై యుపయోగపడుచున్నదిగాన బ్రహ్మమునకు సాకారాది విషయమును దెలుపు శ్రుతులు వ్యర్థములుగావు.

మూ. ఆహచ తన్మాత్రం

తన్మాత్రం=చైతన్య మాత్రముగ, ఆహచ=శ్రుతిచెప్పెనుగూడ

16 సూ. "(1) ఓమైత్రేయీ! లోపలఁగానివెలుపలఁగాని మఱొకరసము లేకయుప్పుగడ్డయంతయునుప్పురసముతో నిండినట్లే ఈ పరమాత్మయులోనన యైనను వేఱురసములు లేక సమస్తమును గేవల చైతన్యమాత్రమైయున్నది' అని శ్రుతియుపరమాత్మ చైతన్యమాత్రమై విలక్షణరూపాంతర రహితమై నిర్విశేషమైయున్నదని చెప్పెనుగూడఁగాన బ్రహ్మము నిరాకారమైనదే.

వివ:— "(1) సయథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యః కృత్స్నోరసఘన ఏవైవంవా అరేఽయమాత్మానంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవ" (బృ. ౪.౫.౧౩). అనిశ్రుతి

మూ. దర్శయతి చాథోఅపిస్మర్యతే.

దర్శయతిచ = శ్రుతిచూపుచున్నది. అథోఅపి=మఱియును, స్మర్యతే=స్మృతులచే స్మరింపఁబడుచున్నది.

17 సూ "1. అబ్రహ్మము, తెలిసిన ప్రపంచముకంటె వేఱొకటి అది తెలియని దానికింటెను భిన్నమైనది." "2. అవికళలులేనిది క్రియలులేనిది శాంతమైనది" అని శ్రుతులును "3. ఆ బ్రహ్మము ఆదిలేనిది నిరతిశయమైనది. అది సత్పదార్థమనిగాని యసత్పదార్థమనిగాని చెప్పఁబడదు" 4 ఓనారద!

దేనిచే నీవు నన్ను సర్వగంధాది గుణసహితునిగఁ జూచుచున్నావో యది నేను సృజించినమాయయే. ఇట్లు నన్ను మాయాసహితునిగఁ దెలియఁదగదు" అని స్మృతులును బ్రహ్మమును నిరాకారముగఁ జూపుచుఁ దెలుపుచున్నవి.

"1. అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి (కే ౧. ౩) 2 "నిష్కలం, 3. నిష్క్రియంశాంతం" "4. మాయాహ్యేషా మయాసృష్టా, యన్మాం పశ్యసి నారద, సర్వభూత గుణైర్యుక్తం నైవ మాంజ్ఞాతుమర్హసి"

మూ. అతఏవచోపమా సూర్యకాదివత్.

అతఏవచ=కనుకనేగూడ, సూర్యకాదివత్ = సూర్యాది ప్రతిబింబములవలె, ఉపమా=పోలిక చెప్పఁబడెను.

18 సూ. ఈ పరమాత్మ చైతన్యరూపుఁడు నిర్వికారుఁడును గనుకనే శ్రుతిస్మృతులలో నీటిలోని సూర్యచంద్రుల ప్రతిబింబములతోఁ బోలిక చెప్పఁ బడినది.

వివ:- "యథాహ్యయం జ్యోతిరాత్మా వివస్వానపో భిన్నా బహుధైకోఽను గచ్ఛన్, ఉపాధినా క్రియతే భేదరూపోదేవః క్షేత్రేష్వేవ జోఽయమాత్మా" జ్యోతిర్మయుఁడు సూర్యుఁడొక్కఁడయ్యు ఘటాదులచే వేఱైన జలములఁ జొచ్చి వేఱుగఁగనిపించునట్లు పుట్టుకలేనివాఁడును స్వప్రకాశుఁడునగు నాయాత్మ యొక్కటయ్యును ఉపాధిచే శరీరములఁజొచ్చి వేఱువేఱుగఁగనిపించుచున్నాఁడు "ఏక ఏవహిభూతాత్మా భూతేభూతే వ్యవస్థితః ఏకధాబహుధాచైవదృశ్యతే జలచంద్రవత్ (బ. బిం. ౧౨) యొకఁడయ్యు ప్రతిభూతమునుండి నీటిలోని చంద్రునివలె ఒకఁడుగాను చాలమందిగను గనిపించుచున్నాఁడు. అని శ్రుతిస్మృతులు.

మూ. అంబువ దగ్రహణాత్తుసతథాత్వమ్

అంబువత్=నీరువలె అగ్రహణాత్ తు=ఉపాధులందు గ్రహింపసంభవింపక పోవుట వలననె తథాత్వమ్=దానితోపోలిక=కుదురదు )

19 సూ. రూపముగల సూర్యచంద్రులు తమకంటె వేఱుగను దూరముగను నున్న జలమందుఁ బ్రతిబింబించుట యుక్తముగాని రూపములేని పరమాత్మ సర్వవ్యాపిగాన దానికంటే వేఱైనదిగాని దూరముననున్నదిగాని యేదియులేకపోవుటచే నీటియందువలె ఉపాధులందుఁ బ్రతిబింబించుట సంభవింపదుగాన నాదృష్టాంతము సరిపోదు

—:వివ పూర్వపక్ష సూత్రము.

20. మూ. వృద్ధిహ్రాస భాక్త్వమంతర్భావాదుభయసామంజస్యా దేవం.

అంతర్భావాత్=ఉపాధులందు అంతర్భవించుటవలన, ఉభయసామంజస్యాత్=దృష్టాంత దార్ష్టాంతికములు రెంటికి సామంజస్యముండుటవలన ఏవం, ఇట్లు, వృద్ధిహ్రాసభాక్త్వం=వృద్ధిక్షయములఁ బొందుట అగుచున్నది.

సూ. జలము మొదలైన యుపాధులందుఁ బ్రతిబింబించిన సూర్యచంద్రులు జలము వృద్ధిపొందిన వృద్ధిపొందుచు క్షయముపొందిన క్షయము పొందుచుఁగదలినఁ గదలుచునున్నట్లు గనిపించినను వాస్తవముగ సూర్యచంద్రులు వృద్ధిక్షయచలనములను పొందనట్లు బ్రహ్మము వాస్తవముగ ఒక్కటయ్యును వికారము లేనిదయ్యును దేహాద్యుపాధులందు నంతర్భవించుటవలన వానిని బొందుచున్నట్లు గనిపించుచు ఉపాధిధర్మములగు వృద్ధిక్షయచలనాదులను బొందుచున్నదను నంశములో సామ్యముండుటవలన దృష్టాంత దార్ష్టాంతికములకు విరోధములేదు.

వివ :- ఇది సిద్ధాంతసూత్రము.

21. మూ దర్శనాచ్చ

దర్శనాత్ చ=కనిపించుటవలనను

సూ. (1) "ఈశ్వరుఁడు రెండుపాదములు గల మనుష్యశరీరములను జేసెను. నాలుగుపాదములు గల పశుశరీరములను జేసెను. ఇట్లు కన్నులు మొదలగునవి బయలుదేఱకముందు ఈశ్వరుఁడు లింగశరీరము దాల్చి ఆ శరీరములను బ్రవేశించెను. "(2)" ఈ జీవాత్మద్వారా ఈశ్వరుఁడు ప్రవేశించి" ఇత్యాది శ్రుతులందు పరమాత్మయె దేహాద్యుపాధులందుఁ బ్రవేశించినట్లు గనిపించుటవలనను జలగత సూర్యచంద్ర దృష్టాంతము సరిపోవుచున్నది.

వివ :- (1) "పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః, పురస్సపక్షీభూత్వాపురః పురుషఆవిశత్॥ (బృ. ౨. ౫. ౧౮) (2) అనేన జీవేనాత్మనానుప్రవిశ్య॥ (ఛాం. ౬. ౩. ౨) ఇత్యాదులు శ్రుతులు.

## ప్రకృతైతావత్త్వాధికరణము ౬

22. మూ. ప్రకృతైతావత్త్వం సాప్రతిషేధతి తతోబ్రవీతి చ భూయః

ప్రకృతైతావత్త్వం హి=ప్రస్తుతమగు మూర్తామూర్తరూప పరిమాణమును మాత్రమె, ప్రతిషేధతి=ప్రతిషేధించుచున్నది, తతః=పిదప, భూయః=మరల, బ్రవీతి చ=చెప్పుచున్నదికూడ.

సూ. (1) "బ్రహ్మమునకు భూమి, నీరు, తేజస్సులను మూర్తరూపమును వాయువు ఆకాశము, అను నమూర్తరూపమును ఈరెండు రూపములు గలవు" అని యుపక్రమించి "(2)" మఱియిందువలన (=పూర్వోక్తము నిషేధార్థకముగాన) లేదని లేదని (=పరమాత్మకంటె అన్యములేదని లేదని) ఉపదేశింపఁబడుచున్నది. ఈ బ్రహ్మముకంటె మఱియొకటె లేదుగదా లేదని తెలియవలయు. మఱియొకటి యనఁగాఁ బ్రతిషేధింపఁబడని బ్రహ్మమున్నది" అను శ్రుతి బ్రహ్మము మూర్తామూర్తరూపమైన యింతమాత్రపు పరిమాణము గలదియె గాదు అని పరిచ్ఛిన్నరూపములను ప్రతిషేధించుచు ఆ శ్రుతియె (3) మఱియొకటి అనఁగా లేదని లేదని బ్రతిషేధింపఁబడని బ్రహ్మమున్నది యని తిరుగఁజెప్పుచున్నదిగూడఁ గాన నా శ్రుతికి బ్రహ్మకంటే వేఱయినది లేదను విషయములోనె తాత్పర్యముగాని బ్రహ్మములేదను విషయములో తాత్పర్యము గాదు.

వివ :- (1) "ద్వేవాబ్రహ్మణోరూపేమూర్తం చైవామూర్తం చ (బృ. ౨. ౩. ౧)" అనియుపక్రమించి (2) అథాత ఆదేశోనేతినేతి నహ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి" (బృ. ౨. ౩. ౬) అని చెప్పఁబడుచున్నది (3) "అన్యత్పరమస్తి" (బృ ౨. ౩. ౬) ఈ శ్రుతికి "ప్రపంచములేదు" అను నాదేశమె గాని వేఱైన యాదేశములేదు గాన లేదని లేదని చెప్పఁబడుచున్నది "అని యర్థాంతరము చెప్పునప్పుడు" అథనామధేయం సత్యస్య సత్యమితి ప్రాణావై సత్యం తేషామేషసత్యం." (బృ. ౨. ౧ ౨౦) నిరపేక్షమైన బ్రహ్మమునకు సత్యమని పేరు. ప్రాణములు సత్యమైనవి. ఆప్రాణములకును ఈ బ్రహ్మము సత్యమైనది అను శ్రుతిబ్రహ్మము మిథ్యగాక సత్యమని తెలుపుచున్నదని తెలియవలయు.

23. మూ. తదవ్యక్త మాహహి.

తత్=ఆబ్రహ్మము, అవ్యక్తం=గ్రహింపఁబడనిదని, ఆహహి=చెప్పెను గదా.

సూ. ఆ బ్రహ్మము ఇంద్రియములచే గ్రహింపఁబడనిదని శ్రుతి స్మృతులు చెప్పినవిగదా.

వివ :- "నచక్షుషా గృహ్యతే, నాపివాచా, నాన్యైర్దేవై స్తపసాకర్మణావా" (ముం. ౩. ౧. ౮) బ్రహ్మము కంటిచే గ్రహింపఁబడదు. వాక్కుచేఁ గాని యితరేంద్రియములచేఁగాని కర్మచేఁగాని గ్రహింపఁబడదు. అని శ్రుతి "అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయ ముచ్యతే" (గీత. ౨. ౨౫.) ఈ ఆత్మ వ్యక్తముగానిది చింతింపరానిది వికారములేనిది" అని గీత చెప్పుచున్నదని భావము.

24. సూ అపి చ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం.

అపిచ=మఱియు, సంరాధనే=ధ్యానమందు, ప్రత్యక్షానుమానాభ్యాం=శ్రుతి స్మృతులనుబట్టి.

సూ, భక్తి, ధ్యాన, ధారణాది సమయములందు యోగులు ఈ పరమాత్మను జూచుచున్నారని శ్రుతిస్మృతులనుబట్టి తెలియుచున్నది.

వివ:-"కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షదావృత్తచక్షురమృతత్వ మిచ్ఛన్" (కఠ. ౪ ౧.) ఒకానొక ధీరుఁడు ఇంద్రియములను విషయములనుండి మరలించి మోక్షమును గోరుచు ప్రత్యగాత్మను జూచెను "జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్త్వ స్తతస్తు తంపశ్యతే నిష్కలంధ్యాయమానః" (ముం. ౩. ౧. ౮) "జ్ఞాననైర్మల్యముచేఁ బరిశుద్ధమైన శక్తిగలవాఁడు కళలులేని యాత్మను ధానించుచుఁ జూచుచున్నాఁడు." అని శ్రుతులు. "యంవినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సంయతేంద్రియాః, జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః" నిద్రలేనివారై ప్రాణాయామపరులై సంతుష్టులై జితేంద్రియులై ధ్యానించుయోగులు చూచునట్టి యాత్మజ్యోతికి నమస్కారము. "యోగినస్తం పశ్యంతి భగవంతం సనాతనం" యోగులు ఆసనాతనుఁడగు భగవంతునిఁ జూచుచున్నారు. ఇత్యాది స్మృతులోను చెప్పుచున్నవని భావము.

25. సూ. ప్రకాశాదివచ్చాఽవై శేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్

ప్రకాశాదివత్ చ = సూర్యప్రకాశాలకువలె, అవైశేష్యం = అభేదము, ప్రకాశశ్చ=ప్రకాశమును, కర్మణి=కర్మయందు, అభ్యాసాత్=అలవాటువలన.

సూ. వెలుఁగు ఆకాశము, సూర్యుఁడు మొదలగునవి వ్రేళ్లు కమండలువు, నీళ్లు మొదలయిన యుపాధులందు వ్రేళ్లు మొదలగువాని రూప విశేషములుగలవివలె ప్రకాశించినను స్వభావమున విశేషములేనట్లు ఆత్మజ్యోతికే శ్రుతులందు మాటిమాటికి జీవులలో నభేదము చెప్పుటవలన జీవాత్మల భేదము ఉపాధులనుబట్టి వచ్చినదేగాని స్వభావమున భేదములేదు

26. మూ అతోఽనంతేన, తథా హి లింగం

అతః = కనుక, అనంతేన = అనంతుఁడగు పరమాత్మతో జీవుఁడు కలియును, తథా హి=అట్లే. లింగం=సూచకమున్నది.

సూ. భేదము ఉపాధులనుబట్టియే గాని స్వభావసిద్ధముగ లేక పోవుటవలన జీవుడు అనంతుఁడగు పరమాత్మతోనైక్యము పొందుచున్నాఁడు "ఎవఁడు పరబ్రహ్మమును దెలిసికొనుచున్నాఁడో వాఁడు బ్రహ్మయె యగుచున్నాఁడు" అని శ్రుతియు దీనికే సూచకమగుచున్నది.

వివ:- "సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముం. ౩. ౨ ౯) అని శ్రుతి.

27 మూ ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్.

ఉభయవ్యపదేశాత్ తు=భిన్నముగ అభిన్నముగ రెండువిధముల వ్యపదేశించుటవలననే, అహికుండలవత్=పాముచుట్టవలె నుండును.

సూ. శ్రుతులందు జీవాత్మ పరమాత్మల భిన్నముగను అభిన్నముగను పాము, పాము చుట్టుకొనుట పడగ పొడుగులవలె వ్యవహరింప బడుటవలన జీవాత్మ పరమాత్మలు భిన్నములు నభిన్నములని యనవలెను.

వివ:- ఇది పూర్వపక్షసూత్రము. "త తస్తుతం పశ్యతే నిష్కలంధ్యాయమానః" (ముం. ౩ ౧. ౮) కళలులేని పరమాత్మను ధానించువాఁడు ఆ పరమాత్మను జూచును "పరాత్పరం పురుష ముపైతి దివ్యం" (ముం. ౩. ౨. ౮) పరాత్పరుఁడును దివ్యుఁడైన పురుషునిఁ బొందును" ఇత్యాదులందు పొందఁదగినవాఁడు పరమాత్మయనియు పొందువాఁడు జీవుఁడనియు భేదవ్యపదేశము చేయఁబడినది. "తత్త్వమసి" (ఛాం. ౬ ౮. ౭) అది నీవైయున్నావు "అహం బ్రహ్మాస్మి" (బృ. ౧ ౪ ౧౦) నేను బ్రహ్మమునై యున్నాను ఇద్యాదులందు అభేదవ్యపదేశము చేయఁబడినది.

28. మూ. ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్

తేజస్త్వాత్=తేజోరూపములగుటవలన, ప్రకాశాశ్రయవత్ వా=ప్రకాశమున కాధారమగు సూర్యుడువలె నుందురు.

సూ. లేక ప్రకాశమును బ్రకాశమునకాధారమైన సూర్యుడు తేజోరూపములగుటవలన అత్యంతము భిన్నములును గాక యభిన్నములును గాక యున్నట్లే జీవాత్మపరమాత్మలును భిన్నములు నభిన్నములునగును.

వివ :- ఇదియుఁ బూర్వపక్షసూత్రము.

29. మూ. పూర్వవద్వా.

పూర్వవత్ వా=పూర్వమువలెనే.

సూ. పూర్వము చెప్పఁబడినట్లు వెలుఁగు ఆకాశము సూర్యుడు మొదలగునవి యుపాధులనుబట్టి భిన్నములుగఁ దోఁచుచున్నట్లు పరమాత్మయు దేహాద్యుపాధులనుబట్టి భిన్నముగాఁ దోఁచుచున్నదేగాని వాస్తవికమునకు భిన్నముగాదు. భేదవ్యవహారశ్రుతులన్నియుఁ బూర్వవ్యవహార ప్రసిద్ధభేదమనె యనువదించి యభేదమునే చెప్పుచున్నవి గాన దోషములేదు.

వివ :- ఇది సిద్ధాంతసూత్రము.

30. మూ. ప్రతిషేధాచ్చ.

ప్రతిషేధాత్ చ=నిషేధించుటవలనను.

సూ. (1) "ఈ పరమాత్మకంటె వేఱొకఁడు చూచువాఁడు లేఁడు" (2) "మఱి యిందువలన ఈ పరమాత్మకంటె భిన్నమైనది లేదని లేదని యుపదేశింపఁబడినది" ఇత్యాదులందును బరమాత్మకంటె వేఱైనది లేదని నిషేధించుటవలనను జీవాత్మపరమాత్మలు అభిన్నులేగాని భిన్నులుగారు.

వివః- "నాన్యతోఽస్తి ద్రష్టా (బృ. ౩. ౭. ౨౩) అథాహ ఆదేశో నేతి నేతి (బృ ౨ ౩. ౬)

## పరాధికరణము ౭

31. మూ. పర మతస్సే, తూన్మాన సంబంధ, భేదవ్యపదేశేభ్యః

సేతూన్మాన, సంబంధ భేదవ్యపదేశేభ్యః = సేతువుగ, పరిమాణము గలవాఁడుగ, శరీరసంబంధము గలవాఁడుగ, భేదస్థలముల నున్నవాఁడుగ వ్యపదేశించుటవలన. అతః=బ్రహ్మముకంటె, పరం=మఱొకటి యున్నది.

సూ. (1) "ఆత్మ యనఁబడు నీతఁడు భూరాదిలోకములు నశింపకుండ ధరించు సేతువు" అని పరమాత్మను సేతువుగను, (2) "ఈ బ్రహ్మము నాలుగుపాదములు గలది, ఎనిమిది డెక్కలుగలది, పదునాఱు కళలుగలది" అని పరిమాణముగల వానిగను, (3) "శరీరములతో సంబంధించిన జీవుఁడు పరమాత్మతో నేకీభవించినవాఁడై బాహ్యవిషయములనుగాని ఆంతరిక విషయములనుగాని యెఱుఁగఁడు" అని శరీరములతో సంబంధించిన వానినిగను, ఈశ్వరుఁడు సూర్యునిలోపలనుగంటి యందును ఉన్నాఁడని వేఱువేఱు స్థలము లందున్న వానినిగను వ్యపదేశించుటవలన నీ బ్రహ్మముకంటె మఱియొక తత్త్వ మున్నదనవలెను.

వివ :_ ఇది పూర్వ పక్షసూత్రము. (1) "అథయ ఆత్మాససేతు ర్విధృతిః రేషాం లోకానామసంభేదాయ" (ఛాం. ౮. ౪. ౧) (2) "తదే తద్బ్రహ్మ చతుష్పాదష్టాశఫంషోడశకలం" (3) "శారీర ఆత్మాప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" (బృ. ౪. ౩. ౨౧) అని శ్రుతులు. బ్రహ్మమునకు దిక్కులు నాలుగును ప్రకాశవంతమను మొదటి పాదము, భూమి, అంతరిక్షము, దివము సముద్రములు అనునవి యనంతవంతమను రెండవ పాదము. అగ్ని చంద్రుఁడు సూర్యుడు విద్యుత్తు అనునవి జ్యోతిష్మంతమను మూఁడవ పాదము. కనులు చెవులు వాక్కు మనస్సు అనునవి యాయతనవంతమను నాలగవ పాదము. ప్రతి పాదమునకు రెండేసి డెక్కలు చొప్పున ఎనిమిది డెక్కలు. పాదమునకు నాలుగేసి కళలు చొప్పున పదునాఱు కళలు గలవు అని పాదాదివర్ణనము.

32. మూ. సామాన్యాత్తు.

సామాన్యాత్ తు=సేతు సామాన్య ధర్మమునుబట్టియే

సూ. సేతువు జలములను నిలువునట్లు పరమాత్మ లోకములను నిలుపుటచే పరమాత్మ సేతువువంటిదిగాన సేతు సామాన్య ధర్మమునుబట్టి సేతువుగా వ్యవహరింపఁబడినది గాన పరమాత్మకంటె నన్యమగు వస్తువులేదు.

33. మూ. బుద్ధ్యర్థః పాదవత్.

పాదవత్=పావలాలవలె, బుద్ధ్యర్థః=ఉపాసన నిమిత్తము.

సూ. వ్యవహారముకొఱకు ధనమును పావలాలు అర్ధలు మొదలగు వానినిగఁ జెప్పినట్లు మందబుద్ధుల యుపాసనకై పరమాత్మకు ఛాదాదిరూప కల్పనము చేయఁబడినది.

34. మూ. స్థాన విశేషాత్ప్రకాశాదివత.

ప్రకాశాదివత్=ప్రకాశాదులవలె, స్థానవిశేషాత్=స్థానవిశేషమునుబట్టి.

సూ. సూర్యప్రకాశము మొదలగునవి భిన్నములు గాకపోయినను ఆయా స్థానవిశేషములనుబట్టి ఆయా స్థానములకు సంబంధించినవిగను భిన్నములుగను దోఁచునట్లు శరీరాద్యుపాధులనుబట్టి పరమాత్మ ఆయా శరీరములకు సంబంధించి నవిగను భిన్నముగను దోఁచుచున్నదేగాని వాస్తవమునకు ఆ పరమాత్మకంటె నన్యమేదియు లేదు.

35. మూ. ఉపపత్తేశ్చ.

ఉపపత్తేః చ=ఉపపన్నమగుటవలనను.

సూ. శరీరాద్యుపాధుల సంబంధమునుబట్టి భిన్నముగఁ దోఁచినను వాస్తవమునకుఁ బరమాత్మకంటె నన్యమేదియు లేదు గనుకనే (1) "పరమాత్మ తన్నుఁ దానుబొందుచున్నాఁడు" అను శ్రుతి యుపపన్నమగుచున్నది.

వివ :- (1) "స్వమపీతో భవతి" (ఛాం. ౬. ౮. ౧) అని శ్రుతి.

36 మూ. తథాన్యప్రతిషేధాత్.

తథా=అట్లే, అన్యప్రతిషేధాత్=ఇతరమైన దానిని నిషేధించుటవలన.

సూ. అట్లే శ్రుతులందుఁ బరమాత్మకంటె నితరమైనది లేదని ప్రతిషేధించుటవలనను సర్వము పరమాత్మయెగాని యన్యమేదియు లేదు.

వివ :- "బ్రహ్మైవేదం సర్వం" (ఛాం. ౩. ౨౫. ౨) ఇది యంతయు బ్రహ్మమె "ఆత్మైవేదం సర్వం" (ఛాం. ౭. ౨౫. ౨) ఇది యంతయు ఆత్మయె "నేహ నానాస్తికించన" (బృ. ౪. ౪. ౧౯) పరమాత్మ విషయమున భిన్నత్వ

ములేదు. ఇత్యాది శ్రుతులు సర్వము పరమాత్మయెగాని యన్యమేదియు లేదని చెప్పుచున్నవని భావము.

37. మూ. అనేన సర్వగతత్వమాయామ శబ్దాదిభ్యః

అనేన=ఈ నిషేధముచే, ఆయామశబ్దాదిభ్యః = వ్యాపియని తెలుపు శ్రుతులనుబట్టి, సర్వగతత్వం=పరమాత్మకు సర్వవ్యాపకత్వము.

సూ. పై సూత్రములందుఁ బరమాత్మకంటె నన్యమేదియు లేదని నిషేధించుటచేతను, పరమాత్మ వ్యాపియైనది యని తెలుపు శ్రుతులనుబట్టియు పరమాత్మ సర్వగతమైనది.

వివ :- "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః'' (ఛా ౩. ౧౪. ౩) పరమాత్మ యాకాశమువలె నంతట వ్యాపించినది నిత్యము "జ్యాయాన్దివః" (ఛా. ౩ ౧౪. ౩) దివముకంటెఁ బెద్దది "జ్యాయానాకాశాత" (ఛాం. ౩. ౧౪ ౩) ఆకాశము కంటెఁ బెద్దది. ఇత్యాదిశ్రుతులును "నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః" (గీత. ౨. ౨౪) పరమాత్మ నిత్యమైనది. యంతట వ్యాపించినది. స్థిరమైనది, అచలము ప్రాచీనమైనది" ఇత్యాది స్మృతులును పరమాత్మ సర్వ వ్యాపియని తెలుపుచున్నవని భావము.

## ఫలాధికరణము ౮

38. మూ. ఫలమత ఉపపత్తేః

ఉపపత్తేః=ఉపపన్నమగుటవల్ల, అతః=ఈ యీశ్వరునినుండె. ఫలం= ఫలము గలుగును.

సూ. ఈశ్వరుఁడె సర్వాధ్యక్షుఁ డగుటవలనఁ గర్మలకు ఫలము ఈశ్వరుని నుండియె కలుగుట యుపపన్నమగుచున్నది.

39. మూ. శ్రుతత్వాచ్చ.

శ్రుతత్వాత్ చ=శ్రుతియందుఁ జెప్పఁబడువలనను.

సూ. (1) "వ్యాపకుఁడు జన్మరహితుఁడునైన యీశ్వరుఁడే ప్రాణుల కాహారము నిచ్చువాఁడు ధనముల నిచ్చువాఁడు" అని శ్రుతియందు ఈశ్వరుఁడు కర్మఫలదాతయని చెప్పఁబడుటవలనను ఈశ్వరుఁడె కర్మఫలమిచ్చువాఁడు.

వివ:- "సవా ఏవ మహా నజ ఆత్మాన్నాదో వసుదానః" (బృ ౪. ౪. ౨౪) అని శ్రుతి.

40. మూ. ధర్మం జైమిని రతఏవ,

అతః ఏవ = ఈ శ్రుతిని బట్టియె, ధర్మం=ధర్మమె ఫలమిచ్చును అని, జైమినిః=జైమిని అనెను.

సూ. "1 స్వర్గము కోరువాఁడు యాగము చేయవలయు". అను శ్రుతిని బట్టి ధర్మమె ఫలము నిచ్చునది యని జైమిని యనియె.

వివ:- "స్వర్గకామోయజేత" అని శ్రుతి.

41. మూ. పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్

హేతు వ్యపదేశాత్=సర్వమునకు హేతువును చెప్పుటవలన, పూర్వఁతు= బ్రహ్మమె ఫలమిచ్చునని బాదరాయణః=బాదరాయణుఁడు.

సూ. కర్మఫలములకును, ధర్మాధర్మములకును ఈశ్వరుఁడె కారణమని శ్రుతులు చెప్పుట వలన ఈశ్వరుని వల్లనె కర్మఫలములు గలుఁగునని బాద రాయణుఁడు.

వివ:- "ఎష హ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యోలోకేభ్య ఉన్నినీషతే, ఏషఉ ఏవాఽసాధు కర్మ కారయతి తం యమధో నినీషతే" ఉశ్వరుఁడు ఎవనిని ఉత్తమలోకములను బొందింపఁ గోరునో వానిచే సత్క ర్మలు చేయించుని, ఎవ్వనిని అధోలోకములఁ బొందింపఁ గొరునో వానిచే అసత్కర్మ చేయించును" అని శ్రుతి. ఈశ్వరుఁడె ధర్మాధర్మములకుఁ గారణ మని చెప్పుచున్నదని భావము. "యో యో యాం యాం త నుం భక్తః శ్రద్ధ యార్చితు మిచ్ఛతి, తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం॥ సత యా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే, లభతే, చతతః కామాన్ మయైన విహితాన్ హి తాన్" ఏయే భక్తుఁడు శ్రద్ధతో, నే రూపుఁ గొల్వఁ గోరునో, వాని వానికి నందఁదే నిశ్చల భక్తిఁ గూర్చెదన్" అతఁడాభక్తితోఁ గూడి భజించు నెల్ల

దేవులన్, నేనె యిచ్చిన కోర్కెలా, దేవులనుండి పొందును " అని గీతయుఁ జెప్పుచున్నది. ఈశ్వరునిబట్టియె ప్రాణులకు విచిత్ర కార్యములు గలుగుచున్నవని భావము.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁడగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
ఉపనిషద్వాక్య సమన్వయమను
బ్రహ్మ మీమాంసా దర్శనమందు
మూఁడవ యధ్యాయమున
తత్ త్వం అను పదార్థముల వివేకమను
రెండవ పాదము



# బ్రహ్మమీమాంసా దర్శనము

## మూఁడవ యధ్యాయము

గుణోపసంహారమను మూఁడవ పాదము.

ఒకచోట చెప్పఁబడిన గుణములు మఱొకచోట సంక్రమించుట

### సర్వవేదాంత ప్రత్యయాధికరణము. ౧.

1. మూ. సర్వవేదాంత ప్రత్యయం చోదనాద్య విశేషాత్.

చోదనాద్య విశేషాత్=విధ్యాది వాక్యములలో విశేషము లేకపోవుటవలన, సర్వ వేదాంత ప్రత్యయః=సర్వ వేదాంతోపాసనలు ఒకటె

సూ. వేదశాఖ లన్నిటి యందును అగ్నిహోత్ర విధ్యాదివాక్యము లొక్కటిగనె యుండుటవలన వేదాంతము లన్నింటియందును జెప్పఁబడిన యుపాసన లొక్కటియెగాని భిన్నములు గావు.

వివ:-"అగ్నిహోత్రంజుహుయాత్" అగ్నిని హోమము చేయవలెను ఇత్యాది విధివాక్యము లొకటిగాన శాఖాదిభేదములనుబట్టి యుపాసనలు భేదింపవని భావము.

2 మూ. భేదాన్నేతిచేన్నైకస్యామపి.

భేదాత్నఇతిచేత్=భేదమువల్ల ఒకటియనరాదు అన్నచో, న=అట్లనరాదు, ఏకస్యామపి=ఒక శాఖయందునుగూడ నిట్లే గలదు.

సూ. ఆయా శాఖీయుల యుపాసనలలో గుణభేదము లనేకముగ నుండుటఁబట్టి యుపాసనలొక్కటి యనరాదన్నచో ఏక విద్యోపాసన యందుఁ

గూడ నిట్టి భేదముండుట యప్రపన్న మగుచున్నదిగాన శాఖాదిభేదమునుబట్టి యుపాసనలకు భేదమును జెప్పు పై దోషము గలుగదు.

వివ :_ ఉపాసనలో అగ్నులయిదన్నను ఆఱన్నను "అగ్నియందు హోమము చేయవలయును" అను విధిలో భేదము లేకపోవుట వలన దోషము లేదని భావము.

3. మూ. స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽధికారాచ్చ

సవవచ్చ తన్నియమః

స్వాధ్యాయస్య=వేదాధ్యయమునకే, తథాత్వేన = ఆ శిరోవ్రత నియమ ముండుటవల్ల, సమాచారే=వేదోవ్రతోపదేశ పదగ్రంథమున, అధికారాత్చ = అధికార విషయాధ్యయన శబ్దమువల్ల, సవపత్చ = సౌర్యాది యుగములవలె, తన్నియమః=దానికి నియమము.

సూ. విద్యాగ్రహణ సమయమున ఆధర్వణశాఖీయులు అగ్నిహోత్ర పాత్రమును శిరస్సున ధరించుట యను శిరోవ్రతమును ధరింతురు అన్యశాఖీ యులు శిరోవ్రతమును ధరింపకయె విద్యను గ్రహింతురుగాన వారు గ్రహించు విద్యలలో భేదముండునుగదా యన్నచో, వేదాధ్యయనమునకె యా శిరోవ్రత ధారణము అంగముగ వేదవ్రతముల నుపదేశించు గ్రంథమున "ఈ శిరోవ్రతము గూడ వేదవ్రతముగ వాఖ్యానింపఁబడినది" అని అధర్వణశాఖీయులు చెప్పుటచేతను "(2) శిరోవ్రతము నాచరింపని వాఁడు గ్రంథరూపమైన విద్యను గ్రహింపరాదు" అని వేదాధ్యయన రూపవిద్యనుగూర్చియె శిరోవ్రత నియమము చెప్పఁబడుటవలనను, సౌర్యాది యాగములు ఆధర్వణ శాఖీయులకు మాత్రమె నియమింపఁబడినట్లు శిరోవ్రతము వేదాధ్యయనమునకు మాత్రమె అంగముగ నియమింపఁబడినదిగాని విద్యకంగముగఁ జెప్పఁబడలేదు గాన విద్యకు భేదము లేదు గనుక దోషము లేదు.

వివ :_(1) "ఇదమపి వేదవ్రతత్వేన వ్యాఖ్యాతం" అని యాధర్వణికు లందురు. (2) "నైతదచీర్ణవ్రతోఽధీతే" (ముం. ౩. ౨. ౧౧) "తేషా మేవైతాం బ్రహ్మ విద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణం" (ముం ౩. ౨. ౧౦) ఎవరిచే నీ శిరోవ్రతము ధరింపఁబడినదో వారికె ఈ బ్రహ్మవిద్యను

జెప్పవలెను అనుచోట "ఈ బ్రహ్మవిద్యను" అని ప్రకృతమగు వేదాధ్యయన రూపగ్రంథ విద్యను బరామర్శించుటచే నీ శిరోవ్రతము వేదాధ్యయన గ్రంథ విద్యకే నియమ మగునుగాని విద్యకుఁ గాదు గాన నీ శ్రుతియు విరోధింపదని తెలియునది

4. సూ దర్శయతి చ

దర్శయతి చ=శ్రుతి చూపుచున్నది గూడ.

సూ. (1) "శ్రుతులన్నియుఁ బొందఁదగినట్లు ఏ పదము చెప్పుచున్నవో యది యోంకార రూపమైన బ్రహ్మమే" అని శ్రుతియుఁ దెలిసికొనదగిన విద్య యొకటి యని చూపుచున్నది గూడఁ గనుక విద్యకు భేదము లేదు.

వివ :- "(1) సర్వేవేదాయత్పద మామనంతి" (కఠ. ౨. ౧౫) అని శ్రుతి. "తథైతమేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసంత ఏవమగ్నా వధ్వర్యవ ఏతం మహావ్రతే ఛందోగాః" అట్లే ఈ పురుషునినే ఋగ్వేదులు గొప్పదైన యుక్థమను శస్త్రమందును, అధ్వర్యులు ఈ పురుషునినే యగ్నియందును, సామ శాఖీయులు ఈ పురుషునినే మహావ్రతమను క్రతువు నందును ఉపాసించుచున్నారు. అను శ్రుతియు తెలిసికొనఁదగు పురుషుని విద్యను ఒకటిగఁ జెప్పుచున్నది. సగుణ విద్యోపాసనను శ్రుతులు ఒకరీతిగనె చెప్పుచున్నవి. బృహదారణ్యకమున వైశ్వానరుఁడు ప్రాదేశమాత్రమందున్నట్లు చెప్పఁబడెను. ఆ వైశ్వానరునినె సామశాఖీయులు సిద్ధవస్తువుగఁ జెప్పిరి. ఉక్థాదిమంత్రములు వేదాంతములన్నిట నొక్క రీతిగనె యున్నవి. ఒకశాఖలో విహితము లయిన యుక్థాదిమంత్రములు మఱియొక శాఖలచే ఉపాసనకై స్వీకరింపఁబడినవి. కాన సగుణ విద్యకును భేదము లేదని తెలియునది.

## ఉపసంహారాధికరణము ౨

5. సూ. ఉపసంహారోఽర్థాఽభేదాద్విధిశేషవత్సమానే చ.

అర్థాఽభేదాత్=వస్తువులో భేదము లేకపోవుటవలన, విధిశేషవత్=విధిశేష మగు నంగములవలె, సమానే చ=సమానము కాఁగా, ఉపసంహారః=సంగ్రహ మగును.

సూ. అగ్నిహోత్రముతోఁ జేయు కర్మలన్నింటియందు ఉన్నది యా అగ్నిహోత్ర మొక్కటియెగాన ఆ యగ్నిహోత్రమునుబట్టి దాని యంగము లన్నియు దానితోపాటె సంగ్రహింపఁబడునట్లు ఆయా శాఖలు వేఱైనను అందుఁ జేయఁబడెడి యుపాసనము ఒక్కటి యగుటచేఁ బ్రయోజనములో భేదము లేకపోవుటవలన ఒక శాఖయందుఁ జెప్పఁబడిన గుణము వేఱొక శాఖయందును సంగ్రహింపఁబడును.

## అన్యథాత్వాధికరణము ౩

6. సూ. అన్యథాత్వం శబ్దాదితి చేన్నాఽవిశేషాత్.

శబ్దాత్=శ్రుతినిబట్టి, అన్యథాత్వం=వేఱుగ నున్నది, ఇతిచేత్=అన్నచో, అవిశేషాత్=విశేషము లేకపోవుటవలన, న=వేరుగాదు.

సూ. (1) "ఓ ప్రాణమా ! నీవు నాకొఱకు ఉద్గానము చేయుము" అనుచోట వాజసనేయులు ప్రాణమునుగర్తగను, (2) "ఆ ప్రాణమును ఉద్గీథముగా నుపాసించిరి" అనుచోట ఛందోగులు ప్రాణమును గర్మగను ఉపక్రమించి వేఱువేఱుగఁ జెప్పుటచేఁ బ్రాణోపాసన భిన్నమైనదన్నచో నిట రెండుచోట్ల బ్రాణప్రశంసయె ముఖ్యము గాన విశేషము లేకపోవుటవలనఁ జెప్పఁబడిన రీతిగాఁ బ్రాణోపాస మొక్కటియె యనవలయును.

వివ :- (1) "త్వం న ఉద్గాయ" (బృ. ౧. ౩. ౨) అని ఛందోగులు. పూర్వమందువలె నిటను ఉపాసన యొక్కటె యని పూర్వపక్షము చేయఁబడినది.

7. సూ. నవా ప్రకరణ భేదాత్ పరోవరీయస్త్వాదివత్.

ప్రకరణభేదాత్ = ఉపక్రమ భేదమునుబట్టి, పరోవరీయస్త్వాదివత్ = ఓంకారము యొక్క యుత్తమోత్తమత్వాదిమువలె, న వా = అభిన్నమైనది యుఁగాదు.

సూ. (1) "ఆయా యుద్గీథావయవమైన యోంకారము ఉత్తమోత్తమ మైనది యనంతమైనది కూడ" అని చెప్పఁబడిన యుత్తమోత్తమైన యనంత మైన యద్గీథమును, గంటియందు సూర్యుని యఁదునుండి హిరణ్యశ్మశ్రుత్వాది గుణములుగల యుద్గీథమును ఒక శాఖలో నున్నదైనను భిన్నమైనట్లు వాజస

నేయ శాఖలో నుద్గీతమగు ప్రాణము ఉపాసింపఁదగినదనియు, ఛాందోగ్య శాఖలో ఉద్గీథాంగమగు ఓంకారము ఉపాసింపఁ దగినదనియు ఉపక్రమభేద మునుబట్టి చెప్పుటవలన ఉపాసనలో భేదము తెలియుచున్నది గాన పేరునకు రెండును ఉద్గీథోపాసనలైనను వానికి అభేదము లేదు.

వివ :- (1) "సఏషపరోవరీయా నుద్గీథస్స ఏషోఽనంతః" (ఛాం. ౧. ౯. ౨) అని శ్రుతి. "త ముద్గీథ ముపాసాం చక్రిరే" (ఛాం ౧ ౨. ౭) "ఆ ప్రాణమును ఉద్గీథమునుగా నుపాసించిరి" అను ఛాందోగ్యములు కర్తయగు ఋత్విక్కును ప్రాణమునుగా నుపాసింపవలయునని చెప్పినచో ఓంకారోపాస నోపక్రమమునకు భంగము కలుగును. వాజసనేయమున ఋత్విక్కె ప్రాణముగఁ జెప్పఁబడుచున్నాఁడు గాన భేదము స్పష్టమని భావము.

8. సూ. సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తితు తదపి

సంజ్ఞాతం = ఒక పేరుతోనే చెప్పఁబడినది అన్నచో, తత్ = అది, ఉక్తం = పూర్వ సూత్రమునఁ జెప్పఁబడినది, తదపి = అది గూడ, అస్తితు = ఉన్నదిగదా.

సూ. "ఉద్గీథ" మను పేరు రెండు శాఖలందును సమానముగానున్నది కాన ఉపాసనవిద్య కూడ నొక్కటే యగును గదా యన్నచో ఈ యాక్షేపము నకు పూర్వసూత్రము (౭సూత్ర)న సమాధానము చెప్పఁబడినది మఱియు స్పష్టముగ భేదముగల యుపాసనా విద్యయందు పేరు ఒక్కటిగ నున్నను — కఠశాఖాగ్రంథమునఁ జెప్పఁబడిన యగ్నిహోత్ర దర్శ పూర్ణమాసాది కర్మలకుఁ గాఠకమను పేరు సమానముగ నున్నను— ఉపాసనావిద్య యొక్క టియె గాదు గాన ఆ యుద్గీథోపాసనలు భిన్నములేగాని యొక్కటిగావు.

## వ్యాప్త్యధికరణము ౪

9. సూ. వ్యాప్తేస్తు సమంజసమ్.

వ్యాప్తేః తు=వ్యాపించియుండుటవలననే, సమంజసమ్=సమంజసమైనది.

సూ. (1) "ఓమ్" అనునట్టి యీ యక్షరమును ఉద్గీథమును ఉపాసింపవలయును" అనుచోట ఓంకారము అన్ని వేదములందు వ్యాపించి

యుండుటవలన 'ఉద్గీథమును' అను దానిని "ఓమ్" అను నక్షరమునకె విశేషణము చేసి యుద్గీథమునకు అవయవమగు ఓంకారమును ఉపాసింప వలయును అని చెప్పుటయె సమంజము కాని ఓంకారమను నక్షరమును ఉద్గీథ మునకు విశేషణముచేసి ఓంకారమను నక్షరముతోఁ గూడిన యుద్గీథమును ఉపాసింపవలయునని యర్థము చెప్పుట సమంజసముగాదు.

వివ :- "ఓమిత్యే తదక్షర యుద్గీథ ముపాసీత" (ఛాం. ౧ ౧ ౧) అని శ్రుతిలో అక్షరం, ఉద్గీథం అని యొక్కటె విధమగు విభక్తులున్నవి. ఆ రెంటిలో ఒకటే విభక్తులుండుటవలన అటసామానాధికారిణ్యము = (ఆ రెండు విభక్తులచేఁ జెప్పఁదగిన విషయ మొకటిగనె యగుట) ఉన్నది. సామానాధి కరణమున్నచోట అధ్యాసము, అపవాదము ఏకత్వము, విశేషణము అను నాలుగును జెప్పవచ్చును. అధ్యాసమనఁగా, ఒక వస్తువునందు, ఇంకొక వస్తు ధర్మములను ఆరోపించుట, త్రాడును జూచి పాము అనుకొనుట. అసత్యమగు జగమును సత్యమగు బ్రహ్మమనుకొనుట. దేహమును ఆత్మగను ఆత్మను దేహముగను ఆరోపించుకొనుట, అపవాదమనఁగా, అజ్ఞానాదులచే మొదటఁ గలిగిన మిథ్యాబుద్ధిని దరువాతఁ గలిగిన జ్ఞానాదులచే నివారించి యథార్థబుద్ధిని నిశ్చయించుట. మొదటఁ ద్రాడును బామనుకొని పిదప దీపముచే తెలిసికొని పిదప ఇది పాము కాదు త్రాడు అని నిశ్చయించుకొనుట దేహమునే ఆత్మగాఁ దలచి పిదప జ్ఞానముచే దేహముగనె ఆత్మకంటె భిన్నమైనదానిగనెతెలిసికొనుట. ఏకత్వమనఁగా అభేదజ్ఞానము. బ్రాహ్మణుఁ డన్నను ద్విజోత్తముఁ డన్నను ఒకరే అని తెలిసికొనుట విశేషణమనఁగా. సమానాకార వస్తువులనుండి యొక వస్తువును భేదము చేయుటకు ఒక విశేషగుణమును జెప్పుట. నల్లఁగలువ అనుచోట కలువలందు భేదము చెప్పుటకుఁ దెల్లఁగలువ నుండి వేఱు చేయుటకు నల్లనిది. అని విశేషగుణమును జెప్పుట. పై శ్రుతి యందు ఉద్గీథరూపమైన ఓంకారమును ఉపాసింపవలయును అని విశేషణమె గాని అధ్యాసముగాని అపవాద ముగాని ఏకత్వముగాని చెప్పరాదని తెలుపుటకే యీ సూత్రము ప్రారంభింపఁ బడినది. ఇట ఓంకారమునందు ఉద్గీథబుద్ధిగాని ఉద్గీథమందు ఓంకారబుద్ధిగాని అధ్యాసముచేఁ జెప్పరాదు. ఓంకారబుద్ధిచే ఉద్గీథబుద్ధిగాని ఉద్గీథబుద్ధిచే ఓంకార బుద్ధిగాని నివారింపఁబడునట్లు. అపవాదముగా చెప్పరాదు. ఓంకారము ఉద్గీథ మును రెండు ఒకటిగా అభేదబుద్ధియుఁ జెప్పరాదని భావము.

10. మూ. సర్వాభేదాదన్యత్రేమే.

సర్వాభేదాత్=అన్నిటికి భేదము లేకపోవుటవలన, అన్యత్ర=మరొక శాఖ యందు, ఇమే=ఈ గుణములు కలుగును.

సూ. ప్రాణోపాసనము అన్ని శాఖలయందును ఒక్కటి యగుటవల్ల ఒక శాఖయందుఁ బ్రాణోపాసనమునకుఁ జెప్పఁబడిన వసిష్ఠత్వాదిగుణములు మఱొక శాఖయందుఁ జెప్పఁబడిన ప్రాణోపాసనమునకును సంక్రమించును.

వివ :- "యద్వాహం వసిష్ఠోఽస్మి త్వం తద్వసిష్ఠోఽసి" (బృ. ౬. ౧. ౧౪) ఏ శ్రేష్ఠగుణముచే నేను వసిష్ఠత్వగుణము కలదాననో దానిచే నీవును వసిష్ఠత్వగుణము గలదానవు" అని వాగింద్రియము ప్రాణమును బొగడెను. ఇట్లు వాజసనేయ శాఖయందును ఛందోగశాఖయందును ప్రాణమునకుఁ జెప్పఁబడిన వసిష్ఠత్వాది గుణములు కౌషీతక్యాదిశాఖలందుఁ జెప్పఁబడిన ప్రాణమునకుఁ గలుగును. శౌర్యాదిగుణములచే స్వదేశమునఁ బ్రసిద్ధులైన దేవదత్తాదులు పరదేశమునకుఁ బోయినను ఆ దేశస్థులచే వారి శౌర్యాదులు తెలియఁబడకపోయినను వారి శౌర్యాదిగుణములు పోకుండునట్లు ప్రాణమొక్కటి యగుటవల్ల ఒక శాఖయందుఁ జెప్పఁబడకున్నను ఇతర శాఖలందుఁ జెప్పఁబడిన గుణములు ఆ శాఖయందుఁ జెప్పఁబడిన ప్రాణమునకుండునని భావము.

## ఆనందాద్యధికరణము ౬

11. మూ. ఆనందాదయః ప్రధానస్య

ప్రధానస్య = బ్రహ్మమునకు, ఆనందాదయః = ఆనందము మొదలైనవి యున్నవి.

సూ. అన్ని శ్రుతులందుఁ జెప్పఁబడిన బ్రహ్మము ఒక్కటే యగుటవలననె ఒక్కొక్కచోటఁ గొన్నిధర్మములు మాత్రమె చెప్పఁబడినప్పటికిని బ్రహ్మమునకు అన్నిచోట్లను ఆనందరూపత్వ సర్వగతత్వాది ధర్మములన్నియు నున్నవని తెలియవలయు.

12. మూ. ప్రియశిరస్త్వాద్యప్రాప్తి రుపచయాపచయౌహి భేదే.

ప్రియ శిరస్త్వాద్యప్రాప్తిః=ప్రియమె శిరస్సు మొదలైన గుణము లొక్కొక శాఖయందు ప్రాప్తింపవు, భేదే హి=భేదముగా నున్న సగుణబ్రహ్మమందె, ఉపచయాపచయౌ=వృద్ధి క్షయములు.

సూ. "అ బ్రహ్మమునకు ఇష్టవస్తు ప్రాప్తిరూపమగు ప్రియమె శిరస్సు, పుత్రజన్మాది సంతోషమె దక్షిణపక్షము, విద్యాది సుఖములవల్లఁ గలుగు ప్రమోదమె యుత్తరపక్షము, ఈ యన్నిటికంటె నుత్కృష్టమైన యానందమె యాత్మ, పుచ్ఛమును ఆధారమును బ్రహ్మమును అనుచోట ఉపాసనలో భేదము గల సగుణ బ్రహ్మమునందె గుణముల వృద్ధిక్షయము ఉపపన్నమగును గాని, నిర్గుణ బ్రహ్మమునందు లుపపన్నముగావు గాన "ఇష్టవస్తు ప్రాప్తిరూపమైన ప్రియమెశిరస్సు" మొదలైన తైత్తిరీయ శాఖయందుఁ జెప్పఁబడిన గుణములు ఇతర శాఖలందును, ఇతర శాఖలందుఁ జెప్పఁబడి సత్యకామత్వాదు లింకొక శాఖయందును బ్రాప్తింపవు.

వివ:- ఇద్దఱు స్త్రీలు ఒకతె గొడుగు పట్టుకొని ఒకతె చామరము పట్టుకొని రాజును సేవించుచున్నారనుచోట సేవింపఁబడువాఁడు రాజొకఁడే యైనను ఆ సేవలో భేదము ధర్మవ్యవస్థలో భేదము ఉన్నట్లే యిందును ఉపాసనలో భేద ముండునుగాన ఒక శాఖలోఁ జెప్పఁబడిన గుణములు ఇంకొక శాఖలోఁ బ్రాప్తింపవని భావము. నిర్గుణబ్రహ్మము విషయమున భేదములేదు గాన దానికి దావే లేదు. ఈ భేదములన్నియు సగుణబ్రహ్మమునకే యని తెలియునది. వాస్తవమునకు నిర్గుణబ్రహ్మముకంటె నితరమెద్దియు లేకున్నను ఇది మందబుద్ధులకుఁ జెప్పఁబడెనని తెలియునది.

13. మూ. ఇతరేత్వర్థ సామాన్యాత్.

అర్థసామాన్యాత్ = తెలిసికొను అర్థములో సామ్యముండుటవలన, ఇతరేతు=ఇతర గుణములును.

సూ. తెలిసికొనఁదగినది బ్రహ్మమొక్కటియె గాన సత్యకామత్వాదుల కంటె నితరమైన సచ్చిదానందాది ధర్మములును అన్నిచోట్లఁ దెలియుఁదగినవి.

## ఆధ్యానాధికరణము ౭

14. సూ. ఆధ్యానాయ ప్రయోజనాభావాత్.

ప్రయోజనాభావాత్ = వరుసలో ప్రయోజనము లేకపోవుటవలన, ఆధ్యానాయ=పురుషదర్శనమునకే.

సూ. (1) "ఇంద్రియములకంటె విషయములు గొప్పవి. విషయముల కంటె మనస్సు గొప్పది, మనస్సుకంటె బుద్ధిగొప్పది, బుద్ధికంటె వ్యాపియగు మహత్తు గొప్పది, మహత్తత్త్వముకంటె అవ్యక్తము గొప్పది, అవ్యక్తముకంటె పురుషుఁడు గొప్పవాఁడు పురుషునికంటె గొప్పదిలేదు. ఆ పురుషుఁడె చివరి హద్దు అతఁడె యుత్తమగతి." అను శ్రుతియందు ఇంద్రియాదులకంటె విష యాదులు గొప్పవని క్రమముగాఁ జెప్పుటలోఁ బ్రయోజనమేమియు లేకపోవుట వలన ఒకదానికంటె నొకటి గొప్పదని వరుసగా చెప్పుట పురుషుఁడె యన్నిటి కంటె గొప్పవాఁడని చెప్పి మోక్షప్రయోజన మిచ్చెడి యా పురుషుని జూపుటకె గాని యొకదానికంటె నొకటి గొప్పదని క్రమము చెప్పుటకుఁ గాదు.

వివ :- (1) "ఇంద్రియేభ్యః పరా హ్యర్థా, హ్యర్థేభ్యశ్చ పరంమనః, మనసశ్చపరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః, మహతః పరమవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః పురుషాన్న పరంకించి త్సాకాష్ఠా సాపరాగతిః (కఠ. ౩. ౧౦. ౧౧) అని శ్రుతి.

15. సూ. ఆత్మశబ్దాచ్చ.

ఆత్మశబ్దాత్‌చ=ఆత్మ శబ్దమును బ్రయోగించుటవలనను.

సూ "ఈ పురుషరూపమైన యాత్మ సర్వప్రాణులందు గూఢమై యున్నది పైకిఁ బ్రకాశింపదు సూక్ష్మదర్శులచే ఉత్తమమైన సూక్ష్మబుద్ధిచేఁ జూడఁబడుచున్నది" అని యీ శ్రుతియందు ఆ పురుషుఁడె చివరి హద్దు అతఁడె యుత్తమగతి" అను శ్రుతిని బరామర్శించుచు పురుషుని యందు ఆత్మశబ్దమును బ్రయోగించుటవలనను ఇంద్రియాదులకంటె విషయాదులు గొప్పవని చెప్పుట పురుషుని గూర్చి తెలుపుటకెగాని యొకదానికంటె నొకటి గొప్పదని క్రమము తెలుపుటకుఁ గాదు.

వివ :- "ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా నప్రకాశతే, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యాసూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" (కఠ. ౩. ౧౨) అని శ్రుతి. "యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞః" (కఠ. ౩. ౧౩) బుద్ధిమంతుఁడు పురుషునిఁ దెలియుటకొఱకే వాక్కును మనస్సును నియమించుకొనవలెను." "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం" (కఠ. ౩. ౯) అతఁడు విష్ణువు యొక్క పరమపదమైన, సంసార మార్గమునకు నవతలిగట్టయిన పరమాత్మను పొందును. ఇత్యాదులు ఆ పురుషునిఁ దెలియుటను గూర్చియె తెలుపుచున్నవి.

## ఆత్మగృహీత్యధికరణము ౭

16. సూ. ఆత్మగృహీతిరితర వదుత్తరాత్.

ఇతరవత్=ఇతర శ్రుతులందువలె, ఉత్తరాత్=ఉత్తర శ్రుతివాక్యమును బట్టి, ఆత్మగృహీతిః=ఆత్మయనగాఁ బరమాత్మ గ్రహింపఁబడును.

సూ (1) "ఈ జగము ఒక యాత్మముగనె యుండెను. మఱొకటి యేదియులేదు, ఆ యాత్మ లోకములను సృజింతునాయేమి యని సంకల్పించెను" (2) "సంకల్పించి యాత్మ స్వర్గమును, అంతరిక్షమును, భూమిని పాతాళమును అను నీ లోకములను సృజించెను" ఇత్యాది శ్రుతులతోఁ జెప్పఁబడిన యాత్మపదముచే, చివరఁ జెప్పఁబడిన "లోకములను సృజింతునాయేమి యని సంకల్పించెను" "ఈ లోకములను సృజించెను" అను వాక్యములనుబట్టి (3) "ఆయా యాత్మనుండియే యాకాశము పుట్టెను" ఇత్యాది శ్రుతులందు ఆత్మ అనగా పరమాత్మగా గ్రహింపవలయునుగాని పరమాత్మకంటె మఱియొక ప్రజాపతిని గ్రహింపరాదు.

వివ :- (1) "ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్స ఈక్షత లోకాన్నుసృజా ఇతి" (ఐ. ౧. ౧.) (2) సఇమాంల్లోకానసృజ తాంభోమరీచీర్మరమాపః" (ఐ. ౧. ౨.) (3) తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై. ౨. ౧. ౧) ఇత్యాదులు శ్రుతులు. శ్రుతులందు మహాభూత సృష్టి చెప్పక లోకసృష్టిని చెప్పుటవలన ఈ సృష్టికర్త యెవరై యుండునను సందేహమును వారించుటకై యిది చెప్పఁబడెను.

17. సూ. అన్వయాదితి చేత్స్యాదవధారణాత్.

అన్వయాత్=సమన్వయించుటవలన, ఇతిచేత్=అన్నచో, అవధారణాత్=నిశ్చయముగా చెప్పుటవలన, స్యాత్=పరమాత్మమె యగును.

సూ. "సంకల్పించి యాత్మ స్వర్గము అంతరిక్షము, భూమి పాతాళము అను నాలోకములను సృజించెను" అను శ్రుతివాక్యమునఁ జెప్పఁబడిన లోకసృష్టి పరమాత్మకంటె నన్యుఁడగు మఱియొక ప్రజాపతి యందు సమన్వయించుట వలన ఆత్మ యనఁగా బ్రజాపతి యనియెగాని పరమాత్మ యని చెప్పరాదన్నచో సృష్టికిపూర్వము ఆత్మయొక్కఁటె యున్నదని నిర్ధారణ చేయుటవలన ఆ పరమాత్మకంటె వేఱొక ప్రజాపతి లేఁడని తెలియుచున్నది గానఁ బై శ్రుతులందు ఆత్మయనఁగాఁ బరమాత్మ యనియెగాని వేఱొక ప్రజాపతి యని చెప్పరాదు.

వివ :- పరమాత్మ మహాభూతములను సృజించిన పిదప వేఱొక ప్రజాపతి స్వర్గాది లోకములను సృజించెనని చెప్పుకొనవచ్చునని యన్నచో పరమాత్మ స్వర్గాదిలోకములను లోకపాలురను అగ్న్యాదులను సృజించి ఇంద్రియములను ఇంద్రియములకు ఆధారమగు శరీరములను వానికుపదేశించి "కథన్విదం మదృతేస్యాత్" (ఐ. ౩. ౧౧) ఇదియంతయు నేను లేకుండ నెట్లుండును అని తలఁచి "స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారాప్రాపద్యత" (ఐ. ౩. ౧౨) ఆ పరమాత్మ ఈ మూర్ధమును జీల్చుకొని ఈ బ్రహ్మరంధ్రము ద్వారా ప్రవేశించెను. అట్లు ప్రవేశించిన పిదప "స ఏతమేవ పురుషం బ్రహ్మతత మపశ్యత్" (ఐ. ౩. ౧౩) ఆ పరమాత్మ ఆ శరీరమునఁ బ్రవేశించిన పురుషుఁడైన తన్ను అంతట వ్యాపించిన బ్రహ్మముగఁ జూచెను. అని ఇత్యాదులందు బ్రహ్మాత్మత్వమును పొందెనట్లు నిశ్చయించుటవలనను స్వర్గాదులను సృజించినట్లు చెపఁబడిన యాత్మ పరమాత్మయేగాని ప్రజాపతి గాఁడని భావము.

16 వ సూత్రమునకు అర్థాంతరమందు సూత్రము.

సూ. (1) "ఆత్మ యెవఁడు? ప్రాణములందు హృదయమున విజ్ఞానమయుఁడై జ్యోతిర్మయుఁడై యున్న పురుషుఁడె ఆత్మ" అని యుపక్రమించి (2) "ఆ ఈ యాత్మ పుట్టుక లేనివాఁడు ముసలితనము లేనివాఁడు చావులేనివాఁడు భయము లేనివాఁడును బ్రహ్మమే." అని యుపసంహారమున వాజసనేయ శాఖ యందుఁ జెప్పఁబడిన యాత్మ పరమాత్మగ గ్రహింపఁబడినట్లు (3) "ఓ సౌమ్యుఁడా! ఇది మొదట సత్పదార్థముగనె యున్నది ఇది యొకటె

యభిన్నమైనది" అని యుపక్రమించి "ఓ శ్వేతకేతూ! ఆ యాత్మయె నీవై యున్నావు" అని యుపసంహారమున ఛందోగశాఖయందు ఆ యాత్మయే నీవై యున్నావని తాదాత్మ్యాదిధర్మములు చెప్పఁబడుటవలన ఆత్మ యనఁగా పరమాత్మయె గ్రహింపఁబడును.

విప :- (1) "కతమ ఆత్మేతియోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యం తర్జ్యోతిః పురుషః" (బృ. ౪ ౩ ౭) అని యుపక్రమశ్రుతి. (2) "సవాఏష మహానజ ఆత్మాఽ జరోఽ మృతోఽ భయో బ్రహ్మ" (బృ. ౪౪. ౨౫) అని వాజసనేయ శాఖలోని యుపసంహార శ్రుతి. (3) "సదేవసోమ్యేద మగ్రఆసీదేక మేవాద్వితీయం" (ఛా. ౬. ౨. ౧.) అని యుపక్రమశ్రుతి. (4) "సఆత్మా తత్త్వమసి" (ఛాం. ౬. ౮. ౭) అని ఛాందోగ్యశాఖలో నుపసంహార శ్రుతి.

17 వ సూత్రమున కర్థాంతమున సూత్రము.

సూ. ఛాందోగ్యశ్రుతియందు ఉపక్రమమందు ఆత్మశబ్దాన్వయము అనగా ఆత్మశబ్దము లేకపోపుటవలనఁ బరమాత్మ గ్రహింపఁబడదన్నచో (1) "దేనిచే వినఁబడనిది వినఁబడినదగునో మననము చేయఁబడనిది మననము చేయఁబడినదగునో తెలియఁబడనిది తెలియఁబడినదగునో అదియె పరమాత్మ" అనియొకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానములు తెలియఁబడునని నిశ్చయించుటవలనను సృష్టికిపూర్వము సత్పదార్థమె యున్నదని నిర్ధరించుటవలనను ఆ సర్వవిజ్ఞానములను బొందఁగోరి "సత్పదార్థముగనె యున్నది" అని చెప్పఁబడినదానికి పరమాత్మయె గ్రహింపఁబడును.

విప :- (1) "యే నాశ్రుతం శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతం" (ఛాం. ౬. ౧. ౧)

### కార్యాఖ్యానాధికరణము ౫

18. సూ. కార్యాఖ్యానాదపూర్వం.

కార్యాఖ్యానాత్ = జలమును వస్త్రకార్యముగఁ జెప్పుటవలన, అపూర్వం = క్రొత్త విధియెగాని ప్రాత విధి చేయఁబడుటలేదు.

సూ ( ) "ప్రాణమునకు జలము వస్త్రమగుటవలననే భుజింపఁ బోవు శ్రోత్రియులు భోజనమునకు ముందువెనుకల జలమును వస్త్రముతోఁ బ్రాణమును గలుపుచున్నారు." అను ఛాందోగ్యశాఖ శ్రుతి యందును, (2) "అందువలన ప్రాణమునకు జలము వస్త్రముగాన విద్వాంసులైన శ్రోత్రియులు భుజింపఁబోవువారై ఆచమనము చేయుచున్నారు భుజించియును ఆచమనము చేయుచున్నారు అందులో ఈ ప్రాణమును ఆచమనముచే బ్రాణమును నగ్నముగానిదిగఁ జేయుచుంటిమని తలఁచుచున్నారు. అందువలన దీనిని దెలియువాఁడు భుజింపఁ బోవుచు ఆచమనము జేయవలయును భుజించియు నాచమనము చేయవలయును. ఈ ప్రాణమునే నగ్నము గానిదిగఁజేయుచున్నామని తలఁచుచున్నారు." అను వాజసనేయ శాఖా శ్రుతి యందును, శుద్ధికై యాచమనము చేయఁదగినట్లు స్మృత్యాచారాది ప్రసిద్ధ విషయమును దిరిగి యనువాదముగఁ జెప్పుటవల్లను, (3) "ఓ ప్రాణమా! నీకు జలమె వస్త్రము" అని ప్రాణమునకు జలము వస్త్రతార్యమగునని చెప్పుటవల్లను, (4) "ఓ ప్రాణమా! కుక్కల వఱకుఁ బక్షుల వఱకుఁ జిన్న పురుగులవఱకుఁ బురుగులు మిడతలవఱకుఁ గల యిది యంతయు నీకు అన్నమే" అని చెప్పి దీనితోపాటు (5) "నీకు జలమె వస్త్రము" అని చెప్పుచు "ఈ ప్రాణమునె నగ్నముగానిదిగఁ జేయుచున్నారని తలఁచుచున్నారు" అని ప్రాణమునకు వస్త్రవిధి చెప్పుటవల్లను నిదివరకుఁ జెప్పని "ప్రాణముయొక్క జలవస్త్రరూపధ్యానము మాత్రము" పై ఛాందోగ్య వాజసనేయ శ్రుతులలో విధింపఁబడుచున్నదిగాని పూర్వప్రసిద్ధమయిన యాచమనము విధింపఁబడుట లేదు.

రివ :- 1. "తస్మాద్వా ఏతదశిష్యంతః పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భిః పరిదధతి" (ఛాం. ౫. ౨. ౨), 2. తద్విద్వాంసః శ్రోత్రియా అశిష్యంత ఆచామం త్యశిత్వా చామంతిత ఏతమేవ తదన్న మనగ్నం కుర్వంతో మన్యంతే తస్మాదేవం విదశిష్యన్నాచామే దశిత్వాచామే దేతమేవ తదన్న మనగ్నం కురుతే" (బృ. ౬. ౧. ౧౪), 3. "ఆపోవాసః", 4. "యదిదం కించా శ్వభ్య ఆ శకునిభ్య ఆ కృమిభ్య ఆ కీటపతంగేభ్య స్తత్తేఽన్నం" (బృ. ౧. ౧౪.) 5. "ఆపోవాసః" 6. "ఏతమేవ తదన్న మనగ్నం కుర్వంతో మన్యంతే" (బృ. ౬. ౧. ౧౪) అని శ్రుతులు.

## సమానాధికరణము ౧౦

19. మూ. సమాన ఏవం చాఽభేదాత్.

అభేదాత్ = బ్రహ్మోపాసన భేదము లేనిదగుటవలన, ఏవం చ = ఇట్లొక శాఖలోను, సమానః=సమానమె.

సూ. 1. "ఉపాసకుఁడు మనోమయము, ప్రాణశరీరములు గలది తేజోరూపముగలదియునైన యాత్మను ఉపాసింపవలయు" అని వాజసనేయశాఖలో అగ్నిరహస్యమున శాండిల్యమను పేరుగల విద్యయందును- 2. "మనోమయుఁడగు పురుషుఁడు తేజస్సత్యరూపములు గలవాఁడై ఆ హృదయము లోపలి వరిగింజవలెను యవగింజవలెను ఉన్నాఁడు ఆ యితఁడు అంతకు ఈశ్వరుఁడై అంతకు అధిపతియై ఈ సమస్త ప్రపంచమును శాసించుచున్నాఁడు" అని యా వాజసనేయశాఖలోనే బృహదారణ్యకమునందును జెప్పఁబడిన బ్రహ్మోపాసనమునకు భేదము లేకపోవుటవలన భిన్నశాఖలలో ఉపాసనకు భేదములేకపోవుటచే ఒక శాఖయందలి ఉపాసన గుణములు ఇంకొక శాఖయందలి యుపాసనను సంగ్రహింపఁబడినట్లు— ఒకే శాఖయందును సంగ్రహింపఁబడుట సమానమె యగునుగానఁ బై శ్రుతులలో ఉపాస్య బ్రహ్మమున కభేదమును, గుణములు సంగ్రహింపఁబడుటయు నగు.

వివ:- 1. "స ఆత్మానముపాసీత మనోమయం ప్రాణశరీరం భారూపం" 2. "మనోమయోఽయం పురుషోభాః సత్యస్తస్మిన్నంతర్హృదయే యథా వ్రీహిర్వాయవోవా స ఏష సర్వస్యేశానః సర్వస్యాధిపతిః సర్వమిదం ప్రశాస్తి యదిదం కిం చ" (బృ. ౫. ౬. ౧) అని శ్రుతులు.

## సంబంధాధికరణము ౧౧

20. మూ. సంబంధాదేవమన్యత్రాపి.

సంబంధాత్=బ్రహ్మముతో సంబంధమువలన, ఏవం=ఇట్లు, అన్యత్రాపి=ఇతరోపాసనయందును.

సూ. 1. "సత్యమె బ్రహ్మము" అని యుపక్రమించి, 2. "సత్యస్వరూపమైన బ్రహ్మమే యీ సూర్యుఁడు, సూర్యమండల మందున్న పురుషుఁడే

సూర్యుఁడు కుడికంటియందున్న పురుషుఁడే యీ సత్యస్వరూపమైన బ్రహ్మము ఆ సూర్యుఁడు ఆ కంటి పురుషుఁ డీయిద్దఱు ఒండొరులందున్న వారు" అను బృహదారణ్యక శ్రుతిలో సత్యబ్రహ్మమును అధిదైవతోపాసనమైన సూర్యుని గను అధ్యాత్మోపాసనమైన కంటిలోని పురుషునిగను గల్పించి 3. "ఆ సూర్యులోని పురుషునికి అహస్సు అనునది రహస్య నామము" అని అధిదైవత మందును ఆ కంటి పురుషునికి అహము అనునది రహస్య నామము. అని అధ్యాత్మమందును గల్పింపఁబడిన పేరులుగల సత్యవిద్యోపాసనలు సత్య స్వరూపమైన బ్రహ్మముతో సంబంధము గలవగుటవలనఁ బూర్వోక్తమగు శాండిల్య విద్యోపాసన యందువలె సత్యవిద్యోపాసనల యందును ఒకదాని నామ గుణము లొకదానికి సంగ్రహింపవచ్చును.

వివ :- ఇది పూర్వపక్షసూత్రము. 1. "సత్యం బ్రహ్మ" (బృ. ౫. ౫. ౧). 2. "తద్యత్సత్య మసౌఆదిత్యో, య ఏష ఏ తస్మి న్మండలే పురుషోయశ్చాయం దక్షిణేక్షన్ పురుషఃతావేతా వన్యోన్యస్మిన్ ప్రతిష్ఠితౌ" (బృ. ౫. ౫ ౨). 3. "తస్యోపనిషదహః". 4 "తస్యోపనిషదహం". అని శ్రుతులు గురువు అరణ్యమున నున్నను గ్రామమున నున్నను శిష్యుఁడు అనుసరించుట మొదలగునవి సమానమైనట్లు ఒక్కటగు సత్యబ్రహ్మమునందు చేయఁబడు విభిన్నోపాసనల గుణములు రెండిటి యందును గలుగునని పూర్వ పక్షము.

21. సూ. న వా విశేషాత్

విశేషాత్=స్థాన విశేషమువలన, నవా=కలుగవుకూడ

సూ. సూర్యమండల మందున్న పురుషుని అధిదైవిక పురుషునిగఁ జెప్పి, వానికి అహస్సు అని పేరనియు, కంటియందున్న పురుషుని అధ్యాత్మ పురుషునిగఁ జెప్పి వానికి అహము అని పేరనియు, స్థాన విశేషములు చెప్పుట వల్ల ఆ రెండిటి యుపాసనలందు ఒకదాని గుణము లొకదానికిఁ గలుగవు.

వివ :- గురువు అరణ్యమందున్నను గ్రామమందున్నను సేవఒకటే గాన అనుసరించుట సమానమైనను గురువు కూర్చున్నప్పుడు చేయవలసిన సేవ యొకవిధముగను నిలుచున్నప్పుడు చేయవలసిన సేవ వేఱువిధముగను నుండును గాన గురువు కూర్చున్నపుడు చేయు సేవ నిలుచున్నప్పుడు పనికిరాదు. నిలు

చున్నప్పుడు చేయు సేవ కూర్చున్నప్పుడు పనికిరాదు. ఇట్లు స్థానవిశేషమును బట్టి సేవ లొకట్రొటిగానట్లే సూర్యుఁడు కన్ను అను స్థానవిశేషములఁబట్టి చేయు నుపాసనలొకటి గావు వానిగుణములు నొకదాని నొకదానికిని గలుగవనిభావము

22. సూ. దర్శయతి చ.

దర్శయతి చ=శ్రుతి చూపుచున్నది గూడ.

సూ. 1. "సూర్యునిలోని పురుషుని రూపమెట్టిదో యట్టిదే కంటిలోని పురుషుని రూపమును, ఈ సూర్యునిలోని పురుషుని కణుపులే కంటిలోని పురుషుని కణుపులును, ఈ సూర్యుడు పురుషునికి, ఉద్గీథ మనియెడి ఏ పేరు గలదో అదియే కంటిలోని పురుషుని పేరును" అను ఛాందోగ్య శ్రుతిలో సూర్యు లోని పురుషుని గుణములు కంటిలోని పురుషునికి నతిదేశించి జెప్పఁబడిన శ్రుతి సూచననుబట్టి అట్లు అతిదేశించి చెప్పినచోట్లనే గాని మఱియొక చోట్ల అట్లు అతిదేశింపరా దనువ్యవస్థను శ్రుతి చూపుచున్నది గూడఁ గానఁ బై యుపాసన లలో అట్లు అతిదేశించి చెప్పనిచోట యొకదాని గుణము లొకదానికిఁ జెప్పరాదు.

వివ:- 1. "తస్యైతస్య తదేవరూపం యదముష్య రూపం యావ ముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ" (ఛాం. ౧. ౭. ౫) అని శ్రుతి.

## సంభృత్యధికరణము ౯-౨

23. సూ. సంభృతి ద్యు వ్యాప్త్యపి చాతః

సంభృతి ద్యు వ్యాప్తి అపి చ=సంపూర్ణశక్తి, ద్యులోక వ్యాప్తి గూడ, అతః=ఈ కారణమునుబట్టియె.

సూ. 1. "బ్రహ్మమె శ్రేష్ఠకారణముగఁ గల యాకాశసృష్టి మొదలగు శక్తులు సంపూర్ణమైనవి. సర్వశ్రేష్ఠమగు బ్రహ్మముమొదట స్వర్గమును వ్యాపించి యుండెను." అను రాణాయనీయశాఖలోని శ్రుతిలోఁ జెప్పఁబడిన సంపూర్ణశక్తులను స్వర్గవ్యాప్తియును గూడ, 2. "ఈ గుణములుగల యాత్మ నా హృదయమున నున్నాఁడు" 3. "కంటి యందున్న యా పురుషుఁడె యీ యాత్మ" అని ఆ శాఖలోని యుపనిషత్తునందే హృదయాక్ష్యాది స్థానవిశేషములుగల్గినట్లుచెప్పఁబడిన శాండిల్య విద్యోపాసనలలో స్థానవిశేషమందుండుట యనునీకారణమునుబట్టియే సంగ్రహింపఁబడవు.

వివ :_ 1 "బ్రహ్మ జ్యేష్ఠా వీర్యా సంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివ మాతతాన" 2. "ఏష మ ఆత్మాంతర్హృదయే" (ఛాం. ౩. ౧౪. ౩) 3. "యఏషోఽక్షిణి పురుషోదృశ్యతే" (ఛాం. ౪. ౧౫. ౧) అని శ్రుతులు.

## పురుష విద్యాధికరణము ౧౩

24. సూ. పురుష విద్యాయామివ చేతరేషామనామ్నానాత్.

పురుష విద్యాయాం ఇవ చ=పురుష యజ్ఞోపాసన యందువలెను, ఇతరేషాం=ఆ యితర గుణములకు, అనామ్నానాత్=చెప్పకపోవుటవల్ల.

సూ. 1. "పురుషుఁడె యజ్ఞము, అతని మొదటి యిరువదినాల్గేండ్లు ప్రాతస్సవనము, పిదపటి నలువదినాలుగేండ్లు మధ్యాహ్నసవనము, తరువాతి నలువదియెనిమిదేండ్లు మూఁడవ సవనము మరణమే యవభృథస్నానము ఈ యుపాసకుఁడు నూటపదియారేండ్లు జీవించును" 2. "ఆ పురుషుఁడు ఏది తినఁ గోరునో ఏది త్రాగఁగోరునో దాని నిష్టపడఁడు అవి యతని దీక్షలు" ఇత్యాదిరూపముగ ఛాందోగ్యమునఁ జెప్పఁబడిన పురుష యజ్ఞోపాసనముందువలె 3. "ఆ విద్వాంసుని యజ్ఞమునకు ఆత్మ యజమానుడు, శ్రద్ధ భార్య, శరీరము సమిధ, రొమ్ము వేదిక, వెంట్రుకలు దర్భలు, శిఖ కుశముష్టి, హృదయము యూపము, కోర్కె నేయి, కోపము యజ్ఞపశువు, తపస్సు అగ్ని, ఇంద్రియనిగ్రహము దక్షిణ, వాక్కు హోత, ప్రాణము ఉద్గాత, కన్ను అధ్వర్యువు, మనస్సు బ్రహ్మ, సాయంకాలము ప్రాతఃకాలము మధ్యాహ్నము అనునవి మూఁడు సవనములు, మరణము అవభృథము ఇది తెలిసినవాఁడు బ్రహ్మ యొక్క మహిమ పొందును" అని తైత్తిరీయమునఁ జెప్పఁబడిన యజ్ఞోపాసమున ఆ యా రూపములు సమానముగఁ జెప్పఁబడకపోవుటవల్ల రెండును విలక్షణములుగ నుండుటచే ఒకదాని గుణము లొకదానియందు సంగ్రహింపఁబడవు.

వివ :_ 1. "పురుషోవావయజ్ఞ స్తస్యయాని చతుర్వింశతి వర్షాణి తత్ప్రాతస్సవన, మథయాని చతుశ్చత్వారింశద్వర్షాణి తన్మాధ్యం దినం సవనమథ యాన్యష్టా చత్వారింశ ద్వర్షాణి తత్తృతీయం సవనం మరణ మవభృథః ప్రహాషోడశం వర్షశతం జీవతయ ఏవం వేద" 2. "సయదశిశిషతి, యత్పిపాసతి, యన్న రమతే తాన్యస్యదీక్షా" 3. "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా

యజమాన, శ్రద్ధా పత్నీ, శరీరమిధ్మ, మురోవేది, ర్లోమానిబర్హి, శ్శిఖావేదో, హృదయం యూపః, కామ ఆజ్యం, మన్యుః పశు, స్తపోఽగ్ని, శ్శమయితాదమో దక్షిణా, వాగ్ఘోతా, ప్రాణ ఉద్గాతా, చక్షురధ్వర్యు, ర్మనో బ్రహ్మా, యత్సాయం ప్రాతర్మధ్యం దినం చ తానిసవనాని మరణమవబృధః, బ్రహ్మణామహిమాన మాప్నోతి"

## వేదాద్యధికరణము ౧౪

25. మూ. వేధాద్యర్థ భేదాత్.

అర్థభేదాత్=ఉపనిషర్ధములతో భేదముండుటవల్ల, వేధాది = చీల్చుట మొదలగునవి సంగ్రహింపఁబడవు.

సూ. 1. "ఓ దేవతా ! నా శత్రువు యొక్క శరీరమెల్లఁ జీల్చుము, గుండె బ్రద్దలు చేయుము, నాడులను త్రెంపుము, తల భేదింపుము, ఇట్లయినచో నా శత్రువు మూడు విధములుగ విశ్లేషము పొందును" ఇత్యాదులు ఉపనిషత్తుల దగ్గరఁ జెప్పఁబడినను అవి యాభిచారిక విషయములుగాన ఉపనిషత్తులలోఁ జెప్పఁబడిన విద్యా విషయములలో నర్థభేదముండుట వలన ఈ విషయములు ఉపనిషద్విద్యలందు సంగ్రహింపఁబడవు. అరణ్యములలోఁ జదువఁబడుచుండు టి యవి యుపనిషత్తుల దగ్గర నూరక పఠింపఁబడినవి.

వివ :- "సర్వం ప్రవిధ్య హృదయం, ప్రవిధ్య ధమనీ ప్రవృజ్యశిరోభిః ప్రవృజ్య త్రిధావిప్రృక్తః".

## హాన్యధికరణము ౧౫

26. మూ. హానౌతూపాయన శబ్దశేషత్వాత్కుశాచ్ఛంద స్తుత్యుపగాన వత్త దుక్తం.

కుశాచ్ఛంద స్తుత్యుపగానవత్=కుశలు, ఛందస్సులు, స్తుతులు, ఉపగాన ములందువలె, ఉపాయన శబ్దశేషత్వాత్ = స్వీకరించుట అనునవె విశేషమగుట వలన, హానౌతు = విడుచుట అని చెప్పినను అందు స్వీకరించుట అనియు గ్రహింపవలెను, తత్=అది. ఉక్తం=పూర్వ మీమాంసయందును జెప్పఁబడినది.

సూ. 1. "ఓ కుశలారా! మీరు వనస్పతులవల్లఁ గలిగిన వారు అట్టి మీరు నను రక్షింపుఁడు" అని భాల్లవశాఖ వారు కుశలను సామాన్యముగ వనస్పతులవల్లఁ గలిగినవిగ చెప్పినను శాట్యాయనశాఖ వారు ఆ కుశలను, 2. "ఉదుంబర (మేడి) వృక్షములవల్లఁ గలిగినట్లు చెప్పుటచే శాట్యాయనశాఖ వారు చెప్పిన రీతిగ ఆ కుశలను ఉదుంబరవృక్షమువల్ల గలిగినవిగఁ జెప్పినట్లును, 3. "ఛందస్సులచే స్తోత్రము చేయుఁడు" అని సామాన్యముగఁ జెప్పినను పైంగ్యశాఖ వారి వచనమునుబట్టి, 4. "దేవచ్ఛందస్సులచే ముందును పిదప అసురచ్ఛందస్సులచే (తొమ్మిది యక్షరములు గలవి అసురచ్ఛందస్సులు తక్కువ గలవి దేవచ్ఛందస్సులు) పిదపను స్తోత్రము చేయవలయునని చెప్పుకొన్నట్లును. షోడశిస్తోత్రము చేయునప్పుడు కొన్ని శాఖల వారు ఫలానాకాలమందాస్తోత్రము చేయవలయునని చెప్పుకున్నను, 5. "సూర్యుఁడుదయింపఁగా స్తోత్రము చేయవలయును" అని అర్చశ్రుతి బట్టి కాలవిశేషము గ్రహించినట్లును, 6. "ఋత్విక్కులు గానము చేయుచున్నారు" అని కొన్ని శాఖలవారు సామాన్యము చెప్పినను, 7. "అధ్వర్యునికంటె నితరుఁడు గానము చేయుచున్నాఁడు" అని భాల్లవశాఖవారి వాక్యమునుబట్టి అధ్వర్యునకంటె నితరులు గానము చేయుచున్నారని చెప్పుకొన్నట్లును, కొన్ని శాఖలలోఁ బుణ్యము స్వీకరింపవలెను, పాపమును విడువవలెను అని చెప్పక కేవలము పుణ్యపాపములను విడువవలయును నని చెప్పినను విడుచుట అనునది స్వీకరింపవలయునను దానిని గూడ అపేక్షించును గాన ఇతర శాఖలనుబట్టి పుణ్యస్వీకారము గూడ గలుగునని గ్రహింపవలయును. ఇట్లే 8. "దీక్షితుడు హోమము చేయరాదు" అని చెప్పి మఱియొకచోట 9. "జీవించినంతవఱకు హోమము చేయవలయును" అని చెప్పినదానికి "ఏకవాక్యముగా దీక్షితుడుగాని వాఁడు జీవించినంతకాలము హోమము చేయవలయు"నని పూర్వ మీమాంస యందును జెప్పఁబడినది గూడ.

విష :- 1. "వానస్పత్యాస్స్థ కుశాస్తా మాపాత" 2. "ఔదుంబరాః" 3. "ఛందోభిస్తునీత" 4. "దేవచ్ఛందాంసి పూర్వాణి" 5. "సమయాధ్యుషితే సూర్యే" 6. "ఋత్విజ ఉపగాయంతి" 7. "నాధ్వర్యురుపగాయతి" 8. "దీక్షితోనజుహోతి" 9. "యావజ్జీవమగ్నిహోత్రంజుహుయాత్". "అశ్వ ఇహరోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్యధూత్వా శరీరమకృతం కృతాత్మాబ్రహ్మలోకమభిసంభవామి" (ఛాం. ౮. ౧౩. ౧)

(రోమములు విదల్చి గుఱ్ఱమువలె పాపమును వీడి నేను స్థిరమనస్కుఁడనై, రాహు ముఖమునుండి విడి చంద్రుఁడువలె స్వస్థుఁడనై శరీరము వీడి వికారము లేని బ్రహ్మలోకమును బొందెదను. అని తాండుల శ్రుతియును "తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి" "అట్లే విద్వాంసుఁడు పుణ్యపాపములను వీడి శుద్ధుఁడై నిరతిశయమగు బ్రహ్మమును బొందును" అని యాధర్వీక శ్రుతిలోను "తస్య పుత్త్రాదాయముపయంతి సుహృదస్సాధు కృత్యాం ద్విషంతః పాపకృత్యాం" మృతుఁడైన వాని ధనమును కుమారులు పొందుదురు. వాని సుకృతమును మిత్రులును శత్రువులు పాపమును బొందుదురు. అని శాట్యాయన శాఖలోను "తత్సుకృత దుష్కృతే విధూనుతే తస్యప్రియా జ్ఞాతయ స్సుకృత ముపయం త్యప్రియాదుష్కృతం" విద్వాంసుఁడు విద్యచే పుణ్యపాపములను విడచుచున్నాఁడు వాని ప్రియబంధువులు పుణ్యమును పొందుదురు. అప్రియులు పాపమును బొందుదురు. అని కౌషీతకీ శాఖలోను పఠింపఁబడుచున్నది. ఇందు విడువవలయునని మాత్రమె చెప్పఁబడిన చోట పుణ్యమును స్వీకరింపవలెనని గ్రహింపవలయునని తెలియవలయునని భావము.

26 సూత్రమున కర్థాంతమున సూత్రము.

సూ. పైసూత్ర వివరణములోఁ జూపిన తాండాది శ్రుతులందలి "విడువవలయును" అనుచోట పుణ్యపాపములు రూపముగల వస్తువులు గావు గాన "విడువవలయును" అను దానికిఁ పుణ్య స్వీకారమును పాప హాని అనియె కుశలు, చందస్సు, స్తుతి, ఉపగాయనములందుఁజెప్పినట్లు చెప్పుకొనవలయును. ఇట్లే పూర్వమీమాంస యందును జెప్పఁబడినది.

వివ;- ధాతువులు అనేకార్థకములు గాన "ధూఞ్" వదల్చు అను ధాతువు నకు హానియుఁ జెప్పవచ్చు నని భావము.

## సాంపరాయాధికరణము ౧౭

27. మూ. సాంపరాయే తర్తవ్యా భావా త్తథా హ్యన్యే.

సాంపరాయే=దేవయాన మార్గమున, తర్తవ్యాభావాత్=దాటఁదగినది లేక పోవుటవలన, తథాహి=అట్లే, అన్యే=ఇతర శాఖియులును.

సూ. 1. "పర్యంకమున నున్న బ్రహ్మము నుపాసించువాఁడు దేవయాన మార్గము పొంది పిదప నగ్నిలోకమును బొందును" అని మొదలుపెట్టి

2. "అతఁడు విరజా నదిని జేరును ఆ నదిని మనస్సంకల్పముచేతనే దాటును పిదప విద్యాబలముచేత పుణ్యములను విదల్చుచున్నాఁడు" అని కౌషీతక శాఖలో దేహమును వీడునపుడె విద్వాంసుఁడు విద్యాబలముచే పుణ్యపాపములను విడచుచున్నాఁడని చెప్పఁబడినది గాన విద్యాబలముచే పుణ్యపాపములను ఇది వరకే విడచుటచే నింక మధ్య దాటఁదగినవి లేకపోవుట వలన శ్రుతియందుఁ జెప్పఁబడిన రీతిగనె దేవయాన మార్గమధ్యముననే పుణ్యపాపములను విడచుచున్నాఁడని చెప్పవలయునట్లే రోమములను విదల్చి గుఱ్ఱము వలెఁ బాపమును వీడి" అని తాండ శాఖవారును" "మృతుఁడైన వాని ధనమును కుమారులు పొందుదురు. వాని సుకృతమును మిత్రులును శత్రువులు పాపమును బొందుదురు" అని శాట్యాయనులును జెప్పుచున్నారు.

వివ :- 1 "సఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోకమా గచ్ఛతి" (కౌషీ. ౧. ౩) 2. "స ఆ గచ్ఛతి విరజాం నదీం తాం మనసైవాత్యేతి తత్సుకృతదుష్కృతే విధూనుతే" (కౌషీ. ౧ ౪) అని కౌషీతక శాఖ శ్రుతులు.

28. సూ. ఛందత ఉభయా విరోధాత్.

ఉభయాఽవిరోధాత్=తాండ్య శాట్యాన శ్రుతులు రెంటికి విరోధము లేకపోవుటవలన, ఛందతః=తనయిచ్ఛ వలననే.

సూ. దేహము వీడి దేవయానమార్గము ద్వారా బయలుదేఱునపుడు మార్గమధ్యమున సుకృతదుష్కృతములను విడుచు నన్నచోఁ బిదప శరీరము పడిపోఁగా యమనియమాది సాధనలద్వారా జీవుఁడు తనయిచ్ఛ ప్రకారము ప్రయత్నము చేయుటయు దానినిబట్టి సుకృతదుష్కృతములు విడచుటయు నుపపన్నముగాదు గాన శరీరము విడచుటకు ముందె జీవుఁడు చేయు యమనియమాద్యనుష్ఠానములనుబట్టి సుకృతదుష్కృతములను విడచు ననవలయును. అట్లన్నపుడే కార్యకారణవిరోధము సంభవించదు. అపుడు తాండ్య శాట్యాయన శ్రుతులును సంగతములగును.

## గత్యర్థవత్త్వాధికరణము ౧౭

29. సూ గతేరర్థవత్త్వ ముభయథాఽన్యథాహి విరోధః.

గతేః = దేవయాన మార్గమునకు, ఉభయథా=రెండు విధములుగా, అర్థవత్త్వం=సార్థకత్వము, అన్యథాహి=నిర్గుణమునను సార్థకమన్నచో, విరోధః=విరోధమగును.

సూ. సగుణోపాసనమందు దేవయాన మార్గము సార్థకమై నిర్గుణోపాసనమందు ఆ దేవయానమార్గము నిర్థకమై ఇట్లు రెండు విధములుగ నగును. కాని నిర్గుణోపాసనమందును సామాన్యముగ ఈ దేవయాన మార్గము గలుగుననరాదు అట్లన్నచో "పుణ్యపాపములను వీడి శుద్ధుఁడై నిరతిశయమగు బ్రహ్మమును బొందును" అను శ్రుతి విరోధించును.

30. మూ ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్.

లోకవత్=లోకమందువలె, తల్లక్షణార్థోపలబ్ధేః=ఆ లక్షణములయొక్క యర్థము లుపలబ్ధమగుటవలన, ఉపపన్నః=ఉపపన్నమగును.

సూ. లోకమందు ఆరోగ్యముకై గ్రామాంతరము పోవునపుడు ఆ ప్రదేశమును జేర్చు మార్గము అవశ్యకమగును. వెళ్లకయె ఆరోగ్యము సిద్ధించిన వానికి ఆ మార్గము ఆవశ్యకముగాదు అట్లే సగుణోపాసనమందును. పర్యంకము నెక్కుట, పర్యంకమందున్న బ్రహ్మముతో మాటాడుట, విశిష్ట గంధాదులను బొందుట మొదలగు ఫలములను బొందుటయును, నిర్గుణోపాసనమందు సమ్యగ్వివేకము గలుగఁగా ఆత్మైకత్వమును దర్శించి ఆప్తకాములై సమస్త క్లేశబీజములను క్షయింపఁజేసికొనియున్న వారికి ఆరంభించిన పుణ్యపాపరూప భోగ కర్మలను నాశనము జేసికొనుటయెగాని యింకఁ గోరఁదగినదేదియు లేకపోవుటచే దేవయానమార్గము ఆవశ్యకము గాదు గాన ఏ ఫలములు లేకపోవుటయును — నుండును గాన సగుణోపాసనమందు దేవయాన గతిసార్థకమగుటయు, నిర్గుణోపాసనమందు దేవయాన మార్గము నిరర్థకమగుటయు నను నా రెండును ఉపపన్నమె యగును.

వివ:- మరల ఈ విభాగము నాల్గవ యధ్యాయమున నిరూపింపఁబడును.

## అనియమాధికరణము ౧౮

31. మూ. అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యాం.

శబ్దానుమానాభ్యాం=శ్రుతి స్మృతులనుబట్టి, అనియమః=దేవయానమార్గములో నియమములేదు, సర్వాసాం=అన్ని శ్రుతులకు అవిరోధః=విరోధములేదు,

సూ. సగుణోపాసన శ్రుతులలోఁగూడఁ గొన్నిచోట్ల దేవయాన మార్గము సంగతి చెప్పకపోయినను 1. "ఎవరు అరణ్యమందుండిరో అట్టి యీ వాన ప్రస్థులు మొదలగు వారు శ్రద్ధ తపస్సు గలిగి బ్రహ్మము నుపాసించువారై దేవయాన మార్గము పొందుదురు. 2. "ఎందుండి కోరికలు మరలునో యట్టి బ్రహ్మలోకమును విద్యచే పొందుదురో అక్కడకు కేవల కర్మఠులును పోఁజాలరు. తపస్వులునైనను బ్రహ్మము నుపాసింపనివారు (అవిద్వాంసులు) పోఁజాలరు" ఇత్యాది శ్రుతులనుబట్టియు ౩. "శుక్లపక్ష మను దేవయాన (అర్చిరాది) మార్గము కృష్ణపక్ష మను ధూమమార్గము ఈ రెండును జగత్తునకు శాశ్వతమైన మార్గములు శుక్లపక్షమార్గముచేత అనావృత్తిని కృష్ణపక్షమార్గముచేత తిరిగి తిరిగి పుట్టుఁ జావులను బొందును;" అను స్మృతినిబట్టియు అన్ని సగుణోపాసనశ్రుతులలో నియమములేక సామాన్యముగ దేవమార్గము గలుగును. కాన శ్రుతులకు విరోధములేదు.

వివ:- 1. "యేచేమేఽరణ్యేశ్రద్ధా తపఇత్యుపాసతే" (ఛాం. ౫.౧౦.౧) 2."విద్యయా తదారోహంతి యత్రకామాః పరాగతాః నతత్ర దక్షిణాయంతి నాఽవిద్వాంసం" ఇత్యాదులు శ్రుతులు ౩. "శుక్లకృష్ణే గతీహ్యేతే జగతశ్శాశ్వతే మతే ఏకయాహ్యనావృత్తి మన్య యా వర్తతే పునః" (గీత. ౮. ౨౬)

వివ:- ఈ రెండు మార్గములనుండి పడిన వారికి "అథయ ఏతౌ పంథానౌ నవిదుస్తే కీటాః పతంగా యదిదం దంద శూకం" ఎవరీ రెండు మార్గములను నెఱుఁగరో వారు పురుగులై మిడతలై దోమలు ఈఁగలు (లేక పాములు)గ పుట్టుదురు అని ఈ శ్రుతి కీటాదిజన్మను దెలుపుచున్నది. కాన సగుణబ్రహ్మోపాసన చేయు వారెల్లరు దేవయాన మార్గములు పొందుదురని భావము.

## యావదధికారాధికరణము ౧౯

౩౨. సూ. యావదధికారమవస్థితిరాధికారికాణాం.

ఆధికారికాణాం=ఈశ్వరాధికారమందున్న వారికి, యావదధికారం=అధికారమున్నంతవఱకు, అవస్థితిః=ఉనికి యుండును.

సూ. బ్రహ్మసాక్షాత్కారము గలిగియున్నను ఈశ్వరునిచే లోకస్థితికై నియోగింపఁబడిన వసిష్ఠాదులు లోకస్థితిరూపమైన యధికారము వారికున్నంత

కాలము వారు జీవన్ముక్తులై యుండియు అవసరమైనచో ఆ యధికారమునకై దేహాంతరములఁ బొంది పిదప ముక్తి పొందుదురు.

వివ:- కనుకనే అపాంతరముఁడు వసిష్ఠుడు నారదుఁడు మొదలగు వారు జ్ఞానులయ్యును. లోకస్థితికై మరల నా యా జన్మలందిరని యితిహాసాదులవల్ల దెలియుచున్నది. "అథ తత ఊర్ధ్వ ఉదేత్య నైవోదేతా నాస్తమే త్యైకల ఏవ మధ్యే స్థాతా" (ఛాం. ౩ ౧౧. ౧) పిదప అధికారము ముగిసిన పిదప సూర్యుఁడు బ్రహ్మస్వరూపుఁడై దేహము వీడి యుదయించుటయుఁగాని యస్త మించుటయుఁగాని లేక యద్వితీయుఁడై తటస్థుఁడై మధ్యను ఆత్మరూపము నొందును అని శ్రుతియుఁ దెలుపుచున్నది. అంతియెగాని జ్ఞానముచే కర్మలను క్షయము చేసికొన్న వారి కొకసారి మోక్షము పిదప ఒకసారి జన్మ అన నవి యుండక మోక్షమొక్కటియె యగును.

## అక్షరధ్యధికరణము ౨౦

౩౩. సూ. అక్షరధియాంత్వవరోధః సామాన్య తద్భావాభ్యామౌపసద వత్తదుక్తం.

ఔపసదవత్=ఉపసద్యాగమందువలె, సామాన్య తద్భావాభ్యాం=సామాన్యము వల్లను దాని భావమువల్లను, అక్షరధియాంతు=అక్షర బ్రహ్మ బుద్ధులకైతే, అవరోధః=స్థూలాది నిషేధమె గ్రహింపవలెను, తత్=అది, ఉక్తం=పూర్వ మీమాంసలోఁ జెప్పఁబడినది.

సూ. అధ్వర్యువు యజుర్వేద మంత్రములచేతనె యాగము చేయు వాఁడయ్యు జామదగ్న్య హీనమను యాగమును జెయుచు, మఱి దానికఁగమైన యుపసద్యాగమున 1. "వేదమున హోత చేయు కార్యమును వేదమున అధ్వ ర్యువు చేయు కార్యమును అగ్నివగు నీ వలన నగును'' తన వేదముకంటె నితరమైన సామవేద మంత్రము సంగ్రహించుకొని దానిచేత పురోడాశమును (హోమద్రవ్యమును) అగ్నిలో వ్రేల్చునట్లు 2. "ఓగార్గీ ! నీ వడిగినది యీ యక్షరమె యని బ్రాహ్మణులు చెప్పుచున్నారు అది స్థూలము గాదు అణువు గాదు పొట్టిది గాదు పొడుగుని గాదు" 3. "దేనిచే ఆ యక్షర బ్రహ్మము తెలియఁబడునో ఆ విద్య పరవిద్య యందురు ఆ బ్రహ్మను నిర్దేశింపరానిది

గ్రహింపరాని" ఇత్యాదులందు చెప్పఁబడిన యక్షరబ్రహ్మము యొక్క "స్థూలముగానిది" మొదలగు స్థూలాది విశేషములను నిషేధించుట అన్ని శ్రుతులందు సమానమగుటవలనను అన్ని శ్రుతులలోను ఆ స్థూలాది విశేషములు లేని బ్రహ్మమె గుర్తింపఁబడుట వలనను అక్షరబ్రహ్మమునకుఁ జెప్పఁబడిన స్థూలాది విశేషముల నిషేధమొకచోట నున్నను ఒక్కచోట లేకున్నను అన్నిచోట్ల "స్థూలముగానిది" మొదలైన స్థూలాది విశేషముల నిషేధము సంగ్రహించుకొనవలెను. ఇట్లే పూర్వమీమాంస యందుఁ జెప్పఁబడినది.

వివ:- 1. "అగ్నేర్వైర్హోత్రం వేరధ్వరం". 2. "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదం త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘం" (బృ. ౩.౮.౮.) 3. "అథపరాయయా తదక్షర మధిగమ్యతే యత్త దద్రేశ్య మగ్రాహ్యం (ముం. ౧. ౧. ౫) అని శ్రుతులు.

## ఇయదామదనాధికరణము ౨౧

34. సూ. ఇయదామననాత్.

ఇయత్=ఇంతయని పరిమాణము, ఆమననాత్=చెప్పుటవలన.

సూ. 1. "కలిసిమెలసి స్నేహము గలిగిన జీవేశ్వరులను ఆ రెండు పక్షులు ఒక వృక్షమునె యాశ్రయించి యున్నవి. వానిలో జీవుఁ డనుపక్షి కర్మఫలము ననుభవించుచున్నది. ఈశ్వరుఁ డను ఆ రెండవ పక్షి కర్మఫలము ననుభవింపక ప్రకాశించుచున్నది" అను శ్రుతిలోను 2. "సుకృత జన్యమగు శరీరమున కర్మఫలము ననుభవించుచు గొప్పదైన హృదయ గుహను జీవేశ్వరులిద్దఱు ప్రవేశించినారు. వారు ఎండనీడఁ వంటి వారని...... చెప్పుచున్నారు" అని శ్రుతిలోను "జీవేశ్వరులు ఇద్దఱు" అని పరిమాణము సమానముగ చెప్పుట వలన ఆ రెండు శ్రుతులలోను జెప్పఁబడిన విద్యావిషయ మొక్కటియెగాని భిన్నము గాదు.

వివ:- 1. "ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్య నశ్నన్నన్యోఽభిచాకశీతి" (ముం. ౩. ౧. ౧.) 2. "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమేపరార్థే ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి" (కఠ. ౩. ౧)

## అంతరత్వాధికరణము ౨౨

35. సూ. అంతరా భూతగ్రామవత్ స్వాత్మనః

భూతగ్రామవత్ = పంచభూతములవలె, అంతరా = అన్నింటిలోను, స్వాత్మనః=పరమాత్మకే చెందును.

సూ. 1. "ఏ బ్రహ్మము సాక్షాత్తుగనున్నదో ప్రత్యక్షమై యున్నదో ఏ యాత్మ యన్నింటిలోపల నున్నదో అది నాకుఁ జెప్పుము" అని యాజ్ఞవల్క్యుని కహోడుఁడు ఉషస్తి యడిగిన ప్రశ్నలలోను "సాక్షాత్తుగనున్నదో ప్రత్యక్షమైనదో" అని చెప్పిన యర్థమునే రెండుసారులు చెప్పినను వాటియందు ఆత్మకుఁ జెప్పఁబడిన "అన్నింటి లోపలనున్నదో" అను విషయము సమానమగుటవల్ల "పంచభూతాత్మకమైన శరీరమున భూమికంటె నీరును నీటికంటె తేజస్సు గొంతకొంత తేడాగా నున్నది" అని యాపేక్షికమైన యంతరత్వమున్న దని చెప్పినను ముఖ్యమైన సర్వాంతరత్వము లేదని చెప్పినట్లు ఇచ్చటను "సాక్షాత్తుగనున్నదో ప్రత్యక్షమైనదో" అను రెండుసార్లు చెప్పఁబడిన విషయములలో ఒకటి పరమాత్మకు ఒక్కటి జీవాత్మకును జెదక అన్నింటిలోపలి పరమాత్మకే చెందును.

ఈ సూత్రమునకే అర్థాంతరమున సూత్రము.

సూ 1. "ఏ బ్రహ్మము సాక్షాత్తుగనున్నదో ప్రత్యక్షమైనదో ఏ యాత్మ యన్నింటి లోపలనున్నదో అది నాకుఁ జెప్పుము" అని యాజ్ఞవల్క్యుని కహోడుఁడు ఉషస్తి యడిగిన ప్రశ్నలలో "సాక్షాత్తుగనున్నదో ప్రత్యక్షమైనదో" అని చెప్పిన యర్థమునే రెండుసారులు చెప్పినను వాటియందు ఆత్మకుఁ జెప్పఁబడిన "అన్నింటిలోపలనున్నదో" అను విషయము సమానమగుటవల్ల— 2. "దేవుఁ డొక్కఁడే సర్వభూతములందు గూఢుఁడై సర్వవ్యాపియై అన్ని ప్రాణుల లోపల ఆత్మయై యున్నాఁడు అని శ్రుతిలో బ్రహ్మము భూతసముదాయ మందున్నాఁడని చెప్పినట్లు ఈపై శ్రుతులలో సమానము జెప్పఁటవల్ల—"సాక్షాత్తుగ నున్నదో ప్రత్యక్షమైనదో" అను రెండుసార్లు చెప్పఁబడిన విషయములలో ఒకటి పరమాత్మకు ఒక్కటి జీవాత్మకుఁ జెదక అన్నింటిలోపలఁ బరమాత్మకే చెందును.

వివ :- జీవాత్మ పరమాత్మలు ఇద్దఱును ఒకే దేహమున నున్నట్లు చెప్పుటయు యుక్తముగాదు కాన నట్లు చెప్పరాదని భావము. 1. "యత్సాక్షాద పరోక్షాద్బ్రహ్మ, య ఆత్మ సర్వాంతరః" (బృ. ౩. ౪. ౧) 2. "ఏకో దేవః సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" (శ్వే. ౬. ౧౧) అని శ్రుతులు.

౩౬. మూ. అన్యథా భేదానుపపత్తిరితి చేన్నోపదేశాంతరవత్.

అన్యథా=అట్లుగానిచో, భేదానుపపత్తిః ఇతిచేత్=భేదము ఉపపన్నము గాదు అన్నచో, ఉపదేశాంతరవత్=ఇతి శ్రుత్యుపదేశమువలె, న=అట్లనరాదు.

సూ. పై శ్రుతియందు పరమాత్మ జీవాత్మ లిద్దఱు విషయమై చెప్పఁబడనిచో "సాక్షాత్తుగనున్నదో ప్రత్యక్షమైనదో" అని రెండుసార్లు చెప్పినదే చెప్పుట యుపపన్నము గాదన్నచో ఛాందోగ్య శ్రుతిరూపమైన మఱియొక యుపదేశములో 1. "అదె యాత్మ ఓ శ్వేతకేతూ! ఆ యాత్మ నీవై యున్నావు" అను విషయము తొమ్మిదిసార్లు చెప్పఁబడిన ఉపాసన విషయమును భేదము లేనట్లు ఇటను భేదము లేదు గాన జీవాత్మ పరమాత్మల విషయమని యుపాసనాభేదము చెప్పకయుండుట యుపపన్నమగును.

వివ :- 1. "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో!" (ఛాం. ౬. ౮. ౭.) అని శ్రుతిఛాందోగ్య శ్రుతి మఱియు దార్ఢ్యము కొఱకు మాటిమాటికి అడుగుట చెప్పుటయు యుక్తమే యని భావము.

## వ్యతిహారాధికరణము ౧౩

౩౭ మూ. వ్యతిహారో విశింషంతి హీతరవత్.

ఇతరవత్=ఇతర గుణములవలె, వ్యతిహారం=విశేషణ విశేష్యభావమని, విశింషంతి=విశేష యుక్తముగఁ జెప్పుచున్నాను.

సూ. 1. "నీవు నేనై యున్నాను నేను నీవై యున్నావు" అని జాబాలి శ్రుతిలో జీవేశ్వరులకుఁ బరస్పరము విశేషణ విశేష్యభావము దేలుపఁబడినది గనుక "అన్నింటిలోను ఉండుట" మొదలైన గుణములు జీవేశ్వరు లిద్దఱి యందుఁ జెప్పఁబడినట్లు. 2. "కనుక నే నెవఁడనో వాఁడే యీ సూర్యునిలోని పురుషుఁడును ఈ సూర్యునిలోని పురుషుఁ డెవఁడో వాఁడే నేను" అను నైతరేయ

శ్రుతి యందును, ౩. "ఓ పూజ్యదేవతా! నీవే నేనై యున్నాను నేనే నీవై యున్నావు" ఇత్యాది శ్రుతులందును గూడ జీవేశ్వరులకుఁ బరస్పరము విశేషణ విశేష్యభావము ఉపాసనకై చెప్పఁబడినది.

వివ .- 1. "త్వమహమస్మ్యహం చ త్వమసి." అని జాబాలి శ్రుతి 2. "తద్యోఽహం సోఽసౌ యోఽసౌ సోఽహం" 3. "త్వంవా అహమస్మి భగవోదేవతేఽహం వై త్వమసి" ఇత్యాదులు శ్రుతులు.

## సత్యాద్యధికరణము ౨౪

౩౮. సూ. సైవహి సత్యాదయః

సా ఏవహి = ఆ సత్యవిద్యోపాసనయే, కాన, సత్యాదయః = సత్యాది గుణములు సంగ్రహింపఁబడును.

సూ. 1. "గొప్పదై పూజ్యమై అన్నింటికి మొదలు జన్మించియున్న యీ సత్యరూపమైన బ్రహ్మము నెవఁడుపాసించునో వానికి లోకజయమను ఫలము గలుగును" అని సత్యవిద్యను మొదలుపెట్టి 2. "ఆ సత్యస్వరూపమైన బ్రహ్మము సూర్యమండలమందున్న పురుషుఁడే, ఆ బ్రహ్మము కుడికంటి యందున్న పురుషుఁడే," అని చెప్పఁబడిన శ్రుతిలో "ఆ సత్యస్వరూపమైన బ్రహ్మము" అని పూర్వోక్త బ్రహ్మమును ఆకర్షించి చెప్పుటవలన ఆ సత్య విద్యోపాసనమె యిదియునగును గాన సత్యాదిగుణములును ఈ రెండవ శ్రుతి యందు సంగ్రహింపవలయును.

వివః- 1. "సయో హైతన్మహద్యక్షం ప్రథమజంవేద" (బృ. ౫. ౪. ౧) 2. "తద్యత్సత్త్యమసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్మండలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్ష న్పురుషః" (బృ. ౫. ౫. ౨) అని శ్రుతులు.

## కామాద్యధికరణము ౨౫

౩౯. సూ. కామాదీతరత్ర తత్రచాయతనాదిభ్యః

ఆయతనాదిభ్యః = స్థానము మొదలగు వానినిబట్టి. కామాది = కామాది గుణములు, ఇతరత్ర=ఇతరమగుచోట్లను, తత్ర చ=అచ్చటను.

సూ. 1. "మఱి యీ బ్రహ్మపురమగు శరీరమందు సూక్ష్మమైన పద్మమువంటి గృహమున్నది. దీనియందు సూక్ష్మమైన యాకాశరూప బ్రహ్మము గలదు," అని ప్రస్తుతించి 2. "ఈ సూక్ష్మాకాశరూపమైన పరమాత్మ పాపములు లేనివాఁడు ముసలితనము లేనివాఁడు, మృత్యువు లేనివాఁడు, శోకము లేనివాఁడు, భోజనేచ్ఛ లేనివాఁడు, దప్పిక లేనివాఁడు, సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు" అని ఛందోగ్యశ్రుతిలోను 3. "విజ్ఞానమయుఁడై ప్రాణములందు హృదయములోన నున్న జ్యోతియై లోని హృదయాకాశమందు శయనించి యున్న యీ యాత్మవ్యాపకుఁడు పుట్టుక లేనివాఁడు అన్నిటిని వశమందుంచుకొన్నవాఁడు" అని వాజసనేయ శ్రుతిలోను హృదయము స్థానముగను దెలిసికొనఁదగిన వాఁడు పురుషుఁడుగను మొదలగు రీతుల సమానముగఁ జెప్పుట వలన ఛందోగశ్రుతిలోఁ జెప్పఁబడిన సత్యకామత్వాది గుణములు వాజసనేయ శ్రుతియందును, వాజసనేయశ్రుతిలోఁ జెప్పఁబడిన అన్నింటిని వశమందుంచుకొనుట మొదలగు గుణములు ఛందోగశ్రుతి యందును సంగ్రహింపవలయును.

వివ:- 1. "అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకంవేశ్మ దహరోఽస్మిన్నంతరాకాశః" (ఛాం. ౮. ౧. ౧) 2. "ఏష ఆత్మాపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః" (ఛాం. ౮ ౧. ౫) 3 "సవాఏష మహానజ ఆత్మాయోఽయం విజ్ఞానమయః ప్రాణేషు య ఏషోఽంతర్హృదయ ఆకాశ స్తస్మిన్ శేతే సర్వస్యవశీ" (బృ. ౪. ౪. ౨౨) అని శ్రుతులు.

## ఆదరాధికరణము ౨౬

40. మూ. ఆదరాదలోపః

ఆదరాత్=ఆదరమువలన, అలోపః=లోపింపరాదు.

సూ. 1. "అతిథులకంటె ముందుగఁ దాను భుజింపవలయును, అట్లుగాక తాను దినక యతిథులకుఁ బెట్టుట తన యగ్నిహోత్రమును మానుకొని యితరుల యగ్నిహోత్రమును జేయుట వట్టిది." అని జాబాలశ్రుతిలో అతిథి భోజనముకంటె యజమానుని భోజనరూపమైన యగ్నిహోత్రమునకు ఆదరము చూపుటవలన. తాను ఏకాదశీవ్రతాదులందు ఉపవాసముండి భుజింపకపోయినను 2. "కాన మొదట చేతికి వచ్చిన యన్నమే హోమద్రవ్యమగును. అతఁడు ఏ

మొదట యాహుతిని ప్రాణమను నగ్నియందు హోమము చేయునో దానిని "ప్రాణమున కల్పింపఁబడుఁ గాక" అని ప్రాణాగ్నియందు హోమము చేయ వలయును.... ఎవఁడెట్లు అగ్నివిద్యను దెలిసి అగ్నిహోత్రమును హోమము చేయునో వాఁడు సర్వాత్మత్వమును బొందియన్నియు ననుభవించును" 3. "ఆఁకలిగల బాలురు తల్లిని సేవించునట్లు సర్వప్రాణులు అగ్నిని సేవించును" అను శ్రుతులతో విధింపఁబడిన ప్రాణాగ్నిహోత్రమును మానక చేయవలయును.

వివ :- ఇది పూర్వపక్షసూత్రము ప్రాణమును అగ్నిగాఁ జెప్పియందుఁ బంచప్రాణాహుతులని వలయునన్నప్పుడు భోజనద్రవ్యములు గ్రహింపక పోయినను అగ్నిహోత్రము లోపింపదు గాన జలముమగాని యుపవాసవ్రతము నకు భంగముగాని యితర ద్రవ్యములనుగాని యన్నమునకు బదులఁ గ్రహించి ప్రాణ మనునగ్నియందు హోమము చేయవలయునని పూర్వపక్షము... 1. "పూర్వోఽతిథిభ్యోఽశ్నీయాద్, యథాహవై స్వయమహుత్వా అగ్ని హోత్రం పరస్య జుహు యాదేవం తత్" (జాబాలశ్రుతి) 2. "తద్యద్భక్తం ప్రథమ మాగచ్ఛేత్తద్ధోమీయం స యాం ప్రథమామాహుతిం జుహుయాత్తాం జుహుయాత్ ప్రాణాయస్వాహా"... య ఏత దేవం విద్వానగ్ని హోత్రం జుహోతి" (ఛాం. ౫. ౧౯. ౧) ౩. "యథేహక్షుధితా బాలామాతరం పర్యుపా సతే ఏవం సర్వాణి భూతాన్యగ్నిహోత్ర ముపాసతే" (ఛాం. ౫. ౨౪ ౫) అని శ్రుతులు.

41. సూ. ఉపస్థితేఽత స్తద్వచనాత్.

తద్వచనాత్ = హోమద్రవ్యముగాఁ జెప్పుటవలన, ఉపస్థితే = భోజనము ఉపస్థితమగునపుడు, అతః = భోజన ద్రవ్యమువలననే.

సూ. 1. "కాన మొదలుఁ జేతికివచ్చిన యన్నమే హోమద్రవ్యమగును" అని వండి సిద్ధముచేసిన యన్నమనే హోమద్రవ్యమునుగాఁ జెప్పుటవలన భోజనము చేయునప్పుడె ఆ భోజన ద్రవ్యమువలననె హోమము చేయవలయును గాన ఉపవాసాదులందు భోజనము చేయనప్పుడు ప్రాణాగ్నిహోత్రమునకు హోమము చేయనక్కరలేదు.

వివ :- ఇది సిద్ధాంత సూత్రము. ఈ ప్రాణాగ్నిహోత్రమునందు హోమము చేయు ప్రాణాహుతులు నిత్యాగ్నిహోత్రమునందు హోమము చేయు

నా హుతులువంటివి గావు. కనుకనే ప్రాణ మనునగ్నిహోత్రమును గూర్చి చెప్పుచు ప్రాణ మనుఅగ్నికి అంగములుగా "ఉర ఏవవేది, ర్లోమానిబర్హి, ర్హృదయం గార్హపత్యో మనోఽన్వాహార్యపచనం ఆస్యమాహవనీయం" (ఛాం. ౫. ౧౮ ౨) వక్షస్థలమె యజ్ఞవేది, రోమములె దర్భలు, హృదయమె గార్హపత్యాగ్ని, మనస్సె దక్షిణాగ్ని, ముఖమె ఆహవనీయాగ్ని" అని కల్పించి చెప్పఁబడెను. ఈ ప్రాణ మనునగ్నియందు నాహుతులుంచుట భోజనకాలమందె నియమింపఁబడెను. నిత్యాగ్నిహోత్రము ప్రొద్దుట సాయంకాలములందు నియమము, అతిథి భోజనముకంటె యజమానుని భోజనమును ముందుగా విధించు శ్రుతి భోజన విషయమున నుండుగాఁ జేయవలయునని చెప్పుటకని తెలియుచుండి. శ్రుతిస్మృతులందు అతిథికిముందుగా భోజనము పెట్టవలయునన్న సంగతి ప్రాణాగ్నిహోత్రికంటె నితర యజమానుల విషయముగా నెఱుంగునది.

## తన్నిర్ధారణానియమాధికరణము ౨౩

42. సూ. తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధః ఫలం,

తద్దృష్టేః=అట్లు గనిపించుటవలన, తన్నిర్ధారణానియమః=అవి తప్పక చేయవలయు నను నియమము లేదు., పృథక్=వేఱుగా, అప్రతిబంధః=ప్రతిబంధకములు లేకపోవుటయె, ఫలం హి=ఫలముగదా.

సూ. 1. "ఆ యోంకారముచే నెవఁడు ఈ యక్షరమును రసతమత్వాది రూపముగ నుపాసించునో ఎవఁడు కేవల కర్మవేత్తయై ఈ యోంకారము నుపాసింపఁడో వారిద్దఱు యాగాది కర్మలఁ జేయుచునే యున్నారు" అని శ్రుతి యందు ఓంకారోపాసన చేయనివాఁడు గూడఁ గర్మచేయుచున్నట్లు గనిపించుట వలన యాగాదికర్మల కంగములు గూడ 2. "ఉద్గీథమున కంగిమగు నోంకార మనునక్షరము నుపాసింపవలయును" అని చెప్పఁబడిన యోంకారాద్యుపాసనలను దప్పక చేసితీరవలయునను నియమము లేదు. ఆ యోంకారాద్యుపాసనలు వేఱుగాఁ జేయుటవలన యాగాది కర్మఫలము సిద్ధించుటలోఁగల ప్రతిబంధములు లేక యతిశయ ఫలము గలుగుటయే ఫలమగును.

వివ:- 1. "తేనోభౌకురుతో యశ్చైత దేవం వేద యశ్చ న వేద (ఛాం. ౧. ౧. ౧౦) 2. "ఓ మిత్యేత దక్షరముద్గీథ ముపాసీత" (ఛాం. ౧.

౧. ౧) అని శ్రుతులు, ఓంకారాద్యుపాసనలు చేసిన వారికి అధికఫలమును ఆ యుపాసన చేయనివానికి సామాన్యఫలమును గలుగునని భావము.

## ప్రదానాధికరణము ౨౮

43. మూ. ప్రదానవదేవ తదుక్తం.

ప్రదానవత్ = పురోడాశముల నిచ్చునట్లు, తదుక్తం = అది సంకర్షణ కాండమునఁ జెప్పఁబడినది.

సూ. 1. "నేను మాటాడఁగలదానే యని వాక్కు వ్రతము ధరించెను" ఇత్యాది వాజసనేయ శ్రుతులలోఁ జెప్పఁబడిన యధ్యాత్మమైన ప్రాణమునకును, 2. "వాయువే సంసర్గము (ఆచ్ఛాదించునది)" ఇత్యాది ఛాందోగ్య శ్రుతులలోఁ జెప్పఁబడిన యధిదైవమైన వాయువునకుఁ దత్త్వమున భేదము లేకున్నను, 3. "పదునొకండు కపాలముల సంస్కరింపఁబడిన పురోడాశమును రాజగుణేంద్రునికి అధిరాజగుణేంద్రునికి స్వరాజగుణేంద్రునికి ఇవ్వవలయును" అను శ్రుతిలో త్రిపురోడాశిని యను యాగమున నొక్కఁడే యైన యింద్రదేవతకు రాజు, అధిరాజు, స్వరాజు, అను గుణాదిభేదములను బట్టి వేఱు వేఱుగాఁ బురోడాశములను (హోమద్రవ్యములను) వేఱువేఱుగా నిచ్చుటకంగీకరించునట్లు ఉపాసనకై ప్రాణమును వాయువును వేఱుగ నంగీకరింపవలయును. 4. "రాజు, అధిరాజు మొదలైన వేర్వేఱు గుణజ్ఞానమును బట్టి దేవతలు గూడ నానావిధమైన వారే" అని సంకర్షణ కాండమున" నట్లె చెప్పఁబడెను.

వివ:- 1. "వదిష్యామ్యేవాహమితి వాగ్దధ్రే" (బృ. ౧. ౫. ౨౧) 2. వాయుర్వావ సంవర్గః" (ఛాం. ౪. ౩. ౨), 3. ఇంద్రాయరాజ్ఞే పురోడాశమేకాదశకపాలమింద్రా యాధిరాజాయేంద్రాయ స్వరాజ్ఞే", 4. "నానా వై దేవతా పృథగ్జ్ఞానాత్" అని శ్రుతులు.

## లింగభూయస్త్వాధికరణము ౨౯

44 మూ. లింగభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి.

లింగభూయస్త్వాత్ = సూచనలె బలమైనవగుటవలన, తత్ హి = ఆ సూచనయె, బలీయః=ఎక్కువ బలమైనది, తదపి=అదియు పూర్వమీమాంస యందు చెప్పఁబడెను.

సూ. 1. "ఆ మనస్సు తన దీర్ఘాయువైన నూఱేండ్లలోఁ గల ముప్పది యాఱువేల దినము లనునిటుకలు గలిగి, మనస్సుచేఁ గల్పింపఁబడి, పూజ్యమై మనోమయమై యొప్పుచున్న యగ్నులను దనవారినిగఁ జూచెను" ఇక మన శ్చయనములు" అనియు 2. "వాక్చయనములను, ప్రాణచయనములను చక్షుశ్చయనములను, శ్రోత్రచయనములను, కర్మచయనములను, అగ్నిచయనములను దనవారినిగఁ జూచెను" అనుచోటఁ మనశ్చయనములను ప్రస్తుత ప్రకరణమును బట్టి యజ్ఞాంగములుగ దలపరాదు. 3. ఎల్లప్రాణులచే ఆ యగ్నులెప్పుడు ఉపాసింపఁబడుచున్నట్లు శక్తి గలుగఁగా ఈ ప్రాణులన్నియు మనస్సుచే దేనిని సంకల్పించుచున్నచో యది యీ యగ్నులకె సాధనము" "నిద్రించుచున్నను ఈ యుపాసకులకొఱకు ఎల్లప్రాణులును ఈ యగ్నులను నిర్వర్తించుచున్నవి" అను నీ శ్రుతులందుఁ సర్వభూతములు ఉపాసనకుని యగ్నులనె నిర్వర్తించుచున్నవని తెలపుట మూలముగ మనశ్చయనాదులు యజ్ఞాంగములుగావనియుఁ గేవల స్వతంత్రోపాసనములనియుఁ జెప్పు సూచనలు ఎక్కువగ నుండుటవలన మనశ్చయనాదులు కేవల స్వతంత్రోపాసనములెగాని యజ్ఞాంగములు గావు. ప్రకరణముకంటె సూచనలె ఎక్కువ బలముగలవిగదా ప్రకరణముకంటె సూచనయె బలీయమని పూర్వమీమాంస యందుఁగూడఁ జెప్పఁబడెను.

వివ:- 1. "తత్ షట్త్రింశతం సహస్రాణ్యపశ్యదాత్మనోఽగ్నీ నర్కాన్ మనోమయాన్ మనశ్చితః" 2. "వాక్చితః ప్రాణచితః శ్చక్షుశ్చిత శ్శ్రోత్రచితః కర్మచితోఽగ్నిచితః" 3. "తద్యత్కించేమాని భూతాని మనసా సంకల్పయంతి తేషామేవ సా కృతిః" 4. "తాన్హైతానేవం విదే సర్వదా సర్వాణి భూతాని చిన్వంత్యపి స్వపతే" అని శ్రుతులు.

45. సూ. పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్ క్రియా మానసవత్.

ప్రకరణాత్ = ప్రకరణమునుబట్టి, పూర్వవికల్పః స్యాత్ = పూరోక్త వికల్పమె, స్యాత్=అగును. క్రియా=కర్మ, మానసవత్=మానస కర్మలవలె.

సూ. ద్వాదశాహ మనుయజ్ఞమున ధ్యానమునకై మౌనవ్రత నియమము గల యవివాక్యమను పేరుగల పదవరోజున, సముద్ర మనుసోమరసమును గ్రహించుట దానినొకచోట నుంచుట దానిని హోమముచేయుట హుతశేషమును గ్రహించుట ఆశేషమును ఋత్విజుల యనుజ్ఞచేఁ ద్రాగుట అను మానస కర్మ

ములు యాగక్రియ కంగములైనట్లు మనశ్చయనాదులును యాగ ప్రకరణమును బట్టి యదివరకుఁ జెప్పఁబడి యాగక్రియ యొక్క మానసరూపమైన యంగములే యగుఁగాని స్వతంత్రములు గావు.

వివ:- ఇది పూర్వపక్షసూత్రము.

46. సూ. అతిదేశాచ్చ.

అతిదేశాత్ చ=పోల్చి చెప్పుటవలనను.

సూ. మనశ్చయనాగ్నులను యాగాగ్నులతోఁ బోల్చి చెప్పుటవలనను మనశ్చయనాదులు యాగక్రియ కంగములగునే గాని స్వతంత్రములు గానేరవు.

వివ:- ఇదియుఁ బూర్వపక్షసూత్రము.

47. సూ. విద్యైవతు నిర్ధారణాత్.

నిర్ధారణాత్=విద్యలుగానే నిర్ధారణ చేయుటవల్ల, విద్యైవతు=విద్యయే.

సూ. 1. "ఈమనశ్చయనాదులు కేవల విద్యాత్మకములేగాని యాగక్రియాశేషములు గావు" ఈ మానసికాగ్నులు ఇట్లుపదేశించు వానికి విద్యచేతనే చయనము చేయఁబడుచున్నవగు చున్నవిగదా" అని శ్రుతియందు మనశ్చయనాదులు కేవల విద్యలుగనే నిర్ధారణ చేయఁబడుటచే స్వతంత్రములు గాని యాగక్రియాంగములు గావు.

వివ:- ఇది సిద్ధాంతసూత్రము 1. "తేహైతే విద్యాచిత ఏవ" 2. "విద్యయా హైవైత ఏవం విదశ్చితా భవంతి" అని శ్రుతులు.

48. సూ. శ్రుత్యాది బలీయస్త్వాచ్చ న బాధః

శ్రుత్యాది బలీయస్త్వాత్=శ్రుతి మొదలైనవి బలీయములగుట వలనను, న బాధః=బాధ కలుగదు.

సూ. "ఈ మనశ్చయనాదులు కేవల విద్యాత్మకములేగాని యాగక్రియాశేషములు గావు" ఇత్యాది శ్రుతి మొదలైనవే ప్రకరణముకంటె బలీయములగుటవలన మనశ్చయనాదులు స్వతంత్రము లనుపక్షమునకు బాధ కలుగదు.

50. సూ. అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతర పృథక్త్వవ ద్దృష్టశ్చ తదుక్తం

అనుబంధాదిభ్యః=యజ్ఞాంగములుగఁ గల్పించుట మొదలగు కారణములఁ బట్టి ప్రజ్ఞాంతర పృథక్త్వవత్=ఇతరోపాసనలు వేఱై స్వతంత్రముగ నున్నట్లు, రాజసూయ యాగ ప్రకరణముఁ జూడఁబడినది. ఇట్లే పూర్వమీమాంసయందును జెప్పఁబడినది.

సూ. 1. "అగ్నులను మనస్సుచేతనె వేదికయందుంచవలెను. మనస్సు చేతనె యిటుకలను గూర్చవలెను, మనస్సుచేతనె సోమరసమును గ్రహింపవలెను, మనస్సుచేతనె యుద్గాతలు స్తోత్రము చేయవలెను, మనస్సుచేతనె ఆశంసిప వలెను. యజ్ఞాంగముగఁ జేయు కర్మలెల్లను యజ్ఞీయముగఁ జేయు కర్మలెల్లను, మనస్సుచేతనె మనోరూపములగు మనశ్చయనములందుఁ జేయఁబడవలెను" అను శ్రుతి అగ్నులను వేదికయందుంచుట మొదలగు యజ్ఞాంగ కర్మలను మనశ్చయనాదులందు మనోమయములుగ కల్పించుచున్నది. మనశ్చయవాదులు యజ్ఞాంగములె యని వాదించినచో ఈ మనశ్చయవాదులందు యజ్ఞాంగకల్పనము చేయు నీ శ్రుతి వ్యర్థము గావలసి వచ్చును గాన మనశ్చయవాదులను యజ్ఞాంగ ములుగఁ గల్పించుట మొదలగు కారణములనుబట్టి, శాండిల్య విద్యోపాసనలు ఇతరోపాసనలకంటె వేఱై స్వతంత్రములైనట్లు మనశ్చయనాదులును స్వతంత్ర ములెగాని యజ్ఞాంగములు గావు. రాజులచేతనె చేయఁదగు రాజసూయ యాగము యొక్క ప్రకరణము నుండి మూడువర్ణములచేతఁ జేయఁదగిన యవేష్టి యను యాగమును విడఁదీసి స్వతంత్రముగఁ జెప్పుటయుఁ జూడఁబడినది. ఈ విష యము పూర్వమీమాంసయందుఁ జెప్పఁబడినదిగూడ.

వివ :- 1 "తే మనసైవాధీయంత మనసాచీయంత మనసైవ గ్రహా అగృహ్యంత మనసాస్తువన్ మనసాశంసన్, యత్కించ యజ్ఞే కర్మక్రియేత, యత్కించ యజ్ఞీయం, కర్మ మనసైవ తేషు తన్మనోమయేషుమనశ్చిత్సు మనోమయమేవ క్రియతే" అని శ్రుతి. "తేషామేకైక ఏవతావాన్ యావానసౌ పూర్వః" ఇదివరకుఁ జెప్పఁబడిన యాగాగ్ని యెంత మహిమగలదో ఈ మనశ్చయనాద్యగ్నులును అంత మహిమ గలిగినవే" అని మనశ్చయనాదులన్నిటి యందు యాగాగ్నిత్వాతిదేశము చేయఁబడినది. ఈ "యతి దేశాదులు మొదలగు కారణములనుబట్టి" అనచోట నున్న "మొదలగు" అను పదమునుబట్టి గ్రహింప వలయును.

51. మూ. న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువ న్న హి లోకాపత్తిః.

సామాన్యాత్ అపి=సామ్యమునుబట్టియు. న = యజ్ఞాంగములు గావు. మృత్యువత్=మృత్యువునకు వలె, ఉపలబ్ధేః = సామ్యము లేనట్లు ఉపలబ్ధమగుట వలన, లోకాపత్తిః=లోకమునను సామాన్యాపత్తి, నహి=లేదుగదా.

సూ. మనశ్చయనాదులును పూర్వోక్తములగు మానస కర్మలును (చూ. ౩ అధ్యా. ౩ పాద. ౪౫ సూ.) మనస్సంబంధులైనవను సామ్యమున్నను పూర్వోక్త శ్రుతి వ్యర్థమగుట (చూ. ౩ అధ్యా ౩ పాద. ౫౦ సూ.) మొదలగు గారణములనుబట్టి మనశ్చయనాదులు స్వతంత్రములె గాని యాగాంగములు గావు. 1. "ఈ సూర్యమండలమందున్న పురుషుఁడె మృత్యువు "2 అగ్నియె మృత్యువు" అని శ్రుతులలో సూర్యుని అగ్నిని మృత్యువుగ నొక్క మృత్యు పదముచేఁ జెప్పినను సూర్యునికి అగ్నికి మృత్యువునకు అత్యంత సామ్యము లేనట్లు మనశ్చయనాదులకు మానసకర్మలకు అత్యంత సామ్యము లేదు. 3. "ఓ గౌతమా! యీ లోకమె అగ్ని సూర్యుడె దీనికి సమిధ." అని చెప్పినను లోకమునకు అగ్నిత్వ సామ్యము లేదుగదా.

వివ:- 1. "సవా ఎష ఏవ మృత్యుర్య ఏష ఏతస్మిన్ మండలే పురుషః" 2. "అగ్నిర్వై మృత్యుః" (బృ. ౩. ౨. ౧౦) 3. "అసౌవావ లోకోగౌతమాగ్నిస్తస్యాదిత్య ఏవ సమిత్" (ఛాం. ౫. ౪. ౧) అని శ్రుతులు.

52. మూ. పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబంధః.

పరేణ=తరువాత శ్రుతివాక్యముచేతను, శబ్దస్య=మనశ్చయవాది శబ్దమునకు, తాద్విధ్యం=కేవల విద్యావిధిత్వమె, భూయస్త్వాత్=ఎక్కువగఁ గల్పించుట వల్లనైతే, అనుబంధః=అనుబంధించి చెప్పఁబడినది.

సూ. తరువాతఁ జెప్పఁబడిన 1. "ఈ లోకమనెడి యగ్నియె చయనము చేయఁబడినది" అను శ్రుతినిబట్టియు మనశ్చయనాదిశబ్దములకుఁ గేవల విద్యావిధిత్వమె ప్రయోజనముగఁ గన్పట్టుచున్నది గాని యాగాంగముగ గన్పట్టుట లేదు. ఆ శ్రుతియే యింకను 2. "ఎందుఁ గోరికలు మరలునో అట్టిదానిని విద్యచే నారోహింతురు" అని కేవల కర్మను నిందించుచు విద్యనె ప్రశంసించుచు నీ భావమునె సూచింపఁ జేయుచున్నది. మనశ్చయవాదులందు అగ్నియొక్క

వేది, దర్భలు మొదలగు నవయవముల నెక్కువగ గల్పింపవలయుం గాన నగ్ని ప్రకరణమున నా విద్య ననుబంధించి చెప్పంబడినది గాని యాగమున కంగ మగుటచే మాత్రముగాదని తెలియవలయును.

వివ:- 1. "అయంవావ లోక ఏషోఽగ్నిశ్చితః" 2. ''విద్యయా తదారోహంతి యత్రకామాః పరాగతాః" అని శ్రుతులు. పూర్వోత్తర శ్రుతులనుబట్టి మనశ్చయవాదులు స్వతంత్రములెగాని యాగాంగములు గావని భావము.

## శరీర భావాధికరణము ౩౦

౫౩. సూ. ఏక ఆత్మనః శరీరే భావాత్.

శరీరే=శరీరమున్నపుడె, భావాత్=ఆత్మ యుండుటవలన, ఆత్మనః=ఆత్మయొక్క (అభావమును) ఏకే=కొందఱు చెప్పుదురు.

సూ. శరీరమున్నపుడు మాత్రమె చైతన్యాది ధర్మములు గనిపించు చున్నవి శరీరము లేనప్పుడా చైతన్యాదులు గనిపించుట లేదుగాన శరీరము కంటె వేఱుగ ఆత్మ యనునది లేదని కొందఱందురు.

వివ:- ఇది పూర్వపక్షసూత్రము. పురుషార్థ సిద్ధికై మనశ్చయనాదులు చేయవలయునని చెప్పుచుం బ్రసంగవశమున మశ్చయనాదులు చేయునట్టి పురుషునిలోని యాత్మాస్తిత్వమును గూర్చి విచారము చేయంబడు చున్నది.

౫౪. సూ. వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్నతూపలబ్ధివత్.

తద్భావాభావిత్వాత్=శరీరము (మరణ సమయమున) ఉన్నను చైతన్యాదులు లేకపోవుటవలన, వ్యతిరేకః=ఆత్మ వేఱు. నతు=దేహము మాత్రము గాదు, ఉపలబ్ధివత్=దేహముకంటె ననుభవ జ్ఞానము వేఱు నుపలబ్ధమైనట్లు.

సూ. జీవుండు మరణించినపుడు దేహమున్నను దేహధర్మములగు రూపాదులున్నను ఆత్మధర్మములగు చైతన్యమును జేష్టయు స్మృతిమొదలగునవి లేకపోవుటవలన ఆత్మ యనునది దేహముకంటె విలక్షణమైనదె గాని దేహము మాత్రము గాదు. పంచభూత సముదాయరూపమగు దేహముకంటె ఆ దేహమును గూర్చి తెలిసికొను నను భవ జ్ఞానము వేఱుగ నుపలబ్ధమైనట్లే ఆత్మయును వేఱైనదియె.

వివ:- ఇది సిద్ధాంత సూత్రము.

## అంగావబద్ధాధికరణము ౩౧

55. మూ. అంగావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదం.

అంగావ బద్ధాః తు=కర్మాంగోపాసనలైతే, శాఖాసు న = శాఖల యందు మాత్రమె గాదు, ప్రతివేదం=ప్రతి వేద శాఖలందు వర్తించును.

సూ. 1. "ఉద్గీథమున కంగమైన ఓం అను నక్షరమును ప్రాణమని యుపాసింపవలయును" 2. "లోకములందు అయిదు విధములైన సామముల నుపాసింపవలెను" ఇత్యాదులైన కర్మాంగోపాసనలు ఉద్గీథాది సామాన్యముగఁ జెప్పుటవలన ప్రతి వేదమందున్న తమ తమ శాఖల యందు మాత్రమె గాక యన్ని శాఖల యందును గల యుద్గీథాద్యుపాసనలందుఁ బ్రవర్తించును.

వివ:- 1. "ఓ మి త్యేతదక్షర ముద్గీథముపాసీత" (ఛాం. ౧. ౧. ౧) 2. "లోకేషు పంచవిధం సామోపాసీత" (ఛాం. ౨. ౨. ౧)

56. మూ. మంత్రాదివద్వాఽవిరోధ.

మంత్రాదివత్ వా=మంత్రాదులువలెఁగాని, అవిరోధః=విరోధము లేదు.

సూ. ఒక శాఖయందుఁ జెప్పఁబడిన మంత్రములను, కర్మలను గుణములను ఇంకొక శాఖయందు సంగ్రహింపఁజేసినట్లే ఒక శాఖయందుఁ జెప్పఁబడిన యుద్గీథాద్యుపాసనలనుగూడ నింకొక శాఖయందు సంగ్రహింపఁ జేయుటలో విరోధ మేదియు లేదు.

వివ:- బియ్యమును పిండి చేయుటకు "కుటరురసి" అను మంత్రము ఒక శాఖయందుఁ జెప్పఁబడుచున్నది. యజుశ్శాఖలో ఈ మంత్రము చెప్పఁబడకపోయినను "కుక్కుటోఽసి" అను మంత్రముచేఁ గాని "కుటరురసి" అను మంత్రముచేఁ గాని రాతిని గ్రహించుచున్నాఁడు" "కుక్కుటోఽసీత్యశ్మానమాదత్తే కుటరు రోసీతివ" అను మంత్రము యజుశ్శాఖ యందు వినియోగింపఁబడుచున్నది ఇట్లే యితరములఁ దెలియునది.

## భూమజ్యాయస్త్వాధికరణము 32 (వైశ్వానర విద్యాధికరణము)

57. సూ. భూమ్నః క్రతువ జ్జాయ స్త్వం తథా హి దర్శయతి.

భూమ్నః=సమస్తోపాసనకు, క్రతువత్=క్రతువులకువలె, జ్యాయ స్త్వం=సను స్తత్వమె, తథాహి=అట్లే, దర్శయతి=శ్రుతి చూపుచున్నది.

సూ. 1. "ఓ యుపమన్యుని పుత్రుఁడా! నీవు దేనిని వైశ్వానరునిగా నుపాసించుచున్నావు" అను ప్రశ్నకు 2. "ఓ పూజ్యుఁడా! ఓ రాజా! ద్యులోకమునే వైశ్వానరునిగా నుపాసించుచున్నా నని చెప్పెను. నీవే వైశ్వానరుని నుపాసించుచున్నావో యితఁడే మంచి తేజస్సుగల వైశ్వానరుఁడు'' అను సమాధాన శ్రుతిలోఁ జెప్పఁబడిన వైశ్వానరోపాసనము దర్శపూర్ణమాసాది క్రతువులవలె సమస్తోపాసనమె గాని వ్యస్తోపాసనము గాదు. 3. "ఆత్మరూపుఁడగు వైశ్వానరుని తల ద్యులోకము కన్నులు సూర్యుఁడు" అని చెప్పిన సమస్తోపాసన శ్రుతితోఁ బై శ్రుతికి ఏక వాక్యత యుండుటవలనను, 4 "ఈ ద్యులోకమె వైశ్వానరాత్మ యొక్క శిరస్సుగాని సమస్త వైశ్వారుఁడు గాదు అని చెప్పెను". 5. "నీవు నన్నుఁ జేరి సరిగ వైశ్వానరుని సమస్తోపాసనము తెలిసికొని యుండకపోతివేని సరిగా తెలిసికొనని నీ తల బ్రద్దలయి పోయియుండెడి" అను శ్రుతులలో వైశ్వానరుని వ్యస్తోపాసనను నిందించుచు సమస్తోపాసనమునె ప్రధానముగఁ జెప్పుటవలనను వైశ్వానరోపాసనము లన్ని యవయవములతోఁగూడిన సమస్తమెగాని ఏ యవయవమున కాయవయవమును విడిగాఁ జెప్పు వ్యస్తోపాసనము గాదు. 6. "ద్యులోకము తల కన్నులు సూర్యుడు గాలి ప్రాణము అన్ని యవయవములతోఁగూడిన వైశ్వానరుని నుపాసించువాఁడు అన్ని లోకములందు అన్ని ప్రాణులందు అన్ని ఆత్మలందు అన్నము ననుభవించుచునాఁడు" అని శ్రుతి సమస్తోపాసనమునకె ఫలమును జూపుచున్నది కావునను వైశ్వానరోపాసనము సమస్తమెగాని వ్యస్తము గాదు.

వివః- 1. "ఔపమన్యవ కంత్వమాత్మానముపాస్సే'' (ఛాం. 5. 12. 1) 2. "దివమేవ భగవో రాజన్నితిహోవాచ ఏష వైసుతేజా ఆత్మావైశ్వానరోయంత్వ మాత్మానముపాస్సే'' 3. "తస్యహవా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్దైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః" (ఛాం. 5. 18. 2) 4. "మూర్ధాత్వేష ఆత్మన ఇతిహోవాచ'' (ఛాం. 5. 12. 2) 5 "మూర్ధాతే వ్యపతిష్య ద్యన్నా

గమిష్యః" (ఛాం. ౩. ౧౨. ౨) 6. "స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మ స్వన్నమత్తి" (ఛాం. ౫. ౧౮. ౧) అని శ్రుతులు.

## శబ్దాదిభేదాధికరణము ౩౩

58. మూ. నానా శబ్దాదిభేదాత్.

శబ్దాదిభేదాత్=భిన్న శబ్దాదులతో వేఱుగఁ జెప్పఁటవలన, నానా=ఉపాసనలు అనేకమే.

సూ. 1. "పరమాత్మ మనోమయుఁడు ప్రాణశరీర రూపుడు" 2. "ఆహారమె బ్రహ్మము, ఆకాశమె బ్రహ్మము" 3. "ఆత్మ సత్యకామము గలది సత్యసంకల్పము గలది", 4. "ప్రాణమె మొదటిది శ్రేష్ఠమైనది ఇత్యాములందుఁ దెలిసికొనఁదగిన బ్రహ్మ మొక్కటేయైనను ఉపాసనకై వేఱువేఱుగాఁ జెప్పి తెలిసికొనుము, ఉపాసింపవలయును, యజ్ఞమును చేయవలయును" అని యిట్లు వేఱువేఱు శబ్దములచే వేర్వేఱు ఉపాసనలఁ జెప్పఁటవలన మనోమయత్వాద్యుపాసనలు భిన్నములైనవే గాని యొక్కటి గావు.

వివ :- 1. "మనోమయః ప్రాణశరీరః" (ఛం. ౩. ౧౪. ౧) 2. కం బ్రహ్మ, ఖంబ్రహ్మ, (చా. ౪. ౧౦. ౫) 3. "సత్యకామస్సత్య సంకల్పః" (ఛాం. ౮. ౧. ౫), 4. ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చః (ఛాం. ౫. ౦. ౧)

## వికల్పాధికరణము ౩౪

59. మూ. వికల్పోఽవిశిష్టఫలత్వాత్.

అవిశిష్ట ఫలత్వాత్=విశేషించిన ఫలము లేకపోవుటవలన, వికల్పః = ఏ యుపాసననైన నుపాసింపవచ్చును అను వికల్పము కలుగునని తెలియునది.

సూ. తెలిసికొనఁదగిన వాఁడు భగవంతుఁ డొక్కఁడే గాన, ఏసగుణ బ్రహ్మోపాసనచేతనైనను ఆ భగవంతుని బొందవచ్చును గనుక, ఆ సగుణ బ్రహ్మోపాసనలందుఁ గల ముఖ్యఫలములో విశేషము లేకపోవుటవలన ఆ యుపాసనలలో నేయుపాసననైనను ఉపాసింపవచ్చును. కాని యన్ని యుపాసనలును ఉపాసింపనక్కఱలేదు. అట్లన్ని యుపాసనలు ఉపాసింపఁదలఁచు మనస్సునకు ఒకదానియందును నిలకడలేక ఆ యుపాసనలచేఁ బొందఁదగు నీశ్వరుని బొందలేకపోవుట తటస్థించును.

## యథాకామాధికరణము ౩౫

౬౦. మూ. కామ్యాస్తుయథాకామం సముచ్చీయేర న్నవా పూర్వహేత్వ భావాత్.

యథాకామం=కోరిక ననుసరించి, పూర్వహేత్వభావాత్ = పూర్వహేతు విటులేకపోవుటవలన, కామ్యాస్తు=కామ్యోపాసనలు స్వేచ్ఛగా, సముచ్చీయేరన్= అన్ని యుపాసింపవచ్చును.

సూ. 1. "పుత్రజీవితమును గోరుచు ఇట్లు ఈ వాయువును దిక్కులనెడు గోవులకు దూడగా నుపాసించువాఁడు పుత్రమరణ శోకమున శోకింపఁడు" ఇత్యాది కామ్యోపాసనములందు సిద్ధించు ఫలము సమానముగ నుండుట అను పూర్వహేతు విందులేకపోవుటవలన ఆ యా యుపాసకుల కోరికలనుబట్టి అన్ని కోరికలను సిద్ధింపఁజేయు నన్ని యుపాసనలను గలిసి గాని లేక ఆయా కోరికలు సిద్ధించుటకై ఆయా యుపాసనలను విడిగాఁ గాని యుపాసింపవచ్చును.

వివ :- 1. "సయఏతమేవం వాయుందిశాం వత్సం వేద న పుత్రరోదం రోదితి" (ఛాం. ౩. ౧౫. ౨) అని శ్రుతి.

## యథాశ్రయభావాధికరణము ౩౬

౬1. మూ. అంగేషు యథాశ్రయ భావః.

అంగేషు = కర్మాంగములందు, యథాశ్రయభావః = వానికాశ్రయమగు స్తుతులనుబట్టి చేయవలయును.

సూ. ఉద్గీథాది కర్మాంగములను ఆశ్రయించి వేదత్రయమందు విధింపఁబడిన యుపాసనలు ఆ యుపాసనల కాశ్రయమైన స్తోత్రాదులనుబట్టి యా స్తోత్రములవలెఁ గలిసియె యనుష్ఠింపఁదగినవి.

వివ :- ఈ సూత్రమును ౬౨, ౬౩, ౬౪, సూత్రములును బూర్వపక్ష సూత్రములు.

౬2. మూ. శిష్టేశ్చ.

శిష్టేః చ=వేదత్రయమందు శాసింపఁబడుటవలనను.

సూ. ఉపాసనలకాశ్రయములగు స్తోత్రాదులు వేదత్రయమందు శాసింపఁబడుటవలనను ఆస్తోత్రముల నాశ్రయించిన యుపాసనలనన్ని అనుష్ఠింపఁదగినవి.

63. మూ. సమాహారాత్.

సమాహారాత్=కలిపి రెండింటిని ఏకముగా చెప్పుటవలన.

సూ. 1. "ఉద్గాత స్వరాదిప్రమాదముచేఁ జెడిన తన యుద్గీథమును సుస్వరయుక్తముగఁ బలికిన హోతయొక్క కర్మనుండి తన ప్రమాదమును దిద్దుకొనుచున్నాఁడు" అను శ్రుతిలో తప్పుదిద్దుకొనుటనుబట్టి ఋగ్వేదములతోఁ జెప్పఁబడిన ప్రణవమును, సామవేదములలో జెప్పఁబడిన యుద్గీథమును రెండును గలిసి ఏకముగ ధ్యానించుట యను విషయము దెలియుటవలనను ఉద్గీథాది కర్మాంగముల నాశ్రయించిన యుపాసనలు కలిపి యనుష్ఠింపఁదగినవి.

వివ :- 1. "హోతృషద నాద్ధైవాపి దురుద్గీథ మనుసమాహరతి" (ఛాం. ౧. ౫. ౫). అనిశ్రుతి.

64. మూ. గుణసాధారణ్య శ్రుతేశ్చ.

గుణసాధారణ్య శ్రుతేః చ=గుణముల సామ్యమును జెప్పు శ్రుతిని బట్టియు.

సూ. 1. "ఓంకారముచేతనే మూఁడు వేదములు ప్రవర్తించుచున్నవి. ఓం అని పలికి యజుర్వేది ప్రేషనిచ్చుచున్నాఁడు, ఓం అని పలికి ఋగ్వేది కీర్తించుచున్నాఁడు, ఓం అని పలికి సామవేది గానము చేయుచున్నాఁడు" అని శ్రుతులనుబట్టి యుపాసనల కాశ్రయమైన యోంకారము అన్ని వేదములందు సమానముగ నుండుటవలనను ఆశ్రయములైన స్తోత్రములను ఆశ్రయించిన యుపాసనలు కలిపియే యనుష్ఠింపఁదగినవి.

ఈ సూత్రమున కర్థాంతరమున సూత్రము.

మూ. గుణసాధారణ్య శ్రుతేశ్చ.

గుణ సాధారణ్య శ్రుతేఃచ=కర్మగుణములగు నుద్గీథాదులు సమానమను శ్రుతిని బట్టియు.

సూ. కర్మగుణములైన యుద్గీథాదులు సర్వవేద ప్రయోగములందు సమానములు గానిచో వానినాశ్రయించిన యుపాసనలు గలిసి యున్నియు

నుండుట సంభవించదు. కాని యుద్గీథాదులు అన్ని వేదములందుఁ బ్రయోగింపఁ బడుచున్నవి యను సంగతి శ్రుతినిబట్టి తెలియుచున్నది గాన ఆశ్రయముల సాహచర్యమునుబట్టి ఆశ్రయించిన యుపాసనలకును సాహచర్యము సిద్ధించు చున్నది

65. సూ. నవాతత్సహ భావాఽశ్రుతేః.

తత్సహభావాఽశ్రుతేః=కలిసి చేయవలయుననీ, వినఁబడకపోవుటవలన, నవా=కలసి గాక విడిగాఁ జేయవచ్చును.

సూ. మూఁడు వేదములందు విధింపఁబడిన యంగములనువలె ఉపాసన లను గలిపిచేయవలయునని శ్రుతి తెలుపకపోవుటవలన గలిపి యన్నియుఁ జేయక యిష్టమువచ్చినట్లు ఆయా కోరికలనుబట్టి విడివిడిగ నాయా యుపాసన లను జేయవచ్చును.

వివ:- 1. "గ్రహం వా గృహీత్వా, చమసంవోన్నీయ, స్తోత్రముపా కరోతి, స్తుతమనుశంసతి ప్రస్తోతస్సామగాయ, హోతరేతద్యజ" 'సోమ పాత్రమును గ్రహించిగాని చమసము నెత్తిగాని స్తోత్రము నారంభింపవలయు, స్తుతతంత్రము ననుసరించి శస్త్రమును బఠింపవలయు' ఓ ప్రస్తోతా నీవు సామ మును గానము చేయుము. ఓ హోతా! దానిని యజింపుము, అని శ్రుతికర్మాంగ ములకు సాహచర్యము చెప్పునట్లు ఉపాసనలకు సాహచర్యమును జెప్పుటలేదు గాన విడివిడిగా కోరికలను ఉపాసనఁ జేయవచ్చు నని భావము.

66. సూ. దర్శనాచ్చ.

దర్శనాత్ చ=శ్రుతిలోఁ గనిపించుటవలనను.

సూ. 1. "కర్మలకు లోపముువచ్చినప్పుడు ప్రాయశ్చిత్తము దెలిసిన ఋత్విజుఁడే యజ్ఞమును యజమానుని ఋత్విజులందఱను వారి ప్రమాదములఁ బోఁగొట్టి రక్షించుచున్నాఁడు" అని శ్రుతి యుపాసనలకు సాహచర్యము లేదని శ్రుతిలోఁ గనిపించుచున్నది. ఎల్ల యుపాసనలకు సాహచర్యము తప్పక యున్నచో ఋత్విజులకెల్లరకు అన్ని యుపాసనములు దెలిసియుండును గాన

వారు పొరపాటుచేయుటయు వారిని సర్వము దెలిసిన ఋత్విజుఁడు రక్షించుటయుఁ గుదురదు గాన ఉపాసనలను గోరికలనుబట్టి విడిగాఁ గాని అన్ని కోరికలనుబట్టి యన్ని యుపాసనలను గాని చేయవచ్చును.

వివః- 1. "ఏవంవి ద్ధ వై బ్రహ్మయజ్ఞం యజమానం సర్వాంశ్చ ఋత్విజోఽభిరక్షతి" (ఛాం. ४. ౧౭. ౧౦) అని శ్రుతి.

ఇది

శ్రీవెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
ఉపాసనలకు భేదమును తత్సంగ్రహమునుదెలుపు
బ్రహ్మమీమాంసా దర్శనమున మూఁడవ యధ్యాయము.



# బ్రహ్మ మీమాంసా దర్శనము

అంతరంగ బహిరంగ సాధన విచారము

నాల్గవ పాదము

## పురుషార్థాధికరణము ౧

1. సూ. పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః

శబ్దాత్ = శ్రుతివాక్యమునుబట్టి, అతః = ఈ యాత్మజ్ఞానమువలననే పురుషార్థః=పురుషార్థమగు మోక్షము (కలుగును), ఇతి=అని, బాదరాయణః= బాదరాయణుఁడనియె.

సూ. 1. "ఆత్మను దెలిసినవాఁడు శోకమును దాటును" ఇత్యాది శ్రుతి వాక్యములనుబట్టి వేదాంతమందు విహితమైన కేవలాత్మజ్ఞానము వలననె పురుషార్థమైన మోక్షము సిద్ధించునని బాదరాయణుఁ డనియె. ఇది సిద్ధాంత సూత్రము.

వివ:- "తరతి శోకమాత్మవిత్" (ఛాం. ౭. ౧ ౩)

2. సూ. శేషత్వాత్పురుషార్థవాదో యథాఽన్యేష్వితి జైమినిః

అన్యేషు యథా=ఇతర శ్రుతులందువలె, శేషత్వాత్ = కర్మశేషమగుట వలన, పురుషార్థవాదః=ఆత్మనుగూర్చి చెప్పిన శ్రుతి పురుష రూపమైన యాత్మ యొక్క అర్థవాదమె, ఇతి=అని, జైమినిః=జైమిని అనెను.

సూ. ఆత్మయె యన్ని కర్మలకుఁ గర్తయగుచున్నది గాన నా యాత్మ యన్ని కర్మలకంటె వేఱైనది. ఆత్మజ్ఞానముకూడ ఆత్మకంటె వేఱైనదే యగుటవలన ఆ జ్ఞానముకూడఁ గర్మలతో సంబంధించినదే యగుటవలన "ఆత్మను దెలిసిన వాఁడు శోకమును దాటును" అని ఫలమును జెప్పు శ్రుతి పురుషరూపమైన యాత్మస్తుతిపరమైన యర్థవాదమె. 1. "ఎవని యొక్క 'జుహువు' అను పేరుగల గరిటెవంటి యజ్ఞపాత్రము మోదుగు గఱ్ఱతోఁ జేయఁ

బడినదగునో వాడు అపకీర్తిని బొందఁడు" ఇత్యాది ద్రవ్యాది సంబంధ శ్రుతులవలె నిదియు నర్థవాదము గానఁ గర్మలతో నున్నపుడే గాని స్వతంత్రముగఁ గేవలాత్మజ్ఞానము వలనఁ బురుషార్థము సిద్ధింపదని జైమిని యనియె.

వివ:-1. "యస్య పర్ణమయీ జుహూర్భవతి నసపాపం శ్లోకం శృణోతి" అని శ్రుతి.

3. మూ. ఆచార దర్శనాత్.

ఆచారదర్శనాత్=జనకాదుల ఆచారము కనిపించుటవలన.

సూ. బ్రహ్మవేత్తలగు జనకాదులు యజ్ఞాదికర్మల నాచరించినట్లు కనిపించుటవలనఁ గేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణము గాదు కాన యజ్ఞకర్మలతోపాటు ఆత్మజ్ఞానము గలిగియుండుటవల్లఁ గేవలాత్మజ్ఞానము స్వతంత్రముగ మోక్షమునకుఁ గారణమనరాదు.

వివ:- "జనకోహ వై దేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే" (బృ. ౩. ౧. విదేహరాజైన జనకుఁడు అనేక దక్షిణలు గల యజ్ఞముచే యజ్ఞము చేసెను అని శ్రుతి. ఇట్లే యుద్దాలకాదులు పుత్రులను ఆజ్ఞాపించుటవల్ల గృహస్థ సంబంధము తెలియుచున్నది. కాన కేవలాత్మజ్ఞానమువల్ల మోక్షము సిద్ధింపదని భావము. కేవలాత్మజ్ఞానముచేతనే మోక్షము సిద్ధించుచో నిఁక కర్మలుచేసే ప్రయాసమేల యని భావము. 3వ సూత్రము నుండి 7వ సూత్రమువరకు ఆక్షేప సూత్రములు.

4. మూ. తచ్ఛ్రుతేః

తచ్ఛ్రుతేః=కర్మసంబంధము వినఁబడుటవలన.

సూ. "పురుషుఁడు జ్ఞానముతోడను శ్రద్ధతోడను రహస్య విజ్ఞానము తోడ నేకర్మను జేయునో యది మిక్కిలి శక్తిగలదగును" అని శ్రుతిని గర్మసంబంధము వినఁబడుటవలనను గేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణమనరాదు.

వివ:-1. యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛాం. ౧. ౧. ౧౦) అని శ్రుతి.

5. మూ. సమన్వారంభణాత్.

సమన్వారంభణాత్ = విద్యాకర్మలు కలిసియుండునట్లు చెప్పుటవలన.

సూ "పరలోకమునకుఁ బోవు వానిని విద్యాకర్మలు రెండు వెంబడించును" అని విద్యాకర్మలు ఫలసిద్ధిలోఁ గలిసియుండునట్లు చెప్పుటవలనను ఆత్మజ్ఞానమొక్కటె స్వతంత్రముగ మోక్షమునకుఁ గారణము గాదు గాన కేవలాత్మజ్ఞానము మోక్షకారణమని చెప్పు శ్రుతి స్తుతిపరమైన యర్థవాదము.

వివ:- "తం విద్యాకర్మణీ సమన్వారభేతే" (బృ. 4. 4. 2) అని శ్రుతి.

6. మూ తద్వతో విధానాత్.

తద్వతః = వేదార్థము గలవానికి, విధానాత్ = విధించుటవలన.

సూ. "గురువునకు సేవచేసి మిగిలిన కాలమున యథావిధానముగా వేదము అర్థసహితముగఁ జదివి యాచార్య కులమునుండి మరలివచ్చి కుటుంబియైన శుచియగు దేశమునఁ గూర్చుండి వేదమును జదువువాఁడై యుండవలెను" అని శ్రుతి సమస్తవేదార్థమును దెలిసినవానికిఁ గర్మలు విధించుటవలన కేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణమనుట స్తుతిమాత్రమె.

వి:- "ఆచార్య కులాద్వేదమధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుంబే శుచౌదేశేస్వాధ్యాయ మధీయానః" (ఛాం 8. 15. 1) అని శ్రుతి.

7. మూ. నియమాచ్చ.

నియమాత్ చ = నియమించుటవలనను.

సూ. "ఇందు కర్మలను జేయుచునే నూఱేండ్లు జీవింపఁగోరవలయునను నియమము విధించుటవలనను గేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణమనరాదు.

వివ:- "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః" (ఈశ. 2) అని శ్రుతి.

8. మూ. అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్.

అధికోపదేశాత్ తు = అధికునిగా నుపదేశించుటవలననైతే, ఏవం = ఇట్లును తద్దర్శనాత్ = దానిని చూపించుటవలనను, బాదరాయణస్య = బాదరాయణు మతమే ఆదరింపఁదగినది.

సూ. శరీరమందున్న జీవాత్మకంటెఁ బరమాత్మను అధికునిగా వేఁ ముల్లందు ఉపదేశించుట వలనను ఇట్లే 1. "ఎవఁడు సర్వజ్ఞుఁడో సర్వవేత్త యతఁడె పరమాత్మ" 2. "ఇతని నుండి భయమువల్ల గాలివీచుచున్న ఇత్యాదిశ్రుతులును శరీరమందలి జీవాత్మునికంటె నధికునిగాఁ బరమా జూపుటవల్లను కర్తృత్వాది సంసారిధర్మములులేక అపహతపాప్మత్వాది ములుగల పరమాత్మయె దెలియఁదగినవాఁడుగా వేదాంతములందు ఉపదేశి బడుటచే అట్టి పరమాత్మ జ్ఞానము కర్మలను ప్రవర్తింపక చేయకపోవుఁ గాక కర్మలను నశింపఁజేయును గాన స్వతంత్రముగఁ గేవలాత్మజ్ఞానమె మునకుఁ గారణమను బాదరాయణుని మతమె యాదరింపఁదగినది.

వివ:- "యః సర్వజ్ఞః సర్వవిత్", "భీషాఽస్మాద్వాత పవ ఇత్యాదులు శ్రుతులు. "ఆత్మ న స్తుకామాయ సర్వంప్రియం భవతి" (బృ. జీవాత్మయొక్క కోరికకొఱకే సర్వము ప్రియమగును. "ఆత్మా వా ద్రష్టవ్యః" (బృ. ౨. ౪. ౫) ఓసీ జీవాత్మయె చూడఁదగినవాఁడు. "యః ప్రాణితి స త ఆత్మా సర్వాంతరః" (బృ. ౩. ౪. ౧) ఎవఁడు వాయువుచే బ్రదుకుచున్నాఁడో అతఁడె నీకు సర్వములో నున్న యాత్మ. దులు జీవాత్మను దెలుపు-శ్రుతులు. జీవాత్మను దెలిసికొనుట ద్వారా పరవ జీవాత్మలకు అభేదమును దెలుపుటకే వాటికి తాత్పర్యము గాన విరోధము తెలియవలయును.

౪ సూ. తుల్యంతు దర్శనం.

దర్శనం=కనిపించుట, తుల్యంతు=సమానమె.

సూ. బ్రహ్మవేత్తలగు జనకాదులకు ఆత్మజ్ఞానముతోపాటు కర్మా ణము శ్రుతులందుఁ గనిపించుచున్నట్లే కర్మాచరణములను విడుచుటయు లందుఁ గనిపించుచున్నది.

వివ:- ఇది శివ సూత్రమునకు ఖండనము "ఏతద్ధస్మ వై తద్విద్వ ఆహు ర్ఋషయః కావషేయాః కిమర్థావయమధ్యేష్యామహే కిమర్థా వ యక్ష్యామహే ఏతద్ధస్మ వై తత్పూర్వే విద్వాంసోఽగ్నిహోత్రం న జువ చక్రిరే" అగ్నిహోత్రములు నిష్ప్రయోజనములని ప్రాచీనులగు బ్రహ్మవి వాటిని త్యజించిరి. కాన యాగాధ్యయనాది కర్మలన్నిటిని విడిచి మన

బ్రహ్మనిష్ఠులమై యుండవలెనని కావషేయులనిరి. "ఏతంవై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" (బృ. ౩ ౫. ౧) సంసారి ధర్మరహితము నపహతపాప్మత్వాది ధర్మసహితమునగు నీ యాత్మను దెలిసికొని బ్రాహ్మణులు పుత్రవాంఛనుండి ధనవాంఛ నుండి విడివడి యజ్ఞోపవీతాదుల వీడి సన్న్యాసాశ్రమము స్వీకరించి బ్రహ్మమును బొందుటకై భిక్షాచర్యము చేయుచుండిరి. "ఏతావదరే ఖల్వమృతత్వ మిత్యుక్త్వా యాజ్ఞవల్క్యః ప్రవవ్రాజ" (బృ. ౪. ౫. ౧౫) ఓ మైత్రేయీ ! ఆత్మజ్ఞానమె సన్న్యాసమె మోక్షమునకు సాధనమని చెప్పి యాజ్ఞవల్క్యుఁడు సన్న్యసించెను. ఇత్యాది శ్రుతులు కర్మాచరణ త్యాగమునె చెప్పుచున్నవి కాన స్వతంత్రముగఁ గేవలాత్మజ్ఞానము మోక్షసాధన మని భావము. "యక్ష్యమాణోహ వై భగవంతోఽహమస్మి" (ఛాం. ౫ ౧౧. ౫) ఓ పూజ్యులారా ! నేను యజ్ఞము చేయఁబోవుచున్నాను. ఇక్కడ నుండుఁడు మీకుఁ గావలసినంత ధనమిచ్చెదను. ఇత్యాది కర్మాచరణ శ్రుతులు వైశ్వానరోపాసనా విషయమని తెలియునది. బ్రహ్మవిదులు లోకసంగ్రహార్థము కర్మలు చేయుచున్నను వారికా కర్మలందభిమానము ఆసక్తి లేకపోవుటవలన వారు చేయు కర్మలు కర్మలు కాక యకర్మలగునని తెలియునది.

10. సూ. అసార్వత్రికీ.

అసార్వత్రికీ=సర్వవిద్యలకు సంబంధించినది గానిది

సూ. "పురుషుఁడు జ్ఞానముతోడను, శ్రద్ధతోడను రహస్య విజ్ఞానము తోడను ఏ కర్మ చేయునో యది మిక్కిలి శక్తి గలదగును." (ఛాం. ౧ ౧. ౧౦) అను శ్రుతి ప్రకృతమైన ఉద్గీథోపాసనకు సంబంధించినదిగాని సర్వవిద్యలకు సంబంధించినది గాదు గాన విరోధింపదు.

వివః- ఇది ౪ వ సూత్రమునకు ఖండనము.

11. సూ. విభాగః శతవత్,

శతవత్=నూటిని వలె, విభాగః=విభజన చేయవలయును

సూ. ఈ పురుష లిద్దఱకు నూఱురూపాయలిమ్ము అని చెప్పఁగా నొక్కొక్కనికి ఏఁబదేసి చొప్పున విభజించి యివ్వవలెనని యర్థమైనట్లు "పరలోకమునకుఁ బోవువానిని విద్యాకర్మలు రెండును వెంబడించును" అను

చోటను విద్యాసక్తుఁడైన వానిని విద్యయుఁ గర్మాసక్తుఁడైన వానిని కర్మ వెంబడించును అని యర్థము గాన ఆ శ్రుతి విరోధింపదు.

వివ:- ఇది ౫ వ సూత్రమునకు ఖండనము.

12. మూ. అధ్యయన మాత్రవతః

అధ్యయన మాత్రవతః=వేదాధ్యయనము చేసిన వారికి మాత్రమె.

సూ. "గురువునకు సేవచేసి మిగిలిన కాలమున యథావిధానవ వేదము అర్థసహితముగఁ జదివి యాచార్య కులమునుండి మరలివచ్చి కుట మున నుండి శుచియగు దేశమునఁ గూర్చుండి వేదము చదువువాఁడై య వలెను" అను శ్రుతి వేదాధ్యయనము చేసినవారికి మాత్రమే కర్మలను విధి చున్నది గాని యుపనిషత్తులందుఁ జెప్పఁబడిన స్వతంత్రముగా మోక్షప్రద నము గూర్చు నాత్మజ్ఞానముగల వారికిఁ గర్మలను విధించుటలేదు గాన దోష లేదు.

వివ:- ఇది ౬ వ సూత్రమునకు ఖండనము.

13. మూ. నాఽవిశేషాత్.

అవిశేషాత్=సామాన్యముగఁ జెప్పుటవలన, న=అట్లుగాదు.

సూ. "ఇందు కర్మలను జేయుచునే నూఱేండ్లు జీవింపఁగోరవలయు (ఈశ. ౨) అను శ్రుతి సామాన్యముగఁ జెప్పబడినది అది ఆత్మజ్ఞానము వారిని గూర్చి చెప్పినదేగాని ఆత్మజ్ఞానముగల వారిని గూర్చి చెప్పినది గాదు

వివ:- ఇది ౭ వ సూత్రమునకు ఖండనము.

14. మూ. స్తుతయే ఽనుమతిర్వా.

స్తుతయే=విద్యాస్తుతికొఱకు, అనుమతిః వా=కర్మల కనుజ్ఞగాని.

సూ. ఒకవేళ ఆ శ్రుతిలో జ్ఞానము గలవాఁడు ఇందు కర్మలను జేఁ చనే నూఱేండ్లు జీవింపఁగోరవలయును. అని విశేషము చెప్పినప్పటికిని శ్రుతిలోనే "ఇట్లు చేసినచో మనుష్యుని గర్మలంటవు" (ఈశ. ౨) చెప్పుటచే జీవించినంత కాలము కర్మలు చేయుచున్నను జ్ఞానసామర్థ్యముచే జ్ఞానముగల వానిని గర్మలంటవు" అను విషయమును స్తుతించి చెప్పుటకై ఆ శ్రుతి కర్మలకు అనుమతి నిచ్చుచున్నదనిగాని గ్రహింపవలయును.

వివ:-ఇది ౭ వ సూత్రమునకు ఖండనము.

15. మూ. కామకారేణ చైకే.

ఏకే=కొందఱు శాఖలవారు, కామకారేణ చ=ఇచ్ఛాపూర్వకముగనే.

సూ. 1. "ఈ బ్రహ్మమే మనకుఁ బ్రత్యక్షమై గనిపించు లోకము. సంతానముచే ఏ పనిని సాధింతుము అని తలఁచి ప్రాచీనులగు బ్రహ్మవేత్తలు సంతానమును కర్మలను ఉపాసనలను గోరరు" అని వాజసనేయ శాఖలవారగు కొందఱు బ్రహ్మవేత్తలు ఇచ్ఛాపూర్వకముగనే కర్మసాధనములగు సంతానాదులను విడచుటవలన కర్మాచరణము మోక్షజ్ఞానమునకు సాధనము అనియును స్వతంత్రముగఁ గేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణమను శ్రుతి స్తుతికొఱకైన యర్థవాదమనియుఁ జెప్పరాదు.

వివ:- 1. "ఏతద్ధస్మ వైతత్పూర్వే విద్వాంసః ప్రజాం నకామయంతే కిం ప్రజయాకరిష్యామో యేషాం. నోఽయమాత్మాఽయం లోకః." (బృ. ४. ४ ౨౨) అని శ్రుతి.

16. మూ. ఉపమర్దం చ.

ఉపమర్దంచ=అవిద్యా ప్రపంచ నాశమును.

సూ. 1. "ఎప్పుడు ఈ పురుషునికి సర్వప్రపంచము బ్రహ్మమే యగునో అప్పుడు దేనిచేత దేనిని జూచును. దేనిచేత దేనిని వాసన చూచును" ఇత్యాది శ్రుతులచే సమస్తప్రపంచము విద్యాసామర్థ్యమువలన నశించునని తెలుపబడుటచేతఁ గర్మాచరణతోపాటుగాక స్వతంత్రమగు కేవలాత్మజ్ఞానము చేతనె మోక్షము గలుగునని తెలియవలయు.

వివ:- 1. "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్, తత్కేన కంజిఘ్రేత్" (బృ. ౨. ४. ౧४) అని శ్రుతి.

17. మూ. ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి.

ఊర్ధ్వరేతస్సుచ = ఊర్ధ్వరేతస్కులందును (కేవలాత్మజ్ఞానము గలిగినట్లు), శబ్దే హి=శ్రుతులందుఁ గనిపించుచున్నది గదా.

సూ. అగ్నిహోత్రాది కర్మాచరణ వీడి యూర్ధ్వరేతస్కులైన సంన్యాసులందును స్వతంత్రముగ నాత్మజ్ఞానము గలిగినట్లు శ్రుతులందు వినబడుచున్నదిగధా కావునఁ గేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణమె యగును.

వివ:- "త్రయోధర్మస్కంధా, యజ్ఞోఽధ్యయనం దానమితి ప్రథమ ఏవ ద్వితీయో, బ్రహ్మచా ర్యాచార్యకులవాసీ తృతీయోఽత్యంత మాత్మానమాచార్యకులేఽవసాదయన్ సర్వఏతే పుణ్యలోకాభవంతి బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి (ఛాం. ౨ ౨౩. ౧). ధర్మప్రధానములగు మూఁడు ఆశ్రమములు గలవు యజ్ఞము, వేదాధ్యయనము, దానము అనునవిగల గృహస్థాశ్రమము మొదటిది. కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుగల వానప్రస్థము రెండవది ఆచార్యకులమందుండి దేహమును నియమములచే క్షీణింపఁజేయు బ్రహ్మచార్యాశ్రమము మూఁడవది ఈ యాశ్రమముల వారందఱు పుణ్యలోకము గలవారగుదు ఇంక మిగిలినవాఁడైన పరివ్రాజకుఁడు పుణ్యలోకములకంటె విలక్షణమైన మోక్షమును బొందును. "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజం (బృ. ౪. ౪. ౨౨). సన్యాసులు ఈ యాత్మలోకమును గోరుచున్నవారై కర్మల సంన్యసించుచున్నారు. "బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్" (జా. బ్రహ్మచర్యమునుండియె సంన్యసింపవలెను. ఇత్యాది శ్రుతులందుఁ గర్మాచ వీడి సంన్యాసులగుచున్నట్లు వినఁబడుచున్నది ఇట్లు శ్రుతులలో సన్యాసాశ్రమములు గనిపించుచున్నవి. ఇట్లే గార్హస్థ్యాశ్రమము పొందిన వారుగాని గార్హస్థ్య పొందనివారుగాని దేవపితృ ఋషిఋణములను యజ్ఞసంతాన బ్రహ్మచర్యములచేఁ దీర్చిగాని తీర్పకగాని యూర్ధ్వరేతసులగుట శ్రుతి స్మృతిప్రసిద్ధము. కేవలాత్మజ్ఞానము మోక్షమునకుఁ గారణమని భావము.

## పరామర్శాధికరణము ౨

18. సూ పరామర్శం జైమినిరచోదనా చాపవదతి హి.

పరామర్శం=ఆశ్రమ పరామర్శము విధికి గాదు. అచోదనా చ=విధిప్రత్యయములు లేవుగూడ, అపవదతి హి=నిషేధించుచున్నది గూడ. జైమిని అని జైమిని

సూ. "ధర్మప్రధానములగు మూఁడు ఆశ్రమములు గలవు" ఇత శ్రుతులలో కర్మల వీడవలయును అని బోధించు విధివాక్యములు గాని విధివాక్యములను దెల్పు విధివాక్యప్రత్యయములు గాని లేకపోవుటవలన విధివాక్యములు గావు అందు ఆశ్రమముల సిద్ధవస్తుస్థితిమాత్రమె పరామర్శింపఁబడినది ఆ పరామర్శయు ఆశ్రమస్తుతికే గాని విధించుటకుఁ గాదు మఱి

1. "ఎవఁడు అగ్నిహోత్రాది కర్మల విడుచునో వాఁడు దేవతావీరులఁ జం

వాఁడగును" 2 "గురువున కిష్టమగు ధనమునిచ్చి యనుజ్ఞపొంది పిదప సంతానమగు తీగెను డ్రెంపకుండఁ బుత్రులను గనుము" 3. "పుత్రులు లేని వానికిఁ బుణ్యలోకము లేదని యందఱు మూర్ఖులునుగూడ నెఱుంగుదురు'' అని శ్రుతులు కర్మల వీడరాదని నిషేధించుచున్నవిగూడఁ గనుకఁ గర్మల వీడరాదు కానఁ గేవలాత్మజ్ఞానము వలన మోక్షము గలుగునని చెప్పరాదని జైమిని తలఁచుచున్నాఁడు.

వివ :- 1. "వీరహా వా ఏష దేవానాం యోఽగ్నిముద్వాసయతే" 2. "ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" (తై. ౧. ౧౧. ౧) 3. "నాపుత్రస్యలోకోఽస్తీతి తత్సర్వేపశవో విదుః" అని శ్రుతులు. "బ్రహ్మచర్యముకుండి సన్న్యసింపవలెను" అను శ్రుతిని అపేక్షింపక యీ విచారము చేయఁబడినదని తెలియవలయు.

19. మూ. అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః

సామ్యశ్రుతేః=సమానముగ వినఁబడుటవలన, అనుష్ఠేయం = అనుష్ఠింపఁదగినది అని, బాదరాయణః=బాదరాయణుఁడనెను.

సూ. "ధర్మప్రధానములగు మూఁడు ఆశ్రమములు గలవు" అను పై శ్రుతియందు గృహస్థాశ్రమమువలె సంన్యాసాశ్రమముగూడ సమానముగ వినఁబడుటవలన సంన్యాసాశ్రమముగూడ గృహస్థాశ్రమముతోపాటు అనుష్ఠింపఁదగినదని బాదరాయణుని మతము.

వివ:- "సన్న్యాసులు ఈ యాత్మలోకమును గోరుచున్నవారై సర్వకర్మల సన్న్యసించుచున్నారు" అను శ్రుతి "ధర్మం చర'' ధర్మము చేయుము ఇత్యాది వేదానువచనములతోపాటు కలిపిచెప్పుటవలన అదియు విధివాక్యమనియె తెలియునది. కాన ఈ శ్రుతి స్తుతిరూపమైన యనువాద శ్రుతిగాదనియు విధిశ్రుతియె యని భావము.

20. మూ. విధిర్వా ధారణవత్.

ధారణవత్=అక్కడ ఉంచుట అనుచోటవలె, విధిః వా=విధిగాని.

సూ. 1. "స్రుక్కులను యజ్ఞపాత్ర క్రింద సమిధ నుంచుచు హవిస్సును దీసికొని పోవలెను. దేవతలకొఱకు స్రుక్కు అను యజ్ఞపాత్రపైని సమిధ నుంచుచున్నాఁడు'' అను శ్రుతియందు సమిధ నుంచుచున్నాఁడు అనునది

క్రొత్తగాఁ జెప్పఁబడుటవలన దానికి 'సమిధ నుంచవలయు' నని యర్థము. ఆ
నట్లు ఈ శ్రుతియందును గార్హస్థ్యాశ్రమమును బరామర్శించుచోట విధివాక్య
మైన యర్థమును గాని చెప్పుకొనవచ్చును గాన అట సంన్యాసాశ్రమమ
గురించి యనువాద రూపముగాఁ జెప్పక విధిరూపముగఁ జెప్పఁబడెనని తెలి
వలెను.

వివ:- 1. "అధస్తాత్సమిథం ధారయన్ననుపద్రవే దుపరి హి దేవే
ధారయతి" అని శ్రుతి. "బ్రహ్మచర్యాదేవప్రవ్రజేత్". బ్రహ్మచర్య
నుండియె సన్న్యసింపవలయును. "బ్రహ్మచర్యం సమాప్య గృహీభవే, ద్గృ
భూత్వా వనీ భవే, ద్వనీ భూత్వా ప్రవ్రజేత్ యదివేతరథా బ్రహ్మచర్యా
ప్రవ్రజేద్గృహాద్వా వనాద్వా" (జాబా. ౪). యదహరేవ విరజే త్తదహ
ప్రవజేత్'' బ్రహ్మచర్యవ్రతము పూర్తిచేసి గృహస్థుఁడు కావలెను. గృహస్థుఁ
పిదప వానప్రస్థుఁడు గావలెను. వానప్రస్థుఁడై సన్న్యసింపవలయును. వే
అట్లుగానిచో బ్రహ్మచర్యము నుండియె గాని సన్న్యసింపవలెను లేక గృ
స్థాశ్రమము నుండి గాని వానప్రస్థాశ్రమము నుండి సన్న్యసింపవలయు
గృహస్థాశ్రమాద్యధికారులకు ఈ శ్రుతి సన్యాసాశ్రమమును విధించుచున్న
అథ పునరేవ వతీనా ఽవ్రతీ వా స్నాతకోఽస్నాతకోవా ఉత్సన్నాగ్ని రన
కోవా" (జాబా. ౪) మఱి గోదానాది వ్రతములు చేసిగాని చేయకగాని ఉపవ
దీక్షాస్నానము చేసిగాని చేయకగాని అగ్నిహోత్రమును విడిచిగాని అ
హోత్రము చేయకగాని సన్న్యసింపవలయును" ఇత్యాది శ్రుతులు బ్రహ్మజ్ఞ
పరిపాకము గలవారు సన్న్యసింపవచ్చునని తెలుపుచున్నవి. "శరీరం మే
చర్షణం" (నా శరీరము విచక్షణమైనది) అను శ్రుతినిబట్టి బధిరపంగ్వంధా
వికలాంగులకు సన్న్యాసము నందధికారము లేదని తెలియుచున్నది. మఱియ
"అథ పరివ్రాడ్వివర్ణ వాసాః ముండోఽపరిగ్రహః శుచిరద్రోహీ భైక్షాణో బ్రహ
భూయాయ భవతి'' (జాబా. ౫) మఱి సన్న్యాసి కాషాయవస్త్రములు ధరించి
శిఖను వీడి, ఎవని నుండి యేమియు గ్రహింపక ఏ ప్రాణిని హింసింపక భి
వృత్తిచే జీవించుచు బ్రహ్మసాక్షాత్కారము పొందును. అను శ్రుతినిబట్టియ
బ్రహ్మజ్ఞానమువల్లనె సంన్యాసము సిద్ధించునని తెలియుచున్నది. కాన శ్రుతి
లందు సంన్యాసాశ్రమములు వినఁబడుచున్నవి. ఇట్లు ఊర్ధ్వరేతస్కులకు
గే కేవలాత్మజ్ఞానము వలననె స్వతంత్రముగ మోక్షము సిద్ధించు నని భావము.

## స్తుతిమాత్రాధికరణము 8

21. మూ. స్తుతిమాత్ర ముపాదానాదితి చేన్నాఽపూర్వత్వాత్.

ఉపాదానాత్ = స్వీకరించుటవలన, ఇతిచేత్ = అర్థవాదము లన్నచో, అపూర్వత్వాత్ = క్రొత్తవగుటవలన, స్తుతిమాత్రం = స్తుతిమాత్రములు, న = కావు.

సూ. 1. "పృథివ్యాది రసములలో నెనిమిదవ దగు నుద్గీథావయవ మయిన యోంకారము అన్ని రసములలోను మిగుల సారవంతమైనది. శ్రేష్ఠమైనది పరమాత్మవంటిది" 2. "ఈ పృథివియే యిక్కు, అగ్నియే సామము", 3. "ఈ యిష్టకా చితాగ్ని ఈ భూలోకమె" 4. "ఈ యుక్థమగు శస్త్రము ఈ భూమియె" ఇత్యాదులందుఁ గర్మాంగములైన యుద్గీథాదులను స్వీకరించుట వల్ల ఉద్గీథాది స్తుతి కొఱకే గాన నర్థవాదములన్నచో. నీ యుద్గీథాద్యుపాసనలు రసతమత్వాది గుణములును ఇతర శ్రుతులవలన సిద్ధించినవి గాక క్రొత్తవగుట వల్ల నుపాసనా విధాయకములె గాని స్తుతిపరములుగావు.

వివః- 1. "స ఏష రసానాం రసతమః పరమః పరార్ధ్యోఽష్టమో యదుద్గీథః" (ఛాం. 1. 1. 3) 2. "ఇయమేవర్గగ్నిస్సామ" (ఛాం, 1. 6. 1) 3. "అయం వావలోక ఏషోఽగ్నిశ్చితః" 4. "తదిద మేవోక్థమియమేవ పృథివీ".

22. మూ. భావశబ్దాచ్చ.

భావశబ్దాత్ చ = విధి శబ్దమువలనను.

సూ. 1. "ఉద్గీథావయవమైన యోంకారము నుపాసింపవలయు" 2. "సామము నుపాసింపవలయు" 3. "నేను ఉక్థమగుదునని యుపాసింపవలెను" ఇత్యాది శ్రుతులందలి విధివాక్యములనుబట్టియు, 4. "ఉపాసకుఁడు యజమానుని గోరికలు పొందించువాఁడగును", 5. "ఇట్లు సామగానము చేయు వాని కొఱకు గమనాగమనములతోఁ గూడిన లోకములు భోగ్యములై యగుచున్నవి" అని ప్రతి ప్రకరణమున ఫలములు వినఁబడుటవలనను ఉద్గీథాది శ్రుతులు ఉపాసనా విధాయకములె గాని స్తుతిపరములు గావు.

వివః- 1. "ఉద్గీథ ముపాసీత" (ఛాం. 1. 1. 1) 2. "సామోపాసీత" (ఛాం. 2. 2. 1) 3. "అహముక్థ మస్మీతి విద్యాత్" 4. "ఆపయితా

హవై కామానాం భవతి" (ఛా. ౧ ౧. ౭) 5 "కల్పంతే హా. లోకా ఊర్ధ్వా శ్చావృత్తాశ్)" (ఛా. ౨. ౨. ౩) అని శ్రుతులు.

## పారిప్లవాధికరణము

23. సూ. పారిప్లవార్థా ఇతిచేన్న విశేషితత్వాత్.

పారిప్లవార్థాః=కథాపరములు, ఇతిచేత్=అన్నచో. విశేషి త్వాత్= విశేషించి చెప్పుటవలన, న=అట్లనరాదు.

సూ. 1. "అనేక కథలను జెప్పెదను" అని ప్రస్తావించి. 2. "వైవస్వతమను వను రాజు గలఁడు" 3. "వైవస్వతుఁడగు యముఁ రాజు గలఁడు" 4. "ఆదిత్యుఁడైన వరుణుఁడు గలఁడు" అని ప్రత్యేకముగా కథలను విశేషించి చెప్పుటవలన, 5. "మఱి యాజ్ఞవల్క్యునికి మైత్రేయి కాత్యా ని అని భార్యలు ఉండిరి" 6. "దివోదాసుని కుమారుఁ డగు ప్రతర్దనుఁ ంద్రుని ప్రియమగు గృహమునకుఁ బోయెను" 7. "పౌత్రాయణుఁ డగు కేవశ్రుతి శ్రద్ధగా నిచ్చువాఁడై బహుదాతయై, అన్నదాతయునై యుండెను" ్యదులు ఉపాసనా స్తుతిపరములేగాని కథాపరములు మాత్రము గావు.

వివః-1. "పారిప్లవమా చక్షీత" 2. "మనుర్వైవస్వతో రాజా" 3. "యమో వైవస్వతః" 4. "వరుణ ఆదిత్యః" 5. "అథహ య వల్క్య స్యద్వేభార్యే బభూవతు ర్మైత్రేయీచ కాత్యాయనీ చ" (బృ. ౪. ౧) 6. "ప్రతర్దనో హ దైవోదాసి రింద్రస్య ప్రియంధామోపజగామ" (కౌ . ౭.౧) 7. "జానశ్రుతిర్హ పౌత్రాయణ శ్శ్రద్ధాదేయో బహుదాతా, బహుం ్యఆస" (ఛాం. ౪. ౧. ౧) అని శ్రుతులు.

24. సూ. తథా చైకవాక్యతోపబంధాత్.

తథా చ=అట్లును, ఏకవాక్యతోపబంధాత్=ఉపాసనలతో నేక వాక్యత నిబంధింపఁబడుటవలన.

సూ. అట్లును వానికి సన్నిహితములగు నుపాసనలతో నేక వాక్యత నిబంధింపఁబడుటవలన 1. "మఱి యాజ్ఞవల్క్యునికి మైత్రేయి కాత్యాయని అను భార్యలిద్దఱుండిరి" ఇత్యాదులుపాసనా స్తుతిపరములే గాని కథాపరములు గావు.

వివ:-"ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృ. ౪. ౫. ౬) ఓ మైత్రేయీ! ఈ యాత్మయే చూడఁదగినది "అను నుపాసనతో" మఱి యాజ్ఞవల్క్యునికి మైత్రేయి కాత్యాయని యను భార్య లిద్దఱుండిరి" అను దాని కైకవాక్యత గలదు. ప్రతర్దనునికి సంబంధించిన శ్రుతి "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా" ప్రజ్ఞాత్మ యగు ప్రాణుఁడనై యుంటిని. అను దానితో నేకవాక్యత గలదు. "వాయుర్వావ సంసర్గః" (ఛా. ౪. ౩. ౧) "వాయువు సంసర్గము" అను శ్రుతితో జానశ్రుతికి సంబంధించిన శ్రుతి కేకవాక్యత గలదు. వీనినిబట్టి యివి యుపాసనా విధి పరములని భావము.

## అగ్నీంధనాద్యధికరణము ౯

౨౫. సూ. అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా.

అత ఏవచ = కనుకనె, అగ్నీంధనాద్యనపేక్షా=అగ్నీంధకాదుల యపేక్ష లేదు.

సూ. కేవలాత్మజ్ఞానము పురుషార్థమునకు హేతువగుటవలననె అగ్ని యందు సమిధలు వ్రేల్చుట మొదలగు నాశ్రమ కర్మలు మోక్ష సిద్ధియందు అపేక్షింపఁదగినవి గావు.

## సర్వాపేక్షాధికరణము ౧౦

౨౬. సూ. సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్.

యజ్ఞాదిశ్రుతేః = యజ్ఞాది శ్రుతివలన, అశ్వవత్ = అశ్వమునకు వలె, సర్వాపేక్షా=సర్వముల యపేక్ష యుండును.

సూ. ౧. "బ్రాహ్మణులు నిత్యము వేదము చదువుటచేతను యజ్ఞము చేతను, దానముచేతను, హితము మితమునగు నాహారము దినుట రూపమైన తపస్సుచేతను, ఈ పరమాత్మను దెలియఁగోరుచున్నారు", ౨. "మఱి యజ్ఞమని దేనినందురో యది బ్రహ్మచర్యమే", ౩. "వేదములన్నియు ఏ బ్రహ్మమును జెప్పుచున్నవో, తపస్సులన్నియు దేనిని జెప్పుచున్నవో దేనిని గోరుచున్నవారై బ్రహ్మచర్య వ్రతమును జేయుచున్నారో ఆ బ్రహ్మపదమును నీకు సంగ్రహముగాఁ జెప్పుచున్నాను. ఇది ఓం అనునదియె" ఇత్యాది శ్రుతులు ఆశ్రమకర్మలను ఆత్మజ్ఞానమునకు సాధనములుగాఁ జెప్పుటవలన, అర్థాతనుబట్టి

గజ్జమును నాగలిచే దున్నుట కుపయోగింపక రథాదులను లాగుట కపేక్షించు చున్నట్లు ఆశ్రమకర్మన్నియు మోక్షఫల సిద్ధియందుఁ గాక ఆత్మ జ్ఞానోత్పత్తి యందు సాధన[illegible]పేక్షింపఁబడును.

[illegible] వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" (బృ. [illegible]) 2. "అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్యమేవతత్" (ఛాం. ౮. ౫. ౧) 3. "సర్వే వేదాయత్పదమామనంతి, తపాంసి సర్వాణి చ యద్వదంతి, యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి, తత్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యోమిత్యేతత్" (కఠ. ౨. ౧౫) ఇత్యాదులు శ్రుతులు. "కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమాగతిః కషాయే కర్మభిః పక్వేతతోజ్ఞానం ప్రవర్తతే" యజ్ఞాదికర్మలు కల్మషనాశ హేతువులు. జ్ఞానమో మోక్షమునకు సాధనము. కర్మలచే పాపము జీర్ణమైపోఁగా పిదప జ్ఞానమదయించుచున్నది" అను స్మృతియు ఆశ్రమకర్మలు జ్ఞానహేతువులని యీ భావమునె సూచించుచున్నదని భావము. "ఈ పరమాత్మను దెలియఁగోరు చున్నారు" ఇత్యాదులు పూర్వోక్తములు గావు గాన వానిని విధివాక్యములుగనె గ్రహింపవలెను. ఇవి స్తుతిపరములు గావని భావము.

27. సూ. శమదమాద్యుపేతః స్యాత్తథాపితు తద్విధే స్తదంగతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్.

తథాపి = అయిన, తదంగయా = ఆత్మజ్ఞానమునకు అంగములుగా, తద్విధేః = ఆశ్రమములను విధించుటవలన నిష్కామ యజ్ఞాదులు, తేషాం = ఆశ్రమాదులు, అవశ్యానుష్ఠేయత్వాత్ = తప్పక యనుష్ఠింపవలసినవి గాన, శమదమాద్యుపేతః స్యాత్ = శమాదులతోఁ గూడినవాఁడై యుండవలెను.

సూ. 1. "ఆత్మఁ దెలిసిన వాఁడు పాపముచే నంటఁబడఁడు గాన ఆత్మగర్మలచే నంటఁబడదని తెలిసిన వాఁడు బహిరింద్రియములను అంతరింద్రియములను నిగ్రహించినవాఁడై ధనాద్యేషణలను వీడి, సుఖదుఃఖాది ద్వంద్వముల సహించి ధ్యానమున నుండి ఆత్మయందే ఆత్మను జూచును" అని శ్రుతి ఆత్మజ్ఞానమునకు శమదమాదులను సాధనములుగ విధించుటవలన సాధకుఁడు యజ్ఞాదులను అపేక్షింపకపోయినను శమదమాదులు తప్పక యనుష్ఠింపఁదగిన వగుట వలన శమదమాదులతోఁ గూడిన వాఁడై యుండవలయును.

వివ:- చూడవలెను అని చెప్పకపోయినను "ఆత్మను జూచును" అనునది పూర్వోక్తము గాదు కాన ఇదియు విధివాక్యమని తెలియవలయును. మాధ్యందిన పాఠమున "పశ్యేత్" చూడవలెను అను పాఠమునగు. "తస్మా దేవం విచ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాత్మన్యే వాత్మానం పశ్యతి" (బృ. ౪. ౪. ౨౩) అని శ్రుతి. ఇందు యజ్ఞాదులు ఆత్మజ్ఞానమునకు బహిరంగ సాధనములనియు, శమదమాదులు అంతరంగ సాధనములనియు దెలియునది.

## సర్వాన్నానుమత్యధికరణము

౨౮. సూ. సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్.

సర్వాన్నానుమతిశ్చ = భక్ష్యాభక్ష్యరూప సర్వాన్నములను దినుట యను అనుజ్ఞయు, ప్రాణాత్యయే = ప్రాణాపాయసమయమందె, తద్దర్శనాత్ = అట్లు శ్రుతులలోఁ గనిపించుటవలన.

సూ. ప్రాణాపాయ సమయమందె యుషస్తి యను బ్రాహ్మణుఁడు ఎంగిలివి, పర్యుషితములు మొదలైన యభక్ష్య పదార్థములను దిన్నట్లు శ్రుతియందు గనిపించుటవలన ప్రాణాపాయమందె యన్నియుఁ దినవచ్చును. కాన "ప్రాణమే నేను అని ధ్యానించు వానికి భక్షింపరానిది అన్నదేది లేదు" ఇత్యాది శ్రుతులు స్తుతిరూపము సిద్ధార్థ కథనరూపములగు నర్థవాదములే కాన విధాయకములు గావు, గాన భక్ష్యాభక్ష్య విధాయకశాస్త్రము వ్యర్థము గాదు.

వివ:- 1. 1. "నహవా ఏవం విది కించ నానన్నం భవతి" (ఛాం. ౫. ౨. ౧) అని శ్రుతి. కురుదేశమందు మిడుతలు పాడుచేయఁగాఁ గఱవు పట్టినది. అప్పుడు ఉషస్తి యను బ్రాహ్మణుఁడు భార్యతోఁ గూడ దేశాంతరము పోవుచు మావటివాఁడు దినుచున్న యెంగిలి గుగ్గిళ్లను యాచించి పుచ్చుకొని భక్షించి కొన్ని దాచియుంచెను. ఆ మావటీడు మంచినీరు గూడఁ బుచ్చుకొమ్మని యీయఁబోఁగా అవి యెంగిలి నీళ్లని నిషేధించెను. అప్పుడు మావటీఁడు "గుగ్గిళ్లు ఎంగిలివి కావా? అవి యేల తింటివి" అనఁగా "ఈ గుగ్గిళ్లు తినకపోయినచో నేను బ్రతికియుండను. "నవా అజీవిష్యమిమానఖాదన్, కామో మ ఉదపానం" (ఛాం. ౧.౧౦ ౪) నీరు ఎక్కడనైన దొరకును" అని చెప్పెను. ఇది ఛాందోగ్యములో (౧. ౧౦. ౧) నున్న కథ.-

వివ:-"ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృ. ౪. ౫. ౬) ఓ మైత్రేయీ! ఈ యాత్మయే చూడఁదగినది "అను నపాసనతో" మఱి యాజ్ఞవల్క్యునికి మైత్రేయి కాత్యాయని యను భార్య లిద్దఱుండిరి" అను దాని కైకవాక్యత గలదు. ప్రతర్దనునికి సంబంధించిన శ్రుతి "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా" ప్రజ్ఞాత్మ యగు ప్రాణుఁడనై యుంటిని. అను దానితో నేకవాక్యత గలదు. "వాయుర్వావ సంసర్గః" (ఛా. ౪. ౩. ౧) "వాయువు సంసర్గము" అను శ్రుతితో జానశ్రుతికి సంబంధించిన శ్రుతి కేకవాక్యత గలదు. వీనినిబట్టి యవి యుపాసనా విధి పరములని భావము.

## అగ్నీంధనాద్యధికరణము ౭

౨౫. సూ. అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా.

అత ఏవచ = కనుకనె, అగ్నీంధనాద్యనపేక్షా = అగ్నీంధకాదుల యపేక్ష లేదు.

సూ. కే: ఆత్మజ్ఞానము పురుషార్థమునకు హేతువగుటవలననె అగ్ని యందు సమిధలు వ్రేల్చుట మొదలగు నాశ్రమ కర్మలు మోక్ష సిద్ధియందు అపేక్షింపఁదగినవి గావు.

## సర్వాపేక్షాధికరణము ౮

౨౬. సూ. సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్.

యజ్ఞాదిశ్రుతేః = యజ్ఞాది శ్రుతివలన, అశ్వవత్ = అశ్వమునకు వలె, సర్వాపేక్షా = సర్వముల యపేక్ష యుండును.

సూ. 1. "బ్రాహ్మణులు నిత్యము వేదము చదువుటచేతను యజ్ఞము చేతను, దానముచేతను, హితము మితమునగు నాహారము దినుట రూపమైన తపస్సుచేతను, ఈ పరమాత్మను దెలియఁగోరుచున్నారు", 2. "మఱి యజ్ఞమని దేనినందురో యది బ్రహ్మచర్యమే", 3. "వేదములన్నియు ఏ బ్రహ్మమును జెప్పుచున్నవో, తపస్సులన్నియు దేనిని జెప్పుచున్నవో దేనిని గోరుచున్నవారై బ్రహ్మచర్య వ్రతమును జేయుచున్నారో ఆ బ్రహ్మపదమును నీకు సంగ్రహముగాఁ జెప్పుచున్నాను. ఇది ఓం అనునదియే" ఇత్యాది శ్రుతులు ఆశ్రమకర్మలను ఆత్మజ్ఞానమునకు సాధనములుగాఁ జెప్పుటవలనను, అర్థతను...

విహితత్వాత్ చ = విధి పబడుటవలనను, ఆశ్రమ కర్మాపి = ఆశ్రమ కర్మయును.

సూ. 1. "జీవించినంతకాలము అగ్నిహోత్రమను హోమము చేయవలెను" అని మోక్షమందిచ్చ గలవారికే గాక మోక్షమందిచ్చ లేనివారికిఁ గూడ సామాన్యముగ విధింపఁబడుటవల్ల బ్రహ్మచర్యాద్యాశ్రమ మాత్రమందున్న వారికి ఆశ్రమ ధర్మ విహితములగు కర్మలు అనుష్ఠింపఁదగినవి.

వివ:- 1. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అని శ్రుతి.

33. సూ సహకారిత్వే న.

సహకారిత్వే న=సహకారులుగను.

సూ. యజ్ఞాది కర్మలు విహితములు గాన అవి చిత్తమునకు శుద్ధి కలిగించుట మూలమున మోక్షమునకు సహకారులుగను ఉపయోగపడును.

34. సర్వథాపి త ఏవోభయ లింగాత్.

ఉభయ లింగాత్ = శ్రుతి స్మృతి లింగములఁబట్టి, త ఏవ=ఆ కర్మలె సర్వథాపి=అన్ని విధముల.

సూ. 1. "వేదము చదువుటచేత బ్రాహ్మణులు ఈ యాత్మను దెలిసికొనఁ గోరుచున్నారు" అని శ్రుతినిబట్టియు, ఎవఁడు కర్మల యొక్క ఫలమును గోరక చేయఁదగిన కర్మలు చేయునో వాఁడె సంన్యాసి, యోగియునగు" అని స్మృతినిబట్టియు గోరికతో నాశ్రమ విహితములుగను, గోరికలేక నిత్యముగ మోక్షమునకు సాధనములుగను అన్ని విధముల ఆ యాగాది కర్మలె యనుష్ఠింపఁదగినవి.

వివ:- 1. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి" (బృ. ౪. ౪. ౨౨) అని శ్రుతి. 2. "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః" (గీత ౬. ౧) అని స్మృతి.

35. సూ. అనభిభవం చ దర్శయతి.

అనభిభవం చ=రాగాదులచేఁ దిరస్కరింపఁబడకుండుటయును, దర్శయతి= శ్రుతి చూపుచున్నది.

సూ. 1. "బ్రహ్మ చర్యముచే పొందఁబడిన పరమాత్మ ఆ బ్ర చర్యమును సాధించు వానినుండి నశింపదు" అను శ్రుతి బ్రహ్మచర్యాది సా సంపన్నుఁడు రాగద్వేషాది క్లేశములచే తిరస్కరింపబడఁడని చూపుచున్నది। యాగాది కర్మలు బ్రహ్మచర్యాద్యాశ్రమ కర్మలుగను మోక్షసాధనములు గూడ నుండును.

వివ:- 1. "ఏష హ్యాత్మా న నశ్యతియం బ్రహ్మచర్యేణాను విందః (ఛాం. ౮. ౫. ౩) అని శ్రుతి.

అంతరాధికరణము ౯

36. సూ. అంతరాచాపి తు తద్దృష్టేః

తద్దృష్టేః=అది కనిపించుటవలన, అంతరా చ అపితు=అనాశ్రమియై యున్నను.

సూ. ఏ యాశ్రమ ధర్మముల నాచరింపని రైక్వుఁడు, వాచక్న మొదలైనవారు బ్రహ్మవేత్తలుగా నున్నట్లు శ్రుతియందుఁ గనిపించుటవ (విధురునికి) భార్య చనిపోయిన వానికిని ఏ యాశ్రమమును స్వీకరింపని వారికి ద్రవ్యాది సంపద లేనివారికిని బధిరపంగ్వంధాదులకును బ్రహ్మవిద్య యందధి కారము గలదు.

37. సూ. అపి చ స్మర్యతే.

అపి చ=మఱియు, స్మర్యతే=స్మృతులందుఁ జెప్పఁబడుచున్నది.

సూ. సంవర్తుఁడు మొదలైన వారు దిగంబరులై యాశ్రమ కర్మలా రింపకున్నను వారు మహాయోగులుగా నుండిరని ఇతిహాసములందుఁ జెప్పఁబడు చున్నది.

38. సూ. విశేషానుగ్రహశ్చ.

విశేషానుగ్రహశ్చ=విశేషములచే విద్యలయనుగ్రహమును.

సూ. మృతపత్నీకుఁడు, ఆశ్రమ శూన్యుఁడు మొదలగు వారికి మనుష మాత్రులు చేయఁదగిన జపములు, ఉపవాసములు దేవతారాధనములు మొదలగు వానిచేతను జన్మాంతరకృతములచే జేయఁబడిన యాశ్రమ కర్మలచేతను మోక్షాను గ్రహము కలుగును.

వివ :- "జప్యేనైవతు సంసిధ్యేద్బ్రాహ్మణోనాత్రసంశయః, కుర్యాదన్యన్నవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" బ్రాహ్మణుడు యాగాదికర్మలు చేసినను చేయకపోయినను ప్రణవాది జపముచేత మోక్షసిద్ధిని పొందును ఇందు సందేహము లేదు. అట్టివాఁడు సర్వప్రాణులకు మిత్రుఁడైన బ్రాహ్మణుఁ డనఁబడును. "అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిం" (గీత. ౬. ౪౫) అనేక జన్మములందుఁ జేయఁబడిన కర్మలచే సిద్ధినిబొందిన వాఁడై మోక్షమును బొందును. ఇత్యాది స్మృతులు పై విషయమును ధ్రువపఱచుచున్నవని తెలియవలయును.

39. మూ. అతస్త్వితరజ్జ్యాయో లింగాచ్చ.

అతః=కనుక, లింగాత్ చ = శ్రుత్యాది లింగమునుబట్టి, ఇతరత్ = ఏ ఆశ్రమమును స్వీకరింపకుండుటకంటె ఏదోయొక ఆశ్రమ స్వీకారము, జ్యాయః = శ్రేష్ఠము.

సూ. 1. "పుణ్య కర్మలుచేసిన వాఁడును తేజోరూపమైన యాత్మను గన్నవాఁడై బ్రహ్మను దెలిసినవాఁడై ఆ జ్ఞానముచేతనె బ్రహ్మమును బొందును" అని శ్రుతినిబట్టియు, 1. ద్విజుఁడు ఏ యాశ్రమమును స్వీకరింపక యొక్కరోజైనను ఉండరాదు." అని స్మృతినిబట్టియు ఏ యాశ్రమమును స్వీకరింపకయుండుటకంటె ఏదేని యొక్క యాశ్రమమును గ్రహించుట యుత్తమమైన మోక్షసాధనమగును.

వివ :- 1. "తేనైతి బ్రహ్మ విత్పుణ్యకృత్తైజసశ్చ" (బృ. ౪. ౪. ౯) అని శ్రుతి. "అనాశ్రమీనతిష్ఠేత్ దినమేక మపిద్విజః" అని స్మృతి.

## తద్భూతాధికరణము ౧౦

40. మూ. తద్భూతస్య నా తద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః.

నియమ = నియములకు, అతద్రూప = ప్రచ్యుతిరూపము యొక్క, అభావేభ్యః = లేకపోవుటలవల్ల, తద్భూతస్య=ఊర్ధ్వరేతస్స్థితి పొందిన వానికి, అతద్భావః=మోక్షస్థితినుండి జారకపోవుట, జైమినేరపి=జైమినికిని సమ్మతమె.

సూ. 1. "ఆచార్యుని యింటఁ దనశరీరమును మిగులఁ గృశింపఁ జేయు బ్రహ్మచర్యాశ్రమము మూఁడవది". 2. "సంన్యాసియై అరణ్యమును బొందవలయునని శాస్త్రము" 3. "ఆ వానప్రస్థాశ్రమము నుండి తిరిగి మరలి రారాదని వేద రహస్యము" 4. "ఆచార్యుని యనుజ్ఞ బొంది యీ నాలుగు ఆశ్రమములలోను ఏదో యొక యాశ్రమమును శరీరము వదలు వఱకు యథావిధిగా ఆశ్రయింపవలెను'' అను నియమములు మోక్ష చ్యుతి లేక పోవుటను దెలుపుటవల్లను, 5. "బ్రహ్మచర్యము పూర్తిచేసి గృహస్థుఁడు గావలయు, గృహస్థాశ్రమము నుండి వానప్రస్థుఁడై ప్రవ్రజింపవలయును లేనిచో బ్రహ్మచర్యమునుండియే సన్యసింపవలయును". అను ప్రమాణములు క్రిందినుండి పైకి ఆరోహణమునే గాని పైనుండి క్రిందికి అవరోహణమును దెలుపక పోవుటవల్లను, 6. "లెస్సగా ననుష్ఠింపఁబడిన ఏ ధర్మముకంటె గుణహీనమైనను స్వధర్మమె శ్రేష్ఠము" అని శాస్త్రము దెలుపుటవల్లను, ఉత్తమమైన యూర్ధ్వరేతస్స్థితిని బొందిన వారికి ఆ స్థితినుండి జాఱుట గలుగదనుట జైమినికిని సమ్మతమె.

వివ:- 1. "అత్యంత మాత్మానమాచార్యకులేఽవసాదయం స్తృతీయః" (ఛాం: ౨. ౨౩. ౧), 2. "అరణ్యమియాదితి పదం", 3. "తతోనపునరేయాదిత్యుపనిషత్", 4. "ఆచార్యేణాభ్యనుజ్ఞాత శ్చతుర్ణామేక మాశ్రమం, అవిమోక్షాచ్ఛరీరస్య సోనుతిష్ఠేద్యథా విధి", 5. "బ్రహ్మచర్యం సమాప్యగృహీ భవేత్ (జా. ౪) గృహాద్వనీ భూత్వాప్రవ్రజేత్ యదివేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" (జా. ౪), 6. "స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః" (గీత. ౩. ౩౫) అని శ్రుతి స్మృతులు.

## ఆధికారికాధికరణము ౧౧

41. సూ. నచాధికారిక మపి పతనానుమానాత్తదయోగాత్.

పతనానుమానాత్=పతనము గలుగునని స్మరించుటవలన, తదయోగాత్= ప్రాయశ్చిత్తము సందర్భించదుగాన, ఆధికారికమపి=ప్రాయశ్చిత్తాధికారమందలి ప్రాయశ్చిత్తముకూడ, నచ=లేదు.

సూ. 1. "జీవించినంత కాలము బ్రహ్మచర్యము నెరపు నైష్ఠికధర్మమున్ను అవలంబించినవాఁడు తన ధర్మము నుండి పడిపోయునచో ఆత్మఘాత్య

చేసికొన్న యాతనిని పరిశుద్ధి చేయు ప్రాయశ్చిత్తమేమియుఁ గనిపింపదు" అను నత్రిస్మృతినిబట్టి తలతెగిన వానికి నింకఁజికిత్స లేనట్లు ఆ పతితునకుఁ బ్రాయశ్చిత్తమెద్దియు లేకపోవుటవలన బ్రహ్మచారియై పిదప గృహస్థాశ్రమము స్వీకరించు నుపకుర్వాణ బ్రహ్మచారికివలె నైష్ఠిక బ్రహ్మచారికిఁ బ్రాయశ్చిత్తాధికార మందుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమును లేదు.

పిప :- 1. "ఆ రూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః, ప్రాయశ్చిత్తం నపశ్యామియేన శుద్ధ్యేత్స ఆత్మహా" అని యత్రిస్మృతి. ఇది పూర్వపక్ష సూత్రము. జీవించినంతకాలము బ్రహ్మచర్యము చేయువాఁడు నైష్ఠిక బ్రహ్మచారి. దీక్ష ముగిసిన పిదప గృహస్థాశ్రమము పొందువాఁడు ఉపకుర్వాణ బ్రహ్మచారి.

42. మూ. ఉపపూర్వమపిత్వేకే భావమశనవత్తదుక్తం.

ఉపపూర్వ మపితు = ఉపపాతకపు ప్రాయశ్చిత్తమైతే, ఏకే కొందఱు, భావం=ఉండుటను, జెప్పుదురు. అశనవత్=మధుమాంసాది భక్షణమువలె, తత్= అది, ఉక్తం=పూర్వమీమాంస యందుఁ జెప్పబడినదె.

సూ. బ్రహ్మచారి యగుటలో భేదము లేకపోవుటవలనను, వ్రతము నుండి పడినవాఁడగుటలోను భేదము లేకపోవుటవలనను, మధు మాంసాది భక్షణమునఁ బ్రాయశ్చిత్తమున్నట్లే నైష్ఠికునకును ఉపపాతక ప్రాయశ్చిత్తముగలదని కొందఱు తలఁచుచున్నారు. ఇట్లు పూర్వమీమాంస యందును జెప్పఁబడినది.

విప :- అత్రిస్మృతిలో బ్రహ్మచర్య రక్షణముకై బహుయత్నము చేయ వలయునని చెప్పుటకై ప్రాయశ్చిత్తములేదని చెప్పఁబడినదని తెలియవలయును. "వానప్రస్థో దీక్షాభేదే కృచ్ఛ్రం ద్వాదశరాత్రం చరిత్వామహాకక్షం వర్ధయేత్, భిక్షుర్వానప్రస్థవత్ సోమవృద్ధి వర్జం స్వశాస్త్ర సంస్కారశ్చ" ప్రమాదము వ్రతలోపము కలుగు వానప్రస్థుఁడు మూఁడు పగళ్లు ఒకసారి చొప్పున మూఁడు దినములును, మూఁడు రాత్రులు ఒకసారి చొప్పున మూఁడు దినములును, మూఁడు దినములు యాచింపక లభించిన దానిని దినుట యను పండ్రెండ్రు రాత్రులు ఉపవసించుట యను కృచ్ఛ్రవ్రతమును జేసి తృణకాష్ఠ సమృద్ధమగు దేశమును నీరు పోసి పెంచవలయును, సంన్యాసియును వ్రతభ్రష్టుఁడైనచో సోమలతను బెంచుట మాని వానప్రస్థునివలెఁ బై ప్రాయశ్చిత్తమును జేయవల యును మఱియుఁ దనకు విహితమగు శాస్త్రమందుఁ జెప్పఁబడిన ప్రాణాయా

మాదులును జేయవలయును" అని చెప్పఁబడుటవలన వానప్రస్థ సన్న్యాసుల కును ప్రాయశ్చిత్తముగలదని తెలియవలయును. ఇది సిద్ధాంత సూత్రము.

## బహిస్తూభయథాధికరణము, స్మృత్యాచారాధికరణము ౧౨

43. సూ. బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ.

ఉభయథాపి = ఉపపాతక మహాపాతకములు రెండింటియందును, స్మృతేః=స్మృతినిబట్టియు, ఆచారాత్ చ=ఆచారమువలనను, బహిః తు=బహిష్క రింపఁదగిన వారే.

సూ. ఊర్ధ్వరేతసులును వ్రతభ్రష్టులైనచో స్మృతులనుబట్టియు శిష్టాచార మునుబట్టియు వారి వ్రతభ్రంశము అది యుపపాతకమైనను మహాపాతకమైనను వారు బహిష్కరింపఁదగినవారే యగుదురు.

## స్వామ్యధికరణము ౧౩

44. సూ. స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః.

ఫలశ్రుతేః=ఫలశ్రుతినిబట్టి, స్వామినః=యజమానునికే ఫలమగును, ఇతి= అని, ఆత్రేయః=ఆత్రేయుఁడు.

సూ. 1. "హింకారము, ప్రస్తావము, ఉద్గీథము, ప్రతిహారము, నిధనము అను నైదు విధములైన సామములను ఇట్లు దెలిసి వర్షదృష్టితో నుపాసించువానికి గోరినప్పుడు వర్షసమృద్ధి యగు" ఇత్యాది శ్రుతులనుబట్టి వర్షాది ఫలములు యజమానునికే చెప్పఁబడుటవలన యాగాంగోపాసనలు యజమాను నివేగాని ఋత్విజులవి గావని యాత్రేయుఁ డనెను.

వివ :- 1. "వర్షతిహాస్మై వర్షయతి హయఏతదేవం విద్వాన్ వృష్టౌ పంచ విధం సామోపాస్తే" (ఛాం ౨. ౩. ౨) అని శ్రుతి.

45. సూ. ఆర్త్విజ్యమిత్యౌడులోమి స్తస్మై హి పరిక్రియతే.

తస్మై=ఆ ప్రయోగము కొఱకు, పరిక్రియతే=కొనఁబడుచున్నాఁడుగాన, ఆర్త్విజ్యం=ఋత్విక్కర్మయే, ఇతి=అని, ఔడులోమిః=ఔడులోమి యనెను.

సూ. సాంగయజ్ఞ ప్రయోగము కొఱకు ఋత్విజుఁడు యజమానిచేఁ గొనఁబడుచున్నాఁడు గాన క్రతువునఁ జేయఁబడెడి యంగోపాసనములు ఋత్వి క్కర్మలేగాని యజమాన కర్మలుగావని యౌడులోమి యనెను.

46. మూ. శ్రుతేశ్చ.

శ్రుతేః చ = శ్రుతినిబట్టియు.

సూ. 1. "యజ్ఞమున ఋత్విజులు దేనింగోరుచున్నారో దాని నంతను యజమానుని కొఱకే కోరుచున్నారు అని చెప్పెను" 2. "యజమానుఁడు ఫల భోక్తగాన ఇట్లు ఉపాసనలు తెలిసిన యుద్గీత 'నీకు ఏ కోర్కెను గానము చేయుదును' అని యజమానుని నడగవలయును" ఇత్యాది శ్రుతులనుబట్టి ఉపాస నల ఫలము యజమానునిఁ బొందినను కర్మ మాత్రము ఋత్విజులదే గాని యజమానునిది గాదు.

వివ :- 1. "యాం వై కాం చ యజ్ఞఋత్విజ ఆశిషమాశాసతే ఇతి యజమానాయైవ తామాశాసతే ఇతి హోవాచ" 2. "తస్మాదు హైవంవి దుద్గీతా బ్రూయాత్కంతేకామ మాగాయాని" (ఛాం. ౧. ౨౦౮. ౯) అని శ్రుతులు.

## సహకార్యంతర విధ్యధికరణము ౧౪

47. మూ. సహకార్యంతర విధిఃపక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్

తద్వతః=బ్రహ్మ విద్యాజ్ఞానముగల వానికి, విధ్యాదివత్ విధ్యాదులవలె, పక్షేణ = పక్షమున, తృతీయం=మూడవ మౌనము, సహకార్యంతర విధిః = మఱియొక సహకారి యగును.

సూ. 1. "కనుక బ్రాహ్మణుఁడు పాండిత్యమును నిశ్చయముగా సంపాదించుకొని బాల్యముతో = (బాలురకు సహజమగు చిత్తశుద్ధితో) నుండ వలెను, శాస్త్రజ్ఞానమును మౌనమును (మననమును) సంపాదించి మునియై (మననము చేయు వాఁడై) యుండవలెను. శ్రవణాదులను మౌనమును (ధ్యానమును) పొంది పిదప బ్రహ్మమును బొందిన వాఁడగును" అను శ్రుతిలో చాల సహజమైన చిత్తశుద్ధియు పాండిత్యమును లభింపని పక్షమునఁ జిత్తశుద్ధి పాండిత్యములలో మూఁడవదగు మౌనము గూడ బ్రహ్మ విద్యాజ్ఞానముగల సంన్యాసికి చాల సహజ చిత్తశుద్ధి పాండిత్యములవలె సహకారి యగునని విధింపఁబడుచున్నది. 1. "స్వర్గముఁ గోరువాఁడు దర్శపూర్ణమాసములచే యజ్ఞము

చేయవలయు" మొదలగు వానియందు అగ్న్యాధానము మొదలగునవి సహకారులుగ విధింపబడినట్లు క్రొత్తగాఁ జెప్పుటవలన సహకారిగ మౌనము విధింపఁబడుచున్నదేగాని యనువాదము గాదు.

వివ :- 1. "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్యబాల్యేన తిష్ఠాసేత్ బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ మునిరమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" (బృ. ౩. ౫. ౧) అని శ్రుతి. మననము చేయువాఁడు ముని యనువ్యుత్పత్తినిబట్టి ముని యనఁగా మననము చేయువాఁడు. ముని గుణము మౌనము. "మునీనా మప్యహం వ్యాసః'' మునులలోఁ గూడ నేను వ్యాసుఁడను" అను ప్రయోగమునుబట్టి ముని యనఁగా మననము చేయు జ్ఞానాతిశయము గలవాఁడని యర్థము గాన సామాన్య జ్ఞానవాచకమగు పాండిత్య పదముచే మనన రూప విశేషార్థకమగు మౌనము గతార్థము గాదు. "వాల్మీకి ర్మునిపుంగవః" (వాల్మీకి ముని శ్రేష్ఠుఁడు) అను ప్రయోగమునుబట్టి వాల్మీకి వానప్రస్థుఁడు గాని సంన్యాసిగాఁడు గాన ముని యనఁగా సంన్యాసియను నర్థము చెప్పరాదు. ఈ శ్రుతిలో చిత్తశుద్ధి పాండిత్యములకంటె మూఁడవదగు మౌనము విధింపఁబడుచున్నదని భావము."

48. సూ. కృత్స్నభావాత్తు గృహిణోప సంహారః.

కృత్స్నభావాత్ తు = సమస్తకర్మలు గృహస్థునికె చెప్పుటవలన, గృహిణా=గృహస్థునితో, ఉపసంహారః=ఉపసంహారము చేయఁబడెను.

సూ. మిగుల కష్టసాధ్యములగు యజ్ఞాదులును ఇతరాశ్రమ ధర్మములగు నహింసా జపేంద్రియ నిగ్రహాదులును గృహస్థునికి విహితములగుటవలన "బ్రహ్మచర్య సమాప్తికిఁ బిదప గురునింట నుండి మరలివచ్చి గృహమందుండి శుద్ధమగుచోట స్వాధ్యాయము చేయుచు బ్రహ్మలోకమును బొందును మరల రాఁడు." అని శ్రుతిలో గృహస్థుని గూర్చి మాత్రమె చెప్పి సమాప్తి చేయఁబడెను గాని సంన్యాసాశ్రమము అనుష్ఠింపఁదగినది గాదని చెప్పుటకు మాత్రము గాదని తెలియవలయు.

వివ :- "అభిసమావృత్య కుటుంబే, శుచౌదేశే స్వాధ్యాయమధీయానః... బ్రహ్మలోకమభిసంపద్యతే న చ పునరావర్తతే'' అని శ్రుతి. (ఛాందోగ్య. ౮. ౧౫..౧).

49. సూ. మౌనవదితరేషా మప్యుపదేశాత్.

మౌనవత్=మౌనమువలె, ఇతరేషామపి = ఇతరమైన వారిని గూడ, ఉపదేశాత్=ఉపదేశించుటవలన.

సూ. 1. "కృచ్ఛ్ర చాంద్రాయణాది తపముగల వానప్రస్థాశ్రమము రెండవది, ఆచార్య కులమందు నివసించి, వేదము చదువు బ్రహ్మచర్యాశ్రమము మూఁడవది" అని శ్రుతియందు వానప్రస్థబ్రహ్మ చార్యాశ్రమములు ఉపదేశింపఁ బడుటచేత సంన్యాస మౌనమువలె గృహస్థాశ్రమమువలె అవి శ్రుతిసమ్మతములె యని తెలియునది.

వివ :- "తప ఏవ ద్వితీయో బ్రహ్మచార్యాచార్య కులవాసీ తృతీయః" (ఛాం. ౨. ౨౩. ౧) అని శ్రుతి.

## అనావిష్కారాధికరణము ౧౫

50. సూ. అనావిష్కుర్వన్నన్వయాత్

అన్వయాత్=అన్వయించుటవలన, అనావిష్కుర్వన్=ప్రకటింపని వాఁడై యుండవలయును.

సూ. 1. "కనుక బ్రాహ్మణుఁడు పాండిత్యమును నిశ్చయముగా సంపాదించుకొని బాల్యముతో నుండవలయును" అను శ్రుతిలో బాల్యముతో నుండవలయును అనుదానికి చాలసహజమగు చిత్తశుద్ధితో నుండవలయునని యర్థము చెప్పినపుడే ఆ బాల్యము బ్రహ్మజ్ఞానమునకు ఉపకారకముగ నన్వయించుటవలన బాలుఁడు ప్రౌఢమైన యింద్రియములు గలవాఁడు గాకపోవుటచే నితరులకుఁ దనయాత్మను బ్రకటించుటకుఁ గోరనట్లు బ్రాహ్మణుఁడును జ్ఞానాఢ్యుఁయైన ధార్మికత్వాదులచేఁ దన్నుఁ బ్రకటింపక దంభదర్పాదులు లేకయుండవలయును అని యీ శ్రుతికర్థము గ్రహింపవలయును.

వివ:- 1. "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేనతిష్ఠాసేత్" (బృ. ౩. ౫. ౧) అని శ్రుతి. "యం నసన్తం నచాసన్తం నాశ్రుతం నబహుశ్రుతం నసువృత్తాం నదుర్వృత్తం వేద కశ్చిత్సబ్రాహ్మణః" (లోకములో జనులు ఎవ్వనిని సత్పురుషుఁడని గాని దుష్టుఁడని గాని, మూర్ఖుఁడని గాని బహుశ్రాతియుఁడని గాని గుర్తింపరో, సాధుశీలుఁడనిగాని దుశ్శీలుఁడనిగాని ఎఱుఁగరో

అతఁడె బ్రాహ్మణుఁడు.) "గూఢ ధర్మాశ్రితోవిద్వా నజ్ఞాత చరితం చరేత్. అంధవజ్జడవచ్చాపి మూకవచ్చ మహీం చరేత్" గూఢముగఁ దన ధర్మము నాశ్రయించి విద్వాంసుఁ డితరులకుఁ దన నడత తెలియనట్లు చరింపవలయును. గ్రుడ్డివానివలెను మూర్ఖుని వలెను, మూఁగివాని వలెను, భూమిని జరింపవల యును. "అవ్యక్త లింగోఽవ్యక్తాచారః" ముముక్షువు తన చిహ్నములు ప్రకటింపనివాఁడై పరులకుఁ దెలియని నడతగలవాఁడై చరింపవలయును. ఇత్యాది స్మృతులును బ్రహ్మవేత్త బాలునివలె నెవరికిఁ దెలియనివాఁడై యుండ వలయునని చెప్పుచున్నవి.

## ఐహికాధికరణము ౧౫

51. సూ. ఐహికమప్యప్రస్తుత ప్రతిబంధే తద్దర్శనాత్.

తద్దర్శనాత్=అట్లు కనిపించుటవలన, అప్రస్తుత ప్రతిబంధే=ప్రస్తుతము ప్రతిబంధములు లేనియెడల, ఐహికమపి=ఇహలోక కర్మయు ఫలసిద్ధికిఁ గారణ మగును.

సూ. 1. "చాలమందిచే నెయ్యది వినుటకును లభింపదో వినుచున్న వారైనను జాలమంది దేనిని ఎఱుఁగరో దానిని జెప్పువాఁడు అద్భుతమైనవాఁడు దానిని బొందినవాఁడు నేర్పరి. నేర్పరియైన గురువుచే బోధింపఁబడి తెలిసికొన్న వాఁడు ఆశ్చర్యకరమైన వాఁడు. అని శ్రుతిలో ఆత్మ తెలియరానిదని గనిపిం చునట్లును వామదేవుఁడు గర్భమునందు ఉండియే బ్రహ్మ భావమును బొంది నట్లు శ్రుతిలోఁ గనిపించుటవల్లను'' 2. "నాయనా కళ్యాణమును జేసిన వాఁడె వ్వఁడును దుర్గతిని బొందఁడు" యోగభ్రష్టుడు సాధు కులమునఁ బుట్టి యందు పూర్వజన్మమందలి బుద్ధితోఁ గలియును. ''అనేక జన్మలనుండి సిద్ధిని పొందిన వాఁడై పిదప నుత్తమ గతిని బొందును'' అని స్మృతులందును గనిపించుట వల్లను ప్రస్తుతమునఁ బ్రతిబంధములు లేకపోయినచో పరలోక కర్మయే గాక ఇహలోకమందలి కర్మ గూడ ఫలసిద్ధికిఁ గారణమగును. పాపాది ప్రతిబంధము లున్నచో ఏ లోకకర్మలైనను ఫలింపవు.

వివ :- 1. "శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః శృణ్వన్తోఽపి బహవోయం న విద్యుః, ఆశ్చర్యో వక్తాకుశలోస్యలబ్ధా, ఆశ్చర్యోజ్ఞాతాకుశ

లానుశిష్టః" (కఠ. ౨ ౩) అని శ్రుతి. 2 "న హి కళ్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాతగచ్ఛతి" (గీ ౬. ౪౦), 3. "తత్రతం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం" (గీత. ౬. ౪౩), 4. "అనేక జన్మసంసిద్ధ స్తతో యాతిపరాంగతిం" (గీత. ౬. ౪౫) అని స్మృతులు.

## ముక్తిఫలాధికరణము ౧౫

52. సూ. ఏవం ముక్తిఫలాఽనియమ స్తదవస్థావధృతే స్తదవస్థావధృతేః

తదవస్థావధృతేః = మోక్షావస్థ యొక విధమైనదే అని నిశ్చయించుటవలన, తదవస్థావధృతేః = మోక్షాఽవస్థ యొక విధమైనదే యని నిశ్చయించుటవలను ఏవ: = ఇట్లు, ముక్తిఫలాఽనియమః = ముక్తిఫలములో భేద నియమము లేదు.

సూ. నిర్గుణమైన మోక్షావస్థ యొక్కటే రూపమైనదని శ్రుతులందు నిశ్చయింపఁబడుటవలన నిట్లు నిర్గుణోపాసనాఫలమగు మోక్షములో హెచ్చుఁ దగ్గుల భేదముండునని శంకింపరాదు శంకింపరాదు.

వివ :- "అస్థూలమనణు" ఆత్మ స్థూలమైనది గాదు సూక్ష్మమైనది యును గాదు. బ్రహ్మైవేదమమృతంపురతః" ముందుగానున్న యిదంతయు అమృతమె బ్రహ్మమె" ఇత్యాది నిర్గుణబ్రహ్మ విషయములు అన్ని శ్రుతులందు సమానముగనె యున్నవని భావము. సగుణోపాసనలో మాత్రము హెచ్చుఁ దగ్గులుండును. "తం యథాయథోపాసతే తదేవ భవతి" ఆ పరమాత్మను ఎట్లు ఏ యే రూపగుణములతో ఉపాసించునో ఆ యా రూపగుణములె కలుగును అని శ్రుతి. నిర్గుణోపాసనలో గుణములు లేకపోవుటచే భేదము లేదని భావము.

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁడు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసా దర్శనమందుఁ మూఁడవ యధ్యాయమున
అంతరంగ బహిరంగసాధన విచారము
అను
నాల్గవ పాదము

# బ్రహ్మమీమాంసా దర్శనము

ఫలాశ్రయవిచారము అను నాల్గవయధ్యాయమందు

జీవన్ముక్తి నిరూపణము అను మొదటి పాదము.

## ఆవృత్త్యధికరణము. ౧.

1. సూ. ఆవృత్తి రసకృదుపదేశాత్.

అసకృత్=మాటిమాటికి, ఉపదేశాత్ = ఉపదేశించుటవలన, ఆవృత్తిః = దర్శన శ్రవణాదుల ఆవృత్తి చేయవలయును,

సూ, 1. "ఓ మైత్రేయీ ! ఆత్మయే చూడఁదగినది, వినఁదగినది, మననము చేయఁదగినది, ధ్యానింపఁదగినది" ఆత్మయె యన్వేషింపఁదగినది, అదియె తెలిసికొనఁదగినది" అని శ్రుతులందు మాటిమాటి కుపదేశింపఁబడుట వలన ఆత్మదర్శన శ్రవణాదులు మాటిమాటికిఁ జేయఁదగినవి.

వివ :- 1. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" (బృ. ౪. ౫. ౬), 2. "సోఽన్వేష్టవ్యః సవిజిజ్ఞాసితవ్యః" (ఛాం. ౮. ౭. ౧) అని శ్రుతులు.

2. సూ. లింగాచ్చ.

లింగాత్ చ=సూచనఁబట్టియు.

సూ. 1. "ఈ సూర్యుఁడె యుద్గీథము" అని యుపక్రమించి సూర్యుని సూర్యునికిరణములను అభేదదృష్టిచేఁ జూచుటచే నాకు నీవొక్కఁడె పుత్రుఁడవై కలిగితివి" గాన 2. "నీవు సూర్యుని కిరణములను వేలు వేలుగా నుపాసింపుము. నీకు అనేక పుత్రులు కలుగుదురని కౌషీతకి యను ఋషి తన పుత్రునికిఁ జెప్పిన శ్రుతి యొక్క సూచననుబట్టియు ఆ సూర్యుని కిరణములనువలె నాత్మదర్శన శ్రవణాదులు మాటిమాటికిఁ జేయఁదగినవని తెలియునది.

వివ :- 1. "ఆదిత్య ఉద్గీథః" (ఛాం. ౧. ౫. ౧), 2. "రశ్మీంస్త్వం పర్యావర్తయాత్" (ఛాం. ౧ ౫ ౨) అని శ్రుతి సూచన.

## ఆత్మత్వోపాసనాధికరణము ౨

౩. సూ. ఆత్మేతి తూప గచ్ఛంతి గ్రాహయంతి చ.

ఆత్మా ఇతి తు = ఆత్మ అనియే, ఉపగచ్ఛంతి = అంగీకరించుచున్నారు, గ్రాహయంతి చ = గ్రహింపఁజేయుచున్నారు గూడ

సూ. 1. "పూజ్యమైన యో దేవతా! నీవే నేనై యున్నాను. పూజ్యమైన దేవతా! నేనే నీవై యున్నావు నేనే బ్రహ్మమను" ఇత్యాదులందుఁ బరమేశ్వరునిగా నంగీకరించుటవలనను, ౩. "అమృత స్వరూపమయిన యీ నీ యాత్మయె యంతర్యామి", 4. "ఈ యాత్మయే యెల్లవాని లోపల నున్నది" ౕ "ఆ సద్రూపమయిన యాత్మయె సత్యము అదియె జగత్తునకాత్మ, అదే నీవై యున్నావు" ఇత్యాదులందుఁ బరమేశ్వరుని నాత్మగా బోధించుటవలనను బరమేశ్వరుఁడను నేనే యని ధ్యానింపవలయునుగాని బరమేశ్వరుఁడు నాకంటె భిన్నుఁడు అనియు నాకుఁ బ్రభువనియుఁ గాని ధ్యానింపరాదు.

వివ:- 1. "త్వం వా అహమస్మి భగవో దేవతే, అహం వై త్వమసి భగవో దేవతే", 2. "అహం బ్రహ్మాస్మి", ౩. "ఏష త ఆత్మాఽంతర్యామ్యమృతః" (బృ. ౩. ౭. ౩), 4 "ఏష త ఆత్మా సర్వాంతరః" (బృ. ౩. ౪. ౧), 5. "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" (ఛాం. ౬. ౮. ౭) ఇత్యాదులు శ్రుతులు. "అథయోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసావన్యోఽహ మస్మీతి న స వేద" (బృ. ౧ ౪. ౧౦) మఱి యెవఁడు ఆత్మకంటె నితరమగు దేవతను ఇది వేఱు నేను వేఱు అని యుపాసించునో వాఁడు తెలియని వాఁడు. "మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (బృ. ౪. ౪ ౧౯) ఎవఁడు ఆత్మను ఇట భిన్నముగఁ జూచునో వాఁడు చావునుండి చావును బొందును. "సర్వంతం పరాదాద్యోఽన్యత్రాత్మన స్సర్వం వేద" (బృ. ౪. ౫. ౭). ఎవఁడు సర్వపదార్థములను ఆత్మకంటె వేఱుగఁ జూచునో వానిని సర్వపదార్థములు శ్రేయస్సు నుండి పడఁద్రోయును" ఇత్యాదులు శ్రుతులు భిన్నత్వమును నిరసించుచున్నవని తెలియునది. "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కంపశ్యేత్" (బృ. ౨ ౪. ౧౪) ఎప్పుడిట్లు చూచునో వానికి సర్వము ఆత్మయె యయ్యెనో అప్పుడు దేనిచే దేనిని జూచును. అనుశ్రుతినిబట్టి ఆత్మ ప్రబోధము గలిగినపుడింక నెదియు తనకంటె భిన్నము గాదని భావము.

## ప్రతీకాధికరణము ౩

4. మూ. న ప్రతీకే న హి సః.

ప్రతీకే=సగుణరూపమందు, న=ఆత్మ దృష్టిలో అభేదోపాసన చేయరాదు. సః=అసగుణోపాసకుఁడు, నహి=సగుణరూపములను ఆత్మగాఁ జూడరాదు.

సూ. 1. "మనస్సు బ్రహ్మము అని యుపాసింపవలెను ఇది యధ్యాత్మోపాసనము. మఱియింక అధిదైవతోపాసనము చెప్పఁబడును ఆకాశము బ్రహ్మ మని యుపాసింపవలయు" 2. "సూర్యుఁడు బ్రహ్మము ఇది యాదేశము" మొదలైన యుపాసనలందు మనస్సే నేను అని అభేదముగ నుపాసింపరాదు. అభేదజ్ఞానము గలవానికి సగుణోపాసనతో నిమిత్తము లేదు భేదజ్ఞానముగల మధ్యమాధికారి నిర్గుణోపాసనము చేయఁజాలఁడు. సగుణోపాసన చేయువాఁడు ఆ యుపాసనలతో నేకము గాఁడు గాన ఆ సగుణోపాసనలను అవే నేను అని ధ్యానము చేయరాదు.

వివ:- 1. "మనో బ్రహ్మేత్యుపాసీతేత్యధ్యాత్మం, మథాధి దైవతమాకాశో బ్రహ్మేతి" (ఛాం. ౩. ౧౮. ౧) 2. "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" (ఛాం. ౩. ౧౯. ౧) అని శ్రుతులు.

## బ్రహ్మదృష్ట్యధికరణము ౪

5. మూ. బ్రహ్మదృష్టి రుత్కర్షాత్.

ఉత్కర్షాత్=ఉత్కర్షమగుటవలన, బ్రహ్మదృష్టిః=బ్రహ్మదృష్టియే చేయవలయును.

సూ. 1. "సూర్యుఁడు బ్రహ్మము" ప్రాణము బ్రహ్మము, మెఱుపులు బ్రహ్మము" ఇత్యాదులందు బ్రహ్మమే యుత్కృష్టమైనది ఫలప్రదాతయును గాఁబట్టి బ్రహ్మమునుబట్టి సూర్యాదుల కుత్కర్ష సిద్ధించును గాన సూర్యుఁడు ప్రాణము మెఱపు మొదలగు వానియందు బ్రహ్మ దృష్టియుంచి యుపాసింపవలయునని యర్థము చెప్పవలయును గాని బ్రహ్మమందు సూర్యాదుల దృష్టియుంచి యుపాసింపవలెనని చెప్పరాదు.

వివ:- 1. ఆదిత్యో బ్రహ్మ, 2. ప్రాణో బ్రహ్మ విద్యుద్బ్రహ్మ" అని శ్రుతులు. "సయ ఏతదేవం విద్వానాదిత్యం బ్రహ్మేత్యుపాస్తే" (ఛాం. ౩. ౧౯.

४) ఇట్లు తెలిసిన వాఁడై సూర్యుని బ్రహ్మముగా నుపాసించునో. "యోవాచం బ్రహ్మేత్యుపాస్తే" (ఛాం ౭ ౨. ౨) ఎవఁడు వాక్కును బ్రహ్మగా నుపాసించునో. ఇత్యాదులందును స్పష్టముగ సూర్యాదులందు బ్రహ్మదృష్టి చెప్పఁబడినదని తెలియవలయును. లోకమున నికృష్టులగు వారియందు ఉత్కృష్టదృష్టి యుంచఁబడును అట్లయినచో ఫలము అధికముగ సిద్ధించును గాన బ్రహ్మదృష్టి చేయవలయునని భావము.

## ఆదిత్యాదిమత్యధికరణము ౫

6. మూ. ఆదిత్యాది మతయశ్చాంగ ఉపపత్తేః.

ఉపపత్తేః=ఉపపన్నమగుటవలన, అంగే=అంగోపాసనలో, ఆదిత్యాది మతయః చ=సూర్యాది బుద్ధులే యుంచవలయును.

సూ. 1. "తపించుచున్న సూర్యుని ఉద్గీథముగ నుపాసింపవలయును" 2. "హింకారము, ప్రస్తావము, ప్రతిహారము, ఉద్గీథము, నిధనము అను నైదు విధములుగల సామమును పృథివ్యాదిలోకములుగ నుపాసింపవలయును" మొదలగు కర్మాంగములైన యుద్గీథాద్యుపాసనలను సూర్యాది బుద్ధితో నుపాసింపఁగా ఆ యుపాసనలు సూర్యాదులవలె సంస్కరింపఁబడి, 3. జ్ఞానములోను శ్రద్ధతోను వేద రహస్యముతోను చేయు నుపాసన మిగుల శక్తిగలిగినదగును." అని శ్రుతిలో చెప్పిన ప్రకారము కర్మసమృద్ధిని గూర్చుటలో నుపపన్నములగుటవలన ఉద్గీథాదులను సూర్యాదుల బుద్ధితోనే యుపాసింపవలయును గాని సూర్యాదులను ఉద్గీథాది బుద్ధితో నుపాసింపరాదు.

వివః- 1. "య ఏవాసౌతపతి తముద్గీథ ముపాసీత" (ఛా. ౨. ౨ ౧) 2లో కేషుపంచవిథం సామోపాసీత (ఛాం. ౨.౨.౧.) 3. "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి." (ఛాం. ౧. ౧. ౧౦) అని శ్రుతులు.

## ఆసీనాధికరణము ౬

7. మూ. ఆసీనః సంభవాత్.

సంభవాత్=ఏకాగ్రత సంభవించుటవలన, ఆసీనః = కూర్చున్నవాఁడై ఉపాసింపవలయును.

సూ. ఉపాసకుఁడు ఉపాసన చేయుటలోఁ గూర్చుండి యున్న మనస్సునకేకాగ్రత యేర్పడుట సంభవమగుటవలనఁ గూర్చుండియే యుపాసి వలయునుగాని నడచుచుఁగాని పరుండిగాని యుపాసింపరాదు.

8. మూ. ధ్యానాచ్చ.

ధ్యానాత్ చ=ధ్యానరూపమైనదగుటవలనను.

సూ ఉపాసనము ఒకటే విషయమును నెడతెగకుండఁ దలఁచు ధ్యానరూపమైనదగుటవలనఁ గూర్చుండియె యుపాసింపవలయును.

9. మూ. అచలత్వం చాపేక్ష్య.

అచలత్వం=నిశ్చలత్వమును, అపేక్ష్యచ=అపేక్షించి కూడ.

సూ. "భూమి ధ్యానించుచున్నదివలె నున్నది'' అని శ్రుతిలో ఉపా మున నిశ్చలత్వమును బురస్కరించుకొనియె చెప్పుటవలనను గూర్చుండి యుపాసింపవలయును.

వివ:- "ధ్యాయతీవ పృథివీ" (ఛాం. ౭. ౬. ౧)

10 మూ. స్మరంతి చ

స్మరంతి చ=శిష్టులు స్మరించుచున్నారు గూడ.

సూ. "పరిశుద్ధమైనచోట తనకు స్థిరమైన యాసనము నిల్పి ధ్యాని వలయు" అని శిష్టులు ఉపాసనాంగములుగ పద్మాసనము మొదలగు వాని జెప్పుచున్నారు గూడ.

వివ:- "శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః" అని (గీత. ౬ ౧౧).

## ఏకాగ్రతాధికరణము ౬

11. యత్రైకాగ్రతా తత్రాఽవిశేషాత్.

అవిశేషాత్=విశేషించి చెప్పకపోవుటవలన, యత్ర=ఎక్కడ, ఏకాగ్రతా= ఏకాగ్రత కలుగునో, తత్ర=అక్కడ ఉపాసింపవలయును.

సూ. ఉపాసన దిగ్దేశకాల విశేషములందుఁ జేయవలయునని నియమింపఁ బడక పోవుటవలన ఎప్పుడెక్కడ మనస్సున కేకాగ్రత కలుగునో అప్పుడక్కడ ఉపాసింపవలయును.

## అప్రాయణాధికరణము ౧౨

12. మూ. ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టం.

ఆప్రాయణాత్=శరీరము విడచువఱకు (ఉపాసింపవలెను), తత్రాపి=ఆ విషయమునఁ గూడ, దృష్టం=శ్రుతులలోఁ జూడఁబడినది.

సూ. శరీరము విడచువఱకు ఉపాసన సేయవలయును. 1. "జీవుఁడు శరీరము విడచునపుడు జ్ఞానము కలవాఁడగుచున్నాఁడు", 2. "అట్టి విజ్ఞానముతోనే గమ్యస్థానము పొందును", 3. "మరణసమయమున ఎట్టి మనస్సుగలవాఁడగునో ఆ మనస్సుతోడనె ప్రాణమును పొందును. ఆ ప్రాణము తేజస్సుగలదై ఆత్మతోఁ గూడఁ దానుసంకల్పించుకొన్న లోకమునకు ఆత్మను జేర్చును, 4. "ఉపాసకుఁడు ఈ లోకమును విడుచునంతవఱకు ఉపాసన చేయవలయును'' ఇత్యాది శ్రుతులలో జీవుఁడు శరీరము విడచునంతవఱకు ఉపాసన చేయవలయుననియు శరీరమును విడచు కాలమున నెట్టి మనస్సుతో నుండునో అట్టి వాఁడై లోకంతరములు పొందుననియుఁ జూడఁబడుచున్నది.

వివ:- 1. "విజ్ఞానో భవతి", 2. "సవిజ్ఞానమే వాన్వా క్రమతి", 3. "యచ్చిత్తస్తే నైష ప్రాణమాయాతి ప్రాణస్తేజసా యుక్తస్య హాత్మనా యధాసంకల్పితం లోకం నయతి'' సయావత్క్రతు రయమస్మా ల్లోకాత్ప్రైతి" అని శ్రుతులు. గడ్డిమీఁద ప్రాకు పురుగు తరువాతి పోచను బట్టుకొని ముందటి పోచను విడచునట్లును జీవుడు నుండును. ''యం యం వాపిస్మరన్ భావం త్యజత్యంతే కళేబరం తంతమేవైతి కౌంతేయ సదాతద్భావ భావితః" (గీత. ౮. ౬) చివర సమయమున మనుష్యుఁడేయే భావమును స్మరించుచు శరీరమును విడచునో ఆ యా భావములచే భావింపఁబడినవాఁడై యా యా రూపులు పొందును" అని గీత...

## తదధిగమాధికరణము ౧౩

13. మూ. తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్.

తదధిగమే=బ్రహ్మము దెలియఁగా, తద్వ్యపదేశాత్=అట్లు చెప్పుటచే ఉత్తర పూర్వాఘయోః=ముందటి, రాబోవు పాపములయొక్క, అశ్లేష వినాశౌ= అంటుకొనకపోవుటయు నాశమును గలుగును.

సూ. 1. "తామరపాకును నీరు అంటుకొననట్లు బ్రహ్మజ్ఞుని వానిని పాపము అంటుకొనదు", 2. "దుబ్బుగడ్డి కొస అగ్నిలో వేసిన వెంటనే కాలిపోవునట్లు ప్రాణాగ్న్యుపాసకుని పాపము లన్నియును పోవును", 3. "ఆ పరబ్రహ్మమును జూచినంతనే హృదయబంధనములు పోవును; సంశయములన్నియు పోవును, సర్వకర్మలు క్షయము పొందను" ఇత్యాది శ్రుతులందు బ్రహ్మజ్ఞానముగల వానికి ఆదివరకు చేసిన పాపాదు లన్నియు నశించుననియు, తరువాతి కర్మలంటుకొనక పోవుననియు వ్యపదేశించుటవలన బ్రహ్మజ్ఞానము కలిగినంతనే పూర్వ పాపములన్ని నశించును, రాఁబోవు పాపములంటుకొనవు.

వివ:- 1. "యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యంత ఏవ మేవంవిది పాపం కర్మ నశ్లిష్యతే" (ఛాం. ౪. ౧౪. ౩), 2. "తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వేపాప్మానః ప్రదూయంతే" (ఛాం. ౫. ౨౪. ౩), 3. "భిద్యతే హృదయ గ్రంధిశ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ముం ౨. ౨. ౮) అని శ్రుతి. "న కర్మక్షీయతే" అనుభవించిననే గాని కర్మక్షయము పొందదు" అను సామాన్య వచనము. కాన "సర్వం పాప్మానంతరతి, తరతిబ్రహ్మ హత్యాం యోఽశ్వమేధేన యజతే య ఉచైనమేవం వేద" ఎవఁడు అశ్వమేధ యాగము చేయుచు దాని తత్త్వము నెఱుంగునో వాఁడు బ్రహ్మహత్యను సర్వపాపములను దాటును. "జ్ఞానినః సర్వపాపాని శీర్యంతేనాత్రసంశయః" జ్ఞానియొక్క పాపము లన్నియు నశింపును సందియము లేదు. అని శ్రుతిస్మృతులు విశేషించి ప్రాయశ్చిత్తాదులవల్ల పాపములన్నియు క్షయము పొందునని చెప్పుటచే "అనుభవించిననే గాని కర్మక్షయింపదు" అను దానిని పై శ్రుతిస్మృతులు బాధించుట తెలియనగు.

## ఇతరాశ్లేషాధికరణము ౧౦

14. సూ. ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతేతు.

సూ. బ్రహ్మజ్ఞానము కలుగఁగాఁ బాపము అంటుకొననట్లే పుణ్యము కూడ అంటుకొనదు. అప్పుడు దేహము పడిపోఁగా మోక్షము తప్పక కలుగును.

వివః- "ఉభే ఉహ్యైవైష ఏతేతరతి" (బృ. ౪. ౪. ౨౨) ఈ బ్రహ్మవేత్త పుణ్యపాపములు రెంటిని దాటును. అను శ్రుతినిబట్టి పాపమువలెఁ బుణ్యమును నశించునని తెలియుచున్నది కాన 'పాపములన్నియు నశించు'నని సామాన్యముగా పాపశబ్దమును మాత్రమే ప్రయోగించి చెప్పినచోటఁ బుణ్యశబ్దము గూడ చెప్పఁబడినదని తెలియవలయును. కాన జ్ఞానము కలుగఁగా పుణ్యపాపములు నశించునని సూత్రమునఁ జెప్పఁబడినది.

## అనారబ్ధాధికరణము ౧౧

15. సూ. అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః

పూర్వే=ఆ పాపపుణ్యములు, అనారబ్ధకార్యే ఏవతు=ప్రారంభింపఁబడని కార్యములు గలిగినప్పుడే తదవధేః=ఆ శరీరము పోవుటయే అవధి అగుటవలన.

సూ. "బ్రహ్మవేత్తకుఁ బూర్వకర్మలచేఁ బ్రారంభింపఁబడి వచ్చిన దేహమున్నంతవఱకె మోక్షము గలుగుటలో నాలస్యమగును గాని పిదప వెంటనె మోక్షము పొందును" అని శ్రుతి శరీరము విడచిన పిదపనె మోక్షము కలుగునని చెప్పుటవలనఁ బూర్వకర్మలచే శరీరాది కార్యములను ప్రారంభింపక మునుపె జ్ఞానముచేఁ బాపపుణ్యములు నశించునుగాని శరీరాదికార్యములు ప్రారంభింపఁబడిన పిదప మాత్రము ఆ శరీరాదులు పోనంతవఱకు సగమె యనుభవింపఁబడిన యా పాపపుణ్యములు నశింపవు.

వివః- "తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" (ఛాం. ౬. ౧౪. ౨) అని శ్రుతి కుమ్మరివాని సారె మొదటఁ ద్రిప్పఁబడఁగా నా వేగమున్నంతవఱకు, ఆ వేగమును ఆపు అడ్డులేనంతవఱకు ఆ చక్రము తిరుగుచునే యున్నట్లు పూర్వకర్మలచే నారంభింపఁబడిన శరీరము ఆ కర్మలున్నంతవఱకు శరీరము నడచుచునే యుండునని భావము.

## అగ్నిహోత్రాద్యధికరణము ౧౨

16 సూ అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్.

తద్దర్శనాత్=అట్లు కనిపించుటవలన, అగ్నిహోత్రాది తు=అగ్నిహో ంది
కర్మలైతే, తత్కార్యాయ ఏవ=ఆ జ్ఞానకార్యమగు మోక్షము కొఱకె

సూ. "వేదములు చదువుటచేతను, యజ్ఞముచేతను, దానము ను
ఉపవాసాది తపస్సుచేతను బ్రాహ్మణులు ఆయా పరమాత్మను దెలిసి నఃఁ
గోరుచున్నారు" అని శ్రుతియందుఁ గనిపించుటవలన జ్ఞానమువలె అగ్నిహో ంది
నిత్యకర్మలును జ్ఞానకార్యమగు మోక్షమునకె సాధనములగును.

వివ:- "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి ఁ న
దానేన తపసాఽనాశకేన" (బృ. ४. ४. २२) అని శ్రుతి. అగ్నిహో ంది
కర్మలు జ్ఞానముద్వారా మోక్షమునకు సాధనమని భావము. సగుణోపాస ద
మాత్రము బ్రహ్మతో నుపాసకుని కైక్యము లేదుగాన ఆ యుపాస కిఁ
గర్తృత్వము పోదు. కనుక అగ్నిహోత్రాదులు తరువాతను గూడఁజే ట
సంభవించును. ఆ యుపాసకుఁడు ఫలాపేక్ష లేక యా యగ్నిహోత్రా ను
జేసినచో వాఁడు పొందవలసిన ఫలము వేఱొకటి లేదుగాన కర్మలకు జ్ఞాన కో
సంబంధము ఉపపన్నమగునని తెలియునది.

17. మూ. అతోఽన్యాపి హ్యేకేషా ముభయోః

అతః=అగ్నిహోత్రాదులకంటె, అన్యాపి=మఱియొక సాధుకృత్య ను
గలదు అది, ఏకేషాం హి = ఇతర శాఖలవారి విషయముకదా, ఉభయో =
జైమిని బాదరాయణుల కిద్దఱకు సమ్మతమె.

సూ. అగ్నిహోత్రాది నిత్య కర్మలకంటె నితరములగు కామ్యక ఖ
"వాని పుత్రులు పిత్ర్యధనమును, స్నేహితులు సుకృతమును, శత్రువులు ప
మును బొందుదురు" అను శ్రుతి తాండిశాట్యాయన శాఖల వారికి న
శ్రుతికి విషయములని తెలియునది. ఆ కామ్యకర్మలు జ్ఞానమునకు ఉప క
ములు గావను విషయము జైమిని బాదరాయణులకు సమ్మతమె.

వివ:- "తస్య పుత్రా దాయముపయంతి, సుహృదస్సాధుకృ ం
ద్విషంతః పాపకృత్యాం" అని శ్రుతి. బ్రహ్మవేత్త యొక్క పుణ్యము, ని
మిత్రులందుఁ దానుజేసిన పుణ్యకర్మలవంటి కర్మలను, శత్రువులందుఁ దన ప

కర్మలవంటి కర్మలను గలిగించి జ్ఞానముచే ఆ బ్రహ్మవేత్త యొక్క పుణ్య పాపములు నశించునని భావము.

## విద్యావీర్యవత్తరాధికరణము

18. సూ. యదేవ విద్యయేతి హి.

యదేవ=ఏదైతే, విద్యయా=జ్ఞానముతోఁ జేయబడునో అది వీర్యవత్తర మైనది, ఇతి హి=అని చెప్పుచున్నది గదా.

సూ. 1. "ఏది జ్ఞానముతోడను శ్రద్ధతోడను వేదరహస్యముతోను, జేయుచున్నాడో యీ కర్మయు మిగుల శక్తి గలదగును" అని శ్రుతిలో జ్ఞానాదులతోఁ జేసిన కర్మ మిగుల శక్తిగలదగునని చెప్పుటవలనను, 2. "ఆ యీ యాత్మను యజ్ఞముచేఁ దెలిసికొనఁ గోరుచున్నారు" అని జ్ఞానములేకుండఁ జేసినను కేవల కర్మచే ఆత్మజ్ఞానము గలుగునని చెప్పుటవలనను, జ్ఞానముచేఁ జేసినచో మిగుల శక్తియును జ్ఞానము లేకుండఁ జేసినచో సామాన్యశక్తియును గలుగునని తెలియుచున్నది గాన జ్ఞానసహిత కర్మయును జ్ఞానరహిత కర్మయును మోక్షమునకుఁ దమ తమ శక్తి ననుసరించి క్రమముగ సహకారులగునని తెలిసికొనవలయునే గాని జ్ఞానరహిత కర్మములు మోక్షమునకు సహకారులు గానేగావని తలఁపరాదు.

వివ:- 1. "య దేవ విద్య యా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛాం. ౧. ౧. ౧౦), 2. "తమేత మాత్మానం యజ్ఞేన వివిదిషంతి" (బృ. ౪. ౪. ౨౨) అని శ్రుతులు.

## ఇతరక్షపణాధికరణము

19. సూ. భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే.

భోగేన తు=అనుభవించుట చేతనైతే, ఇతరే=పాపపుణ్యములను, క్షపయిత్వా=నశింపఁ జేసికొని, సంపద్యతే=బ్రహ్మమగును.

సూ. పూర్వ పుణ్యకర్మలనుబట్టి యారంభింపఁబడి వచ్చిన శ కార్యముల ననుభవించుటచే వానిని నశింపఁజేసికొని జీవుఁడు బ్రహ్మసరూ నొందును.

ఇది
శ్రీవెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
ఉపాసనలకు భేదమును తత్సంగ్రహమును దెలుపు
బ్రహ్మమీమాంసయందు నాల్గవ యధ్యాయమున
జీవన్ముక్తి నిరూపణ మను మొదటి పాదము.

# బ్రహ్మమీమాంసా దర్శనము

## ఫలాశ్రయ విచారము

### నాల్గవ అధ్యాయమున ఉత్క్రాంతిక్రమ మను రెండవ పాదము

#### వాగధికరణము ౧

1. మూ. వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ.

దర్శనాత్ = కనిపించుటవలనను, శబ్దాత్ చ = శబ్దమువలనను, వాక్ = వాక్కు, మనసి=మనస్సున లీనమగును.

సూ. "ఓ సౌమ్యుడా! చనిపోవు పురుషుని వాక్కు మనస్సునందును, మనస్సు ప్రాణమందును, ప్రాణము తేజస్సునందును, తేజస్సు పరదేవత యందును లయమగుచున్నవి." అను శ్రుతిలో వాక్కు అనుదానికి వాగ్వ్యాపార మని యర్థము చెప్పవలయును. మనస్సు యొక్క వ్యాపారమున్నపుడే వాగ్వ్యాపారము లీనమగుట లోకమున మనుజుడు చనిపోవునపుడు గనిపించుట వలనను, వృత్తివృత్తిమంతముల కభేదము గాన వాక్కు అను పదమునకు వాగ్వ్యాపారము అని అర్థము చెప్పుట యుక్తమగుటవలనను మనస్సుయొక్క వ్యాపారమందు వాక్కుయొక్క వ్యాపారము లీనమొందుచున్నదని యర్థము చెప్పుకొనవలెను.

వి:- "అస్య పురుషస్య సోమ్యప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం" (ఛాం. ౬. ౮. ౬) అని శ్రుతి.

2. మూ. అత ఏవ చ సర్వాణ్యను.

అత ఏవ=కనుకనే, సర్వాణి = సర్వేంద్రియములు, అను = మనస్సు ననుసరించును.

సూ. చనిపోయిన పురుషునిలోని తేజస్సు చల్లారగా పిదప మనస్సు లీనమైన యింద్రియములలో "పునర్జన్మమును బొందును" ఇత్యాది శ్రుతులందును పూర్వసూత్రమందు జెప్పబడినట్లు ఇంద్రియములతో అను దానికి ఇంద్రియ

వ్యాపారములతో అని చెప్పి కన్ను మొదలగు నింద్రియములన్నింటి వ్యా
ములను మనస్సునందు లీనమగుచున్నవని యర్థము చెప్పుకొనవలయును.

వివ :- " తస్మాదుపశాంత తేజాః పునర్భవ మింద్రియై ర్మ
సంపద్య మానైః" (ప్రశ్న. ౩ ౯) అని శ్రుతి.

౭. సూ. తన్మనః ప్రాణ ఉత్తరాత్.

ఉత్తరాత్=ఉత్తర వాక్యమునుబట్టి, తన్మనః=ఆ మనస్సు, ప్రాణ
ప్రాణమందు లయించును.

సూ. "ఓ సౌమ్యుడా ! చనిపోవు పురుషుని వాక్కు మనస్సునందు
మనస్సు ప్రాణమందును, ప్రాణము తేజస్సునందును, తేజస్సు పరదేవతయ
లయమగుచున్నది." అని తరువాతి శ్రుతిలో మనస్సు ప్రాణమందు లయి
నవి చెప్పుటవల్ల వృత్తి వృత్తిమంతముల కభేదము గాన ఇట మనస్సన
మనస్సు యొక్క వృత్తి యని చెప్పుకొని ఆ చిత్తవృత్తి ప్రాణమందు లయి
చున్నదని చెప్పుకొనవలయును.

వివ:- "అస్య పురుషస్య సౌమ్య ప్రయతో వాఙ్మనసి సం పద్యతే వ
ప్రాణే ప్రాణ స్తేజసి తేజః పరస్యాం దేవతాయాం" (ఛాం. ౬. ౮. ౬)
శ్రుతి. నిద్రించిన వానియందు మూర్ఛపడిన వానియందును మనోవ్యాపా
ప్రాణమందు లయించుట గానిపించుచున్నది. కాన మనోవ్యాపారమనియే
మనస్సే ప్రాణమందు లయించునని చెప్పుకొనరాదు. మఱియు నీటి న
యన్నము ప్రాణము ఉద్భవించును. అన్నము నుండి మనస్సు ఉద్భవించ
అని యుత్పత్తి క్రమములో మనస్సు అన్నమందే లయించును గాని ప్రాణమ
లయించుట న్యాయము గాదు గాన మనస్సు ప్రాణమందు లయించునని చె
రాదు. కాన పై శ్రుతిలో మనస్సు యొక్క వ్యాపారమే ప్రాణమందు లయి
నని చెప్పుకొనవలయును గాని మనస్సే స్వరూపముతో ప్రాణమందు లయించు
చెప్పరాదని భావము.

## అధ్యక్షాధికరణము ౩

౮. సూ. సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః.

సః = ఆ ప్రాణము, అధ్యక్షే = ఇంద్రియాధిపతి యగు జీవునియందు లయించును, తదుపగమాదిభ్యః=ఆ జీవు ననుసరించుట మొదలగు వానిని బట్టి.

సూ. 1. "ప్రయాణము చేయు రాజును సేవకు లనుసరించునట్లే జీవుఁడు ఎగ యూపిరి తీయుచున్న చివరికాలమున నీ జీవునిఁ బ్రాణములన్నియు ననుసరించిపోవుచున్నవి", 2. "పరలోకమునకుఁ బోవుచున్న జీవునిని ఆ ప్రాణము వెంబడించి పోవుచున్నది. ఆ పోవుచున్న ప్రాణము ననుసరించి యింద్రియము లన్నియుఁ బోవుచున్నవి." 3. "చివరి కాలమున జీవుఁడు ఫల ప్రాప్తికి విశేషజ్ఞానము గలవాఁడగును. అని శ్రుతులలో ప్రాణము జీవునితోపాటు పోవుచున్నదనియు ఫలముపొందు జ్ఞానము గలవాఁడనియు చెప్పుటవల్ల ఆ ప్రాణము ప్రాణములకుఁ ప్రభువైన జీవునియందు లయించుచున్నదని తెలియునది.

వివ:- 1. "ఏవ మేవేమ మాత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభి సమాయంతి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి" 2. "తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి" (బృ ౪. ౪. ౨), 3. "సవిజ్ఞానో భవతి" అని శ్రుతులు. ప్రాణము తేజస్సునందును తేజస్సు పరదేవతయందు లయమగు చున్నది" అని శ్రుతిలో ప్రాణము తేజస్సునందు లయమొందుచున్నదని చెప్పఁ బడినను ప్రాణములకు జీవుఁడు ప్రభువగుటవే నను, శరీరమునుండి ప్రాణములు విడిపోవుట జీవునినిబట్టి ముఖ్యముగఁ గలిగినవగుటవల్లను ఇతర శ్రుతులందుఁ జెప్పఁబడిన విశేషము లిక్కడ అపేక్షించుకొని ప్రాణము జీవునియందు లయించుచున్నదని చెప్పకొనవలెనని భావము.

5. సూ. భూతేషు తచ్ఛ్రుతేః.

తచ్ఛ్రుతేః = అట్టి శ్రుతినిబట్టి, భూతేషు = సూక్ష్మభూతములందు లయించును.

సూ. ప్రాణములతోఁ గూడిన జీవుఁడు తేజస్సుతోపాటు చరించు సూక్ష్మ భూతములందు లయించును ప్రాణము తేజస్సునందు లయించు"నను శ్రుతినిబట్టి తెలియునది.

వివ :- స్రుఘ్న దేశమునుండి మధురకుఁ బోయి మధురనుండి పాటలి పుత్రమునకుఁ బోవుచున్నాఁడని చెప్పునప్పుడు మధ్యనున్న మధురను జెప్పక

పోయినను మధురకు వెళ్లియె పాటలిపుత్రమునకుఁ బోవుచున్నాఁడని యర్థము తోఁచునట్లు ఇందు ప్రాణము జీవునియందును జీవుడు తేజస్సు మొదలగు సూక్ష్మ భూతములందును లయించుచున్నాఁడని చెప్పుటకు బదులుగా మధ్యనున్న జీవునిఁ జెప్పక ప్రాణమె తేజస్సు మొదలగు వానియందు లయించునని చెప్పఁబడినను ప్రాణము జీవునియందును జీవుఁడు సూక్ష్మభూతములందును లయించునని తోఁచును గాన మధ్యగా జీవునిని గూర్చి చెప్పలేదని భావము.

6. సూ. నైకస్మిన్ దర్శయతో హి.

ఏకస్మిన్=తేజస్సునందె, న = లయింపదు, దర్శయతః హి = శ్రుతి స్మృతులు చూపుచున్నవిగదా.

సూ. 1. "జీవుఁడు పృథివీమయుఁడై, జలమయుఁడై. వాయు మయుఁడై, తేజోమయుఁడై చరించును" అని ఇత్యాది శ్రుతులును. 2. "ఆ సూక్ష్మములును, పరిచ్ఛిన్నములును, నశింపనివియు, నగు పంచభూత భాగము లతోఁ గూడ నీ ప్రపంచమంతయుఁ గ్రమముగ సంభవించుచున్నది" అని స్మృతియుఁ జూపుచున్నవి గాన తేజస్సు పదము మిగిలిన భూతములకుఁ గూడ సూచకము గనుకఁ దేజస్సునందు మాత్రమె గాకఁ బంచభూతములందుఁ గూడ జీవుఁడు లయమగునని తెలియవలయు.

వివః- 1. "పృథివీమయ ఆపోమయో వాయుమయ ఆకాశమ యస్తే జోమయః" అని శ్రుతి. "అణ్వ్యోమాత్రా వినాశిన్యో దశార్ధానాంతుయాః స్మృతాః, తాభిః సార్ధ మిదం సర్వం, సంభవ త్యనుపూర్వశః" అని స్మృతి.

## ఆసృత్యుపక్రమాధికరణము ౪

7. సూ. సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య.

ఆసృత్యుపక్రమాత్=ప్రాణాదులు విడిచిపోవునని యుపక్రమించుటవలన, సమానాచ = విద్వాంసునకు అవిద్వాంసునకు భూతలయము సమానమె, అనుపోష్య=అవిద్యాదుల నశింపఁజేయక, అమృతత్వం చ=అపేక్షితమైన యమృతత్వమును బొందును.

సూ. "ప్రాణము తేజస్సునందును, తేజస్సు పరదేవత యందును లయమగుచున్నది" అని శ్రుతియందు విద్వాంసునకును అవిద్వాంసునకును

సమానముగనె ప్రాణములు జీవుని విడిచిపోవునని చెప్పుటవలన అవిద్వాంసుని వలెను విద్వాంసునకు భూతములందు లయ మగుట సమానమె. అవిద్వాంసుఁడు దేహమునకు బీజములైన భూతసూక్ష్మముల నాశ్రయించి కర్మలచే దేహాంతరమును బొందఁబోవును. విద్వాంసుఁడు మాత్రము అవిద్యాదిక్లేశములను నశింపఁజేయకయె మోక్షనాడిద్వారా యపరవిద్యా (వేదవిద్యా) శక్తినిబట్టి మోక్షమువలె శాశ్వతము గాకపోయినను స్వర్గాదులనుబట్టి శాశ్వతమగు బ్రహ్మలోక పదమును బొందును అని తెలియవలయు.

వివ:- 1. "ప్రాణస్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం" (ఛాం. ౬. ౮. ౬) అని శ్రుతి.

## తదాపీత్యధికరణము - సంసారవ్యపదేశాధికరణము ౫

8. సూ. తదాపీతేః సంసార వ్యపదేశాత్.

తత్=తేజస్సు మొదలగునది, ఆపీతేః=సంసార మోక్షము కలుగువఱకుండుటవల్లను, సంసార వ్యపదేశాత్=దానికి సంసారము గలుగునని చెప్పుటవలన.

సూ. "కొందఱు దేహులు వారి కర్మలనుబట్టియు వారి జ్ఞానమును బట్టియు, శరీరము గ్రహింతురు. మనుష్యాది జన్మలను బొందుదురు. కొందఱు అధములు స్థావరరూపమును బొందుదురు" అని శ్రుతి యందుఁ జెప్పఁబడిన ప్రకారము తేజస్సు మొదలగు భూతములు, జ్ఞానముచేత మోక్షము పొందువఱకు సంసారము పొందుచుండునని "తేజస్సు పరదేవత యందు లయమగును" అను దానికి అర్థము గ్రహింపవలయును.

వివ:- "యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః స్థాణు మన్యేఽను సంయంతి యథాకర్మ యథా శ్రుతం" (కఠ. ౫. ౭) తేజ. "పరస్యాం దేవతాయాం" (ఛాం. ౬. ౮. ౬) అని శ్రుతులు.

9. సూ. సూక్ష్మం ప్రమాణత శ్చతదోపలబ్ధేః.

తదా=అట్లు, ఉపలబ్ధేః=ఉపలబ్ధమగుటవలన, ప్రమాణతః=ప్రమాణమును బట్టియు, సూక్ష్మ=సూక్ష్మమైనది.

సూ. ఇతర భూతములతోఁగూడిన తేజస్సు శరీరమును విడచునప్పు నాడుల ద్వారా పోవునని వినఁబడుట మొదలగు కారణములనుబట్టి పరిణామ కోతు స్వరూపములోను సూక్ష్మమైయున్నట్లు ఉపలబ్ధమగుటవల్ల సూక్ష్మ దగ్గరవారికిఁగూడఁ గనిపింపకపోవుచున్నదని తెలియవలయును.

10 మూ. నోపమర్దేనాతః.

అతః=అందువలన, ఉపమర్దేన=దాహాది నిమిత్త నాశముచేత, న సూక్ష్మ శరీరము నశింపదు.

సూ. సూక్ష్మమైయుండుటవల్లనే స్థూలదేహములను దగులపెట్టుట మొ లగు పనులను చేసినను ఆ తేజస్సు బాధింపఁబడదు.

మూ. అస్యైవచోపపత్తే రేష ఊష్మా.

ఉపపత్తేః = ఉపపన్నమగుటవలన, ఏషః = ఈ ఊష్మా చ =వేడిం అస్య=ఈ సూక్ష్మ శరీరముదే.

సూ. జీవించియున్నపుడు శరీరమున వేడియుండి చనిపోయినపుడు వేడి కనిపింపకపోవుటవలన ఈ వేడి ప్రసిద్ధమగు శరీరముకంటె నితరమ సూక్ష్మమైన భూతములదే యని తెలియవలయును.

వివః- " ఉష్ణఏవైష జీవిష్యన్, శీతోమరిష్యన్" ఈ శరీరము జీవిం పోవుచు వెచ్చనిదై, మరణింపఁబోవుచుఁ జల్లనిదై యుండు నని శ్రుతి తెలు చున్నదని భావము.

## ప్రతిషేధాధికరణము — శారీరాధికరణము ౬

12. మూ. ప్రతిషేధాదితిచేన్న శారీరాత్.

ప్రతిషేధాత్ = ప్రతిషేధించుట వలన, ఇతిచేత్ = అన్నచో, శారీరాత్ శరీరముల లోని జీవుని నుండి, న=వెడలవు.

సూ. 1. "మతి యెవఁడు కోరనివాఁడై, కోరికలు లేనివాఁడై, కోరిక ంచే విడిపడినవాఁడై, కోరికలన్నియుఁ దీరినవాఁడై, ఆత్మమును మాత్రమె కోరునో వాని ప్రాణములు వెడలవు. వాఁడు బ్రహ్మమేయగుచు బ్రహ్మము పొందుచున్నాఁడు" అని శ్రుతి బ్రహ్మవేత్త: దేహమునుండి ప్రాణములు వెడ

వని నిషేధించుటచేత బ్రహ్మవేత్త ప్రాణములు వెడలవన్నచో ఈ నిషేధము జీవుని నుండి ప్రాణములు వెడలవని చెప్పుటకేగాని శరీరము నుండి వెడలవని చెప్పుటకుఁ గాదు కనుకనే", 2. "ఆ జీవుని నుండి ప్రాణములు వెడలవు" అని శ్రుతి జీవుని నుండి మాత్రమె ప్రాణములు వెడలవని స్పష్టము చేయుచున్నది గాన శరీరము నుండి ప్రాణములు వెడలునని చెప్పవచ్చును".

వివ:- ఇది పూర్వపక్షసూత్రము. 1. "అథాఽకామయమానో యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో భవతి, న తస్య ప్రాణా ఉత్క్రామంతి" బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి (బృ. ४. ४. ౬.) నతస్య ప్రాణా ఉత్క్రామంతి అని శ్రుతులు.

13. సూ. స్పష్టో హ్యేకేషాం.

ఏకేషాం=కొందఱు శాఖల వారి శ్రుతులలో, స్పష్టో హి = స్పష్టముగా నున్నది గదా.

సూ 1. "ఎప్పుడు ఈ విద్వాంసుఁడు చనిపోవునో అప్పుడు ప్రాణములు వాని నుండి వెడలునా వెడలవా" అని యార్తభాగుఁ డడుగఁగా" 2. అవి వెడలవు". 3. "ఈ బ్రహ్మవేత్త యందే యేకీభవించుచున్నవి" 4. "అప్పుడు దేహము ఉబ్బును, బాహ్య వాయువుచే నిండింపఁబడును అట్లు నిండింపఁబడినదై చనిపోయిపడుచున్నది అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను" 5. "వాని నుండి ప్రాణములు వెడలవు అతనియందె లయించుచున్నవి" 6. "అందె బ్రహ్మమును బొందును" అని కాణ్వాది శాఖలవారి శ్రుతులు స్పష్టముగా బ్రహ్మవేత్త యొక్క ప్రాణములు వానినుండి వెడలవనియు ఆ బ్రహ్మవేత్తయందే లయించుచున్నవని చెప్పుటవలన బ్రహ్మవేత్త యొక్క శరీరమునుండి ప్రాణములు వెడలినను ఆ బ్రహ్మవేత్త జీవుని నుండి వెడలక ఆ జీవునియందె లయించును.

వివ:- 1 "యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ప్రాణాః క్రామంత్యాహో నేతి" (బృ. ३. ౨. ౧౧). 2. "నేతిహోవాచ యాజ్ఞవల్క్యః" (బృ. ३. ౨. ౧౧), 3. "అత్రైవసమవలీయంతే", 4. "స ఉచ్ఛ్వయత్యాధ్మాయ త్యాధ్మాతో మృతశ్శేతే" (బృ. ३. ౨. ౧౧), 5. "న తస్మాత్ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే" (బృ. ३), 6. "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అని శ్రుతులు. బ్రహ్మవేత్త నిష్కాముఁడు గాన అతఁడు కోరికలు

డీర్చుట కేశరీరమును గాని ఏ లోకమును గాని పొందవ సిన యవసరము లేదు గాన బ్రహ్మమందె లయించునని భావము. ప్రాణములు వెడలకున్నచో వెడ యింకొక లోకముకో శరీరమునకో వెడలునని చెప్పవలసి వచ్చును గాన అ నిషేధింపబడుచున్నదని రహస్యము.

14. మూ. స్మర్యతే చ.

స్మర్యతే చ=స్మరింపబడుచున్నది గూడ.

సూ. 1. "సర్వభూతముల యాత్మ స్వరూపమై సరిగా జూచు పొందవలసిన స్థానము లేకయుండు బ్రహ్మవేత్త యొక్క పదవిని గోరుచ దేవతలు గూడ ఆ బ్రహ్మవేత్త యొక్క మార్గమేదో తెలియక మోహమ చెందుచున్నారు", 2. "శుకయోగి ఆకాశమున జేరి గాలికంటెను వడిగల గతితో తన మహిమను చూపించి సర్వభూతములను బొందినవాడయ్యెను." అని (మహాభారతమున) చెప్పబడుచున్నది గాన బ్రహ్మవేత్త ప్రాణములు అతని నుండి వెడలుట గాని గతి గాని లేదని తెలియవలయును.

వివః- 1. "సర్వభూతాత్మ భూతస్య సమ్యగ్భూతాని పశ్యతః దేవాఅపి మార్గే ముహ్యంతి హ్యపదస్య పదైషిణః" శుకస్తుమారుతాచ్ఛీఘ్రాం గతిం కృత్వాంతరిక్షగః దర్శయిత్వా ప్రభావం స్వం సర్వభూత గతోఽభవత్" అని మహాభారతము. గతిని గూర్చి చెప్పు శ్రుతులకేది విషయమో యా సంగతి ఈ యధ్యాయమున మూడవ పాదమున నైదవ యధికరణమున జెప్పబడును.

పరసంపత్త్యధికరణము - వాగాదిలయాధికరణము ౭

15. మూ. తానిపరే తథా హ్యా హ.

తాని=ఆ యింద్రియములు, పరే=పరబ్రహ్మమున లయించును, తథా = అట్లు శ్రుతియు, ఆహ హి=చెప్పెనుగదా.

సూ. 1. "అంతటను బ్రహ్మము జూచు విద్వాంసుని యొక్క ప్రాణ శ్రద్ధాదులగు పదునారు కళలును పురుషునినే పొందునవియై నదులు సముద్ర మున లయించునట్లు పురుషునినే పొంది యస్తమించును" అని శ్రుతి వాగాది ప్రాణములు పురుషునినె పొంది లయించుచున్నట్లు చెప్పుచుండెను గాన బ్రహ్మ వేత్త యొక్క ఇంద్రియములు భూతములును బ్రహ్మయందె లయించుచున్నవి.

---

వివః- 1. "ఏవ మేవాస్య పరిద్రష్టురిమాః షోడశ కళాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛంతి" (ప్రశ్న. ఉ. ౫) అని శ్రుతి. "గతాః కళాః పంచదశ ప్రతిష్ఠాః" (ము౦. ౩. ౨ ౭) ప్రాణాదులగు పదునైదు కళలు తమ ప్రకృతులగు పృథివ్యాదులను పొంది బ్రహ్మమందు లయించుచున్నవి. అను శ్రుతి వ్యవహారము ననుసరించి చెప్పఁబడినదని తెలియవలయును. "అంతటను బ్రహ్మముఁ జూచు" అను శ్రుతి బ్రహ్మవేత్త యొక్క కళలన్నియు బ్రహ్మమే యగుచున్నవని చెప్పుచున్నది కావు ఈ రెండు శ్రుతులకు విరోధము లేదని భావము.

### అవిభాగాధికరణము ౮

16. సూ. అవిభాగో వచనాత్.

వచనాత్=శ్రుతి చెప్పుటవలన, అవిభాగః=విభాగములేక లయించును.

సూ. 1. "ఈ కళల నామరూపములు భేదించుచున్నవి, సముద్రమున నదులువలె పురుషుని యందుఁ గళలు లయమొందిన పిదప పురుషుఁడనియే చెప్పఁబడును. ఇది తెలిసిన వాఁడు కళారహితుఁడై యమృతుఁడగును" అని శ్రుతి కళలన్నియు మిగులక లయించునని చెప్పుటచే బ్రహ్మవేత్త యొక్క ప్రాణాది కళలన్నియు విభాగము లేక మిగులక బ్రహ్మయందె లయమొందును.

వివః- భిద్యేతే తాసాం నామరూపే, పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽకలోఽమృతో భవతి" (ప్ర. ఉ. ౫) అని శ్రుతి.

### తదోఽకోధికరణము - విద్యాసామర్థ్యాధికరణము ౯

17. సూ. తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యా సామర్థ్యాత్తచ్ఛేషగ త్యను స్మృతియోగాచ్చ హార్దానుగృహీతః శతాధికయా.

తదోకస = ఆ జీవుని హృదయమునకు, అగ్రజ్వలనం = ఛాలి సంగతి స్ఫురించుట గలుగును, తత్ప్రకాశితద్వారః = దానిచేఁ బ్రకాశింపఁ జేయఁబడిన ద్వారము గలవాఁడై, విద్యాసామర్థ్యాత్=జ్ఞాన సామర్థ్యమువలన, తచ్ఛేషగత్యను స్మృతియోగాత్ చ = దానికి శేషమగు గతిని స్మరించుయోగము వలనను, శతాధికయా = నూటుకంటె నెక్కువగు నాడిచే, హార్దానుగృహీతః = హృదయ మందలి బ్రహ్మముచే ననుగ్రహింపఁబడినవాడై వెడలును.

సూ. జీవుఁడు శరీరమునుండి వెడలునపుడు వాక్కు ప్రాణము వె లగు నింద్రియములను లయమొనర్చుకొనును అపుడు వానికి స్థానమైన హృద యమునకు భావి విషయములు స్ఫురించును. ఆ స్ఫురణముచేఁ దాను బోవవల మార్గము ప్రకాశింపఁగాఁ దన జ్ఞానసామర్థ్యమువల్లను, ఆ జ్ఞానమునకు శేషవ తలయందలి నాడులద్వారా చేయు ప్రయాణమార్గమును బరిశీలించి స్మరించ వల్లను, దన హృదయమందున్న బ్రహ్మముచే ననుగ్రహింపఁబడినవాఁ హృదయమందున్న నూఱు నాడులకంటె వేఱైన నూటయొకటవ నాడిచే వెడలు

వివ:- స ఏతా స్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయ మేవాన్వా మతి" ఆ జీవుఁడు ఈ చక్షురాదీంద్రియములను నిశ్శేషముగా స్వీకరిం హృదయమునే ప్రవేశించును. అను శ్రుతినిబట్టి జీవునికి హృదయము స్థానము అ తెలియుచున్నది. "తస్య హైతస్య హృదయ స్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతేనై ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వా అన్యేభ్యో వా శరీరదేశేభ్యః (బృ. ౪. ౪. ౨) ఆ యీ హృదయముయొక్క ఛిద్రముయొక్క నిర్గమ ద్వా మగు నాడీ ముఖము భావి స్ఫురణతో ప్రకాశించుచున్నది. దానిచే నీ జీవుఁ కంటినుండి గాని తలనుండి గాని మిగిలిన శరీర దేశములనుండి గాని వెడలున అను శ్రుతి విద్వాంసునకు అవిద్వాంసునకు సమానముగనే చెప్పుచుండఁ విద్వాంసుఁడు భావి విషయస్ఫురణచే జ్ఞానసామర్థ్యముచేత తలనుండి వెడఁ చున్నాఁడనియు అవిద్వాంసుఁడు మిగిలిన స్థానములనుండి వెడలుచున్నాఁడనియ ఈ సూత్రముచేఁ జెప్పఁబడుచున్నది. "శతంచైకా చ హృదయస్య నాడ్యస్తాసా మూర్ధాన మభి నిఃసృతైకా, తయోర్ధ్వ మాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" (ఛాం. ౮. ౬. ౬.) హృదయమున ముఖ్యముగ నాడులు నూటయొకటి యున్నవి. వాటిలో సుషుమ్న అనునొక నాడి బ్రహ్మ రంధ్రమును జొచ్చియున్నది. ఆ నాడిచే పైకిఁ బోవువాఁడు అమృతత్వమున బొందును. మిగిలిన నాడులు జీవుఁడు శరీరమునుండి వెడలుటకే యగును కాని యమృతత్వమునకుఁ గావు. అని శ్రుతిలోఁ జెప్పఁబడినట్లు జ్ఞానసామర్థ్యముచేత సుషుమ్నా నాడిద్వారా విద్వాంసుఁడు మాత్రము వెడలి అమృతత్వమును బొందు నని అవిద్వాంసులు ఇతర నాడులద్వారా వెడలి కర్మానుసారముగా ఆయా లోకములఁ బొందుదురని భావము.

## రశ్మ్యనుసార్యధికరణము ౧౦

-18 సూ. రశ్మ్యనుసారీ.

రశ్మ్యనుసారీ=సూర్యరశ్ముల ననుసరించినవాఁడై వెడలును.

సూ. 1. "పిదప నెప్పుడు జీవుఁడు ఈ శరీరమునుండి వెడలునో అప్పుడు ఈ నాడులందు వ్యాపించిన కిరణములద్వారా పైకిఁబోవుచున్నాఁడు" 2. "ఆ నాడిచేఁ బైకిఁబోవువాఁ డమృతత్వము పొందును" అని శ్రుతిలో రాత్రి యందని గాని పగటియందని గాని విశేషించి చెప్పకపోవుటవల్ల మరణించి అన్ని కాలములందును సూర్యకిరణముల ననుసరించి పైకిఁ బోవుచున్నాఁడని తెలియవలయు.

వివ:- 1. "అథ యత్రైత దస్మాచ్ఛరీరా దుత్క్రామ త్యథైతై రేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే" (ఛాం. ౮. ౬. ౫), "తయోర్ధ్వ మాయన్నమృతత్వమేతి" (ఛాం. ౮. ౬. ౬) అని శ్రుతులు.

19. సూ. నిశినేతిచేన్న సంబంధస్య యావద్దేహభావిత్వా ద్దర్శయతి చ.

నిశి=రాత్రి, యందు న ఇతిచేత్=కిరణములు లేవన్నచో, న=అట్లనరాదు, సంబంధస్య=సంబంధము, యావద్దేహ భావిత్వాత్=దేహమున్నంత వఱకుండుట వలన, దర్శయతి చ=ఉన్నట్లు శ్రుతి చూపుచున్నది కూడ.

సూ. 1. "రశ్ములు ఈ సూర్యుని నుండి ప్రసరించుచున్నవి. అవి యీ నాడులందు ప్రసరించును. ఆ రస్ములు ఈ నాడుల నుండి ప్రాకుచున్నవి. ఆ రస్ములు ఈ సూర్యుని యందు వ్యాపించును" 2. "సూర్యుఁడు రాత్రి యందును ఈ పగటినే చేయుచున్నాఁడు" అని శ్రుతులు సూర్యుని కిరణములు రాత్రి యందుఁ గూడ ఉండునట్లు చెప్పుటచేతను. 3. "శరీరమునుండి వెడలెడి యీ విద్వాంసుఁడు మనోవేగముతో సూర్యునిఁ బొందును" అని చెప్పుటచేతను నాడులకు సూర్యకిరణములకును దేహమున్నంతవఱకు సంబంధము ఉండునని శ్రుతులు చూపుచున్నవిగాన రాత్రి యందు నాడులకు సూర్యరస్ములకు సంబంధము లేదని చెప్పరాదు. కనుక పగలు గాని రాత్రిగాని నాడీరస్ముల సంబంధముతో జీవుఁడు పైకిఁబోవునని తెలియవలెను.

వివ:- 1. "అముష్మా దాదిత్యాత్ప్రతాయంతే తేఽముష్మి న్నాస్పృప్తాః" (ఛాం. ౮. ౬. ౨) 2. "అహరేవై తద్రాత్రౌ విదధాతి" 3. యావత్ క్షిప్యే న్మన స్తావదాదిత్యం గచ్ఛతి" (ఛాం. ౮. ౬. ౫) శ్రుతులు.

## దక్షిణాయనాధికరణము ౧౧

20. మూ. అత శ్చాయనేఽపి దక్షిణే.

అతః=కనుకనె, దక్షిణేఽపి అయనే=దక్షిణాయనమందును విద్యాఫల పొందును.

సూ. కనుకనే దక్షిణాయణమందుఁ గూడ మృతుఁడైన జీవుఁడు వి ఫలమును బొందును.

వివ:- "ఆ పూర్వమాణ పక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాంస్తాన్" (ఛా ౪. ౧౫. ౫) శుక్లపక్షమునుండి సూర్యుఁడు ఉత్తరముగా పోవు నాఱుమాస లలో పోవును. అను శ్రుతిచే ఉత్తరాయణమే కోరఁదగినదను శంకను వారించు ఈసూత్రము చెప్పఁబడెను. "ఉత్తరాయణము శ్రేష్ఠము" అను లోకాచారము మన్నించుటకును తండ్రి యిచ్చిన స్వచ్ఛంద మరణమును జూపుటకును భీష్ముఁ ఉత్తరాయణ ప్రవేశమువఱకు శరీరము విడక యుండెను గాని యుత్తరాయ మున శరీరము విడచినఁగాని యుత్తమలోకములు రావని గాదని తెలియవలయ కాన ఏ కాలమునఁ జనిపోయినను జ్ఞానసామర్థ్యముచే విద్యాఫలము గలుగున భావము.

21. మూ. యోగినః ప్రతి చ స్మార్తే చైతే.

యోగినః ప్రతి=యోగులను గూర్చి, స్మర్యతే చ = స్మృతియంద స్మరింపఁబడుచున్నదికూడా ఏతే=ఈ సాంఖ్యులు యోగులు, స్మార్తే చ=స్మృతి యందుఁ జెప్పఁబడినవాడే.

సూ. "ఓ యర్జునా! యేకాలమందు యోగులు చనిపోయినవారై పుట్టిక చావులను, మోక్షమును బొందుదురో యా కాలమును నీకుఁ జెప్పెదను" అని స్మృతి యోగులను గూర్చియె చెప్పుచున్నది గాన స్మృతియందుఁ జెప్ప బడిన సాంఖ్యులను గూర్చియు యోగులను గూర్చియు ఉత్తరాయణము శ్రేష్ఠ

మఱియు అందు పోవువారు మోక్షమును బొందుదురని చెప్పుటవలన స్మృతి కాధారమగు శ్రుతియందుఁ జెప్పఁబడిన యుపాసకుల కాలనియమము లేక యె రాత్రిగాని పగలుగాని యుత్తరాయణమునఁ గాని దక్షిణాయనమునఁగాని విద్యా సామర్థ్యముచే ఉత్తమగతిని బొందెదరని తెలియవలయును.

వివ:_ యత్రకాలే త్వనావృత్తి మావృత్తిఞ్చైవ యోగినః, ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ" అని (గీత. ౮. ౨౩)

ఇది

శ్రీ వెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు

చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన

బ్రహ్మమీమాంసాదర్శనమందు ఫలాశ్రయ విచారమను

నాల్గవ యధ్యాయమున ఉత్క్రాంతి క్రమ మను రెండవ పాదము.

# బ్రహ్మమీమాంసా దర్శనము

ఫలాశయ విచారమను నాల్గవ యధ్యాయములో
గంతవ్యమగు నర్చిరాది మార్గ నిర్ణయ మను మూఁడవపాదము.

## అర్చిరాద్యధికరణము ౧

**1. సూ. అర్చిరాదినా తత్ప్రథితేః**

తత్=ఆయర్చిరాది మార్గము. ప్రథితేః = ప్రసిద్ధమై యుండుటవలనః అర్చిరాదినా=అర్చిరాది మార్గము గాఁ బోదురు.

సూ. "పంచాగ్ని విద్యోపాసకులే గాక యరణ్యమున శ్రద్ధగా సత్య బ్రహ్మము నుపాసించు వారు గూడ అర్చిరాదిమార్గమునఁ బోవుదురు" అని విద్వాంసులకు అర్చిరాదిమార్గము ప్రసిద్ధమై యుండుటవలన బ్రహ్మముఁ బొందు వారందఱు ఆయర్చిరాది మార్గముగు దనే పోదురు

వివ :- "అథైతైరేవ రశ్మిభిరూర్ధ్వం అక్రమతే" (ఛాం. ౮ ౬ ౫) ముక్తి యీ సూర్యకిరణముల ద్వారానే పైకిఁ బోవును. "తేఽర్చిషమభి సంభవం త్యర్చిషోఽహః" (బృ ౬. ౨. ౧౫) పంచాగ్న్యుపాసకులగు గృహస్థులు అగ్నిదేవతను ఆ యర్చిర్దేవతనుండి అహరభిమాన దేవతను బొందుదురు "స ఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోకమాగచ్ఛతి" (కౌ. ౧ ౩) ఆ యుపాసకుఁడు ఈ దేవయాన మార్గమునుపొంది అగ్నిలోకమును జేరుచున్నాఁడు. "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి స వాయు మాగచ్ఛతి" (బృ ౫ ౧౦ ౧) విద్వాంసుఁడీ లోకమునుండి పోవునప్పుడు వాయులోకమును బొందును. "సూర్య ద్వారేణతే విరజాః ప్రయాంతి" (ముండ. ౧ ౨. ౧౧) స్వీకరములఁ జేయును హిరణ్యగర్భోపాసన చేయువారు పుణ్యపాపముల వీడి సూర్యమార్గమునఁ

పోవుచున్నారు. ఇట్లు శ్రుతులలో భిన్న భిన్న మార్గములు చెప్పఁబడుటచే సందేహ
వారణకై యీ సూత్రము చెప్పఁబడినది. ఈ మార్గములు విభిన్నములుగాఁ
గనఁబడినను మార్గము ఒకటే. కాని యా మార్గమందుఁ గల మజిలీల నబట్టి యా
యా చోట్ల అనేకానేకముగా గణింపుటవల్ల ఆ మార్గమున కనేక విశేషణ
ములు చెప్పఁబడెను. బ్రహ్మలోకమునకుఁ బోవు మార్గమొకటె యని భావము.
"తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి" (బృ. ౬. ౨ ౧౫) బ్రహ్మ
వేత్తలు బ్రహ్మలోకములందు శ్రేష్ఠులై హిరణ్యగర్భుని దగ్గరఁ జాలకాల
ముందురు. "తస్మిన్ వసతి శాశ్వతీస్సమాః" (బృ. ౫ ౧౦ ౧) బ్రహ్మ
లోకమందు శాశ్వత సంవత్సరము లుండును. ఇత్యాది శ్రుతులలో వెళ్లఁదగినది
బ్రహ్మలోకమని కూడఁ జెప్పఁబడినది. పై శ్రుతులలో "పితృ యీ సూర్య
కిరణముల ద్వారానే పైకి పోవుదురు" అని నిర్ధారణగాఁ జెప్పుటచే రాత్రి సూర్య
రశ్మి సంబంధము లేదుగదా అను సందేహమును వారించుటకై రాత్రి గూడ
సూర్యరశ్మి సంబంధము గలదని యా సూర్యరశ్ముల ద్వారానే పోదురు అని
చెప్పుటకే గాని అర్చిరాది మార్గముగుండఁ బోవరని నిషేధించుటకుఁ జెప్పఁబడ
లేదని తెలియవలయును. "స యావత్ క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛతి"
(ఛాం. ౮. ౬. ౫) విద్వాంసుఁడు మనోవేగముతో సూర్యుని బొందును. ఇది
ఇతర మార్గములకంటె అర్చిరాది మార్గమున మనోవేగముతోఁ బోవునని యర్థము
గాదు మార్గమొకటే యయ్యును "ఇంటికి ద్వరగా వత్తును" అని లోకమునఁ
జెప్పునట్లు మనోవేగముతోఁ బోవునని చెప్పఁబడెను గాని మార్గము లనేకము
లుండి ఈ మార్గమునఁ ద్వరగాఁ బోవుననోఁ బోవునని చెప్పుటకు మాత్రము
గాదని తెలియునది. "అథైతయోః పథోర్న కతరేణచన" (ఛాం. ౫. ౧౦ ౮)
క్షుద్ర జంతువులు ఈ యర్చిరాది ధూమాది మార్గములు రెంటిలో నేమార్గము
ద్వారా గాని పోవవు. అను శ్రుతి దేవయానము పితృయాణము అను రెండు
మార్గములనుండి భ్రష్టులగు వారికి మూఁడవ మార్గమును జెప్పుచున్నది. పితృ
యాణమార్గముకంటె అర్చిరాదులైన చాల మజిలీలుగల దేవయానమను మార్గ
మొకటి యున్నదని యీ శ్రుతి ప్రకటించుచున్నది. అర్చిరాది మార్గమునఁ జాల
మజిలీలును, ఇతర మార్గములఁ గొంచెము మజిలీలును గలవని తెలియవలయును.
అర్చిరాది శ్రుతియందు అనేకమైన మజిలీలు చెప్పఁబడెను. అన్యశ్రుతులందు ఆ
మార్గములు తక్కువగఁ జెప్పఁబడెను. చాల మజిలీలు చెప్పు శ్రుతికనుగుణ

ముగ్గఁ దక్కువ మజిలీలు గల శ్రుతులను అన్వయించుట న్యాయము గాన సూత్రమున అర్చిరాది దేవతల మార్గమునె యుదాహరించి చెప్పఁబడెను.

## వాయ్వధికరణము ౨

2. సూ. వాయుమబ్దా దవిశేష విశేషాభ్యాం.

అవిశేష విశేషాభ్యాం=సామాన్య విశేషములుగఁ జెప్పుటవలన, అబ్దాత్=సంవత్సర దేవత పిదప, వాయుం=వాయువును జేర్పవలయును.

సూ. 1. "ఆ యుపాసకుఁడు దేవయాన మార్గమును బొంది యగ్ని లోకమును, వాయులోకమును, వరుణలోకమును, ఇంద్రలోకమును, ప్రజాపతి లోకమును, బ్రహ్మలోకమును బొందును", 2. "ఆ యుపాసకులు అర్చిర్దేవత నుండి యహర్దేవతను, అహర్దేవత శుక్లపక్షమును, యుత్తరాయణమును, సంవత్సర దేవతను, సూర్యునిని చంద్రుని, వానిద్వారా మెఱపును బొందుదురు పిదప ఒక యమానవ పురుషుఁడు వచ్చి వీరిని బ్రహ్మమును బొందించును" అను శ్రుతులలో అగ్ని అర్చిశ్శబ్దములు రెండును సమానార్థకములైనను దిరిగి యుపయోగించుటచే నిందు జీవుఁడు వెళ్లఁబోవు లోకముల క్రమము చెప్పఁబడలేదు. ఇందు వాయులోకమునకు వరుస క్రమము విశేషించి చెప్పలేదు.", 3. "పురుషుఁడు ఈ దేహమును విడిచి వెడలునప్పుడు వాయువును జేరును, ఆ వాయువు తన దగ్గఱకు వచ్చిన వానికొఱకు తనయందు బండికంటి చిల్లువంటి సందను గల్గఁజేయును ఆ యుపాసకుఁ డాసందువెంట పైకిఁబోవును. పిదప అతఁడు సూర్యుని జేరును" అను శ్రుతిలో వాయువకు వరుస విశేషించి జెప్పఁబడినది. ఇట్లు శ్రుతులందు సామాన్యముగను విశేషముగను వాయువు యొక్క క్రమము చెప్పఁబడుటచే విశేషించి చెప్పినచోట వాయువునకు పిదప సూర్యుని చెప్పుటచే సామాన్యముగఁ జెపిన శ్రుతిలో సంవత్సరదేవతకుఁ దరువాతను సూర్యునికిఁ బూర్వమందును వాయులోకమును జేర్చి సంవత్సర దేవతనుండి వాయులోకమును అందుండి సూర్యుని బొందు ననువరుసను దెలియవలయును.

వివః- 1 "స ఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోకమాగచ్ఛతి, స వాయులోకం, స వరుణలోకం, స ఇంద్రలోకం, స ప్రజాపతిలోకం, స బ్రహ్మలోకం." (కౌ ౧. ౩) 2. "తేఽర్చిష మభిసంభవంత్యర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణ పక్ష మాపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాం

స్తాన్మాసేభ్య స్సంవత్సరం సంవత్సరా దాదిత్య మాదిత్యా చ్చంద్రమసం చంద్ర మసో విద్యుతం తత్పురుషో౽మానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి (ఛాం.౫. ౧౦ ౧. ౨), కి. "యదా వై పురుషో౽స్మాల్లోకాత్ ప్రైతి స వాయు మాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తే న స ఊర్ధ్వ మాక్రమతే స ఆదిత్య మాగచ్ఛతి" (బృ. ౫. ౧౦. ౧) అని శ్రుతులు. మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్యం" (బృ. ౬. ౨. ౧౫) మాసములనుండి దేవలోకమును దేవ లోకమునుండి సూర్యుని అని వాజసనేయ శాఖలో పాఠము వేఱుగానున్నది. కాన ఈ సూత్రము ఛాందోగ్యశాఖ శ్రుతి పాఠమునబట్టి చెప్పఁబడెనని తెలియు నది. ఛాందోగ్య వాజసనేయ శ్రుతులలో మాత్రము ఒకచోట దేవలోకము అనునది లేదు ఇంకొకచోట సంవత్సరము అనునది లేదు. అందు రెండు శ్రుతులనుబట్టి దేవలోకము సంవత్సరము అను రెండును రెండుచోట్లఁ జేర్ప వలయును. అందునుగూడ మాసములతో సంబంధమునుబట్టి సంవత్సరము మొదటను తరువాత దేవలోకమును జేర్పవలయునని తెలియవలయును.

### తడిదధికరణము ౩

**౪. సూ. తడితో౽ధి వరుణః సంబంధాత్.**

సంబంధాత్=సంబంధముండుటవలన, తడిత్=మెఱపునకు, అధి=పైని, వరుణః=వరుణ లోకము గ్రహింపవలయును.

సూ. మెఱపునకు జలాధిపతి యగు వరుణునికి సంబంధముండుటవలన "సూర్యుని నుండి చంద్రుని చంద్రుని నుండి మెఱపును బొందుదురు" అనుచోట మెఱపునకుఁ దరువాత వరుణ లోకమును బొందును అనునది సంబంధించును.

వివ:- ఉఱుములు ఉఱిమినప్పుడు మెఱపులు ఎక్కువగా మేఘముల పైని నటించునపుడు వానకురియును. "మెఱయుచున్నది యుఱుముచున్నది వర్షము కురియును" అని బ్రాహ్మణమును జెప్పుచున్నది గాన మెఱపులకు జలాధిపతి యగు వరుణునికి సంబంధమున్నది గాన మెఱపు అను పదమునకుఁ బిదప వరుణలోకము అనునది చేర్పవలయును. వరుణ లోకము పిదప ఇంద్ర ప్రజాపతి లోకములు పఠింపబడుటవలనను వానికి మఱియొక స్థానము లేక పోవుటవలన అవి వరుణలోకమునకుఁ బిదప నుండునని తెలియవలయును. మఱియు అర్చిరాదిమార్గమున మెఱపు చివరిదని తెలియవలయును.

## ఆతివాహికాధికరణము ౪

౪ సూ. ఆతివాహికా స్తల్లింగాత్.

తల్లింగత్ = ఆ సూచనను బట్టి, ఆతివాహికాః=అతివాహకులు=అతివాహికులను పురుషులు వచ్చి తీసికొని పోదురు.

సూ. "చంద్రుని నుండి మెఱుపును బొందుదురు పిదప నొక యమానుష పురుషుఁడు వచ్చి వారిని బహ్మమును బొందించును" అని శ్రుతిలో అమానుష పురుషుఁడు బొందించును అని సూచననుబట్టి అర్చిరాదులు అన్నవి ఉపాసకులను దీసికొనిపోవు దేవతలే గాని మార్గచిహ్నములు గాని భోగభూములు గాని గావు.

వివ:- "చంద్రమసో విద్యుతం, తత్పురుషోఽ మానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి" (ఛాం. ౪ ౧౫ ౫) అని శ్రుతి.

౫. సూ. ఉభయ వ్యామోహాత్ తత్సిద్ధేః.

ఉభయ వ్యామోహాత్=జీవులు అర్చిరాది దేవులు వ్యామోహితులగుటవల్ల అస్వతంత్రులగుటవలన, తత్సిద్ధేః = అర్చిరాది దేవతలచేఁ దొసికొనిపోఁబడుట సిద్ధించుటవలన

సూ. శరీరము విడిచి అర్చిరాదుల వెంట బోవు జీవులును వీరిని దీసికొనిపోవుటకు నియోగింపబడిన యర్చిరాది దేవతలును స్వతంత్రులుగారు. గావున లోకమున పిచ్చివారును మూర్ఛపడినవారును ఇతరులచేతఁ దీసికొని పోఁబడునట్లు జీవులును అర్చిరాది దేవతలచేఁ దీసికొనిపోఁబడుట సిద్ధించుట వలన పై శ్రుతిలోఁ జూపఁబడిన "అమానుష పురుషుఁడు బ్రహ్మమును బొందించును" అను సూచన యుక్తమైనదే

వివ:- పై శ్రుతిలో అర్చిరాది దేవతల నుండి వారిద్వారా జీవులు పోవుదురని యర్థము తెలియవలయు. లోకవ్యవహారములో "నీవు ఇక్కడ నుండి బలవర్మను బలవర్మ నుండి జయసింహుని వానినుండి కృష్ణగుప్తుని సమీపించుము" అని యున్నట్లు అర్చిరాదుల విషయములోఁగూడ ఊహింపవలయును. ఇదే అగ్నిలోకము పోయి అగ్ని చేత తీసికొనిపోఁబడును వాయు లోకమును బొందును వాయువుచే ముందు లోకమునకుఁ దీసికొనిపోవబడును. ఇట్లు అంతటఁ దెలియునది యని భావము

6. మూ. వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః.

తచ్ఛ్రుతేః=అట్టి శ్రుతినిబట్టి తతః = తరువాత, వైద్యుతేన ఏవ = మెఱుపునకు సంబంధించిన యమానుషునిచేతనే తీసికొనిపోబడును.

సూ. "మెఱుపును పొందిన యా జీవులను ఒక యమానుష పురుషుఁడు వచ్చి బ్రహ్మలోకమును బొందించును" అను శ్రుతినిబట్టి మెఱుపు దగ్గఱనుండి యమానుష పురుషుఁడు వచ్చి వారిని వరుణాది లోకముల నుండి బ్రహ్మలోకమును జేర్చునని తెలియునది

వివ:- "తాన్ వైద్యుతాన్ పురుషోఽమానవః స ఏత్య బ్రహ్మలోకం గమయతి" అని శ్రుతి. వరుణాదులు ఆ యమానుష పురుషునికి అడ్డుగలుగక బ్రహ్మలోకము చేరుటకు సాయపడుదురని యూహించునది.

## కార్యాధికరణము ౩

7 మూ. కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః.

అస్య=ఈ సగుణబ్రహ్మమును, గత్యుపపత్తేః=పొందుటకు ఉపపన్నమగుటవలన, కార్యం = సగుణబ్రహ్మను ఆ పురుషుడు పొందించును అని, బాదరిః=బాదరి అనెను.

సూ. సగుణబ్రహ్మము పరిచ్ఛిన్న ప్రదేశము గలవాఁడు గాన ఆ బ్రహ్మ దగ్గఱకు పోవుట యుపపన్నమగును గాన సగుణోపాసకులను ఆ యమానుష పురుషుఁడు ఆ సగుణబ్రహ్మమును బొందించుచున్నాఁడని బాదరి యనియె.

వి:- నిర్గుణబ్రహ్మము సర్వదేశములందుండును గాన అతని దగ్గఱకు వెళ్లుటగాని వెళ్లువాఁడుగాని తీసికొని వెళ్లువారుగాని యనునది యుండదు గాన నిర్గుణ బ్రహ్మోపాసకుఁడు తన హృదయమందున్న యా బ్రహ్మమందే లయమగునని రహస్యము.

8. మూ. విశేషితత్వాచ్చ.

విశేషితత్వాత్ చ=విశేషించి చెప్పుటవలనను.

సూ. 1. "బ్రహ్మలోకమును బొందించును ఆ బ్రహ్మవేత్తలు బ్రహ్మలోకములందుత్తములై హిరణ్యగర్భుని దగ్గఱ చాలకాలముందురు" అని

శ్రుతిలో విశేషించి నిర్గుణ బ్రహ్మముకంటె వేఱుగా " బ్రహ్మలోకములందు " అని లోకశబ్ద ప్రయోగ బహువచనముచే అవస్థా విశేషములనుబట్టి భిన్నములగు సగుణబ్రహ్మలోకములను గూర్చి చెప్పుటచే అర్చిరాది గమనము సగుణబ్రహ్మ విషయకిమైనదే.

వివ:- 1. "బ్రహ్మలోకాన్ గమయతి తే తేషు బ్రహ్మ లోకేషు పరాః పరావతో వసంతి" (బృ. ఉ. ౨. ౧౫) అని శ్రుతి.

9. సామీప్యాత్తు తద్వ్యపదేశః.

సామీప్యాత్ తు=సామీప్యమునుబట్టియైతే, తద్వ్యపదేశః=ఆ పరబ్రహ్మమునకు వ్యవహరింపబడినది.

సూ. పరబ్రహ్మమునకు దగ్గఱగా నుండుటవలన సగుణమైన యీ పరబ్రహ్మము గూడ బ్రహ్మపదముచేతఁ బై శ్రుతులలో వ్యవహరింపబడియెను గాన బ్రహ్మ పదమునకు సగుణబ్రహ్మ మని యర్థము చెప్పుటలో విరోధము లేదు.

వివ:- పరబ్రహ్మమే ఉపాసకకొఱకు మనోమయత్వాది వికారధర్మములచే వ్యవహరింపఁబడి సగుణబ్రహ్మము కార్యబ్రహ్మము యపరబ్రహ్మమను పేర్లతో నున్నవని తెలియవలయును.

10. సూ. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాఽతః పరమభిధానాత్.

అభిధానాత్=శ్రుతి చెప్పుటవలన, కార్యాత్యయే=కార్య బ్రహ్మలోకమునకు ప్రళయము గలుగఁగా, తదధ్యక్షేణ సహ=ఆ లోకమునకు ప్రభువైన వానితో గూడ, అతః=దీనికంటె గొప్పదగు పరమపదమును బొందును.

సూ. 1. "ఈ యర్చిరాది మార్గముద్వారా బ్రహ్మమును బొందిన వారీ మను సృష్టియందుఁ దిరిగి జన్మింపరు", 2. "ఆ యర్చిరాది మార్గమునఁ బైకిఁ బోవువారికిఁ దిరిగి జన్మ లేదు", 3 "సుషుమ్నా నాడిచేఁ బైకిపోయి యమృతత్వమును బొందును" ఇత్యాది శ్రుతులందు జన్మరాహిత్యరూపమగు మోక్షము చెప్పఁబడుటవలన, సగుణ బ్రహ్మ లోకమునకుఁ బోయిన పిదప మరల అందు బ్రహ్మజ్ఞానము గలవారై జీవులు నా సగుణబ్రహ్మ లోకమునకుఁ బ్రభువయిన హిరణ్యగర్భునితోఁ గూడ ఆ బ్రహ్మలోకమునకుఁ బ్రళయము

సంభవించిన తరువాత క్రమముగా పరిశుద్ధమైన పరబ్రహ్మము యొక్క పరమ పదమును బొందుదురు.

వివః- దీనినిబట్టి క్రమముగనే యుపాసకులకు పరమపదమగు ముక్తి సంభవించును గాని వెంటనే లభింపదని భావము. 1. "ఏతేన ప్రతిపద్యమానా మానవ మావర్తం నావర్తంతే" (ఛాం. ౪. ౧౫. ౬), 2. "తేషామిహ న పునరావృత్తిరస్తి", 3. "తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి" (ఛాం. ౮. ౬. ౬) అని శ్రుతులు.

11. మూ. స్మృతేశ్చ.

స్మృతేఃచ=స్మృతినిబట్టియు.

సూ. సగుణబ్రహ్మతోఁ గూడ నా యుపాసకులందఱు జ్ఞానము పొందిన పిదప ఆ సగుణబ్రహ్మ యొక్క యవసాన కాలమున దన్యత్రై పరమపదమును బొందుదురు" అని స్మృతివాక్యమునుబట్టియు ఆ సగుణబ్రహ్మతోఁ గూడ నుపాసకులు క్రమముగాఁ పరమపదమును బొందుదురని తెలియఁదగు.

వివః- కావున అర్చిరాది గమన శ్రుతులన్నియు సగుణబ్రహ్మ విషయకములని భావము

12. మూ. పరంజైమిని ర్ముఖ్యత్వాత్.

ముఖ్యత్వాత్—ముఖ్యమగుటవలన పరం=పరబ్రహ్మము అని, జైమినిః= జైమిని అనెను.

సూ. 1. "ఆ యమానుష పురుషుడు బ్రహ్మను బొందించును" అను చోట బ్రహ్మపదమునకు ముఖ్యార్థమగు పరబ్రహ్మమని యర్థము చెప్పుటయే న్యాయము గాన ఈ శ్రుతిలోఁ బరబ్రహ్మమే చెప్పఁబడుచున్నదని జైమిని యనియె.

వివః- 1. "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని శ్రుతి.

13. మూ. దర్శనాచ్చ.

దర్శనాత్‌చ = చూపుటవలనను.

సూ. 1. "అసుషుమ్నా నాడిచేఁ బైకిఁబోవుచు అమృతత్వమును బొందును" అని శ్రుతి గమన పూర్వకముగా అమృతత్వమును జూపుచున్నది

గాన అమృతత్వము పరబ్రహ్మ విషయకమె "తయోర్ధ్వమాయ న్నమృతత్వ మేతి" (ఛాం. ౮. ౬. ౬) అని శ్రుతి.

14: సూ. నచకార్యే ప్రతిపత్త్యభిసంధిః.

కార్యే=సగుణబ్రహ్మ విషయమందు, ప్రతిపత్తి = గ్రహణము యొక్క, అభిసంధిః=అభిసంధి. న చ=కాదు.

సూ. 1. "నామరూపముల నిర్వహించునదియు, వానిచే స్పృశింపఁబడనిదియును పరబ్రహ్మమే" ఇత్యాదులచే చెప్పఁబడిన పరబ్రహ్మమే ప్రస్తుతము గాన, 2. "ప్రజాపతి సభాభవనమును ప్రవేశింతును" అను నుపాసకుని మరణకాల సంకల్పమును సగుణబ్రహ్మ విషయమగు సంకల్పము గాదు నిర్గుణమగు పరబ్రహ్మ విషయకమె

వివ:- 1. "నామరూప యోర్నిర్వహితా యదంతరాతద్బ్రహ్మ" (ఛాం. ౮. ౧౪. ౧), 2. "ప్రజాపతేస్సభాం ప్రవేశ్మప్రపద్యే" (ఛాం. ౮. ౧౪. ౧) అని శ్రుతులు, ఈ ౧౨, ౧౩, ౧౪ సూత్రములు జైమిని మతమును జెప్పుచున్నవి గాన ఇవి పూర్వపక్షసూత్రములే ౭, ౮, ౯, ౧౦, ౧౧, సూత్రములలోఁ జెప్పఁబడిన బాదరి మతమె సిద్ధాంతము. "ఆత్మై వేదం సర్వం" (ఛాం. ౭. ౨౫. ౨) ఇదియంతయు ఆత్మయె "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" (శ్వే. ౬. ౬. ౧౯) ఆత్మ అవయవములు క్రియలులేనిది శాంతమైనది నిర్దోషము అజ్ఞానము లేనిది. "అస్థూలమన ణ్వహ్రస్వ మదీర్ఘం" ఆత్మ స్థూలమైనదిగాని సూక్ష్మమైనదిగాని పొట్టిది గాని పొడుగుకదిగాని కాదు. "సబాహ్యా భ్యంతరోహ్యజః" (ముం. ౨. ౧. ౨) ఆత్మ లోపల వెలుపల నిండియున్నది పుట్టుకలేనిది. "స ఏష నేతి నేత్యాత్మా" (బృ. ౩. ౯. ౨౬) ఆ యాత్మ ఇది కాదు ఇది కాదు అనునట్టిది. ఇత్యాదిశ్రుతులచే దేశకాలాది విశేష శూన్యమైనది గాన అంతటనున్న దానికి అర్చిరాదిమార్గముచే వెళ్లి చేరుట యనునది యెందును సంభవింపదు గాన అర్చిరాది గమన శ్రుతులన్నియు సగుణబ్రహ్మ విషయకములే గాని నిర్గుణబ్రహ్మ విషయకములు గావని తెలియునది.

## అప్రతీకాలంబనాధికరణములు ౬

15. సూ. అప్రతీకాలంబనా న్నయతీతి బాదరాయణ ఉభయథా దోషా త్తత్క్రతుశ్చ.

ఉభయథా=రెండు విధములుగాను, అదోషాత్ = దోషము లేకపోవుట వలన, అప్రతీకాలంబ నాన్=నామాది ప్రతీకోపాసకుల కంటె నితరులగు వికారోపాసకులను, నయతి=తీసికొని వెళ్లును, ఇతి=అని, బాదరాయణః=బాదరాయణుఁ డనియె, తత్క్రతుః చ=తత్క్రతు న్యాయముగూడ దీనినే సమర్థించుచున్నది.

సూ. 1. "ఆ జీవులను ఒక యమానుష పురుషుఁడు వచ్చి బ్రహ్మలోకమును పొందించును" అనుచోట నామాదిప్రతీకోపాసకులను బ్రహ్మలోకమును అమానుష పురుషుఁడు జేర్పఁడు, నామాదిప్రతీకోపాసకులను గాక మిగిలిన వికారోపాసకులను బ్రహ్మలోకమును జేర్చునని రెండు విధములుగఁ జెప్పినను దోషము లేకపోవుటవలన నామాదిప్రతీకోపాసకులను విడిచి తక్కిన వికారోపాసకులను మాత్రము బ్రహ్మలోకమును అమానుష పురుషుఁడు పొందించునని బాదరాయణుఁడు తలఁచుచున్నాఁడు, 2. "ఎవఁ డెట్లెట్లు దేని నుపాసించునో వాఁడు దానినే పొందును" అను శ్రుతి ఈ విషయమునే సమర్థించుచున్నది.

వివ:- "పురుషోఽ మానవః స ఏత్య బ్రహ్మ గమయతి", 2. "తం యథా యథోపాసతే తదేవ భవతి" పంచాగ్ని విద్యయందు "స ఏనాన్ బ్రహ్మ గమయతి" (ఛాం. ౫ ౧౦. ౨) అతఁడు వారిని బ్రహ్మముఁ బొందించును" అని ఇత్యాదికముగ విశేషించి చెప్పినచోట్ల మాత్రము ఈ నిషేధము ప్రవర్తింప దని తెలియునది "యథాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" ఈ లోకమున పురుషుఁ డెట్టి క్రతువు చేయునో వాఁడు ఇటనుండి పోయి అట్టి క్రతుఫలమును పొందినవాఁడగును. ఈ యర్థముగలది క్రతున్యాయము.

16. సూ. విశేషంచ దర్శయతి.

విశేషం చ=విశేషమును, దర్శయతి=శ్రుతి చూపుచున్నది.

సూ. 1. "నామము బ్రహ్మమని యుపాసించువానికి ఆ నామము వ్యాపించునంతచోటను అతనికి స్వేచ్ఛాగమనము గలుగును", 2. "వాక్కుకంటె నామము గొప్పది", 3. "వాక్కును బ్రహ్మముగా నుపాసించువానికి వాగ్విషయమునఁ గామగమనము సిద్ధించును", 4. "వాక్కుకంటె మనస్సు గొప్పది" ఇత్యాదులలో నామాదిప్రతీకోపాసనము లందొక దానికంటె నొకటి గొప్పదని శ్రుతి చూపుచున్నది గాన నామాదిప్రతీకోపాసములందు ఫలవిశేషములుండుట వలనను, ఏక బ్రహ్మము నుపాసించు వారికి ఫలవిశేషములు లేకపోవుటవలనను

నామాదిప్రతీకోపాసకులకంటె భిన్నమైన వారినే అమానుష పురుషుఁడు బ్రహ్మను బొందించునని గ్రహింపవలయును.

విషః- 1. "యావన్నామ్నో గతం తత్రాస్య యథా కామచారో భవతి" (ఛాం. ౭. ౨. ౧), 2. "వాగ్వావనామ్నో భూయసీ" (ఛాం. ౭. ౨. ౧), 3. "యావద్వాచో గతం తత్రాస్య కామచారో భవతి" (ఛాం. ౭. ౨ ౨). 4. "మనోవావ వాచోభూయః" (ఛాం. ౭. ౩, ౧) అని శ్రుతులు. కావున నామాదిప్రతీకోపాసనములు ఇతరోపాసనములతో సమములు గావని భావము.

ఇది

శ్రీవెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు

చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన

బ్రహ్మ మీమాంసాదర్శనమందు ఫలాశ్రయ విచారమను

నాల్గవ యధ్యాయమున గంతవ్యమగు

నర్చిరాది మార్గనిర్ణయ మనుమూఁడవ పాదము.

# బ్రహ్మమీమాంసా దర్శనము

ఫలాశ్రయ విచార మనునాల్గవ యధ్యాయమున జ్ఞానమునకు ఉపాసనకు

ఫల నిర్ణయ మను నాల్గవ పాదము.

## సంపద్యావిర్భావాధికరణము ౧

1. మూ. సంపద్యావిర్భావః స్వేన స్వశబ్దాత్.

శబ్దాత్=శ్రుతిలో స్వశబ్దము ప్రయోగించుటవలన, స్వేన=ఆత్మరూపము తోడ, సంపద్య = బ్రహ్మమును పొంది, ఆవిర్భావః = బ్రహ్మ సాక్షాత్కారము పొందును.

సూ. 1. "వాయువు మొదలగునవి యాకాశరూపమును బొందినట్లు ఈ జీవుఁడు ఈ శరీరమునుండి లేచి ఆ పరమజ్యోతిని పొంది తన యాత్మరూప మును బొందుచున్నాఁడు" అని శ్రుతిలో జీవుఁడు తన ఆత్మరూపమును బొందు నని చెప్పుటవలన ముక్తిని బొందు జీవుఁడు పరంజ్యోతియగు బ్రహ్మమును బొంది, దేవలోకాదులందువలె నితర రూపాదులతోఁ గాక, యాత్మరూపముతోనె బ్రహ్మ సాక్షాత్కారమును బొందును.

వివః-1. "ఏవమే వైష సంప్రసాదోఽస్మా చ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అని శ్రుతి.

2. మూ. ముక్తః ప్రతిజ్ఞానాత్.

ప్రతిజ్ఞానాత్=ముక్తిని గూర్చి ప్రతిజ్ఞ చేయుటవలన, ముక్తః=ముక్తుఁడె ఆత్మరూపము పొందును.

సూ. 1. "శరీరము నాత్మగాఁ జూడని వానిని ప్రియముగాని యప్రియ ముగాని తాకవు" అని మొదలు పెట్టి, 2. "తన యాత్మస్వరూపముఁ బొందు చున్నాఁడు అతఁడె యుత్తమ పురుషుఁడు", 3. "పాపరహితము జరామరణ వర్జితమునగు నాత్మను దెలియవలెను అట్లు తెలిసిన వాఁడెల్ల కోర్కెలను బొందును" అని శ్రుతిలో ముక్తునిగూర్చి ప్రతిజ్ఞ చేయఁబడుటవల్ల అదివరకు

శరీరమున రాగద్వేషాది సర్వబంధములచే బంధింపఁబడి యిపుడు వానినుండి ముక్తుఁడై మొదటి రూపమగు పరిశుద్ధమైన యాత్మరూపముతో నుండును,

వివః- 1. అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః'' (ఛాం. (ఛాం. ౮. ౧౨. ౧), 2. "స్వేన రూపేణాభిసంపద్యతే స ఉత్తమ పురుషః'' (ఛాం. ౮. ౧౨. ౩), 3. య ఆత్మాపహతపాప్మా విజరో విమృత్యుః'' (ఛాం. ౮. ౭. ౧) అని శ్రుతులు. మోక్షఫలకథనము బంధములనుండి విడివడుటె రూపమైనదే గాని క్రొత్త ఫలము గలుగునని చెప్పుటకు మాత్రము గాదు. రోగపీడితుఁడు రోగములనుండి ముక్తుఁడయ్యెనని చెప్పినట్లు బంధములనుండి ముక్తుఁడయ్యె ననువ్యవహారముగూడ నట్లె తెలియునది.

3. సూ. ఆత్మా ప్రకరణాత్.

ప్రకరణాత్= ప్రకరణమునుబట్టి, ఆత్మా=ఆత్మయె అర్థము.

సూ. 1. "పాపరహితము జరామరణ వర్జితమునగు నాత్మను దెలియవలయు" అను ప్రకరణమునుబట్టి 3. "ఆ పరమజ్యోతిని పొంది తన యాత్మరూపమును బొందుచున్నాఁడు'' అనుచోటఁ బరమజ్యోతి యనఁగా ఆత్మయె గాని భౌతికమగు జ్యోతియని యర్థము గాదు.

వివః- 1. "య ఆపహతపాప్మా విజరో విమృత్యుః" (ఛాం. ౮.౭.౧) 2. "పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే" (ఛాం. ౮ ౧౨ ౩) అని శ్రుతులు, (చూ. బృ. ౪. ౩. ౧౬) "తదేవ జ్యోతిషాం జోతిః" అనుచో జ్యోతిశ్శబ్దము ఆత్మపరముగాఁగూడఁ గనిపించుచున్నది. (చూ. ౧౭.౩.౪౦ సూ.)

## అవిభాగాధికరణము ౨

4. సూ. అవిభాగేన దృష్టత్వాత్.

దృష్టత్వాత్ = చూడఁబడుట వలన, అవిభాగేన = అవిభాగముగనే యుండును.

సూ. 1. ''ఆ యాత్మ నీవై యున్నావు" 2. "నేను బ్రహ్మమునై యున్నాను'' 3. "ఆ ద్రష్టకంటె వేఱుగా విడియుండి చూడఁబడు రెండవ వస్తువేదియు లేదు" ఇత్యాదులందు పరజ్యోతిని పొంది ఆత్మ స్వరూపము పొందువాఁడు బ్రహ్మముకంటె అభేదముగా నున్నట్లు చూడబడుటవలన ముక్తుఁడు బ్రహ్మముతో నేకమైయుండునుగాని విడిగా నుండడు.

వివ:- 1. "తత్త్వమసి" (ఛాం. ౬. ౮. ౭) 2. "అహం బ్రహ్మాస్మి" (బృ. ౧. ౪. ౧౦) 3. "నతుద్వితీయమస్తి తతోఽన్య ద్విభక్తం యత్పశ్యేత్" (బృ. ౪. ३ ౨३) అని శ్రుతులు ఇట్లే "యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి, ఏవం మునేర్విజానత ఆత్మాభవతి గౌతమ" (క. ౪, ౧౫) ఓ నచికేతుఁడా, నిర్మలజలమందుఁ బోయఁబడిన నిర్మలజలము నిర్మలముగానే యున్నట్లు జీవేశ్వరులను అభేదముగాఁ దెలిసికొన్న మననశీలుని యాత్మ అట్టిదే యగును. ఇత్యాది శ్రుతులును నదీ సముద్రాద్యుదాహరణములును జీవేశ్వరుల కైక్యమునే బోధించుచున్నవని భావము.

## బ్రాహ్మాధికరణము ३

5. సూ. బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః

ఉపన్యాసాదిభ్యః=బోధనలబట్టి, బ్రాహ్మేణ=బ్రాహ్మము తోనైక్యమగునని, జైమినిః=జైమిని యనియె,

సూ. 1 "పాపరహితము జరామరణ వర్జితమునగు నాత్మను దెలిసికొనవలయును" అనునది మొదలుకొని 2 "ఆత్మ సత్యసంకల్పుడు సత్యకాముఁడు అనునంతవఱకుఁ జెప్పఁబడిన శ్రుతినిబట్టియు ఇంకను ఆత్మ సర్వజ్ఞమై నదిసర్వమునకుఁబ్రభువైనది" ఇత్యాది శ్రుతుల బోధనఁబట్టియు 3. "తన యాత్మ రూపమును బొందుచున్నాఁడు" అనుచోట అపహతపాప్మత్వాదిగుణములుగల బ్రహ్మముతోనేకమగుచున్నాఁడని యర్థముగ్రహింపవలయునని జైమినియనియె.

వివ:- 1. "స అపహతపాప్మా" (ఛాం ౮. ౭. ౧) 2. "సత్యకామః సత్యసంకల్పః" (ఛా. ౮. ౭. ౧) 3. "స్వేన రూపేణాభి సంపద్యతే" అని శ్రుతులు.

6. సూ. చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః.

తదాత్మకత్వాత్ = చైతన్య స్వరూపుఁడగుటవలన, చితితన్మాత్రేణ = చైతన్యముతో మాత్రమె యుండును అని, ఔడులోమియనియె.

**సూ. ముక్తుఁడు చైతన్యమందుఁ గేవల చైతన్యముతో చైతన్య స్వరూపుఁడై యుండుటవలన సర్వజ్ఞత్వాది ధర్మములతోఁ గాక చైతన్యముతోనే యుండునని యౌడులోమి యనియె.**

వివ:_వా స్తవమునకు సర్వజ్ఞత్వాపహతపాప్మత్వాది గుణములు ఇతరవై లక్షణ్యమును జెప్పుటకేగాని సవికల్ప సగుణ స్వరూపమును జెప్పుటకుఁ గాదు. ఇవి కేవలము శబ్దవికల్పమువల్లఁ గలిగినవని తెలియునది.

7. మూ. ఏవమప్యుపన్యాసా త్పూర్వభావాదవిరోధం బాదరాయణః.

ఏవమపి=చైతన్య స్వరూపమును అంగీకరించినను, ఉపన్యాసాత్=పూర్వ శ్రుతులును జెప్పుటవలన, అవిరోధం=విరోధము లేనట్లు, పూర్వభావాత్=ఇది వరకు ఉండుటవలనను, బాదరాయణః=బాదరాయణుఁ డనియె.

సూ. ముక్తుఁడు కేవలము పారమార్థికమైన చైతన్య స్వరూపము గలవాఁడుగ నంగీకరించినను వ్యవహారము నపేక్షించి పూర్వ శ్రుతివాక్యముల వల్లఁ దెలియఁబడిన సకలైశ్వర్యరూప బ్రహ్మమును నిరాకరింపకపోవుటవలన పై మతములతో విరోధము లేదని బాదరాయణుఁడు తలఁచుచున్నాఁడు.

## సంకల్పాధికరణము ౪

8. మూ. సంకల్పా దేవ తు తచ్ఛ్రుతేః.

తచ్ఛ్రుతేః = అట్లు శ్రుతి వినబడుటవలన, సంకల్పాదేవతు = సంకల్పము వలననే.

సూ. 1. "సత్యకామాది గుణములను సాక్షాత్కరింపఁ జేసికొన్న ముక్తుఁడు పితృలోకములను గోరువాఁడై యున్నచో వానికి సంకల్పమువలననే పితృదేవతలు వత్తురు" అని శ్రుతిలోఁ జెప్పబడుటవలన ముక్తునకు సర్వ ప్రయోజనములు నిమిత్తాంత రాపేక్ష లేకయె సంకల్పముచేతనే సిద్ధించును.

వివ:_ 1. "స యది పితృలోక కామో భవతి సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠంతి" (ఛాం. ౮. ౨. ౧) అని శ్రుతి.

9. మూ. అత ఏవ చానన్యాధి పతిః.

అత ఏవ చ=కనుకనే, అనన్యాధిపతిః=ఇతర ప్రభువు లేనివాఁడు.

సూ. ముక్తుని సంకల్పము లెన్నటికి వ్యర్థము గావు కనుకనే ముక్తునికిఁ దనకంటె నింకొక ప్రభువు లేఁడు. అతనికెల్ల యైశ్వర్యములు స్వాధీనమందె యుండును.

వివః- "అథ య ఇహాత్మాన మనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్కామాన్ తేషాం సర్వేషులోకేషు కామ చారో భవతి" (ఛాం. ౮. ౧. ౬) పిదప నెవరు ఆత్మను సత్యసంకల్పాదులను జక్కగాఁ దెలిసికొని పోవుచున్నారో వారికి సర్వ లోకములందు స్వేచ్ఛా విహారము కలుగును. అను శ్రుతియు నీ సంగతినే బోధించుచున్నది.

## అభావాధికరణము ౩

10. మూ అభావం బాదరి రాహ హ్యేవం.

ఏవం హి=ఇట్లే. ఆహ=శ్రుతి చెప్పెను కాన, అభావం = మోక్షావస్థలో శరీరాదులు లేకుండుటను, బాదరిః=బాదరి యనియె.

సూ. 1. "ముక్తుఁడు బ్రహ్మలోకమందున్న యీ కోరికలన్నిటిని మనస్సుచేతనె చూచుచు నానందించును" అని శ్రుతినిబట్టి ముక్తుఁడు శరీరేంద్రియములు లేకుండనె సంకల్పముచేతనె సర్వము పొందుచున్నాఁడని తెలియు చున్నది గాన ముక్తునికి మోక్షావస్థయందు శరీరేంద్రియము లుండవని బాదరి యనియె.

వివః- 1. "మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే" (ఛాం. ౮. ౧౨ ౫) "య ఏతే బ్రహ్మలోకే" (ఛాం. ౧౨. ౧) అని శ్రుతి.

11. మూ. భావం జైమిని ర్వికల్పామననాత్.

వికల్పామననాత్=వికల్పముగఁ జెప్పుటవలన, భావం=శరీరాదులుండుటను, జైమినిః=జైమిని యనియె.

సూ. 1. "విద్వాంసుఁడు ఒక విధముగ నుండును, మూఁడు విధములుగ నుండును" అని శ్రుతి ముక్తుడు అనేక విధములుగాఁ గూడ నుండునని వికల్పము చెప్పుటవలన ముక్తునికి మనస్సు ఉన్నట్లుగనె యింద్రియములతోఁ గూడిన శరీరము గూడ నుండునని జైమిని తలఁచుచున్నాఁడు.

వివః- 1. "స ఏకధా భవతి త్రిధాభవతి" (ఛాం. ౭. ౨౬. ౨) అని శ్రుతి.

12. మూ. ద్వాదశాహవ దుభయ విధం బాదరాయణోఽతః.

అతః=ఇందువలన, ద్వాదశాహవత్=ద్వాదశాహమువలె, ఉభయవిధం= రెండు విధములుగ నుండునని, బాదరాయణః=బాదరాయణుఁడు.

సూ. ద్వాదశాహము సత్రముగను అహీనముగను గూడ రెండు విధముల నైనట్లు, పైని జెప్పఁబడిన శ్రుతులలో ముక్తునికి సశరీరత్వా శరీరత్వముల చెప్పఁబడుటనుబట్టి ముక్తుఁడు శరీరము సంకల్పించుకొన్నచో శరీరము గలవాఁడుగను, శరీరాభావమును సంకల్పించుకొన్నచో శరీరము లేనివాఁడుగను రెండు విధములుగ నుండునని బాదరాయణుఁ డనియె.

వివ:- "య ఏవం విద్వాంసః సత్రముపయంతి" ద్వాదశాహమును ఇట్లే విద్వాంసులు సత్రమును చేయుదురు. ద్వాదశాహమును అనేక కర్తలు చేయుచున్నట్లు చెప్పఁబడుటవలన అది సత్రమనియుఁ జెప్పఁబడును. ఆ సత్ ఉపయంతి అను విధులున్నది సత్రమనఁబడును. "ద్వాదశాహం ప్రజాకామం యాజయేత్" సంతాన కామములిచ్చు ద్వాదశాహమును యజింపఁ జేయవలయును. అనుచో యాజయేత్ అనునది యున్నది అహీనము అనఁబడును. ఇట్లు ద్వాదశాహము రెండువిధముల సాధువైనట్లే ముక్తుని సశరీరత్వా శరీరత్వములు రెండు సాధువులే యని భావము.

13. సూ. తన్వభావే సంధ్యవ దుపపత్తేః.

తన్వభావే=శరీరము లేకున్నను, సంధ్యవత్=కలలోవలె, ఉపపత్తేః = ఉపపన్నమగుటవలన.

సూ. కలలో ఏ యింద్రియములు పనిచేయకున్నను గేవల మనస్సుచేతనె సర్వ కార్యములు చేయుట యుపపన్నమైనట్లు శరీరేంద్రియములు లేకపోయినను ముక్తుఁడు మోక్షమున సర్వకామములు పొందుట యుపపన్న మగును.

14. సూ. భావే జాగ్రద్వత్.

భావే=శరీరమున్నపుడు, జాగ్రద్వత్=జాగ్రదవస్థయందువలె.

సూ. మెలఁకువగా నున్నపుడు శరీరేంద్రియములతోఁ బనిచేయునట్లే మోక్షావస్థయందు సంకల్ప మాత్రముచేతనే లభించిన శరీరేంద్రియములతో ముక్తుఁడు సర్వకామములఁ బొందునని తెలియునది.

## ప్రదీపాధికరణము ౬

15. సూ. ప్రదీపవ దావేశ స్తథా హి దర్శయతి.

ప్రదీపవత్=ప్రదీపమువలె, ఆదేశః=అట్లు ఆదేశింపఁబడినది, తథా హి= అట్లే శ్రుతి, దర్శయతి=చూపుచున్నది.

సూ. అతఁడు ఒకవిధముగను, మూఁడు విధములుగను, అయిదు విధములుగను ఏడు విధములుగను, తొమ్మిది విధములుగను నుండును" అని శ్రుతి ముక్తుఁడు అనేక విధములుగ శరీరములతో నుండుట చూపుచున్నది గాన దీపమొక్కటియైనను వత్తులనుబట్టి అనేకముగ నైనట్లు ముక్తుఁడు సత్య సంకల్పుఁడు గాన అనేకరూపములను బొందును.

విప :- "నిర్మాణచిత్తా న్యస్మితామాత్రాత్ ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషా మస్మితామాత్రాత్" (పాతంజల. ౪. ౪. ౧) యోగియొక్క సంకల్పమాత్రమువలన నిర్మింపఁబడిన దేహములందు మనస్సులు పుట్టును, ఈ అనేక చిత్తములు ప్రవృత్తిభేదమును మొదటి మనస్సొక్కటే నియమించునది యగును అని యోగశాస్త్రమందుఁ గూడ నీవిషయమె చెప్పఁబడినది.

16. మూ. స్వాప్యయ సంపత్త్యో రన్యతరాపేక్ష మావిష్కృతం హి.

స్వాప్యయ సంపత్త్యోః = సుషుప్తి, మోక్షములతో, అన్యతరాపేక్షం = ఏదోయొక విశేషవిజ్ఞానము, ఆవిష్కృతం హి=ప్రకటింపఁబడినది గదా.

సూ. 1. "ఎప్పుడు వానికి సర్వము నాత్మయే యయినపుడు ఎవఁడు దేనిని దేనిచేఁ దెలిసికొనును." 2. "ద్రష్టకంటె వేఱుగా విడినట్లు దెలిసికొనునట్టి రెండవ వస్తువు లేనేలేదు" ఇత్యాది శ్రుతులతో ముక్తునికివేఱే తెలిసికొను విశేష విజ్ఞానము లేదని చెప్పుట నిద్రావస్థ మోక్షావస్థలలో నొకదానిఁబట్టి యొకటి విశేషవిజ్ఞానము లేనిదని చెప్పుటకెగాని సగుణ విద్యోపాసనా ఫలసిద్ధి లేదని చెప్పుటకుఁ గాదు. కావున ముక్తున కనేక శరీర ప్రవేశాదిరూపమైన యైశ్వర్యము నంగీకరించుట విరోధింపదు", 3. "ఎందు నిద్రించినవాఁడు ఏ కోరికను గోరఁడో ఏ స్వప్నమును జూడఁడో" అను శ్రుతి స్వప్నావస్థయందు విశేషవిజ్ఞానము లేనట్లు ఆవిష్కరించుచున్నది, 4. "ఈ భూతములనుండి లేచి వాని ననుసరించియె నశించును చనిపోయిన పిదప వానికి పేర్లు లేవు", 5. "ఇతనికి సర్వము ఆత్మయె యయినపుడు దేనిచే దేనిని జూచును" ఇత్యాదిశ్రుతులు మోక్షమున విశేషవిజ్ఞానము లేనట్లు ఆవిష్కరించుచున్నవి గాన విశేషవిజ్ఞానము లేదని

చెప్పుట నిద్రావస్థనుబట్టి మోక్షమునకును మోక్షావస్థనుబట్టి నిద్రావస్థకును విశే
విజ్ఞానము లేదని చెప్పఁబడెనని తెలియవలయును.

వివః- 1. "యత్రత్వస్య సర్వమాత్మైవాఽభూత్తత్కేన కం విజా
యాత్" (బృ. ౨ ౪. ౧౪) 2. "న తుతద్ద్వితీయమస్తి తతోఽన్య ద్విభక్తం
యద్విజానీయాత్'' (బృ. ౪. ౩. ౩౦) 3. "యత్ర సుప్తో న కం చనకామం
కామయతే న కం చన స్వప్నం పశ్యతి" (బృ. ౪. ౩. ౧౯) 4. "ఏతేభ్యో
భూతేభ్యస్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి" (బృ. ౨
౪. ౧౪) 5. "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేనకం జానీయాత్"
(బృ. ౨. ౪. ౧౪) అని శ్రుతులు. అనేక శరీర ప్రవేశాదిరూపమైన యైశ్వర్య
ములుండునని చెప్పినపుడు స్వర్గాదులవలె మఱియొక రూపమైన సగుణవిద్యోపా
సనా ఫలసిద్ధి గలుగునని భావము.

17. సూ. జగద్వ్యాపారవర్జం ప్రకరణా దసన్నిహితత్వాచ్చ.

ప్రకరణాత్ = ప్రకరణమునుబట్టియు, అసన్నిహితత్వాత్ చ = సన్నిహి
తులై యుండకపోవుటవలనను, జగద్వ్యాపారవర్జం = జగద్వ్యాపారము తక్క
మిగిలినవుండును.

సూ. పరమాత్మయె జగద్వ్యాపారమందు అధికారి గాన ఆ పరమేశ్వరుని
గూర్చియె శ్రుతులు సృష్ట్యాదికార్యములను ఉపదేశించుటవలనను, పరమేశ్వరుని
కంటె నితరులగు ముక్తులు అణిమాద్యైశ్వర్యవంతులై జగద్వ్యాపారమందు సన్ని
హితులై యుండకపోవుటవలనను, సగుణబ్రహ్మోపాసనచేసి మనస్సుతోఁగూడ
ఈశ్వర సాయుజ్యముఁబొందిన వారికి జగద్వ్యాపారము తక్క మిగిలిన యణి
మాద్యైశ్వర్యములు గలుగును.

వివః- 1. "ఆప్నోతి స్వారాజ్యం'' (తై. ౧. ౬. ౨) సగుణబ్రహ్మో
పాసకుఁడు స్వర్గరాజ్యాధిపత్యముఁ బొందును. "సర్వేఽస్మై బలిమావహంతి"
(తై. ౧. ౫. ౩) సగుణబ్రహ్మోపాసకుని అగ్న్యాదిదేవతలు పూజించు
చున్నారు. "తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛాం. ౭. ౨౫. ౨)
సగుణబ్రహ్మోపాసకులకు సర్వలోకములందు స్వేచ్ఛాసంచారము గలుగును.
ఇత్యాది శ్రుతులు ఈ సంగతినే బోధించుచున్నవని భావము. స సగుణోపాసనచే
ముక్తులయినవారు మనస్సుతోఁగూడినవారు గాన ఆ ముక్తులందఱకు ఒకేదాని

యందె యైకమత్యము గలుగదు. ఒకరికి సృష్టిచేయుట యందు ఒకరికి సంహారము చేయుటయందు ఇచ్ఛ కలుగవచ్చును అట్లు పరస్పర విరోధమగు నిచ్ఛలచే జగత్తు వ్యాకులమగును. కాన నిత్యశుద్ధుఁడగు నీశ్వరునికె యట్టి జగత్కర్తృత్వము గలదు గాని యితర ముక్తుల కట్టిదిలేదు. కాన సగుణోపాసన ముక్తులు నిత్యముక్తుఁడగు నీశ్వర సంకల్పము ననుసరించి వారు ఐశ్వర్యాదుల ననుభవించుటయందె గాని సృష్టికార్యాదులందుఁ బ్రవర్తింపరని భావము.

18. మూ. ప్రత్యక్షోప దేశాదితి చేన్నాధికారిక మండలస్థోక్తేః.

ప్రత్యక్షోపదేశాత్=ప్రత్యక్షముగా నుపదేశించుటవలన, ఇతిచేత్ = అని అన్నచో, అధికారిమండలస్థోక్తేః = అధికారమందున్న సూర్యాదిమండల ముందున్న పురుషునిబట్టి చెప్పుటవలన, న=అట్లనరాదు.

సూ. 1. "సగుణబ్రహ్మోపాసకుఁడు స్వర్గ రాజ్యాధిపత్యమును బొందుచున్నాఁడు" ఇత్యాది శ్రుతులు ఉపాసకునకు ప్రత్యక్షముగా నిరంకుశమయిన యైశ్వర్యము నుపదేశించుచున్నవి గాన సగుణ ముక్తులు ఈశ్వరాధీనులై జగద్వ్యాపారమందుగాక మిగిలిన యైశ్వర్యములందె ప్రవర్తింతురని చెప్పుట యెట్లన్నచో సూర్యాదిమండలము లందున్న పురుషునిబట్టియె సగుణోపాసకులకు స్వర్గరాజ్య ప్రాప్తి గలుగునని చెప్పుటవలనను, పిదప 1. "మనస్సులకుఁ బ్రభువైన సర్వేశ్వరుని సగుణోపాసకుడు పొందును" అని శ్రుతి చెప్పుటవలనను 3. "ఈశ్వరుని ననుసరించియె సగుణోపాసకుఁడు వాక్పతియై చక్షుష్పతియై యగును" అని వాక్పతిత్వాదులు ఈశ్వరునిబట్టి కలిగినవిగాఁ జెప్పుటవలనను సగుణోపాసనచే ముక్తులయిన వారికి ఈశ్వరుని బట్టియె యైశ్వర్యము గలుగును గాన పైని జెప్పిన దోషము పట్టదు.

వివ:- 1. "ఆప్నోతి స్వారాజ్యం" (తై. ౧. ౬. ౨) 2. "ఆప్నోతి మనసస్పతిం" (తై. ౧. ౬. ౨) 3. "వాక్పతి శ్చక్షుష్పతిః" (తై. ౧. ౬. ౨) అని శ్రుతులు.

19. మూ. వికారావర్తి చ తథా హి స్థితిమాహ.

వికారావర్తి చ = వికారములతో అవర్తించురూపమును గూడ నున్నదిఁ. తథా హి=అట్లే, స్థితిం=ఉండుటను శ్రుతి. ఆహ=చెప్పుచున్నది.

సూ. 1. "ఈశ్వరుని మహిమ యంతటిది ఈ సర్వప్రపంచముకంటెం గూడఁ బురుషుఁడు గొప్పవాఁడు, సర్వభూతములును ఇతని పాదము ఇతని మూఁడవ పాదము దివమందున్నది" అని శ్రుతి పరమేశ్వరుని కేవల వికార గోచరమగు సూర్యాదిమండలమందున్న సగుణరూపమే గాన నిత్యముక్తమై నిర్గుణమైయున్న రూపముగాఁ గూడ నున్నట్లు చెప్పుటవలన ఈశ్వరాధీనులైన సగుణోపాసకులు నిర్గుణరూపమును బొందక సగుణరూపమున నున్నట్లే నిరంకుశ మగు నైశ్వర్యము పొందఁజాలక ఈశ్వరాయత్తమైన యైశ్వర్యమునె పొందుదురు.

వివః-1. "తావానస్యమహిమా తతోజ్యాయాంశ్చ పూరుషః, పాదోఽస్య సర్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" (ఛాం. ౩. ౧౨. ౬) అని శ్రుతి ఈశ్వరుని సగుణముగాను నిర్గుణముగాను జెప్పుచున్నది.

20. సూ. దర్శయతశ్చైవ ప్రత్యక్షానుమానే.

ప్రత్యక్షానుమానే = ప్రత్యక్షమైన శ్రుతి, అనుమానమైన స్మృతియు, ఏవం—ఇట్లు, దర్శయతః చ=చూపుచున్నవి గూ.

సూ. 1. "అక్కడ సూర్యుఁడు ప్రకాశింపఁడు, చంద్రుఁడు నక్షత్రములు ప్రకాశింపవు ఈ మెఱపులు మెఱయవు, ఆ ప్రకాశము ముందు ఈ యగ్ని ఏ పాటిది. దానిని సూర్యుఁడు గాని చంద్రుఁడు గాని అగ్ని గాని ప్రకాశింపఁ జేయలేదు" ఇత్యాది శ్రుతి స్మృతులు ఆ పరమేశ్వరునికి వికారములేని నిర్గుణ రూపమును గూడఁ జూపుచున్నవి గాన పరమేశ్వరునికి నిర్గుణరూపమును గలదు.

వివః- 1. "నతత్ర సూర్యోభాతి, న చంద్ర తారకం, నేమా విద్యుతో భాంతి, కుతోఽయమగ్నిః" (కఠ. ౫. ౧౫) 2, "న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః" (గీత. ౧౫. ౬) అని శ్రుతిస్మృతులు.

21. సూ. భోగమాత్రసామ్య లింగాచ్చ.

భోగమాత్రసామ్య లింగాత్ చ=సగుణోపాసకుఁడై ముక్తుఁడైన వానికి ఈ ఈశ్వరునితో భోగమంతె సామ్యమును దెలుపు లింగమును బట్టియు.

సూ 1. "అదియెట్లనఁగా నెల్లజంతువులు ఈ దేవతనెట్లు సేవించుచున్నవో యట్లే ఎల్లజంతువులు ఈ దేవత నిట్లు ఉపాసించువానిని సేవించును" ప్రాణవ్రతధారణచేతను ఈ దేవత యొక్క సాయుజ్యమును సమానలోకత్వమును పొందును" ఇత్యాది శ్రుతులు సగుణోపాసకునకును పరమేశ్వరునకును భేదమును దెలుపుటవలన సగుణోపాసక ముక్తునకు నీశ్వరునితో భోగమందే సామ్యముగాని నిరంకుశైశ్వర్యమునందు సామ్యము లేదని తెలుపుటవలనను సగుణోపాసకుఁడైన ముక్తునకు జగద్వ్యాపార సామర్థ్యము ప్రాప్తింపదు.

వివ:- 1. "స యథైతాం దేవతాం సర్వాణి భూతాన్యవంతి ఏవం హైవం విదం సర్వాణి భూతాన్యవంతి" (బృ. ౧. ౫. ౨౩) "తేన ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతి" (బృ. ౧. ౫. ౨౩) అని శ్రుతులు.

22. సూ. అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్.

శబ్దాత్=శ్రుతివాక్య ప్రమాణమునుబట్టి, అనావృత్తిః=తిరిగి పుట్టుకలేదు, శబ్దాత్=శ్రుతివాక్యమునుబట్టి, అనావృత్తిః=తిరిగి పుట్టుక లేదు.

సూ. 1. "ఆ సుషుమ్నా నాడిద్వారా పైకిఁబోవు వాఁడు అమృతత్వమును బొందును" 2. "బ్రహ్మలోకమును బొందినవారు తిరిగి భూలోకమునకు రారు" 3. "అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకము పొందినవారు తిరిగి ఈ మానవలోకమునకు రారు" 4. "బ్రహ్మలోకమును బొందును తిరిగి రాఁడు" ఇత్యాది శ్రుతి వాక్యములనుబట్టి యర్చిరాదిమార్గమున బ్రహ్మలోకము పొందినవారు భూలోకమునకుఁ దిరిగిరారు తిరిగిరారు.

వివ:- "1. తయోర్ధ్వ మాయన్నమృతత్వమేతి" 2 తేషామిహన పునరావృత్తిః 3. "ఏతేన ప్రతిపద్యమానా ఇదం మానవమావర్తం నా వర్తంతే" 4. "బ్రహ్మలోకమభి సంపద్యతే న చ పునరావర్తతే" ఇత్యాదులు శ్రుతులు.

యస్మిన్నరశ్చ హవై ణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే తృతీయస్యామితో దివి, యస్మిన్నైరం మదీయంసరః, యస్మిన్నశ్వత్థః సోమసవనః, యస్మిన్నపరాజితా పూర్బ్రహ్మణః, యస్మింశ్చ ప్రభువిమితం హిరణ్మయం వేశ్మ" ఈ భూలోకము నుండి మూఁడవదియైన బ్రహ్మలోకమున 'అరము' 'ణ్యము' అను సముద్రతుల్యములగు రెండు సుధాహ్రదములు గలవు, మఱియు అన్నమయమును, హర్షక

రమమునగు సరస్సు గలదు. అందె అమృతవర్షియగు రావిచెట్టు గలదు. అందె కర్మజ్ఞానశూన్యులు పొందరాని హిరణ్యగర్భుని పట్టణము గలదు. ఆ పట్టణమున హిరణ్యగర్భునిచే నిర్మింపఁబడిన బంగారపు మండపము గలదు" అని యనేక మంత్రములందు అర్థవాదాదులందు బ్రహ్మలోకము వర్ణింపఁబడినది. అట్టి బ్రహ్మలోకమును బొందిన వారికి జన్మమరణములతోఁ గూడిన రాకపోకలు లేవని భావము.

ఇది
శ్రీవెంకమాంబా నారాయణశాస్త్రి దంపతుల తనయుఁ డగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బ్రహ్మమీమాంసాదర్శనమందు ఫలాశ్రయ విచారమను
నాల్గవ యధ్యాయమున జ్ఞానోపాసనల ఫల నిర్ణయమను
నాల్గవ పాదము
సర్వము సంపూర్ణము
ఓమ్
శాంతి శ్శాంతి శ్శాంతిః






# ఆర్షవిజ్ఞాన పరిషత్తు ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. సాహిత్య సౌందర్యదర్శనము | మేలు ప్రతి రూ. | 35-0 |
| | సాదా ,, | 25-0 |
| 2. నారాయణీయాంధ్ర వ్యాకరణము | మేలు ,, | 10-0 |
| | సాదా ,, | 10-0 |
| 3. ఉపనయన వివాహ విధి | మేలు ,, | 10-0 |
| | సాదా ,, | 3-0 |
| 4. అమృత గీతాంజలి | మేలు ,, | 7-0 |
| | సాదా ,, | 5-0 |
| 5. మాతృశ్రీ - ప్రార్థనలు | మేలు ,, | 10-0 |
| | సాదా ,, | 8-0 |
| 6. సోక్రటీసు జీవితము - సంభాషణలు | మేలు ,, | 9-0 |
| | సాదా ,, | 5-0 |
| 7. ఉపనిత్సుధ | | 4-0 |
| 8. నారాయణీయ కావ్యాదర్శము | మేలు ,, | 5-0 |
| | సాదా ,, | 4-0 |
| 9. చీకట్లో జ్యోతి | మేలు ,, | 5-0 |
| | సాదా ,, | 4-0 |

[illegible].

లలితా ప్రెస్ 6-2-977/1, ఖైరతాబాదు,
హైదరాబాదు - 500004.

రచయిత-ప్రకాశకర్త,
చర్ల గణపతిశాస్త్రి.